# రావణ రాజ్యము, రామరాజ్యము

(వచన రచన)



శ్రీ లంకిపల్లి ఓబయ్య నాయుడు

ఓం శ్రీరామరక్ష, సర్వ జగద్రక్ష, శ్రీరస్తు, శుభమస్తు, అవిఘ్నమస్తు

# రావణ రాజ్యము, రామ రాజ్యము

## (వచన రచన)

**కంకంటి పాపరాజు గారి**
**పద్యములకు భావానువాదము**




చరితం రఘునాధస్యశతకోటి ప్రవిస్తరం

ఏకైక మక్షరం ప్రోక్తం, మహాపాతకనాశనం

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేదసే

రఘునాధాయ, నాథాయ సీతాయః పతయే నమః

ఓం లోకాస్సమస్తాస్సుఖినోభవంతు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ప్రథమ ముద్రణ : జనవరి - 2005

ప్రతులు : 1000



**పుస్తకములభించు అడ్రెస్సు :**

**ఎల్. ఓబయ్య నాయుడు,**

డోర్ నెం: 15-1227 (మిద్దెపైన), వినాయకపురం,

కొండమిట్ట, చిత్తూరు (పోస్టు), చిత్తూరు. ఆంధ్రప్రదేశ్.

పుస్తకం ఖరీదు : **రూ. 126/-**

---

*ముద్రించిన వారు:*

**వెట్రివేల్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

పొన్నియమ్మన్ గుడివీధి, చిత్తూరు, (ఆం.ప్ర.)

పిన్ కోడ్ : 517001, ఫోన్: 08572 - 235169.

ప్రొ: పి. పట్టాభి రెడ్డి

# రావణ రాజ్యము, రామ రాజ్యము

## మా తల్లిదండ్రులకంకితము

క. శ్రీ రామా యీ కావ్యము
ధారాళముగాను నాదు, తలిదండ్రులకున్
కూరిమిసంకితమొసగి తి
వారికి సద్గతుల నిమ్ము, వరగుణరామా

క. తలిదండ్రి ఋణము దీర్చక,
పలువిధకార్యము లొనర్చు, ఫలితము కంటెన్
తలిదండ్రుల కొనరించెడు
పలు సేవలె మిన్నయగును, ప్రభు శ్రీరామా

క. కావున నేనీ కావ్యము
గావించితి తలిదండ్రికతి సమ్మతితో
గావున నీ పుణ్యము గొని
రావింపుము పరమగతకి, రఘుకుల సోమా

ఆ. తండ్రియాజ్ఞ నీవు, తలదాల్చి యడవికి
వెడలిపోయినావు విహిత మనుచు
అందరకును నీవు, ఆదర్శ మార్గంబు
చూపితీవిధంబు శుభ చరిత్ర

## మఱియు వినము

సీ. లంకిపల్లె పెద్దరామి నాయుడు తండ్రి, ఆదెమ్మగారు నాకమ్మయయ్యె
పాపయ్య వారికి ప్రథమ పుత్రుండయ్యె, మంగమ్మయనుపుత్రి మరల గలిగె
చెంగమనాయుండు, శ్రేష్ఠుడై జన్మించె, గురవయ్య నాల్గవ కొమరుడయ్యె
ఐదవ వాడయి యావిర్భవించెను, నారాయణాయను నామమునను

తే. అందరికి పిన్న వాడ నేనగుటవలన, ముద్దుమురిపెంబుతోనన్ను మోద మలర
మాటలాడించి నేనాడు మాటలకును, సంతసంబందుచుండిరి సరసులగుచు

క. రామా వీరందరినీ ధామంబును జేరనటుల, తమదయతోడన్
క్షేమంబుగ బిలిపింపుము, నామది సంతోషమంద, నా శ్రీరామా

ఇట్లు మా పెద్దల శ్రేయోభిలాషి రచయిత, కవి
**లంకిపల్లె ఓబయ్య నాయుడు**





పిలిచిన పలికెడు దైవము
ఇలలో శ్రీ వెంకటేశుడిహపర సుఖముల్
తులలేని సిరులు యశమును
కలిగించునుగాక! మీకు ఘనతర లీలన్.

---

**THIS BOOK IS**

**PUBLISHED WITH THE**

**FINANCIAL ASSISTANCE OF**

**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**

**UNDER THEIR SCHEME**

**"AID TO PUBLISH RELIGIOUS BOOKS"**



## రచయితనైన నా తొలిపలుకు :

మాన్య మహాశయులారా! వినండి, నేనీ శ్రీమద్రామాయణమును వ్రాయుటకు ముఖ్యకారణములు నాకు శ్రీరామునిపై మక్కువ ఎక్కువ 1955 - 56 లో రంగనాథ రామాయణమును మా అన్నగారు లంకిపల్లె రెడ్డెప్ప గారు (మారు పేరు అప్పోడు) చదువగా ఆ రామాయణానికి సంపూర్ణముగా అర్థము చెప్పియుంటిని. మా పిన తండ్రి చిన రామానాయుడు గారు మాతో ఈ పని చేయించియుండిరి. మా గురువుగారు శ్రీ ఆకుల రెడ్డెప్పాచారి గారి వద్ద చదువుకొను కాలములో మాకు పాఠ్యభాగముగా శ్రీ కంకంటి పాపరాజుగారు రచించిన పద్యకావ్యము శ్రీమదుత్తర రామాయణమును మాచేత చదివించి యుండిరి. ఇది యొక ప్రౌఢకావ్యము ఎవడు ఉత్తర రామాయణమును స్పష్టముగా చదువగలడో అతడు గుర్తింపు గల విద్యావిశారదుడు. ఈ విధముగా నాకు పూర్వ రామాయణమును, ఉత్తర రామాయణముల యందు ప్రవేశముండగా, ఈ కాలపు చదువరులు పద్యముల జోలికి పోవుటలేదు. అందు వలన ఆ ఉత్తర రామాయణమును చదువరులు అటకపై గూర్చుండ బెట్టియున్నారు. అందులో గల విజ్ఞానము అందరికి దూరమైనది.

ఏమయ్యా! రామాయణమును రకరకములుగా సినిమాలలో చూస్తున్నాం, టీవీలలో జూస్తున్నాం, ఆ కాలము కంటే ఈ కాలము వాళ్ళమైన మాకే బాగా దెలుసునను వారు లేకపోలేదు. అందుకు నేను సమ్మతిస్తున్నాను. కానీ అది యెంత మందికి లభ్యమౌతుంది. చాలా మందికి సాధ్యపడదు, ఎందుకనగా ఇంటిలో నుండి టీవీని చూచిన వారికి, సినిమా చూచిన వారికి మాత్రమే లభ్యమౌతుంది. ఆ విజ్ఞానం నీటి మీద వ్రాతవంటిది. నీటి మీద వ్రాసిన అక్షరాలెంత సేపుండునో, ఈ విజ్ఞానం కూడ చూచి, విన్నవారి మనస్సులలో అంతసేపే యుండును. స్థిరముగా ఉండునదేదీ అంటే రాతి మీద వ్రాతమాత్రమే. రాతి మీద అక్షరాలు వేస్తే ఆ రాయి ఉన్నంత కాలమూ ఉండగలవు. అదేవిధంగా రాతి మీద శాసనమువలె, చదువరులలో, శ్రోతల మనస్సులలో నిలచిపోవాలంటే గ్రంధములుండి తీరాలి. ఆ గ్రంధాలను పలుపర్యాయములు పఠించి, పుస్తకములోని విజ్ఞానాన్ని, మస్తకంలో నిక్షిప్తంజేసుకోవాలి. ఇదంతా ఆలోచించి, నేను ప్రౌఢకావ్యములో గల పద్యాలకు, భావమును మాత్రమే గ్రహించి సామాన్యముగా చదువ, వ్రాయనేర్చిన వారందరికిని, అరటిపండు ఒలిచి నోటిలోని కందించినట్లు, సులభముగా అర్థమగునట్లు వ్రాసి ముద్రణ వేయించి రావణుడంటే యెలాంటివాడు, అతని రాజ్యపరిపాలన మెలా జరిగినది, అతని వలన ప్రపంచములో గల వారెంత సుఖపడియున్నారు, అతనిని సంహరించి శ్రీరాముడు పరిపాలించినాడు. ఆయన కాలములో ప్రపంచవాసులే విధముగా సుఖమను భవించినారు. ఇదంతా తెలియాలంటే, వచనములో మరొక గ్రంధము కావలిసిందే. అదీగాక శ్రీరాముడు ముఖ్య ఆరాధ్య దైవము

అయోధ్యలో పదకొండు వేల సంవత్సరములు శ్రీరాముడుండి రాజ్యపరిపాలన మొనరించి యున్నాడు. అలాంటి రాముడు జన్మించిన చోటనున్న గుడిని బడగొట్టి, మసీదును నిర్మించడము సమంజసమేనా? భారతీయులందరికి, ఇది తెలియాలంటే ఈ గ్రంధాన్ని చదివి అర్థంచేసికోవలసిన అగత్యమెంతైనా ఉన్నది. దేవుడక్కడనే యున్నాడా? అంతటా ఉన్నాడు కదా! అని చెప్పేవారు కూడ ఉన్నారు. ఒక కోవకు చెందినవారు మరణించిన వారి పేరుతో స్థూపాలను నిర్మిస్తున్నారు. వీరెంత మందిని ఉద్ధారకం చేసినారని స్థూపాన్ని జ్ఞాపకార్థం నిర్మించాలి. పోనీ ఆ స్థూపాన్ని పడగొట్టితే వారూరకుంటారా? వీరికే స్థూపాలు నిర్మిస్తే రామునికి పుట్టిన స్థలంలో చారిత్రికమైన గుడి అక్కరలేదా! రాముడు ముందుటి వాడా లేక మసీదింకా ముందుటిదా? ఇందులో ఏది న్యాయం, ఏది అన్యాయం, ప్రతి వారికి తెలియాలంటే, ఈ గ్రంధాన్నందరు చదవాలి. గాంధీ మహాత్ముడు రామ రాజ్యం కావాలని కోరాడు. రాముని పరిపాలన చెడ్డదైతే, గాంధీగారు అలాకోరేవారు కారుకదా! ఇదంతా, విజ్ఞులు ఆలోచించాలి.

రామాయణమొక కుటుంబ చరిత్ర. ఆ కుటుంబములో కూడ కుశ్చితులు ప్రవేశించి కలతలు బెట్టారు. చిన్నాభిన్నమైంది. మరలా తేరుకొని, ఆ కుటుంబం ఐకమత్యముతో కలసినిలిచింది. కుశ్చితులు దలచుకొంటే వారు సాధించలేనిదేమీ ఉండదు. అందుకే వేమన్నగారన్నారు. వేరు పురుగు జేరి వృక్షంబు జెరచును, చీడ పురుగు జేరి చెట్టు, జెఱచు కుశ్చితుండు జేరి గుణవంతు జెరచురా, విశ్వదాభి రామ వినురవేమ. అన్నారామహాత్ముడు.

ఇదంత నా మనస్సునందు మెదలుట చేతనే గ్రంధ రచనకు పూనుకొంటిని. 20 సంవత్సరముల కృషి ఫలితమీగ్రంధం. దీనినందరు చదవి తమ కుటుంబ సభ్యులచే చదివించి తమ పిల్లలచేత, స్త్రీలచేత చదివించి, తరతరముల వరకు ఆదర్శ గ్రంధముగా ఆరాధించుచు శ్రీరాముని కృపకు పాత్రులయ్యెదరుగాక.

తారక మంత్రము కోరిన దొరకెను, ధన్యుడనైతిర వోరన్నా! మీరిన కాలుని దూతల పాలిటి మృత్యువుయని నమ్మకయున్న - మరొక మహాత్ముడు.

శ్రీరామనామాం, మరువాం మరువాం, సిద్ధాముయమునకు వెరువాం వెరువాం అన్నాడు ఇంకొక మహాత్ముడు ఎంత ధీమానో చూడండీ. ఇది చదివిన వారికి యమలోక మార్గం మూత - వైకుంఠ మార్గం తీత, నమస్తే!

ఇట్లు

రచయిత

ఎల్. ఓబయ్య నాయుడు



శ్రీ పూజ్య రామకృష్ణానంద స్వాములవారు

గండి క్షేత్రమ్

**అభిప్రాయము :**

గండిక్షేత్రం, శ్రీ భూమానం దాశ్రమం పీఠాధిపతులు, పూజ్యపాదులు, మా గురుదేవులు. బ్రహ్మలీన **శ్రీశ్రీశ్రీ రామకృష్ణానంద స్వాముల వారు.** గీతావాణిపత్రికా సంపాదకులు.

వీరు నాకధ్యాత్మిక గురువర్యులు, వీరి ఆశీర్వాద బలము, శ్రీ కృష్ణ పరమాత్మ, దయా విశేషముల వలన నేని పుడొక రచయితనైనాను, వీరునాకు 1984 లో నేను వ్రాసిన శ్రీమద్భగవద్గీత, తోహరగేయములను రచియించి యుండిన గ్రంథమునకు వారిచ్చియుండిన, అభిప్రాయము నేనిందు పొందు పరచు చున్నాను.

**ఇకవారి సందేశము :**

భక్తునకు భద్ర కామనలు, భద్రాశీస్సులు నాయనా ఓబయ్యా! నీ పట్టుదల, ఫలించినది, నీగీతా సేవ పండినది. **నహి కల్యాణ కృత్‌కశ్చిత్** దుర్గతిం తాతగశ్చతి (గీత 6వ అధ్యాయం) అనే గీతావాక్యాన్ని యోగక్షేమం వహామ్యహం అనే భగవంతుని ప్రతిజ్ఞను (గీత 9-22) ఆచరణలో చేసి చూపించి, చరితార్థం చేశావు.

"రామంతే అధిక రామంకరదాసో"

రామునికంటే రామభక్తుడే గొప్ప, అనితులసీ దాసన్నాడు, గట్టి శిష్యుడవు, నేనే మెత్తనివాణ్ణి, నీవు నాకంటే గట్టి వానివి, బాబూ నీ ఉద్యమం మూడు పూవ్వులు ఆరు కాయలుగా వికాసంచెంది వర్థిల్లుగాక, ఏడు కొండల ప్రభువు నీకు సదాయేడుగడ యగునుగాక, రామకథ ఎందరెన్నివిధాల వర్ణిస్తే వాసికి తక్కువా? అని కంకంటి పాపరాజుగారన్నారు.

గీతను బహురుచులతో త్రాగి, త్రాగీ ఎందరెంత త్రాగినా! అఘత్యాగం, అజ్ఞానత్యాగం, ఆదికేశవునితో యోగం సంయోగం సంయోగ సిద్ధం, గీతాచార్యుని, అనుగ్రహము, గీతామాత ఆశీర్వాదము, సదానీకులభించు గాక, అని రామకథను పై విధముగా ప్రశంసించి యున్నారు, తథాస్తు శుభమస్తు.

ఇట్లు

**శ్రీశ్రీశ్రీ రామకృష్ణానందస్వాములవారు గీతావాణి సంపాదకులు**

**ప్రచారకులు, భూమానందాశ్రమం, గండిక్షేత్రము**

**వీరన్న గట్టుపల్లె వేంపల్లె పోస్టు, పులివెందుల మండలం, కడపజిల్లా, (ఆం.ప్ర.)**

# నివేదన

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య
తిరుపతి

**యావత్ స్థాస్యంతి గిరయః**
**సరితశ్చ మహీతలే !**
**తావద్రామాయణ కథా**
**లోకేషు ప్రచరిష్యతి !!**

కొండలూ, నదులూ భూతలంలో ఉన్నంత కాలం రాముని గాథ లోకంలో వ్యాప్తినొంది ఉంటుంది అని రామాయణ ప్రశస్తి వర్ణింప బడింది.

రామాయణం పూర్వరామాయణం, ఉత్తర రామాయణం అని రెండు భాగాలు. రావణ సంహారానంతరం శ్రీరాముడు అయోధ్యకు తిరిగి వచ్చి పట్టాభిషిక్తుడయ్యేంత వరకు సాగిన కథ పూర్వరామాయణం. ఆ తరువాత సీతాపరిత్యాగం, శంబూకవధ, రావణుని చరిత్ర మొదలైన కథలూ, చివర రాముని మహాప్రస్థానం - వర్ణింపబడే భాగాన్ని ఉత్తర రామాయణ మంటారు.

యోగవాసిష్ఠం గూడ ఉత్తర రామాయణంగా ప్రశస్తమయింది. అది యిక్కడ ప్రస్తుతం కాదు.

ఉత్తర రామాయణాన్ని వాల్మీకి రచించినాడా? అన్న విషయంలో అనేక వాదోపవాదాలు వెలశాయి. ప్రముఖులనేకులు అది వాల్మీకి రచన కాదన్నారు. ఔనన్నవారూ లేకపోలేదు.

శ్రీ కంకంటి పాపరాజు అనే తెల్గుకవి ఉత్తర రామాయణగాథను చక్కని ప్రబంధంగా తెల్గులో అనువదించి యున్నాడు. ఇంకా ఇతరులు కొందరు చేసిన ఆంధ్రానువాదాలు గూడా ఉన్నాయి.

ఉత్తర రామాయణంలో సీతాపరిత్యాగం, శంబూకవధ అనే అంశాలు శ్రీరాముని పవిత్ర చరిత్రకు కళంకం ఆపాదిస్తున్నాయని కొందరి భావన. ఏది ఏమైనా లోకంలో అనాదిగా వ్యాపించిన ఈగాథలను ఆధునిక దృష్టితో పరీక్షించి అందలి బాగోగులను నిర్ణయించడం వల్ల కలిగే ప్రయోజనం శూన్యమే.

శ్రీ లంకిపల్లె ఓబయ్య నాయుడుగారు నాకు దాదాపు 20 సంవత్సరాల నుండీ పరిచితులు. ఈయన సహజకవి. గండి శ్రీరామకృష్ణానంద స్వాములవారి వంటి మహనీయుల అనుగ్రహానికి పాత్రుడైన ఉత్తమవ్యక్తి.

ఇంతకుముందే శ్రీరామద్విశతి, భగవద్గీత - తోహార గేయాలు వీరు రచించి ప్రచురించారు. ఇంకా కొన్ని గ్రంథాలు కలవుగాని అవి అముద్రితాలు.

ప్రస్తుతం ఉత్తర రామాయణ కథకు వీరు 'రావణ రాజ్యము - రామ రాజ్యము' అన్న పేరులో సరళ గ్రాంథిక భాషలో, అందరికీ అర్థమయ్యే తీరులో అను-వదించారు. దీనికి మూలం కంకంటివారి ప్రబంధమే. అయితే 'శంబూకవధ' వంటి ఘట్టాలు రాముని పాత్రకు అనౌచిత్యాన్ని ఆపాదిస్తున్నాయని గుర్తించిన వీరు

హనుమంతుని విద్యాభ్యాస ఘట్టాన్ని వర్ణించేటప్పుడు నేటి విద్యార్థుల సో పేర్కొన్నారు.

ఇంత పెద్ద గ్రంథాన్ని ఓపికతో శ్రమకోర్చి రచించిన శ్రీ ఓబయ్య నాయుడు గారు శ్లాఘనీయులు. భగవంతుడిచ్చిన రచనా శక్తిని భగవత్సేవకే అంకితం గావిస్తూ ఈ గ్రంథాన్ని ఇలా రూపొందించడంలో వీరు కృతకృత్యులయ్యారు.

ఈ గ్రంథం విలువ గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం వారు దీని ముద్రణకు తగిన సాయం అందించడం ముదావహం.

పాఠకులు ప్రాచీన ప్రబంధాలు చదివే రోజులు క్రమంగా కనుమరు-గయ్యాయి. సులభ సుందరంగా వచనంలో ఉంటే కొందరైనా చదువుతారు. అందులో రామాయణం వంటి ఉద్గ్రంథం అందరికీ పఠింప దగినదే.

అట్టి గ్రంథాన్ని అందరికీ అందుబాటులోకి తెచ్చిన శ్రీ ఓబయ్య నాయుడు గారు అభినందనీయులు.

ఇంటింటా ఈ గ్రంథం ఆదరింపబడగలదని మనసారా భావిస్తున్నాను.

ఇట్లు

సముద్రాల లక్ష్మణయ్య

తిరుపతి.

# అక్షరాంజలి

వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు నైన శ్రీలంకిపల్లి ఓబయ్య నాయుడు గారు నాకు చిరపరిచితులు. భారతీయ ఆర్ష సంప్రదాయ సంస్కృతుల పట్ల వీరికిగల ఆరాధనాతత్త్వం ప్రశంసనీయం. ప్రాచ్యపంథాలో విద్యాభ్యాసం చేసిన మహనీయులు వీరు.

కంకంటి పాపరాజు కవి ప్రణీతమైన ఉత్తర రామాయణం ఒక మహత్తర కావ్యం. ఈ ఇతివృత్తాన్నే సంస్కృతంలో భవభూతి, తెలుగులో తిక్కన, కంకంటి పాపరాజు ఆవిష్కరించిన తీరుతెన్నులు సహృదయలోకానికి రసరమ్యజగత్తులై వెలిశాయి. కాని అవన్ని శ్లోకాలుగా, పద్యాలుగా ఉన్నందువల్ల గాసట బీసటే చదివి గాథలు త్రవ్వే తెలుగు పాఠకులందరికీ అందుబాటులో లేవు. ఆ మనోజ్ఞకావ్య ఘట్టాలను సరళాంధ్ర గద్యరూపంలో తెనుగు సేత గావించిన ఘనత శ్రీ ఓబయ్య నాయుడు ప్రతిఘట్టాన్ని, సన్నివేశాన్ని అందరికీ అర్థమయ్యే రీతిలో వీరు మలిచారు. సీతాపరిత్యాగం, లక్ష్మణుని విషాదం వంటి సన్నివేశాలు పఠిస్తూ ఉంటే పఠితల హృదయాలు కరుణరసప్లావి తాలౌతాయి. హనుమంతుడు సూర్య భగవానుని వద్ద విద్యాభ్యాసం చేసిన మధురఘట్టం నేటివిద్యార్థులందరూ తప్పక చదవాలి. ఒక్క విద్యార్థి లోకమే గాదు. అందరూ తప్పక చదువదగిన గ్రంథం ఈ "రావణ రాజ్యము - రామరాజ్యము".

శ్రీ ఓబయ్య నాయుడు గారు భవిష్యత్తులో ఇంకా ఇటువంటి గ్రంథాలు రచింపగలరని ఆకాంక్షిస్తూ, వారికి అక్షరాంజలి సమర్పిస్తున్నాను.

**మేడసాని మోహన్ గారు**

తిరుపతి.

# ముందుమాట

**డా॥ వి. హరినాయుడు**

రీడర్ : తెలుగు డిపార్టుమెంటు,

వి.వి.కె.ఎన్. ప్రభుత్వ కళాశాల, చిత్తూరు.

**శ్రీ లంకిపల్లె ఓబయ్యనాయుడు** గారు గండి భూమానందాశ్రమాధిపతులైన **శ్రీశ్రీశ్రీ బ్రహ్మలీన రామకృష్ణానంద స్వాముల** వారి ప్రియ శిష్యులు. వారి కృపాకటాక్షంచేత తనకు భక్తి తత్పరత, తత్త్వజ్ఞానం కలిగినట్లు వీరు గురుస్తుతిలో చెప్పుకొన్నారు. వీరు రైతుగా జీవనం సాగిస్తూ, రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తున్నారు. శ్రీ మద్భగవద్గీతను తోహర గేయాలుగా అనువదించారు. శ్రీరామ ద్విశతి అనే పద్యకావ్యాన్ని వ్రాసి శ్రీ సత్య సాయిబాబా వారి కంకిత మిచ్చారు. పెక్కుచోట్ల ధార్మికోపన్యాసాలు చేసి పలువురి ప్రశంస లందుకొన్నారు. సహజకవి, కర్షకకవి, ఆధ్యాత్మిక కవియని బిరుదులందు కొన్నారు. రామభక్తిలో మునిగి తేలుతున్న శ్రీ నాయుడుగారు వ్రాసిన ''**రావణ రాజ్యం - రామరాజ్యం**'' నిండైనవారి భక్తి భావనకొక ఉదాహరణ.

**' ఇదంపవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్**

**యఃపఠేద్రామ చరితం సర్వపాపైః ప్రముచ్యతే '**

రామకథ పవిత్రమైనది. పాపాలను హరించేది, పుణ్యాలను చేకూర్చేది, వేదాలతో సమానమైనది. రామచరితను పఠించువాడు సర్వ పాపాలనుండి విముక్తుడౌతాడని వాల్మీకి కవీంద్రులు రామయణ బాలకాండలో వివరించారు. ఇలాంటి ఉత్కృష్టతలున్న రామాయణ కావ్యాన్ని పలువురు పద్యకావ్యాలుగా గద్యకావ్యాలుగా వ్రాశారు. తెలుగులో వచ్చిన రామాయణాల్లో ప్రత్యేకతను సంతరించుకొన్నది కంకంటి పాపరాజు వ్రాసిన '**ఉత్తర రామాయణం**'. రావణుని వధానంతరం, శ్రీరామ పట్టాభిషేకమైన తర్వాత సీతనుద్దేశించి లోకులు ఏదో మాట్లాడుకొంటున్నారని వేగులు చెప్పగా రాముడువిని, లోకాపవాదభీతితో గర్భవతిగా ఉన్న సీతను అడవిలో విడిచి రమ్మనడం, సీతకు కుశలవులు జన్మించడం, శ్రీరాముని అశ్వమేధయాగం, సీతారాముల పునస్సమాగమం, భూదేవితో సీత రసాతల ప్రవేశం, రామాదులు పరమపదం చేరుకోవడం ఇందులోని ఇతివృత్తం. కంకంటి వారి ఉత్తర రామాయణాన్ని శ్రీ నాయుడు గారు అనువదించడానికి గల కారణాన్ని ఉటంకిస్తూ –

' సామాన్యులు, పండితులు రామావతారమహిమను చదివి ధన్యజన్ములు కావాలనే భావనతో, ఈనాటి పాఠకులకు పద్యాలు చదవడం, అర్థం చేసుకోవడం కష్టమని భావించి, కంకంటి వారి ఉత్తర రామాయణ కావ్యంలోని పద్యాలకు భావానువాదం చేసి '**రావణ రాజ్యం - రామ రాజ్యం**' అనే పేరుతో వచన రచన చేస్తున్నాను' అని పీఠికలో స్పష్టీకరించారు.

రచయిత సరళ గ్రాంథిక భాషలో ఈ కావ్య రచన చేశారు. దశగ్రీవాదుల బాల్య క్రీడలు, దశగ్రీవుని వీరహోమం, వేదవతీ వర్ణన, మేఘనాథుని పరాక్రమం, హనుమంతుని విద్యాభ్యాసం, రావణునికి సనత్కుమారోపదేశం, యమలోకవర్ణన, అశ్వమేథయాగ వర్ణన, వైకుంఠ వర్ణన మొదలగు ఘట్టాలను ఎంతో రమ్యంగా, మూలానికి మెరుగులు దిద్దినట్లు వ్రాశారు.

భక్తి తత్త్వవిషయాల్లో రచయిత సూక్ష్మ విషయాలను కూడ వదిలిపెట్టకుండ అనువదించారు. రాక్షస వీరుల జననం, వారి చేష్టలు, సాహసాలను, అతిశయంగా వర్ణించినట్లు కనిపించినా పాత్రపోషణ విషయంగా అది సమంజస మనిపిస్తుంది.

హనుమంతుని విద్యాభ్యాసం, శంబుకుని వధ అనువదించు సందర్భాల్లో స్వీయాభిప్రాయాన్ని వ్యక్తీకరించి తన అంతరంగాన్ని బయట పెట్టినారు శ్రీ ఓబయ్యగారు. నాటికి నేటికి మనిషి ఆలోచనల్లో వస్తున్న మార్పుల విశ్లేషణ కీఘట్టాలు ఉపకరిస్తాయి. యాగాశ్వాన్ని లవకుశులు అడ్డగించడం, లక్ష్మణుడు వారితో పోరాడడం ఇందులో లేదు. దీనికి కారణం మూలంలో లేకపోవడమే.

ఇరవై సంవత్సరాల కృషిఫలితం ఈ కావ్యమని కవిచెప్పడం వల్ల గ్రంథం పట్ల యెంతనిబద్ధత, భక్తిభావం ఉన్నాయో తెలుస్తుంది. ఫలశ్రుతిలో 'ఈ కావ్యాన్ని చదివినవారికి తెలియగల మహోపదేశము లెన్నియో గలవు. గోపాలుర నుండి భూపాలుర వరకు తెలిసికోదగినవిందు గలవు' అనిచెప్పి 'పునర్జన్మలేని ముక్తిలభిస్తుంది' అనడం వల్ల సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య మోక్షాలు లభిస్తాయని రచయిత ప్రగాఢ విశ్వాసం.

దైవభక్తిని, ఆధ్యాత్మికభావనను, ఆస్తికత్వాన్ని పెంపొందింపజేసే అమూల్య గ్రంథాన్ని తెలుగు వారికందించిన కర్షకకవి, సహజకవి, ఆధ్యాత్మిక కవి శ్రీ ఓబయ్య నాయుడు గారి జన్మ చరితార్థమైనది. ఈ గ్రంథ రాజాన్ని ఆంధ్ర పాఠకలోకమాదరించుగాక!

<u>ఉపదేశ వాక్యం</u>

రామహా రామహా రామహా
రామహా శ్రీరామ రామ రామహా రామహా
రామహా రామహా రామహా
రామహా పట్టాభిరామ రామహా రామహా
**(ఇది తారకమంత్రం - శ్రీరామద్విశతి)**

**వి. హరినాయుడు**

# కృతజ్ఞతలు

నేనీ గ్రంథమును వ్రాయుటకు కంకంటి పాపరాజు గారి పద్యకావ్యము, ఉత్తర రామాయణమునకు భావానువాదముగా వాడుకొన్నందు వలన శ్రీ పాపరాజు గారికి.

నా గ్రంథరచన ప్రచురణకు ఆర్థిక సహాయ మందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము ముఖ్యదైవము శ్రీ వేంకటరమణ స్వామికి, కార్య నిర్వహణాధికారి గారికి, ఎడిటర్ ఆఫీసరు గారికి వారి సిబ్బందికి, సెలక్టు కమిటీ వారికి మఱియు **శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారికి.**

ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి అక్షరాంజలి వ్రాసిన సరస్వతీ -పుత్ర, అవధాన చక్రవర్తి టి.టి.డి. అన్నమాచార్య ప్రాజెక్ట్ డైరెక్టరు **శ్రీ మేడసాని మోహన్ గారికి.**

గ్రంథప్రచురణలో చేదోడు వాదోడుగా సహకరించిన చిత్తూరు జిల్లా రచయితల సంఘ ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి మాజీ సభ్యులు **శ్రీ కె. రామకృష్ణ గారికి.**

ప్రూఫులు సరిజూచి తప్పులను సవరించి పీఠికను వ్రాసి యిచ్చిన **డా॥ వి. హరినాయుడు గారికి.**

అద్భుతముగా పేపర్లలో ప్రింటింగు రేపరు, వర్ణచిత్రణము జేసి, అందముగా, ఆకర్షణీయముగా భద్రతగా నుండునటుల బైండింగ్ జేసి యిచ్చిన వెట్రివేల్ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్ అధినేత **శ్రీయుతులు పట్టాభి రెడ్డి గారికి వారి సిబ్బందికి మరియు ఆర్. శ్రీనివాసన్ గారికి.**

మఱెందరో మహానుభావులకు పేరు పేరున అభినందనలతో నా కృతజ్ఞతలను దెల్పుకొనుచు, ధన్యవాదములర్పించు కొనుచున్నాను.

ఇట్లు

రచయిత

**లంకిపల్లె ఓబయ్య నాయుడు**

గ్రంథకర్త, ఆధ్యాత్మిక కవి, సహజకవి, కర్షకకవి

ఓం శ్రీ రాం

# రావణ రాజ్యము, రామరాజ్యము (వచన రచన)

ఈ గ్రంథమును వ్రాయుటకు, నా ఉద్దేశ్యము, రచయిత, శ్రీరామనామ మాహాత్మ్యము

## గ్రంథ విషయ సూచిక పేజీలు

## ఆశ్వాసం: 8 ప్రారంభము

# గ్రంధ ప్రచురణకు విరాళములిచ్చిన దాతలు

| | | |
|---|---|---|
| 1. | వెంకట్రెడ్డి గారు, బెంగుళూరు | 3,000-00 |
| 2. | T.N. రఘునాథ రెడ్డి గారు, మదనపల్లె | 1,116-00 |
| 3. | రామ సుబ్బారెడ్డి గారు, రిటైర్డు వెటర్నరీ డా॥ మదనపల్లె | 1,116-00 |
| 4. | రెడ్డెయ్య నాయుడు గారు, మదనపల్లె | 1,116-00 |
| 5. | రామలక్ష్మమ్మ గారు, కుప్పము రెడ్డెమ్మ | 1,116-00 |
| 6. | రమణయ్య నాయుడు గారు, మదనపల్లె | 1,000-00 |
| 7. | రాటకొండ నరసింహా రెడ్డి గారు, మదనపల్లె | 1,000-00 |
| 8. | డాక్టరు సిద్దారెడ్డి గారు, పుంగనూరు (మదనపల్లె) | 1,000-00 |
| 9. | D. ఆదికేశవులు నాయుడు గారు, చిత్తూరు | 1,000-00 |
| 10. | పామిడి వద్ద కల్లూరు రాధాకృష్ణ గారు, అనంతపురం | 1,000-00 |
| 11. | K.V. రమణయ్య డాక్టరు గారు, మాజ పుదిపట్ల | 1,000-00 |
| 12. | రామిరెడ్డి గారు, లక్ష్మీపురం | 1,000-00 |
| 13. | అనంతపూర్ B.J.P. నాయకులు | 1,000-00 |
| 14. | రామిరెడ్డి గారు, పెరుమాళ్ళపల్లె | 1,000-00 |
| 15. | డాక్టరు లక్ష్మమ్మ గారు, మదనపల్లె | 516-00 |
| 16. | సరోజమ్మ గారు, చిత్తూరు | 516-00 |
| 17. | బాబిలతా పటేల్ డాక్టరు గారు, మదనపల్లె | 510-00 |
| 18. | డాక్టరు వీరప్పగారు, మదనపల్లె | 508-00 |
| 19. | డాక్టరు సంజీవ రాయుడు గారు, మదనపల్లె | 500-00 |
| 20. | ప్రపుల్లమ్మ, మదనపల్లె | 500-00 |
| 21. | డా॥ చంద్రమోహన్ గారు, మదనపల్లె | 500-00 |
| 22. | A.S.R. సినిమా నారాయణస్వామి నాయుడు గారు | 500-00 |
| 23. | మాణిక్యమ్మ గారు, చిత్తూరు | 500-00 |
| 24. | ఇందిరమ్మ గారు, కలిచర్ల | 500-00 |
| 25. | రామ చంద్రయ్య గారు (ఎడంవారిపల్లె వడ్లమిషన్ ఓనర్) | 500-00 |

| | | |
|---|---|---|
| 26. | వెంకట్రమణప్ప గారు, పోస్టు మాస్టర్, లక్ష్మీపురం | 500-00 |
| 27. | శ్రీనివాసులు రెడ్డి గారు, బ్యాంకు మేనేజరు | 500-00 |
| 28. | డా. జయచంద్రా రెడ్డి గారు, చిత్తూరు | 400-00 |
| 29. | మట్టిపాడు నరసింహారెడ్డి గారు | 200-00 |
| 30. | రాందాస్ నాయుడు గారు, బెంగుళూరు | 200-00 |
| 31. | రామప్ప నాయుడు గారు, రాయల్‌పాడు | 200-00 |
| 32. | డా॥అశోక్ గారు, మదనపల్లె | 200-00 |
| 33. | రచయితల సంఘం వారు, మదనపల్లె | 150-00 |
| 34. | విజ్ఞానసుధ రఘునాథ్ గారు, చిత్తూరు | 120-00 |
| 35. | వేదాంతం లక్ష్మీ శాస్త్రిగారు, మదనపల్లె | 120-00 |
| 36. | విద్యాసాగర్ డాక్టరు గారు, మదనపల్లె | 116-00 |
| 37. | డా॥ వర్మాగారు, మదనపల్లె | 116-00 |
| 38. | హరినాథ గుప్త గారు, చిత్తూరు | 116-00 |
| 39. | శమంతక మణి గారు, చిత్తూరు | 116-00 |
| 40. | T.N. సరస్వతమ్మ గారు, చిత్తూరు | 116-00 |
| 41. | కలిచర్ల ప్రభాకర రెడ్డి గారు | 116-00 |
| 42. | డా॥హరీష్ గారు, మదనపల్లె | 110-00 |
| 43. | డా॥విజయ్ కుమార్ గారు, మదనపల్లె | 100-00 |
| 44. | డా॥M.D. సుబ్బారావు గారు | 100-00 |
| 45. | డా॥S.M. భాషా గారు, మదనపల్లె | 100-00 |
| 46. | డా॥ప్రసాద్ గారు, మదనపల్లె | 100-00 |

# రావణ రాజ్యము, రామ రాజ్యము
# వచన రచన జేయుటకు నా ఉద్దేశ్యం

రచయిత

శ్లో. చరితంరఘు నాథస్య శతకోటి ప్రవిస్తరం
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనం
రామాయ రామభద్రాయ రామచంద్రాయవేదసే
రఘునాధాయ నాథాయ సీతాయ: పతయేనమ:

క. శ్రీ మద్రామాయణ కథ
సామాన్యులు పండితులును జదివియుతామున్
రామావతార మహిమను
తామెల్లరు జదివి జన్మ ధన్యత జెందన్

సీ. రావణ రాజ్యంబు రామరాజ్యంబని
వచనంబు వ్రాసితి వనరు గాను
పాపరాజు గారి పద్యంబు లందలి
భావాను వాదంబు బరపినాడ
పద్యముల్ జదువుట బహు కష్టమని యెంచి
మాని వేయగ చాల మరుగుబడుచు
నుండుట గమనించి నొక విధంబుగ దాని
పునరుద్ధరింపగ బుద్ధినెంచి

తే. రాక్షసోత్పత్తి రావణు జన్మ కథయు
తపము వరములు లోకముల్ దద్దరిలుట
దేవతలు రావణుని భాధ దీర్పు మనుచు
వేడుకొనన భయమొసగెనా విష్ణు మూర్తి

క. పరలోకంబున నుండి యు
నరలోకంబున జనించి నారాయణుడే
దురమున రావణు జంపియు
ధర పదినొకవేల యేండ్లు తానేలిచనెన్

సీ. ఇనవంశశేఖరా! యీ కావ్యమణివి నిర్మించిన సుకవి వాల్మీకి మౌని
రామాయణంబను నామంబు దీనికి గావించెనిది భవత్కథయెసుమ్మ
విను మిరువదినాల్గు వేల గ్రంథంబిది, యేనూరు సర్గలు నిందుగలవు
పట్టాభిషేచన పర్యంత కథలారు, కాండంబుల రచించెకడపటి కథ

తే. నవలనుత్తర కాండంబుననునమర్చెనమ్మ హామౌనినతని దయానిరూఢి
నేమునేర్చితిమిది విననిచ్చగల్గె నేనివినదగుదినము నివ్విధమున

**రాముడవ్వేళ వైకుంఠధాము డయ్యే**
**ఈ విధముగా రావణునితో ప్రారంభమై**
**శ్రీరాముడు వైకుంఠ ధామము జేరుటతో**
**ఈ కావ్యం ముగుస్తుంది.**

# శ్రీరామనామ మాహాత్మ్యము

సీ. నియతి రామా యంచునీ నామము జపించు
భాగ్యశాలికి వేదపాఠమేల
నిను నొక్క పరియైన గనుగొన్న సుజ్ఞాన
నిధికి బ్రహ్మజ్ఞాననిష్ఠయేల
నీ భక్తియొనరించు నిపుణు జేరి భజించు
స్థిరబుద్ధికి దపంబు సేయనేల
నీ కటాక్షము దారి నిమిషమాత్రము జేరి
చెలగు మేటికి దీర్ఘసేవయేల

తే. నీ వినుతిసేయు వానికి నిక్కువముగ
జింత సేయంగ నణి మాది సిద్ధులేల
జానకీనాథ మీ పాద జలముగ్రోలు
ఘన గుణాబ్ధికి దేవత్వకాంక్షయేల

# శ్రీరామనామ మహిమను గురించి మహనీయులు జెప్పిన మహావాక్యములు

1. రామ నామము కన్న మంత్రము భూమిలోనే లేదురా
2. రామనామమే లడ్డుంటా, తినేటి వారికి తీపుంట
3. అంతా రామమయం జగమంతా రామమయం
4. తారక మంత్రము కోరిన దొరికెను ధన్యుడనైతిని ఓరన్నా
5. మీరిన కాలుని దూతల పాలిట మృత్యువృయుని నమ్ముకయున్నా
6. శ్రీరామనామం మరువాం మరువాం సిద్ధామియమునీకి వెఱువాం

ఓం శ్రీరామ చంద్ర పరబ్రహ్మణేనమః

# రావణ రాజ్యము రామరాజ్యము వచన రచన

## సమస్త దేవతల ప్రార్థన

**క. శ్రీవాణి, గౌరి, గణపతి**
**నా వాగ్గుణ కర్మములను నలరించుటకున్**
**భావమున దలతు సద్గురు**
**దేవుని భవహరుని దేవ, దేవాధిపతిన్**

బ్రహ్మదేవునివద్ద వేదములను దొంగలించిన సోమకాసురుని సంహరించి, ఆ వేదములను, బ్రహ్మ కొసగిన, ఆ మీనరూప పరమాత్మ, నన్ను రక్షించు గాక.

తాబేలు రూపముతో మందర పర్వతమును తన వీపుపై మోసిన ఆదామోదర పరమాత్మ నన్ను తప్పక రక్షించు గాత.

వరాహ రూపముతో భూమిని తన కోఱ మీద నిలబెట్టిన ఆ వరాహమూర్తి నన్ను వర్ధిల్లజేయు గాక.

భక్త ప్రహ్లాదుని బాధలు పెట్టిన, హిరణ్యకశ్యపుని విదళించి పొట్ట జించిన నరసింహమూర్తి నన్ను రక్షించు గాక.

వామనుడై బలి చక్రవర్తిని సామాన్యుని వలె దానమడిగి త్రివిక్రముడై త్రిలోకాల నాక్రమించిన త్రివిక్రమదేవుడు త్రిలోకములయందును నన్ను ధీరుడై కాపాడు గాక.

పరశురామమూర్తి నాకు ప్రభువై ప్రాపుగా నుండు గాక.

శ్రీరామచంద్రుడు నన్ను చెంతనే యుండి కాపాడు గాక.

బలరాముడు నాకు బలమొసగి రక్షించు గాక.

చిదానంద ఘనుడు, శ్రీకృష్ణభగవానుడు, ఫల్గుణనకు వలె నాకు ప్రాపై పరమార్థ జ్ఞానము ప్రసాదించి పరమ పధమును బహూకరించు గాక

బుద్ధావతారుడు బుద్ధిని కల్క్యావతారుడు కలిమిని, బలములను, కలిగించి నన్ను కాపాడుగాక.

విఘ్నములను, దొలగించి వినాయకుడు రక్షించును గాక. సమస్త వాక్జృంభణములతో సరస్వతీ దేవినానాలుక పై నాట్యమాడును గాక.

పార్వతీ దేవి నాకు ప్రాపైయుండు గాక, శివుడు నాకు క్షేమములు సమకూర్చును గాక.

బ్రహ్మదేవుడు నాకావ్యమును బహు విధములుగా సృష్టికి సాయ మొనరించు గాక, విష్ణు దేవుడు నన్ను విడువక వెనువెంటనే కాపాడు గాక. లక్ష్మీదేవి నాదగు కావ్యమునందు నిక్షేపమై నిలచి యుండు గాక.

హనుమంతుడు అణువణువున, నా కావ్యమునదంతర్భూతుడై యుండు గాక!

# సుకవుల వర్ణనము

ఆదికవి వాల్మీకి, ఆది కావ్యము రామాయణము. ఆ రామ తారకమంత్ర పఠనీయముచే, పాపరహితుడై, రామాయణ కావ్యమును రచించిన వాల్మీకి మహా మునీంద్రుని, నా హృదయమునందు వసియింప వేడుకొనుచున్నాను.

వ్యాసమునీంద్రుని, సంస్కృత కవులను ఆంధ్రకవులను అందరికినీ నా హస్తములు మోడ్చి నమస్కరించుచున్నాను.

పరమమై, వినుటకింపై, పాపములను పోగొట్టునదై, పుణ్యకధలు గలదై, మఱియు బ్రహ్మదేవునిచే పొగడ్తలందినదై, మృదు మధురమై, పదబంధురమై ధారావాహినిగా, సందర్భ శుద్ధులతో, ఆయా రసముల చొప్పించి, కంకటి పాపరాజుగారు రచించిన పద్యకావ్యమైన ఉత్తరరామాయణమును ఆధారముగా జేసికొని, ఇతర కావ్యముల నుండి కొన్నింటిని గ్రహించి రచన గావించియున్నాను.

**మాన్య మహాశయులారా, ఇంతకు ముందే**

తిక్కనాది మహాకవులు ఎందరెందరో వ్రాసి యున్నారు. వారికంటే నీవంత మహాఘనుడవా? అని నన్ను నిరసింపవద్దు. ఆ రామకథ నెందరెన్ని రీతుల వర్ణించినా దాని వాసికి తక్కువ కాదని కంకటి పాపరాజుగారు చెప్పియున్నారు. దాని కీర్తి పెరుగుచుండునే గాని తరుగునది కాదు. అది తరుగదు.

**(జీవు) లెనుబదినాల్గు లక్షల చావు పుట్టుకలిక్కడ ఎవరెవరు జేసిన పాప కర్మములనుభవించేదక్కడ) అని ఒక జ్ఞాని తత్త్వమును రచించి యున్నాడు.**

సృష్టిలో ఎనుబది నాలుగు లక్షల రకముల జీవరాసులున్నవట, ఉద్భిజములు, స్వేదజములు, అండజములు, పిండజములని స్థావర జంగమములు నాల్గువిధములు.

స్థావరములు ఎక్కడ పుట్టినవో అక్కడనే యుండనవి చెట్లు, మానులు రాళ్ళు వంటివి. జంగమములు అటు యిటు తిరుగాడునవి. ఇవి క్రిమి నుండి పశు పక్షి మృగాది మానవుల వరకు గలవు.

ఉద్భిజములనగా, భూమిలో నుండి మొలకెత్తి పైకి వచ్చునవి, స్వేదజములు, ఎవరెవరిచెమటతో వారియందే పుట్టునవి. చీరపోతులు. తలలో పేలు మొదలగునవి అండజములు, గ్రుడ్లలో నుండి పుట్టునవి. పక్షులు మొ!!వి పిండజములు పశువులు, మనుష్యులు, మావిలో నుండి చీల్చుకొని పుట్టునవి.

ఈయన్నింటి కంటే మనుష్య జన్మ శ్రేష్ఠము ఆఖరుదట, అట్టి మనుష్యుడై, ఈ కర్మభూమియందు పుట్టి కవిత్వము వ్రాయనేర్చి, ఆ జానకీ దేవి భర్త, మఱియు పుణ్యముల ప్రోవైన, రామచంద్రుని కథను జెప్పక, అసత్కథలెన్ని జెప్పినను, వ్రాసినను వాని వివేకమెందుకు బనికి వచ్చును అని పాపరాజుగారన్నారు.

ఏలననగా వాల్మీకి మహాశయుడు, శుభప్రదమగు శ్రీరామ తారక మంత్రమును నిష్ఠాగరిష్ఠుడై జపించి, పాపప్రక్షాళమును గావించుకొని పవిత్రుడైన తరువాతనీ కథను రచించియే కదా మూడులోకములందు గల మహామునీంద్రుల చేత పొగడ్తలంది యున్నాడు, అందుచున్నాడు. అట్టి రామకథ, పుణ్యములకు పుట్టిల్లైనందున, ఎటువంటి వారికైనను, పాపములను దరిద్రములను, త్రుంచి వేయబడుచుండును.

అంతియే కాదు. ఈ కావ్యమును చదివిన ప్రతి వారికిని, తెలియ గల మహోపదేశము లెన్నియో గలవు. గోపాలుర నుండి భూపాలుర వరకు తెలిసికోదగినవిందులో గలవు.

# కథా ప్రారంభము

శ్లో : అయోధ్యా, మధురా, మాయా, కాశీకాంచే అవంతికా పురీ ద్వారవతీ
చైవ సప్తైతే మోక్షదాయికా

మనుజులకు, మోక్షమునొసగెడు పుణ్యపట్టణములు ఏడున్నవి. వానిలో అయోధ్య మొదటి పట్టణము.

అయోధ్యను ఎందుకు మొదటి పట్టణముగా ఎందుకు మన ప్రాచీనులు నిర్ణయించుటకు తగిన కారణమేమిటని పరశీలించగా కృతయుగము నుండి అయోధ్య రాజధానిగా, సూర్య వంశ, క్షత్రియులు భారతదేశమును పరిపాలించుచుండిరి, వారిలో దశరథ మహారాజునకు శ్రీరామన్నారాయుణుడే పుత్రుడుగా జన్మించి, శ్రీరామచంద్రుడను పేరుతో, రావణాదిదుష్టరాక్షసులను సంహరించి, ఆ పట్టణమునకు రాజై, పదునొకండు వేల సంవత్సరములు రాజధానిగా రాజ్య పరిపాలన చేసి, దుష్టులను దునుమాడి, శిష్టులను చేరదీసి ధర్మసంస్థాపన, చేసి అఖరులో అక్కడున్న సమస్త జీవులను సరయూనదికి తన వెంట దీసుక పోయి వారికందరికి, వైకుంఠ ప్రాప్తి గలుగజేసి, తాను అవతార సమాప్తి గావించిన అపురూపమగు శ్రీరామ జీవిత గాథను సూచించెడు చరిత్ర గలది అయోధ్యా పట్టణము.

పూర్వ రామాయణ కథను సంగ్రహముగా నిందు పొందుపరచితిని

# అయోధ్యా పట్టణ వర్ణన

అయోధ్యలో గల గుఱ్ఱములు గాలివేగములు గలవి. ఏనుగులు, నల్లని కొండల వలె నడయాడుచుండును. వీరభటులు, ప్రళయ కాలరుద్రుల వలె పరాక్రమ వంతులు అమరావతీ పట్టణమును దేవేంద్రుడేలినట్లు, అయోధ్యను, దశరథ మహారాజు పాలించుచుండెను. అయోధ్య చుట్టూ గల పొలములు పంటలు బండి వంగియుండును.

ఇట్లుండగా ఆ పట్టణమును, ఏ కొఱతలు లేనివాడై సూర్య వంశీయుడగు, దశరథ మహారాజు ధర్మముగా ప్రజలను కన్నబిడ్డల వలె పరిపాలించుచుండెను.

అయనకే కొఱతలు లేకున్నను, ఒక కొఱత మాత్రము వైదొలగ కట్లే నిలచియుండెను. అది సంతానము లేని కొఱత. అయనకు ముప్వురు పట్టపు రాణులు. వారు కౌసల్య, సుమిత్ర, కైక. ఆయనకు వృద్ధాప్యము వద్దన్నా వచ్చి పైబడియుండెను. సంతానము సంభవించలేదు. అందువలన, తన కన్నీ యుండియు, లేనివాని వలె చింతించుచుండెను.

ఆ కొఱత దీర్చుకొనుటకు దశరథ మహారాజు, తమ కుల గురువు వసిష్ట మహర్షితో కూడ వాసుదేవాది మునీంద్రుల బిలిపించి, వారి కర్ఘ్య పాద్యాదులనిచ్చి తగిన ఆసనముల యందు గూర్చుండ నియమించి; వినయముతో మహాత్ములారా! మా వంశాకురములగు సంతాన ప్రాప్తి నాకు సమకూరలేదు. కావున మీరు నామీద దయ దలచి, సంతానమును కలిగించు సదుపాయమును చక్కగా ఆలోచించి సంతాన ప్రాప్తి కలిగింపవలయుననగా, మునీంద్రులందరును సమాలోచన గావించి, ఒక తీర్మానము గావించిరి. పుత్రకామేష్టి అను యజ్ఞమును గావించినచో మీకు సంతాన ప్రాప్తి గల్గునని దశరథ మహారాజునకు సమాధానమొసగిరి.

అందుకు ఋష్యశృంగ మహర్షిని, రోమపాదుని పట్టణము నుండి అయోధ్యకు, ఆ యజ్ఞము జేయుటకు ఆహ్వానించుకొని ఆయన ఆధ్వర్యములో యజ్ఞమును ప్రారంభించిరి.

ఇది యిట్లుండగా లంకాధిపతియైన రావణుడు, ఆ కాలములో బ్రహ్మదేవుని వలన, బలమైన వరములను బొంది, ఆ వరగర్వములతో విజృంభించి యజ్ఞయాగాదులను చెడగొట్టుట, పుణ్య స్త్రీలను చెఱబట్టుట, తపోవనములు తగులబెట్టుట, మునీశ్వరులను మోది చంపుట, రాజుల పై యుద్ధములు జేయుట వారి నోడించుట, దేవేంద్రాది దిక్పాలురను, దేవతలను ఒకరేమిటి త్రిలోక వాసులను ముప్పుతిప్పలు బెట్టుచుండెను.

ఆ రావణుడు బెట్టు బాధల కోర్వలేక, దేవతలు, మునీశ్వరులు, తక్కుం గల వారందరును కలసి, వైకుంఠమునకు బోయి శ్రీమన్నారాయణుని దర్శించి చేతులు జోడించి దీన వదనులై, దేవదేవ! రావణ, కుంభకర్ణాది రాక్షసుల వలన మాకు కల్గు బాధలను భరింపలేకున్నాము. వారిని సంహరించి దయతో మమ్ము రక్షింపుమని వేడుకొని యండిరి.

వారి ప్రార్ధనను విని శ్రీమన్నారాయణుడు, వారి పై దయగలవాడై వేల్పులారా! మీరిక భయపడవలదు. ఆ రావణుని దుండగములన్నియు నేను గమనించుచునే యున్నాను. కానీ బ్రహ్మ యిచ్చిన వరములను కాపాడుట కొరకై, నేనింత కాలము సంహరింపక యూరకుంటిని. ఇక సహింపను భూలోకములో అయోధ్యా పట్టణమునందు, దశరథ మహారాజు తనయుడనై శ్రీరామచంద్రుడను పేరుతో నవతరించెదను. మీరును మీమీ యంశలతో వానరులుగా జన్మింపుడు. అందరము కలసి, ఆ రాక్షసుని అంతము గావించెదము. అతడు బ్రహ్మను వరములడుగునపుడు, నరుల చేతను, వానరుల చేతను, చావు లేకుండా వరములను కోరలేదు. అందు వలన, మనము నరులుగా, వానరులుగా బోయి వారిని హతమార్చవలెను. దేవుళ్ళముగా నుండి సంహరింపబోయినచో వాడు సంహరింపబడడు, అని శ్రీరామన్నారాయణుడు దేవతలకభయమొసగి వారిని పంపివైచెను.

ఇట్లు శ్రీమన్నారాయణుడు దేవతలకొసగిన మాటను చెల్లించుకొనుటకై సమయమును కనిపెట్టుకొని యుండెను. భూలోకములో తమలీలలను జూపింపదలచి విష్ణువు వైకుంఠ నగరము మీద గల వాంఛను వదులుకొనెను.

ఇది యిట్లుండగా అయోధ్యలో వసిష్టుడు ఋష్య శృంగుని అధ్వర్యములో దశరథ మహారాజు యజ్ఞవాటికలో పుత్ర కామేష్టి సేయుచుండిరి. ఆ యజ్ఞములో, హోమకుండము నుండి పాయస పాత్రనుదీసికొని యజ్ఞపురుషుడు, బయలు వెడలి ఆ పాత్రను దశరథ మహారాజున కొసగి, ఇందులో గల పాయసమును నీ రాణులకు ముప్వురుకును సమపాళ్ళుగా పంచి యిమ్ము. వారు దానిని స్వీకరించి, భుజించిన యెడల వారి యందు సంతాన ప్రాప్తి గల్గునని చెప్పి వెడలిపోయెను. విష్ణుదేవుడా పాయస రూపములో నుండి దశరధుని భార్యల యందు కౌసల్యకు శ్రీరామచంద్రుడును, సుమిత్రకు లక్ష్మణ, శత్రుఘ్నులును, కైకకు భరతుడును జన్మించిరి.

వారు దిన దిన ప్రవృద్ధి జెంది కుల గురువు వసిష్ట మహర్షి వద్ద సమస్త విద్యలు నేర్చిరి. ఆ కుమారులను జూచి, దశరథ మహారాజు తనివి దీర యానందించుచుండెను. ఇట్లుండగా నొకనాడు విశ్వామిత్ర మునీంద్రుడు దశరథ మహారాజు దర్శనార్థమై దశరధుని సభాస్థలికి వచ్చెను. దశరథుడా మునీంద్రునకు తగిన మర్యాదలు గావించి, స్వామీ! మీరు మాతో నేమి కార్యార్థమై యరుదెంచితిరి. చెప్పినచో ఆ కార్యమును. చేసెదనని మాటయిచ్చెను.

అందుకు విశ్వామిత్రుడు సంతోషించి, రాజా! నేనొక యజ్ఞమును జేయుటకు తలపెట్టి యున్నాను. కానీ, ఆ యజ్ఞమును, మా రీచ, సుబాహులను రాక్షసులు జరుగనీయక భగ్నము గావించుచున్నారు. వారిని రూపుమాపే శక్తి నాకున్నది కానీ నేను యజ్ఞ దీక్షలో నుండుట వలన కోపింపరాదు. అందువలన నీ సహాయమును కోరి వచ్చితిని. నా వెంట రామలక్ష్మణులను బంపుము. యజ్ఞమును వారి సహాయముచే నిర్విఘ్నముగా నెరవేర్చుకొని నీ కుమారులను నీకు మరలా అప్పగింపగలను అని విశ్వామిత్ర మహర్షి దశరధునకు దెలిపెను.

అది విన్న దశరథ మహారాజు వినయముతో స్వామీ! రాముడు పసివాడు. ఇంకనూ యుద్ధానుభవములు తెలియని వాడూ. ఆ రాక్షసులు రణరంగము నందారితేరిన వారు. అందు వలన సైన్య సమేతముగా నేనే వచ్చి మీ యజ్ఞమునకు రక్షణ గావించెదను అనగా వశిష్ట మహర్షి దశరధునకు ధైర్యమును దెల్పి నీవు ఈ మునీంద్రునకు జేసిన వాగ్దానమును నిలబెట్టుకొనుము. మీ వంశీయులింతవరకు ఆడిన మాట తప్పిన వారు కారు. అంతే కాదు రాముని సామర్థ్యమును గాధి నందునుని ఘనతను దెలియపరచి దశరధునకు ధైర్యము దెలిపి రామలక్ష్మణులను విశ్వామిత్రుని వెంట బంపుటకంగీరింపజేసెను.

రామలక్ష్మణులు, విశ్వామిత్రుని వెంట బయలు దేరిరి. వారిని వెంట బెట్టుకొని విశ్వామిత్రుడు ఋష్యాశ్రమయంబులను జూపుచు, తనధను ర్విద్యలను వారికి నేర్పించుచు వారికి బల అతి బలయను విద్యను నేర్పి, జృంభకాస్త్రములను వాని ప్రయోగోప సంహారాదులను తెలియజేసెను.

ఇట్లు వారు పోవుచుండగా వెయ్యేనుగులబలము గలదియగు తాటకి యను రాక్షస స్త్రీ, భయంకర రూపముతో, వారికెదురయ్యెను. ఆ రాక్షసిని జూచి విశ్వామిత్రుడు శ్రీరామునితో ఓ రామచంద్రా! ఇది స్త్రీ కదాయని దయ జూపవద్దు. దుష్టురాలగుట వలన స్త్రీని రాజగువాడు దడించవలెను, అని తెలుపగా శ్రీరాముడు ముని యాజ్ఞను శిరసా వహించి, తక్షణమే తాటకిని సంహరించెను. తరువాత వారు మునియాశ్రమును చేరిరి.

మునీంద్రుడు యజ్ఞమును ప్రారంభించెను. మారీచ సుబాహులు మరలా యజ్ఞమును జరుగనీయక రక్త మాంసములు గురిపించిరి. రామలక్ష్మణులు గస్తు దిరుగుచుండిరి. రాముడొక బాణముతో గొట్టగా సుబాహుడు మృతి జెందెను. మారీచుడు మాత్రము మరణింపక సముద్రములో బడి లేచి చక్కగా లంకలోనికి వెళ్ళెను. మునీశ్వరుని యజ్ఞము, నిరాటంకముగా నెఱవేరెను.

తన యజ్ఞ కార్యము ముగిసినందుకు రామ లక్ష్మణులను ప్రశంసించుచు, విశ్వామిత్ర మహర్షి విశేషముగా సంతోషించెను. తరువాత రామలక్ష్మణులను, విదర్భానగరము(మిధిల)నకు దీసికొనిపోవుటకు సమకట్టి, ప్రయాణము సాగించుచుండెను. వారు పోవు దారిలో గౌతమ మహర్షి ఆశ్రమము కలదు. ఆ యాశ్రమము లోనికి రామలక్ష్మణులు ప్రవేశించిరి, వారు పోయిన చోట ఒక ఱాతికి రామచంద్రుని పాదము సోకెను. ఆ స్పర్శ తగులగనే, శిల సజీవ స్త్రీగా మారెను. ఆ స్త్రీ గౌతమ మహర్షి భార్య అహల్య, గౌతమముని శాపమువలన ఆమె రాయిగా పడియుండెను. రామపాద స్పర్శతో, మరలా అహల్యగా మారి శ్రీరామచంద్రుని పూజించెను.

ఆమె వలన పూజలందిన తరువాత, విశ్వామిత్రుడు వారిని మిథిలా నగరమునకు దీసికొనివెళ్ళెను. అక్కడ జనక మహారాజుగారింటిలో శివ ధనుస్సు కలదు. ఆ ధనస్సును ఎవరెక్కుబెట్టెదరో వారికి తనకుమార్తెనిచ్చెదనని, జనక మహారాజు శపథము జేసియుండెను. రాజాధిరాజులందరు వచ్చి ఆ ధనుస్సు నెక్కుబెట్టుటకు ప్రయత్నించి, పెట్టలేక మొనగాండ్రందరు వెనుకకు వెడలి

యుండిరి. విశ్వామిత్రుడు జనక మహారాజునకు రామలక్ష్మణులను జూపించి, శివధనుస్సు నెక్కుబెట్టుటకు శ్రీరామచంద్రుని నియమించెను. రామచంద్రుడా ధనుస్సునకు నమస్కరించి ఎడమ చేతితో పైకెత్తి, కుడిచేతితో అల్లె త్రాటిని ఎక్కుబెట్టుటకు, ఎగద్రోయుచు ధనుస్సును వంచు సమయమున నది ఫెళ్ళుమను శబ్ధముతో నడిమికి విఱిగి నేలపై బడెను. అపుడు శ్రీరాముని పై పుష్ప వర్షము గురిసెను. సీతయును జనక మహారాజును సంతోషించిరి. జనక మహారాజు విశ్వామిత్ర మహర్షితో వివరణలు తెలిపి అయోధ్యకు వర్తమానము బంపిరి. దశరధుడు తమ భార్యలతో, బంధువులతో భరత, శత్రుఘ్ను కుమారులతో రథ, గజాశ్వములతో మంత్రులతో సపరివారముగా బయలుదేరి, మిథిలానగరమునకు వచ్చెను. జనక మహారాజు దశరధునకు రాజోచిత సత్కారములు గావించి, తగిన విడుదులనిచ్చి శ్రీరామచంద్రునకు సీతను తనకుమార్తెయైన ఊర్మిళను లక్ష్మణునకును తన తమ్ముని కుమార్తెలు మాండవిని భరతునకును, శ్రుతకీర్తిని శత్రుఘ్నునకును ఇచ్చి, శుభముహూర్తమున వివాహము జరిపించిరి. తన కుమార్తెలను దశరథ మహారాజు వెంట జనకుడయోధ్యకు బంపెను. అందరును పోవుచుండిరి.

వారిట్లు పోవుచుండగా జమదగ్ని కుమారుడు పరశురాముడు వారు పోవుచున్న త్రోవలో ప్రత్యక్షమయ్యెను. పరశురాముని పేరు వినగానే దశరధుడు అతని కెదురుబోయి దండ ప్రణామములాచరించి, ప్రాధేయపడి, తమ కుమారులకు జరిగిన వివాహమును దెలిపి, మాపై దయజూపుమని యడుగుచుండెను. పరశురాముడు దశరధుని తిరస్కార భావముతో జూచి రామచంద్రునిగని ఓ రాఘవా! నీవు నా గురువు గారగు శివుని ధనుస్సును విఱిచి నా గురువు గారి కపచారము గావించితివి. అది పేటెత్తియుండెను. శివ, విష్ణువులు యుద్ధము జేసినపుడు ఆ ధనుస్సు శివుడు చేపట్టగా ఇదిగో నా చేత నుండు ఈ ధనుస్సును విష్ణువు ధరించి యుండెను. దానిని విఱచుటతో నేను మహాబలవంతుడనని, ఉబ్బి పోవుట కాదు, నాచేత నున్న ఈ ధనుస్సు నెక్కుబెట్టుము, నీ బలమెంతటిదో చూచెదగాకయని ఆ ధనస్సును శ్రీరాముని చేతికి పరశురాముడందించెను. శ్రీరాముడు ధనుస్సు నొకవైపు కొనను చేతికందుకొని, ఆ ధనుస్సు ద్వారా పరశురామునిలోనున్న బలశౌర్యముల సర్వస్వమును లాగికొనెను. పరశురాముడు బలహీనుడై తన చేతిలో నున్న ధనస్సు కోపును కూడ మోయజాలక క్రిందికి విడచి రామచంద్రా! నీవెవడివో నేను తెలిసికొంటిని. శ్రీరాన్నారాయణుడవు. నేను కూడా

ఆయంశమువాడనే, అందు వలన నాలో గల విద్యలు, శక్తులు నీలోనికి ప్రవేశించినవి. ఇక నేనీ దినము నుండి, క్షత్రియుల పై పగసాధించుట విడచి వైచి తపస్సు జేసికొనుటకు బోవుచున్నాను. నీకన్ని విధముల జయమును క్షేమమును సమకూరుగాక! అని శ్రీరామునాశీర్వదించి వెళ్ళిపోయెను.

పిమ్మట రామలక్ష్మణులు, తమ తమ భార్యలతో తల్లిదండ్రులతో బంధు మిత్ర పరివారముతో నెమ్మదిగా అయోధ్య జేరి అందరును సుఖసంతోషములతో నుండిరి. ఇట్లుండగా దశరథ మహారాజు ఆలోచించి రామచంద్రునకు రాజ్య పరిపాలనసేయు సామర్థ్యమున్నదని గ్రహించెను.

ఒక దినము, వసిష్టాది మహామునీంద్రులును, హిత, పురోహిత మంత్రులును నిండు సభలో కొలువైయున్న సమయమున దశరథుడు సభ వారి సమక్షములో శ్రీరామచంద్రునకు యువరాజ పట్టాభిషేకము గావింపదలచితిని. ఆ కార్యము, మీకందరికిని, ఇష్టమైనచో ముహూర్తము నిర్ణయింప వలసినదిగా వసిష్టుని కోరెను. వసిష్టుడు ముహూర్త నిర్ణయము గావింపగా, ఆ ప్రకారమంతయు రామచంద్రునకు తెలియజేసి, పట్టణమునలంకరించుటకు చాటింపు జేయించెను. అందుకు ప్రజలందరు సంతోషించి, పట్టణాలంకరణతో పాటు తమ తమ గృహములను కూడా అలంకరించుకొనుచుండిరి.

ఇట్లుండగా దశరథ మహారాజు చిన్న భార్య కైక. ఆ కైక యొక్క దాసి మందర. ఆమెను కేకయ రాజు తన కుమార్తెయైన కైకకు నమ్మకము గల దాసిగా ఆనాడే ఆమె వెంట పంపియుండెను. ఇట్లుండగా ఒకనాడు శ్రీరాముడు తన తమ్ములతో ఆడుకొనుచుండగా ఆయన వేసిన బొంగరము వచ్చి మందర మోకాలునకు తగిలినదట. అందుకు మందర కసి తీర్చుకొనెద చూడుమని శబథము చేసియుండెనట. ఈనాడు శ్రీరామ పట్టాభిషేక మహోత్సవముగా, పట్టణ మలంకరించు చున్నారని, కొందరి వలన తెలిసికొని, పరుగు పరుగున కైక వద్దకుచేరినది.

ఆత్రుతతో అమ్మా! కైకా! రేపు శ్రీరామునకు పట్టాభిషేకము జరుగ బోవుచున్నదే అని తెలియజేసినది. కైక సంతోషముతో, మందర వద్దకు వచ్చి ఎంత చల్లని మాట జెప్పితివేయనుచు, ఈ మాటకు తగిన బహుమతి నీకు నేనివ్వలేను. కానీ, ఇదిగో నా మెడలో గల రత్నహారము నీ మెడలో వేయుచున్నానని హారము వేసి తన సంతోషమును వ్యక్తపరచినది.

ఆ చేష్టలకు మందరకు ఒళ్ళంతా మంటలెక్కినవి, శరీరముపై జెఱ్ఱులు బారాడినట్లైనది. పెదవులు కొఱుకుకున్నది. కైక యిచ్చిన హారాన్ని విసిరి కొట్టినది. ఓ వెఱ్ఱిబాగులదానా! నీ సవతి కొడుకు రాజు కాబోవుచుండ ఆ మాట విని నీవు సంతోషించెదవా? నీకిపుడున్న గౌరవము, రేపటి నుండి ఉండబోదు. రేపటి నుండి కౌసల్య కొడుకు రాజు. అందువలన నీవు కౌసల్యకు దాసివి. నేను ఆమె దాసీలకు దాసిని. నీ కొడుకు భరతుడు శ్రీరామునకు బంటు, మన బ్రతుకెంత మర్యాద లేని బ్రతుకు. అందువలన రాబోయే ప్రమాదము తెలిసిన, నేనెట్లు సంతోషింపగలను? ఇదంతా నిజమైతే, శ్రీరామునకు పట్టాభిషేకము జరుగకూడదు. ఆ జరుగబోయే పట్టాభిషేకము నీ కుమారుడు భరతునకు జరుగవలెను. భరతుడు రాజైతే నీవు ఆయన తల్లిగా అధికార మహారాణిగా నిన్ను నా కన్నులతో చూడవలెను. అప్పుడు నీవిచ్చిన హారాన్ని నేను వేసుకొని తిరగాలి అని మందర కైకకు ఇంకా ఎన్నెన్నో విధాలుగా బోధించినది. ఇంత మార్పు జరగాలంటే, నేను చెప్పినట్లు నీవు వినాలి అని మందర కైకకు కశ్మల గుణాలను నూరిపోసినది.

చెప్పుడు మాటలు చాలా తియ్యగా నుండునని పెద్దల నానుడి. అంత మంచి కైక ఇంతలోనే మారిపోయింది. ఐతే, ఇంకేమి సేయుమనెదవో చెప్పవేయని అని కైక మందరనడుగగా చెప్పుచున్నది.

రాజుగారీదినం నీ వద్దకు రాకమునుపే నీవలంకారములను తీసి వేసి, కోపగృహంలోనికి వెళ్ళి గట్టిగా పడుకో. రాజుగారు రాగానే బింకము చూపించు. ఆయన ప్రాధేయ పడినా మాట్లాడవద్దు. ఆయన నిన్ను ఆలనా పాలనలతో నీకేమి కావాలో చెప్పుమని అడిగినపుడు, నీకు ఆయనిచ్చియుండిన పూర్వపు వరములను జ్ఞాపకము జేసి, ఆ రెండు వరములను ఇపుడు నాకు చెల్లించవలెనని కోరుకో అని చెవిలో ఏదో చెప్పి జాగ్రత్తగా మసలుకో అని హెచ్చరించినది. కైక అదే విధముగా కోపగృహప్రవేశము గావించినది.

దశరథ మహారాజు శ్రీరామ పట్టాభిషేక విషయమును కైకకు తెలిపి ఆమెను సంతోషపెట్టవలెనని ఉత్సాహముతో కైక గృహమునకు బ్రవేశించెను. కైక కనబడలేదు. కోపగృహములో నున్నదని దాదులు దెల్పగా కారణమేమిటో తెలియక రాజుగారు గృహములోనికి బోయి అలుక పాన్పు పైనున్న కైకను జూచి తిన్నగా సమీపించి యామెను పలుకరించెను, పలుకలేదు. ఇట్లు పరుండుటకు కారణమేమి తెలుపవలెను గాని పరుండిన ప్రయోజనమేమి? రేపు, మన శ్రీరామచంద్రునకు

పట్టాభిషేక మహోత్సవము, జరుగగలదు. శ్రీరాముడు ఆయన తల్లికంటె నిన్నే గొప్పగా భావించే వాడు. అందువలన ఆ విషయమునునీకు తెలిపి నిన్ను సంతోషింప జేయుటకై వచ్చితిని అని దశరధ మహారాజు కైకకు దెలియజేసెను.

అది విన్న కైక మహారాజా! ఒకప్పుడు మీరు నాకు రెండు వరము లిచ్చియుంటిరి. ఆ వరములను నాకవసరమైనపుడు కోరెదను అంతవరకుమీ దగ్గరనే యుంచుకోవలసినదని చెప్పి యుంటిని. ఆ రెండు వరములను నాకు మీరిపుడు చెల్లించవలెను.

ఆ వరములేమిటో చెప్పెదను వినండి, ఒకటి భరతునకు పట్టాభిషేకము, రెండవది జటావల్కలములు ధరించి శ్రీరామచంద్రుడు పదునాల్గు సంవత్సరములు అరణ్య వాసము. ఈ రెండు వరములను నాకు మీరిపుడు చెలించవలెను.

అని కైక వినిపించగనే దశరధుడు విని మొదలు నరికిన పర్ణ వృక్షము వలె నేలకొఱగి పోయెను. కొంతసేపటికి తెప్పరిల్లి, కైకను ప్రాధేయపడి ఆ రెండు పద్ధతులు తప్ప మరేవియైనను కోరుకొనుము తప్పక యిచ్చెదనని రాజుగారనేక విధముల చెప్పినను ఆమె ఒప్పుకొనలేదు. ఆ రాత్రంతయు దశరధుడు కైక యింటనే యుండెను.

మరునాడరుణోదయమున రామచంద్రుడు లేచి కాలకృత్యములను దీర్చుకొని స్నానమాడి కాబోయే యువరాజైనందున, మొదట తల్లులకు నమస్కరించి, వారి దీవెనలందవలెనని తలంచి రామచంద్రుడు కైకమ్మ యింటికి బోయెను. అక్కడ జరిగిన దంతయు తెలిసికొని కైకమ్మతో అమ్మా! మా తండ్రి యిచ్చిన వరములను నేను చెల్లించెదను. తండ్రి ఆస్తులకు మాత్రమే తనయుడు వారసుడు కాదు. ఆయన బాధ్యతలన్నింటికిని వారసుడే. అందువలన నా తండ్రి యిచ్చిన మాట నేను నిలబెట్టెదను అని చెప్పి కౌసల్య, సుమిత్రల యిండ్ల కడకు బోయి, వారికీ విషయములను దెలిపి, భరతుని నా వలెనే చూచుకొనుడు. ఈ వరములనతడు కోరలేదు. అతని తల్లి కోరినది. ఇందులో అతని తప్పేమియు లేదు అని వారందరికిని ఓదార్పు మాటలు జెప్పి లక్ష్మణునితో గలిసి సీతాదేవి గృహమునకు వచ్చి, జరిగినదంతయు ఆమెకు తెలియజేసి నేనడవికి బోయి పదునాలుగేడులు, పదునాలుగు దినములు గడిపి వచ్చెదను. మీరు నేను వచ్చు వరకు మీ అత్త గారికి సేవలు జేయుచు భరతుని మన్నలందుచు కాలమును

గడుపుచుండుము. భరతుడు చాలా మంచివాడు. అతడు ఆయన తల్లి కంటే మిమ్మే ఎక్కువగా చూడగలడు, అని శ్రీరాముడు దెలుపగా విని సీతాదేవి దుఃఖించుచు నాథా నా మాట కెదురాడెనని యనుకొనక నా ప్రార్థన మన్నింపుడు. నేను కూడా నీతో వచ్చెదను. నీవు లేని అయోధ్యయే నా కడవివంటిది. అట్లు నీవు కాదన్నచో నేను ప్రాణ త్యాగము జేసికొనెదను అని దుఃఖించెను. సీత నూరడించి తనతో వచ్చుటకు రామచంద్రుడు సమ్మతించెను.

ఇదంతయు లక్ష్మణుడు బైట నుండి వినుచుండి, కోపోద్ధీపితుడై అన్నగారికి నమస్కరించి అన్నా నాకడ్డుచెప్పక సెలవొసంగుము. రాజధర్మము నవలంబించి, నేడే భరతుని జంపి, క్షత్రియ ధర్మము ననుసరించి అయోధ్య రాజ్యమును నీ కప్పగించెదను అని లక్ష్మణస్వామి శ్రీరామచంద్రుని కోరెను.

శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో తమ్ముడూ నీవంతటివాడవే కానీ, భరతుడు కూడా నాకు నీలాంటి తమ్ముడే కదా! మఱియు నాయందు భక్తి శ్రద్ధలు కలవాడే కానీ, తనకు రాజ్యము కావలెనని అడవులకు నన్ను పంపుమనీ భరతుడు కోరలేదు. అతని తల్లి కోరినది. మన తండ్రిగారెప్పుడో ఆయమ్మకు మాట చెప్పి యున్నాడు వరములొసగియున్నాడు. కావున తండ్రి మాటను నిలబెట్టుట పుత్రులమైన మనందరి కర్తవ్యము. అందు వలన నీ కోపమునుపసంహారించి, శాంతింపుము, అని శ్రీరామచంద్రుడు తన పెద్ద తమ్ముడైన లక్ష్మణుని శాంతింపజేసి,

తమ్ముడూ! నాపై గల భక్తిని ప్రేమను నీవు భరతునిపై మరలించి నేను వచ్చు వరకు నీవు భరతునకు సహాయకారివై యుండుము, అని శ్రీరామచంద్రుడు లక్ష్మణునకు దెలుపగా లక్ష్మణుడన్నకు నమస్కరించి అన్నగారూ మిమ్ములను విడచి నేను క్షణమైన నుండజాలను, కాదనక మీ వెంట వచ్చుటకు నన్నంగీకరింపుమని ప్రాధేయపడి లక్ష్మణుడడిగెను. శ్రీరామచంద్రుడంగీకరించెను. అందరును కైకమ్మ యింటికి బోయి ఆమె యిచ్చిన జటావల్కములు ధరించి సీత లక్ష్మణులతో గలిసి శ్రీరాముడరణ్యమునకు పయనమయ్యెను. ఈ వార్త దావానలము వలె పట్టణమంతయు వ్యాపించెను. పౌరులందరును, నిన్ను విడచి మేమయోధ్యలో నుండ జాలమని అడవులకు నీ వెంటనే వచ్చెదమని తల్లి గోవుల వెంట లేగదూడల వలె రాముని వెంట బయలు దేరిరి.

సుమంత్రుడు రథమును దీసుకొని రాగా శ్రీరామ, సీతా లక్షణులారథములో పయనించుచుండిరి. ఆ సాయంకాలమునకందరును తమసానది గట్టునకు చేరిరి.

ఆ రాత్రి అందరును అచ్చట బసజేసి నిద్రించిరి. అక్కడ గుహుడను శ్రీరామభక్తుడు రాత్రి కాలములో పౌరజనులు నిద్రించు సమయమున సీతా రామలక్ష్మణులను తన పడవ మీద నెక్కించి తమసానదిని దాటించెను.

ఇక్కడ రామచంద్రుని వెంట వచ్చిన ప్రజలు సూర్యోదయ కాలమున నిద్రమేల్కొనిచూచునప్పటికి, తమ ప్రియతమ రామచంద్రుడు సతీ సోదర సేమతముగా నది దాటి వెళ్ళినను వార్త విని చేయునది లేక తిరుగు ప్రయాణము జేసి అయోధ్య జేరిరి.

సుమంత్రుడు సీతా రామలక్ష్మణులు లేని రధమును అయోధ్యకు దీసికొని పోయెను. రామలక్ష్మణులు రాలేదన్న వార్త విని దశరధుడు ఓ రామచంద్రాయని పుత్రశోకముతో మరణించెను. అపుడు దశరధుని దేహమును తైలములో భద్రపరచి దశరధుని మంత్రులు భరత, శత్రుఘ్నులకు కబురు బంపిరి.

ఆ సమయములో భరత, శత్రుఘ్నులు, తమ మేనమామగారింటికి వెళ్ళియుండిరి. దశరధుని మరణ వార్తను దెలిపి వారిని అయోధ్యకు తీసికొని రావలసినదిగా చెప్పినకబురు విని వారు వెనువెంటనే బయలుదేరి అయోధ్యకు చేరిరి. ఇక్కడ జరిగినదంతయు భరతుడు తెలిసికొని తన తల్లియైన కైకను చాలా నిందించెను. నీవు నాకు తల్లివిగాదు రాక్షసివి. నీ గర్భమునందు నేను పుత్రుడనై పుట్టడమే యొక పాపము. నాకు రాజ్యము సంపాదించి పెట్టుమని నిన్ను నేనెప్పుడైన కోరియుంటినా! ఈ ప్రపంచమున్నంత కాలము నీవు నాకు అప కీర్తి సంపాదించి యిచ్చితివి. పచ్చని కాపురములో చిచ్చుబెట్టితివి. పండంటి కాపురాన్ని భ్రష్టుబట్టించితివి. అని దూషించి భరతుడు. పెద్ద తల్లుల వద్దకు బోయి వారి పాదముల మీద బడినాడు. వారేమి మాటలాడినను. అమ్మా! నన్ను నిందించవలదని వారికి మనస్సు కరుగునటుల ప్రాధేయపడి వారి మన్ననలంది, నేను పోయి మా అన్న శ్రీరామచంద్రుని బ్రతిమాలి తీసికొనివచ్చి అయోధ్యకు రాజును జేసెదనని తల్లులకు జెప్పి తన తండ్రి గారికి దహన సంస్కారములు గావించి తరువాత తన సైన్యముతో బయలుదేరి, చిత్రకూట పర్వతము వద్ద గల శ్రీరామచంద్రుని దర్శించెను.

శ్రీరామచంద్రుడు తల్లులకు నమస్కరించి. వారి వలన తండ్రి మరణ వార్తను విని శ్రీరామసీతాలక్ష్మణులు తర్పణాలను వదిలిరి.

భరతుడన్నను సమీపించి అన్నా! అయోధ్యకు వచ్చి, నీవే రాజ్య భారమును వహింపుము. నీవు వచ్చువరకు నేనీ చోటు వదలిపోనని, శ్రీరాముని పాదముల మీద బడెను. శ్రీరాముడు భరతునకనేక విధములుగా సమ్మతి పరచి భరతుడుకోరగా శ్రీరాముడు తన పాదుకల నిచ్చెను. భరతు డాపాదుకలను దీసుకొని తల్లులుతోతిరిగి అయోధ్య జేరి శృంగి భెరపురమునందు నివసించుచు శ్రీరాముని వలె తానును నార చీరలు ధరించి శ్రీరామచంద్రుడు తిరిగి వచ్చు వరకు అక్కడనే రాముని పాదుకలను రాముని ప్రతినిధిగా బెట్టి రాచకార్యములు సాగించు చుండెను.

ఇట్లు భరతుడు తల్లులును వెళ్ళిన తర్వాత శ్రీరామచంద్రుడు సకాలక్ష్మణులు చిత్రకూటము నుండి దండకారణ్యమునకు వెళ్ళుచుండిరి. వారు పోయెడు త్రోవలో విరాధుడను రాక్షసుడు సీతను జూచి, అవలీలగా ఆమెనెత్తుకొని పైకెగిరిపోయెను. శ్రీరాముడారాక్షసుని ఒక బాణముచే సంహరించి గరుడాస్త్రమును వేసి ఆగరుడుని పై సీతను క్రిందికి దింపుకొనెను. తరువాత మునీంద్రుల ఆశ్రమములను జూచుచు వారి వలన ఆశీర్వాదములను బొందుచు దండ కారణ్యములో బ్రవేశించి పంచవటియను చోట పర్ణశాల నిర్మించి అందులో నివసించుచుండిరి.

సీతారాములకు లక్ష్మణడు రాత్రులలో వర్ణశాలలో ప్రశాంతముగా నుండు నటుల జేసి తాను ధనుర్బాణములను ధరించి గస్తు దిరుగుచు కాపలా గాసెడు వాడు. పగటి కాలములో వారికాహారము పండ్లు దుంపలు తెచ్చి యిచ్చెడువాడు. ఈ విధముగా లక్ష్మణుడు వారి కంగరక్షకుడై సేవలు జేయుచుండెను. ఇట్లు సుమారు పదమూడు సంవత్సరములు దండకారణ్యములో కాలము గడిచెను.

దండకారణ్యము రాక్షసులకు శరణ్యము. లంక నుండి రాక్షసులు వచ్చి పోవుచుండెదరు. అందువలన రావణుని చెల్లెలు శూర్పణఖ అదాటుగా పంచవటి వైపునకు వచ్చినది. అందులో గల వర్ణశాలలో రామలక్ష్మణ సీతలను జూచినది. సీతారాములుండుటయే గాక తనకూ ఒక కుటీరము పర్ణశాల సమీపములో లక్ష్మణుడు వేసికొని యుండెను. శూర్పణఖ రామలక్ష్మణుల అందచందములను జూచి వారిని ప్రేమించి, తనను భార్యగా స్వీకరింపుమని ఒకసారి రాముణ్ణి, మఱియొకసారి లక్ష్మణుణ్ణి కోరినది. నాకు భార్య యున్నది. లక్ష్మణునకు భార్య లేదు. ఆయన వద్దకు వెళ్ళుమని రామచంద్రుడనగా లక్ష్మణుని వద్దకు బోయి నన్ను నీవు భార్యగా స్వీకరింపుమని యడిగినది, నేను ఆయన సేవ కుడను, నిన్ను స్వీకరించినచొ నీవు కూడా వారికి సేవకురాలుగా నుండవలసి యుండును.

అందువలన, ఆయననే స్వీకరింపుము, అని లక్ష్మణుడు చెప్పగా మరలా రాముని వద్దకు బోయి, నీవే నన్ను స్వీకరింపుము. నీకీయాడుది ఉన్నదని కదా నన్ను నిరాకరించుచున్నావు, దీనిని బట్టి ఇప్పుడే దిగ్రమింగెదనని సీత వైపు శూర్పణఖ జూచెను. సీత భయపడుచుండెను. రాముడది గుర్తించి, ఈ చీటీ ఆయన దగ్గరిమ్ము ఆయన నీకు దగిన విధముగా సేయగలడు. అని చెప్పి లేఖను శ్రీరాముడివ్వగా శూర్పణఖ దానిని లక్ష్మణునకు చూపించెను. అది చూచి లక్ష్మణుడా శూర్పణఖను దగ్గఱకు చేరదీసి ఆమె పొడవైన ముక్కును చేటల వంటి చెవులను ఖండించెను. అది రొద జేయుచు భయంకరముగా అఱచుచు అంగలు వేయుచు బరువెత్తెను.

ఆ దండకారణ్యములో ఖరుడు, దూషణుడు అను రాక్షసులు రావణుని బంధువులు గలరు.వారు పదునాలుగు వేల మంది, కంచు రథములు గలవారై యా అరణ్యములో నివసించు చుండిరి. ఈ శూర్పణఖ వారి వద్దకు బోయి, పంచవటిలో రామలక్ష్మణులనే నరులన్నదమ్ము లున్నారు. వారు నన్నీ విధముగా వికృతిరాలను గావించిరి, అని శూర్పణఖ చెప్పగా విని, నరులకింత కండకావరమా వారిని బ్రతుకనీయకూడదని తమ సైన్యముతో రాముని పై యుద్ధమునకు వచ్చిరి.

శ్రీరాముడు సీత రక్షణకు లక్ష్మణుని నియమించి, తానొక్కడే తన బాణములతో వారిని ఖండతుండెములు గావించి ఒకరిని కూడా మిగులనీయక సంహరించెను. అది చూచి శూర్పణఖ బిరబిరాలంకకు బోయి రామలక్ష్మణులు, తనకు గావించిన ఘోరకృత్యమును దెల్పి ఖరదూషణాదులు రామునిచే ఖండింపబడుట కూడా రావణునకు దెలియజేసి సీత యొక్క సౌందర్యమును రావణునెదుట అద్భుతముగా వర్ణించెను. సీత సౌందర్యమును గూర్చి విని చపలుడైన రావణుడు, మారీచుని వద్దకు బోయి నీవు లేడి రూపమును ధరించి మాయామృగముగా నటించి శ్రీరాముని దూరముగా తీసికొని పొమ్ము అని తెలుపగా మారీచుడు బంగారు వన్నె గల మాయలేడి రూపమును ధరించి పర్ణశాల ముందు తిరుగుచెండెను. ఆ మృగమును ప్రాణముతో నాకు పట్టియివ్వుమని సీత కోరగా రాముడు మృగము వెంట బయలు దేరి వెళ్ళెను. అది రాముని దూరముగా దీసికొని పోయెను. రాముడు విసుగు జెంది బాణముతో గొట్టగా శ్రీరాముని వంటి కంఠముతో హా సీతా! హా లక్ష్మణా! యని అఱచుచు మారీచుడు తన ప్రాణములను వదలెను. ఆ కంఠ స్వరము విన్న సీత లక్ష్మణా! మీ అన్నకేదో అపద వచ్చినది. నీవు బోయి సహాయపడుమని కోరెను.

లక్ష్మణుడు సీతతో అమ్మా రామునకాపద వచ్చుట యనగా అగ్నికి చెదలంటినదన్నట్లుండును. రాముని కాపదరాదు. ఇదేదో రాక్షస మాయ. నీవు భయపడవలదు త్వరలోనే అన్న రాగలడని చెప్పగా ఆ మాటలు విని, కోపించి, నీచుడా! నీవు మా సేవ సేయదునను సాకుతో మా వెంట వచ్చి యున్నావు. ఏదో విధముగా రాముడు లేని సమయము జూచి నాతో కాపురము సేయదలచి యున్నావు. మోసముతో దాయాది తనమును బైటపెట్టితివి. భరతుడు రాజ్యాన్ని కాజేసెను. నీవు నన్నే కాజేయాలను కొన్నావు. నీకు నేను దక్కను. నీకోతిక నెఱవేరదని కర్ణ కఠోరమైన మాటలు లక్ష్మణుని మాటలాడగా వినజాలక లక్ష్మణుడు పర్ణశాల యందు మూడు గీతలు గీచి, ఈ గీతలను దాటవద్దు అని తెల్పి అన్నను వెదుకుటకు వెళ్ళెను.

లక్ష్మణుడటు పోయిన వెంటనే అక్కడనే యతి రూపము ధరించి, నక్కి యుండిన రావణుడు, పర్ణశాల ముందు నిలచి బిక్షమడుగగా, సీత భిక్షముదెచ్చి పెట్టబోయినది. గీతలు దాటి వచ్చి భిక్షము పెట్టుమని కపటయతి కోరినాడు. సీత గీతలు దాటినది, యతి రూపములో వచ్చిన రావణుడు తన నిజరూపమును సీతకు జూపి నేను లంకాధిపతి రావణుడను. ఇంత సౌందర్యరాశివైన నీవేల ఆ మానవుడగు రామునితో నుండెదవు. నాతో నాలంకాపురికి రమ్ము. మూడు లోకముల యందెవ్వరికినీ లేనివైభవమును సమకూర్చి యున్నాను. మగవారనే వారందరికీ నేను మగడను. నీకు మాత్రమే దాసుడనుగా నుండగలను. నారాణులందరికి నిన్నే రాణిని చేయుదునని ప్రేలినాడు. సీత కనులెఱ్ఱజేసి వానిని తిరస్కరించినది.

నీవు రాముని ముందు గడ్డి పోచవంటి వానివి. రామలక్ష్మణులను మోసగించి, దూరముగా పంపి ఈ విధముగా బీరములు పల్కుచున్నావు. ఎవరూ లేని సమయమున ఇంటిలోనికి ప్రవేశించు దొంగ కుక్కవలె, రాముడు లేని సమయములో నీవిక్కడికి వచ్చి, ప్రగల్భములు చెప్పుచున్నావని తూలనాడినది.

అతడు ఇంకా భయంకరమైన రూపాన్ని చూపించినాడు. ఆ రూపాన్ని చూచి సీత తెలివి దప్పి పడిపోయినది. తన చేతుల మీద ఆమెనెత్తుకొని తన రథములో బెట్టుకొని బయలుదేరినాడు. సీతకు తెలివి వచ్చినది. రావణుడు నన్ను బలవంతముగా ఎత్తుకొని పోవుచున్నాడు. నేనయోధ్యలో దశరథ మహారాజు కోడలిని. శ్రీరామచంద్రుని భార్యను సీతను అని బిగ్గరగా అఱచుచు రావణుని రథములో పోవుచుండగా ఆ యార్తనాదము విని సూర్యునకు రథము తోలెడి అనూరుని

కుమారుడు జటాయువు అను పక్షి రాజు రావణున కడ్డుపడి వానితో యుద్ధము చేసినది. చివరకు రావణుడు జటాయువును కత్తితో ఱెక్కలను నఱుకగా ఆ జటాయువు క్రిందబడి, సీత జాడ రామలక్ష్మణులకు తెలియజేయుటకై ప్రాణములతో బ్రతికి యుండెను. సీత ఈ విధముగా అరచుచు తమ నగలను దీసి మూటగట్టి ఋష్యమూక పర్వతము మీద నలుగురు వానరులు గుంపుగా నుండగా, ఆ మూటను వారినడుమ బడునట్లు దిగవిడచెను. రావణుడు తన రథములో మహావేగముతో లంకకు బోయి అక్కడ ఆశోక వనములో హరిజట, త్రిజట అను కొందరిని ఆమెకు కావలి బెట్టి ఒక సంవత్సరము గడువు బెట్టి, తనకనుకూలవతి కాకపోయినచో ఈమె కండలు తఱిగి కల్లుతో అద్దుకొనితిని వేయుమని వారి నాజ్ఞాపించి రావణుడు తమ నివాసమునకు బోయెను.

ఇక్కడ లక్ష్మణుడు సీత తనను మాటలాడిన శూలపు పోటుల వంటి మాటలు వినజాలక పర్ణశాల ముందు గిఱ్ఱలు గీచి వీటినిదాటవద్దని తెలిపి రాముని వెదుకుటకు వెళ్ళి యుండెను.

శ్రీరాముడు మాయా మృగమైన మారీచుని సంహరించి, వెను దిరిగి వచ్చుచుండెను. లక్ష్మణుడు మధ్యే మార్గంలో శ్రీరామునకెదురయ్యెను. వర్ణశాలలో జరిగినదంతయు అన్నకు తెలుపగా ఇరువురును వర్ణశాలకు చేరిరి. సీత కనబడలేదు. సీతను వెదుకుచు కొంత దూరము వచ్చిరి. అక్కడ ఱెక్కలు తెగి పడియున్న జటాయువును జూచిరి. జటాయువు వారితో సీతను రావణుడు రథములో బెట్టుకొని పోవుచుండగా ఆమె ఆర్తనాదము విని నేను వానితో యుద్ధము జేయగా ఖడ్గముతో నా ఱెక్కలు నఱికివైచెను. వాడు వెళ్ళిపోగా మీకామె సంగతి తెలియజేయుటకై ప్రాణములతో మీ రాకకు వేచి యుంటిని. ఇక నేను ప్రాణమును వదులుచున్నాను. నాకగ్ని సంస్కారము గావించుమని జటాయువు రాముని జూచుచూ జీవము వదలెను.

రామలక్ష్మణులు చితి బేర్చి మృత జటాయు శరీరమునందులో బెట్టి అగ్ని సంస్కారముగావించి తర్పణలిచ్చి వెడలిరి.

అన్నదమ్ములిద్దరును పోవుచుండగా కబంధుడను రాక్షసుడు ఆమడ దూరము పొడవు గల తన చేతులను చాచగా రామలక్ష్మణులతని చేతికి చిక్కిరి. వానికి తల కడుపులో గలదు. వీరిని మ్రింగుటకు సిద్ధపడుచుండగా వాని భుజములను చెరియొకరు నఱికి వైచిరి, కబంధుడు మరణించెను. కాని శాపము

వలన వాడు రాక్షసుడుగానుండెను. ఇప్పుడు వానిశాపము దీరి దివ్యరూపముతో స్వర్గమునకు బోయెను.

పిమ్మట రామలక్ష్మణులు శబరి ఆశ్రమమునకు బోయి ఆమె యిచ్చిన ఆతిథ్యమును దీసికొని, ఆమెకు మోక్షమిచ్చి అక్కడ నుండి బయలు దేరి పంపాసరోవరము వద్దకు చేరి వారచట తిరుగుచుండిరి. ఆ సమీపమున ఋష్యమూక పర్వతము గలదు. ఆ పర్వతము మీద సుగ్రీవుడు, హనుమంతుడు వారితో ఇంకా కొందరు వానరులుండిరి. కిష్కింధకు రాజధానియైన వానరులకు వాలి సుగ్రీవులు రాజులు. అన్నయగు వాలి సుగ్రీవుని కొట్టి తరిమి వేయగా, సుగ్రీవుడు హనుమదాదులతో ఋష్యమూక పర్వతముపై నుండెను. పంపా సరోవరము గట్టున తిరిగుచున్న రామలక్ష్మణులను జూచి తనను చంపుటకు వాలి వీరిని పంపి యుండవచ్చునను అనుమానముతో వారెవరో తెలిసికొని రమ్మని హనుమంతుని రామలక్ష్మణుల వద్దకు బంపెను. హనుమంతుడు పోయి వారిని విచారించి రామలక్ష్మణులుగా తెలిసికొని వారినిద్దరిని తన రెండు భుజములపై నెక్కించుకొని సుగ్రీవుని దగ్గరకు జేర్చి శ్రీరామ సుగ్రీవులకు మిత్రత్వము కలుగ జేసెను. వారిద్దరు అగ్నిసాక్షిగా మిత్రులైరి. శ్రీరాముడు వాలిని సంహరించి సుగ్రీవుని కిష్కింధకు రాజును జేసెను. అంగదుని యువరాజుగా జేసెను, అంగదుడు వాలి కుమారుడు.

వర్షా కాలము పోయిన తర్వాత సుగ్రీవుడు ఎక్కడెక్కడనున్న వానరుల నందరినీ ప్రోగు జేసి సీతను వెదకుటకు నాల్గు దిక్కులకును పంపించెను. దక్షిణ దిక్కునకు ప్రముఖులగు హనుమ, జాంబవంత, నల, నీల, అంగద అను వారిని వానరసమూహముతో పంపించెను. రామచంద్రుడు హనుమంతుని బిలిచి తన శిఖాముద్రికనిచ్చి ఇది సీతకు ఆనవాలుగా చూపింపుము. ఆమె నుండి ఏదైన ఆనవాలుగా తెమ్మని నీకు జయమగు గాక! అని ఆశీర్వదించి పంపెను. వానరులందురు కలసి పోయి స్వయం ప్రభయను నామె గుహలో ప్రవేశించి తిరిగి వచ్చుటకు త్రోవ దెలియక ఆమెను ప్రార్థించిరి. ఆమె ప్రభావము వలన బైటపడిరి. తరువాత దక్షిణ సముద్ర తీరమునకు బోయి, అచట సంపాతియను పక్షి రాజును జూచి జటాయువు మరణమును చెప్పుకొను చుండిరి. సంపాతి వారి మాటలను విని తన అన్న జటాయువని తెలిపి, సీత రావణుని అశోక వనములో శింశుపావృక్షము క్రింద యున్నది. నాకు నూరు యోజనముల చూపు గలదు. నాకు రెక్కలు కాలిపోయి యుండెను. రామ కార్యార్థమై వచ్చిన

వానరులకు నీవు సీత జాడను తెలిపినపుడు నీకు ఱెక్కలు రాగలవని చెప్పి యుండిరి. అదే విధముగా నాకిపుడు ఱెక్కలు వచ్చినవి అని చెప్పి ఎగిరి పోయెను.

వానరులందరూ సముద్రమును దాటుటకు వారి సత్తాను వివరించుకొని, ఈ పనికి హనుమంతుడు తగిన వాడని నిర్ణయించి ఆయనను ప్రోత్సహించిరి. హనుమంతుడు సముద్రమును దాటుటకు ఆకసమార్గములో ఎగిరిపోవు చుండెను. సముద్రములో మైనాకుడను పర్వత మొకటి కలదు. అతడు వాయుదేవుని మిత్రుడు. అందువలన వాయు పుత్రునకు విశ్రాంతినిచ్చుటకు పైకి వచ్చెను. హనుమంతుడు చేయి తాకి అతనిని తృప్తి పరచి మరలా పోవుచుండెను. దేవతలు హనుమంతుని బలమును పరీక్షించుటకు నాగమాతను సురసను బంపిరి. నాగమాత యెదురై హనుమంతునడ్డగించి నోరు దెరిచెను. హనుమంతుడు పెరిగెను, మరింత యామె నోరుదెరిచెను. సూక్ష్మరూపుడై యామె నోటిలోనికి బోయి వెలుపలికి వచ్చెను. సింహిక యను నామె హనుమంతునాకర్షించెను. హనుమంతుడామెను. హతమార్చెను. లంక ద్వారమును గాయుటకు లంకిణి యను రాక్షసి హనుమంతుని అడ్డుకొనగా ఆమెను తన చేతి పిడికిలితో బొడిచి చంపెను. ఆమె తన శాపము దీరి స్వర్గమునకు పోయెను. తరువాత హనుమంతుడు మార్జాల రూపమును ధరించి లంకను శోధించి అశోక వనములో సీతను కనుగొని ఆమెతో సంభాషించి, శ్రీరాముని సందేశ మామెకు దెలిపి, రామ ముద్రికనామెకొసగి, ఆమె శిరోరత్నమును ఆనవాలుగా ఇవ్వగా, అది తీసికొని శ్రీరామునితో, లక్ష్మణునితో వానరసైన్యముతో వచ్చి రాక్షస సంహారము గావించెదము భయపడవలదని సీతకు ధైర్యమును దెల్పి నాకాకలియగుచున్నది. ఒక పండు రాల్చుకుని పోయెదనని సీతయనుమతి బొంది, అశోక వనమును పెరికి వైచెను.

వనపాలకులీసంగతి రావణునకెరిగింపగా, రావణుడు అక్షయ కుమారుని మఱియు కొంతమందిని పంపగా హనుమంతుడు వారినందరిని సంహారము గావించెను. తన పెద్దకుమారుడు ఇంద్రజిత్తును బంపగా అతడు హనుమంతుని పై బ్రహ్మాస్త్రప్రయోగము చేసి, కట్టి హనుమంతుని రావణదర్బారునకు దీసికొని పోయెను. ఇతని తోకను గాల్చుమని రావణుడాజ్ఞాపింపగా తోకకు అగ్గి పెట్టిరి. హనుమంతుడు తోకకు గల అగ్గిచే లంకనే గాల్చి సముద్రములో స్నానము జేసి ఆవలి గట్టున గల వానరులను చేరెను.

హనుమంతుని జూచి, వానరులు సంతోషించి అందరును గలిసి, కిష్కింధకు చేరిరి. హనుమంతుడు రామచంద్రుని వద్దకు బోయి నమస్కారము

జేసి, స్వామీ! నేను పోయి సీతామాతను చూచి మాటలాడితిని. తమరిచ్చిన ఉంగరమును అమ్మవారికిచ్చితిని. అమ్మవారిచ్చిన శిరోరత్నమును మీరు చూడండి అని శ్రీరామునకు శిరోరత్నమును చేతిలో బెట్టెను. ఇక మూడు నెలలో లోపల మీరు వచ్చి రావణ సంహారము గావించి నన్ను తీసుకొని వెళ్ళవలెను, లేకున్న నాప్రాణము నిలువదు అని చెప్పినది. అందువలన, మనమందరము పోయి రావణసంహారము గావింపవలెనని శ్రీరామునకు హనుమంతుడు జరిగినదంతయు తెలియజేసెను.

తరువాత వానరులందరితో గలిసి, లంకకు పయనమై సముద్ర పుటొడ్డునకు చేరిరి. అచట శ్రీరామచంద్రుడు లంకకు త్రోవనిమ్మని చాలా ప్రార్థించెను. కాని సముద్రుడు శ్రీరాముని ప్రార్థన ఆలకించని విధముగా పెద్ద పెద్ద అలలతో తొణుకులు బడుచుండగా జూచి శ్రీరాముడు కోపించి బ్రహ్మాస్త్రమును సంధించెను. సముద్రుడు భయపడెను. ఆ సముద్రుము నీరంతయు శ్రీరాముని బాణముమొనకు ముత్యమువలె చేరి సముద్రము బీడుగా కనబడెను. సముద్రుడు శ్రీరామచంద్రుని వేడుకొని, సముద్రము మీద కొండ రాళ్ళతో వారధి గట్టి లంకకు పోవలసినదిగా సలహా జెప్పెను. అప్పుడందరు కొండలు దెచ్చి యిచ్చుచుండగా నలుడు వారధి నిర్మించెను. ఒక ఉడుత శ్రీరామునకు సేవ సేయు ఉద్దేశ్యముతో నీటిలో మునిగి, ఇసుకలో పొరలాడి ఆ యిసుకను వారధిపై రాల్చుచుండెను. ఇట్లు మాటి మాటికిని సేయుచుండగా చూచి, దానిని తెప్పించి, ప్రీతిగా దాని వీపును చేతితో నిమిరెను. అందువలన ఉడుత వీపు మీద చారలు ఏర్పడెను.

ఇట్లుండగా లంకలో రావణుని సభలో సీత లోకములకు తల్లివంటి దనియు శ్రీరామునకు సీతనర్పించి శరణు వేడుట మంచిదని నీతి దెలుపగా రావణుడు కోపించి విభీషణుని ఎడమకాలితో తన్ని నీవు కూడా ఆ రామునితో కలిసి రండి. ఇక నా సభలో నుండకూడదు వెళ్ళుమని యవమానించెను.

విభీషణుడు తన నలుగురు మంత్రులతో కలిసి రాముని వద్దకు వచ్చి శరణు వేడగా రావణుని చంపి లంకకు నిన్ను రాజును జేసెదనని మాట యిచ్చి లంకను ఇసుకలో రేఖాచిత్రము గీసి అందుకు విభీషణునకు పట్టాభిషేకము గావించెను. అందరును కలిసి వారధి పూర్తి జేసి సముద్రమును దాటి లంకను ముట్టడించి రావణుని వద్దకు అంగదుని రాయబారిగా సీతనుదెచ్చి సమర్పింపుము లేకున్న యుద్ధమునకు సిద్ధముగా రమ్మని చెప్పి పంపెను. రావణుడు వినలేదు. యుద్ధమే సిద్ధమైనది.

అపుడు శ్రీరాముని వానర సైన్యమునకును రావణుని రాక్షస సైన్యమునకును ఘోర యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో అతికాయ మహాకాయ ధూమ్రాక్ష విరూపాక్ష ప్రహస్త, కుంభకర్ణ, ఇంద్రజిత్తు, అందరును సంహరింపబడిరి. చివరకు రామ రావణుల యుద్ధము జరిగి, రావణుని యుద్ధములో శ్రీరామచంద్రుడు సంహరించి, లంకా రాజ్యమునకు విభీషణుని పట్టాభిషిక్తునిచేసి, సీతను దీసికొని వచ్చి అగ్ని పరీక్ష జేయించగా బ్రహ్మేంద్రాదులు సీత నిర్దోషియని సాక్ష్యములు జెప్పిరి. రావణుని పుష్పకవిమానముతో వానర సైన్యముతో గలిసి సీతాసమేతుడై శ్రీరామచంద్రుడు లంక నుండి బయలు దేరి వచ్చిరి.

తన రాక భరతునకు ఆంజనేయుని ద్వారా తెలియజేసి తర్వాత శ్రీరాముడయోధ్య చేరి జటావల్కములు తొలగించుకొని సంసిద్ధుడయ్యెను. భరతుడు శ్రీరాముని పాదుకలను దెచ్చి అన్నకు సమర్పించెను. తాను జటా వల్కములు తొలగించుకొనెను. వసిష్టాదిమునీంద్రులు పరమ సంతోషముతో అయోధ్యకు శ్రీరాముని పట్టాభిషిక్తుని జేసిరి. ప్రజలానందించిరి.

ఇది పూర్వ రామాయణ సంగ్రహ కథ.

# ఉత్తర కాండ

## ఉత్తర రామాయణ కథ ప్రారంభము

ముందు రావణ రాజ్యమును గూర్చియు తరువాత రామరాజ్యమును గూర్చియు సవిస్తరముగా కథా రచన జరిగినది.

ఓం శ్రీరామచంద్ర వరబ్రహ్మణే నమః

శ్రీరామచంద్రుడానాడు యువరాజ పట్టాభిషేకమునకు జరిగిన ప్రయత్నములు మందర, కైకల వలన విఫలమై అయోధ్యను విడచి పదనాలుగు సంవత్సరములు వనవాసమునకు వెళ్ళవలసివచ్చెను. పితృవాక్య పరిపాలన కొఱకై శ్రీరాముడరణ్యములకు పోవలసివచ్చెను. వారట్లు పోయినందున, లోకకళ్యాణము జరిగెను. దుష్ట రాక్షసులను సంహరించి వారి దుండగముల నుండి ప్రజలను, దేవతలను, మునులను రక్షించుట దుర్మార్గులను శిక్షించుట, ధర్మమును నిలబెట్టుట అనునవి అరణ్యవాస ఫలితముగా జరిగిపోయెను.

ఇక ఇపుడు జరిగే శ్రీరామపట్టాభిషేకము వలన రామరాజ్య పరిపాలన అందులో ప్రజలు సుఖించుట అనునవి జరుగగలవు. ఆ కథ ప్రారంభమగును.

భరతుడానాడు చిత్రకూట పర్వతము చెంత శ్రీరాముడుండగా పోయి రాముని పాదుకలను దెచ్చి, ఆ పాదుకలకు రాజ్యపట్టాభిషేకము గావించి శ్రీరాముని ప్రతినిధిగా భరతుడు శృంగి బేరపురమునందు నివసించుచు, రాచకార్యములు చూచుచుండెను. తాను కూడా మునివలె వేషధారియై అన్నరాక కొఱకెదురు చూచుచుండెను.

శ్రీరాముడు లంకలో రావణువధానంతరము తాను వచ్చుచున్నాననను వార్త దెలుపుమని, భరతుని వద్దకు, ముందే హనుమంతుని బంపెను. హనుమంతుడు వార్తను దెచ్చి భరతునకు తెలియజేసెను. భరతుడది విని సంతోషభరితుడై

యుండెను. శ్రీరామచంద్రుడయోధ్యకు చేరి తల్లులకు పాదాభివందనమాచరించి. కులగురువగు వశిష్టునకు పాద నమస్కారము జేసి జరుగవలసిన కార్యములను తమ ఆధ్వర్యములో జరుపవలసినదిగా కోరెను.

వశిష్టుడందులకంగీరించి ఎక్కడెక్కడెనో యున్న గొప్ప గొప్ప మునీంద్రులకు తెలియజేసి వారికాహ్వానములు బంపి, వామదేవ జాబాలి, అగస్త్య, విశ్వామిత్ర మున్నగు మునీంద్రులందరు జేరి అన్ని పుణ్యనదుల తీర్థములను సప్తసముద్ర జలములను తెప్పించి, పట్టణమలంకరించి వైభవోపేతముగా శ్రీరామచంద్రుని సీతాదేవిని సింహాసనమున కూర్చుండ బెట్టి పట్టాభిషేక మహోత్సవమును గావించిరి. ఆయుత్సవమునకు కణ్వాది మునులు శ్రీరాముని చూచుట కొఱకు వచ్చిరి. ఆ వచ్చిన వారిలో కణ్వమహామునీంద్రుడు ప్రముఖుడు. అగస్త్యుడు, గౌతముడు, జమదగ్ని, ఇంకా తక్కిన మునీంద్రులు వచ్చి అయోధ్య రాజహజార ద్వారము నిలచి శ్రీరామునకు తమ రాకను తెలియజేసిరి.

మునీంద్రులు వచ్చి యున్నారను వార్త వినగానే శ్రీరామచంద్రుడు వారికెదురుగా బోయి వారిని మర్యాద పూర్వకముగా తమ కొలువు కూటములోనికి దీసికొని వచ్చి వారి కర్ఘ్య పాద్యాదులనిచ్చి తగిన ఆసనములందు వారిని కూర్చుండబెట్టి శ్రీరామచంద్రుడు వారికి కుశలప్రశ్నలు వేసి వారితో నిట్లనెను.

ఓ తపోధనులారా! మీరును, మీ శిష్యులును మునుపటి వలెగాక, ఇపుడందరును ఆటంకములు గలుగక తపస్సులు చేసికొనుచున్నారా? మీ శిష్యులు భక్తి శ్రద్ధలు గల వారై మిమ్ము సేవింపుచున్నారా? మీకు కావలసిన దర్భలు, ఆకులు, పండ్లు, గడ్డలు మొదలగునవి లభ్యమగుచున్నవా? మీరుండు అడవులు ఆశ్రమములలోనికి ప్రేవేశించి దుండగులు మీకు బాధలు కల్గించుటలు లేవు కదా? మహాత్ములగు మీ ఆశీర్వాద బలము చేతనే మాకీ భుజబలశౌర్యములు చేకూరుచున్నవని వారి గొప్పదనమును గూర్చి విడి విడిగా రామచంద్రుడు బ్రశంసించెను.

ఈ మహామునీంద్రుడు ఈ భూభారమునంతయూతన తొడ మీదనే మోయగల్గెను. అత్రి మహామునిని జూపి ఈ మునీంద్రుడు త్రిమూర్తులను తమ బిడ్డలనుగా పొందగల్గెను. విశ్వామిత్రుని జూపుచు, ఈ మునీంద్రుడు బ్రహ్మ జేసిన సృష్టికి ప్రతి సృష్టి జేసెను. అగస్త్య మనీంద్రుని జూపుచు ఈయతీశ్వరుడు సముద్రములో గల నీరంతటిని, తన పుక్కిటి యందిమిడ్చిఆపోశనముబట్టెను.

ఇట్టి మహా అతిశయములు గల మిమ్మందిరిని మెచ్చుకొనుచున్నాను. నా కన్నులు కఱవు దీరునట్లుగా మిమ్ములను చూడగల్గితిని అని శ్రీరాచంద్రుడా మునీశ్వరులను తన, మేఘ గంభీరమైన కంఠస్వరముతో పొగడెను. అట్లు తమ్ముబొగడుచున్న శ్రీరామచంద్రుని మాటలు విని, ఆ మునీంద్రులు చెప్పుచున్నారు. రామచంద్ర ప్రభూ ఈ లోకములన్నియును నీకడగంటి చూపులతోనే పవిత్రములయ్యెను. సూర్య ప్రకాశముతో చీకటి తొలగినట్లు మీ దర్శన భాగ్యముతో భయమనే మబ్బులు తొలగిపోయినవి.

దేవతల గుండెలలో గాలమువలెను ప్రాణి కోట్ల కన్నులలో నలుసువలెను. కాళ్ళలో ముల్లువలెను, తలల మీద పిడుగు వలె నుండి బాధలు గలిగించుచున్న రావణుని మీరు సంహరించితిరి. అతని చావువలన లోకములన్నియు సంతోషించినవి. దేవేంద్రాది దేవతలు రావణుని భయమునకు వెఱచి ముఖముల కడ్డముగా ముసుగులను వేసికొని మూలలయందు దాగి యుండిరి. ఇంద్రుడు, అగ్ని, యమధర్మరాజున్ను, నైరుతి, వరుణుడు, వాయువు, కుభేరుడు, ఈశాన్యాది, దిక్పాలురు, తమ ముఖములపై ముసుగులు దీసి, ఇపుడు స్వేచ్ఛగా తిరుగు చున్నారు. అందముగా అలంకరించుకొన్నచో రావణుడెత్తుకొని పొవునేమోయని స్త్రీలు అలంకారములు తీసివైచిరి. మఱియు పల్లెల యందును పట్టణముల యందుండక, కొండ గుహలలో దాగి యుండిన దేవతా స్త్రీలు వారి వారి నివాసములను చేరి అందముగానలంకరించుకొని, స్వేచ్ఛగా తిరగుచున్నారు. జపాది అనుష్టానములను చేసికొనుచుండిన మునీశ్వరులు అయనుష్ఠానములను చాలించి రావణుని బలమునకు భయపడి జడములై యుండిరి. ఇపుడం దరును జపతపాద్యనుష్ఠానములను చక్కగా నిర్వర్తించుచున్నారు. ఆకాశ మార్గములో తిరుగుచుండిన ఖేచరులు రావణునకు భయపడి దిక్కులేని వ్వారై దిరు గుట చాలించి యుండిరి, ఇపుడందరును ధీరులై విమానములలో దిరుగుచున్నారు. పడగలు విప్పి ఆడితే రావణుడు చూచి చంపివేయునేమోనని భయపడి పడగలు ముడుచుకొని పుట్టలలో దాగి యుండిన నాగులిపుడు పడగలు విప్పి ఆడుచున్నవి. కావున ఓ రామచంద్రా వీరందరి పై దయతలచి నీవాదశకంఠుని సంహరించి నందువలనే సమకూరినవి.

ఓ రామచంద్రా! నీవు మునీశ్వరుల పాలిట గలవాడనుటకు విశ్వామిత్రుని యాగమును సంరక్షణ జేయుట, పాపాత్ములను పవిత్రులను జేసెదవనుటకు నీ పాదధూళి దగిలిన రాతిని స్త్రీగా జేయుట, బలవంతులందరి కంటే బలవంతుడవనుటకు శివధనస్సును విఱచుట, ఇతరులెవరును చేయజాలని పనులవలీలగా సేయుదువనుటకు నీటి పై రాళ్లను తేలియాడించి, సముద్రములో వారధి నిర్మించుట సమస్త జీవనియామకుడవనుటకు వానరుల చేత పనులు చేయించుట ఇవన్నియు సాక్ష్యములే యగుచున్నవి. ఇంతటి శక్తిసామర్ధ్యములు గలనిన్ను మేము దీవించుట యనగా నీ ప్రతాపానికిని నీ కీర్తికిని సాక్ష్యములగు చున్నవి. నిన్నాశ్రయించిన వారి పక్షముననుసరించి మమ్ములను గొప్పగా జెప్పుచున్నావే గాని నీనామ జపము సేయుట వలననే కదా! మాకీ పవిత్ర పేరు ప్రఖ్యాతులు సంభవించినవి. దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించుటకొఱకై, పితృాజ్ఞ పరిపాలన అను నెపముతో అరణ్యములకు వెళ్ళితివి. రావణుని సంహరించ వలెనను ఉద్దేశ్యముతో సీతను వంటరిగా విడచి లేడిని దరుముచు అరణ్యము లోనికి వెళ్ళితివి, దుర్బుద్ధిగలవాడై సుగ్రీవుని తరిమి వేసి వాలిని సంహరించుటకు సుగ్రీవుని పక్షపమున చేరితివి. రావణునొక గడ్డి పరకగా భావించి విభీషణునకు లంకా రాజ్య పట్టాభిషేకమును, సముద్రమునకు వారధి కట్టక ముందే గావించితిరి.

ఓ రామచంద్రా! నీవు విల్లును చేబూని వింటి నారికి బాణమును సంధించు చున్నపుడు స్వర్గ, మర్త్య, పాతాళములనెడి మూడులోకములు గడగడలాడిపోవును. నిన్నెదిరించి నిలుచుటకెంతటి వారికైనను సాధ్యముగాదు, అందువలన రావణుని బంధు మిత్ర, పుత్ర, పౌత్ర, సమేతముగా వారిని సంహరించుటయనగా అది నీకే తగియున్నది. అనేకములగు అస్త్రశస్త్రములను ధరించిన ప్రహస్తుడును, మహోదరుడును, కంపనుడును, నరాంకుడును దేవాంతకుడను, కుంభకర్ణుడును, కుంభుడు, నికుంభుడు, విరూపాక్షుడు యజ్ఞ కోపుడు ఇంకా ఎందరెందరో రాక్షసులు వానరవీరుల చేతులలో మరణించిరి. అతికాయుడు లక్ష్మణుని చేతిలో మరణించెను. పర్వతమువంటి దేహము గల కుంభకర్ణుడు, రావణుడు నీ చేతిలో మరణించిరి. రావణ, కుంభకర్ణుల ధాటికి నిలువ వచ్చునేమో కానీ, ఇంద్రజిత్తు నెదరించి నిలుచుటకెవ్వరికిని సాధ్యము కాదు. అట్టి ఇంద్రజిత్తును నీ తమ్ముడు

లక్ష్మణ స్వామి నిలువరించి చంపి వైచెను. అందు వలన లక్ష్మణ స్వామి పరాక్రమమేమని చెప్పగలము.

పూర్వము ఇంద్రాది దేవతలకభయమొసగి రావణాది దుష్ట రాక్షసులను వధించి త్రిలోక వాసులకు, పుణ్యస్త్రీలకు, మునీంద్రులకు, రాజాధిరాజులకును వారి బాధలను దప్పించి, రక్షించినందుకు ముల్లోకవాసులు, నిన్ను దలంచుచు నీకు జేజేలు బల్కుచున్నారు. పండుగలు చేసికొనుచున్నారు అని మునీంద్రులందరును ఏక కంఠముతో శ్రీరామచంద్రునకు దెలిపిరి.

ఇదంతయు విన్న శ్రీరామచంద్రుడు వినయము గలవాడై ఓ మునీంద్రులారా! నా మనవిని యాలకింపుడు. కుంభకర్ణ, కంపన, అకంపన, ధూమ్రాక్ష, విరూపాక్ష, యుపాక్ష, అతికాయ, ప్రహస్త, త్రిశిర, దేవాంతక, నరాంతక మొదలగు వీరులందరినీ సామాన్యులనుగా దెలుపుచు, ఇంద్రజిత్తును వీరందరికంటె మహావీరునిగా దెల్పుచున్నారు. వీరందరి కంటె ఇంద్రజిత్తునకు అంత పరాక్రమమెటులగల్గినది అతడంతవాడగుటకు కారణమేమి? ఎవరి ప్రభావము వలన దేవేంద్రుని గెలువగలిగెను. ఇంత పరాక్రమశాలియగు కుమారుని గన్న మొదటి కారణుడగు రావణుని జన్మ వృత్తాంతమును, అతడు జేసిన తపస్సులను, ఈ త్రిలోకవాసులను జయించుట మొదలగునవి రహస్యము లేవైనను, దాచక వినిపింపుమని శ్రీరామచంద్రుడు మునీశ్వరులను కోరెను.

వసిష్టాది మునీంద్రులందుకు సమ్మతించి ఆ కార్యమునకు అగస్త్య మహామునిని నియమించిరి. అగస్త్య మహర్షి చెప్పుటకు నారంభించెను.

# రావణ రాజ్యం

ఇట్లడిగిన రామచంద్రునకు అగస్త్య మునీంద్రుడు రావణాదుల జన్మ వృత్తాంతమును రాక్షసుల వంశోత్పత్తిని చెప్పుటకునారంభించెను.

ఓ రామచంద్రా! కవీంద్రులు వ్రాయు పద్యములకేవిధముగా నాల్గు పాదములుండునో ఆ విధముగా కృతయుగమునందు ధర్మము నాల్గుపాదములతో నడచుచుండెను. చతుర్ముఖ బ్రహ్మదేవునకు ప్రధమ కుమారుడుపులస్త్య బ్రహ్మ ఆయన మునీశ్వరులందరికిని ముఖ్యమైనవాడుగా నుండెను. అపులస్త్య బ్రహ్మ మంచిగుణములకు పుట్టినిల్లు వంటివాడు. తమోగుణము లేనివాడై యుండెను. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను ఆరు అరిషడ్వర్గములు ప్రతి యొకరికి తనలో గల శత్రువులు. అపులస్త్య బ్రహ్మయందివి లేవు. ఇవి ఎవని మనస్సు నుండి తొలగింపబడి యుండునో అతడు శత్రువులను జయించిన వాడు. శివుని వలె, ఆపులస్త్య బ్రహ్మ ఉగ్ర తపస్సు చేయుచుండెను.

ఈ విధముగా తపస్సు చేయుచున్న ఆపులస్త్యుని యాశ్రమము మన్మధుని కొలకు వసంతుడు చిలుకల గుంపును చేర్చినట్లు మేఘమును గప్పు మెరుపు తీగవలె రతీ దేవి వంటి తళుకు బెళుకు చూపులతో దేవకన్యలు, నాగకన్యలు, ఖేచరకన్యలు అచట తిరుగుచు పాటలు బాడుచు కేరింతలు బెట్టుచు, భయంకరముగా అచట తిరుగుచు తపస్సునకు భంగము గల్గించు చుండిరి. అందువలన వీరిని వనమునకు రానీయకుండుట కుపాయమాలోచించి పులస్త్యుడు వారితో ఓ లీలవతులారా! ఈ దినము మొదలు ఏ కన్య నన్ను చూచునో ఆకన్య తక్షణమే గర్భవతి అగును గాక! అని శాపము బెట్టెను. వారు భయపడి వెళ్ళిపోయిరి. ఆ దినము నుండి పులస్త్య బ్రహ్మకు వీరి పీడ విరగడయ్యెను. ఆయన తపస్సు నిర్విఘ్నముగా జరుగుచుండెను.

పులస్త్యబ్రహ్మ ఈ విధముగా శాపమిచ్చియున్నాడని అందరికిని తెలియదు. అందు వలన ఒకనాడు తృణబిందు మహారాజు కుమార్తె తమ చెలికత్తెలతో,

పులస్త్యుని ఆశ్రమ సమీపమున తిరుగుచుండెను. వారాడుచుండిన ఆటలలో అది యొక ఆటగా ఆమె చెలికత్తెలు ఉన్నట్లుండి కనబడకుండా దాగుకొనిరి. వారిని వెదుకుచు తృణబిందుని కుమార్తె పోవుచు నొకచోట జడలను బెంచుకొని జింక చర్మమును బరచుకొని, కూర్చొని వేదపారాయణము గావించుచుండిన పులస్త్యుని జూచెను. ఆయనను చూచిన తక్షణమే ఆమె గర్భవతి యయ్యెను. అట్లైనందులకామె భయపడి అయ్యో! నేనిట్లు నిష్కారణముగా గర్భవతినైతిని. నాకిట్లు వచ్చుటకు కారణమేమై యుండ వచ్చును. నేను లేత ప్రాయపుదానను. ఇట్లు గర్భవతినైనందున నన్ను చూచి నా తండ్రి యేమనును. నాసాటి కన్యలలో నాకు నగుబాట్లు కలిగెను. అని యాలోచించుచు తన యింటికి వెళ్ళి ఏమియు దిక్కు తోచక తల వంచుకొని దీనముగా నుండెను.

ఇట్లుండిన కుమార్తెను తృణబిందువు జూచి అమ్మా! నీవింతవరకు ఎక్కడికి వెళ్ళియుంటివి. నీవెవ్వరికిని కీడు జేసిన దానవు కాదు. ఏకఠినాత్ముడు నిన్ను జూచి ఈ విధముగా శపించెను. నిమిషమాత్రములోనే నీవిధముగా గర్భవతి వగుటకు కారణమేమి. ఇక్కడి కేదిక్కున గలవాడీ చెడు కార్యమును గావించెను, దాపక తెలుపుమని కుమార్తెనడిగెను.

అది విని అతని కుమార్తె జరిగినదంతయు తృణ బిందునకు వివరించెను. నాయనా! నేనేపాపమెరుగను. నా చెలికత్తెలతో గలిసిపులస్త్యాశ్రమమునకు పోయి యుంటిని. అచట నా చెలికత్తెలు కనబడక మరుగైరి. నేను వారిని వెదుకుచు పోయి పులస్త్యుని జూచితిని. ఆయనను చూడగనే నాకీ విధముగా గర్భమేర్పడెను, అని కుమార్తె దెలుపగనే తృణబిందుడు తన యోగ దృష్టి అను అద్దమునందు జూచి జరిగినదంతయు తెలిసికొని, తన రోమములు గగుర్పాటు జెందుచుండగా తన కుమార్తె కారాజు ఈ విధముగా తెలియజేసెను.

అమ్మా నేను తెలియక నీయందు నేరమున్నదని భావించితిని. కానీ నా సందేహమిప్పుడు తీరినది. నీవు భాధపడవలదని యోదార్చి, నీవు గర్భవతివగుటకు కారణమున్నది. దేవకన్యలు పులస్త్యుని ఆశ్రమమునకు వచ్చి తిరుగుచుండిరి. వారి యాగడములు ఆయన సహింపజాలక ఇకమీదట నన్ను జూచిన కన్య గర్భవతి కాగలదని శపించెను. నీకది తెలియక, అక్కడికి వెళ్ళి, ఆయనను చూచినందున, నీకీ విధముగా గర్భము వచ్చెను. అని చెప్పి తన కుమార్తెను తృణబిందుడు పులస్త్యుని ఆశ్రమమునకు తీసుకొనిపోయి, భయభక్తులతో, ఆయనకు నమస్కరించి, ఓ మునిచంద్రా! ఈ కన్య గుణగణములలో మంచి పేరు గాంచినది. ఈమెను నీవు

చేపట్టుము. శివునకు పార్వతి వలెను, సూర్యునకు ఛాయాదేవి వలెను, ఈమె నిన్ననుసరించి నీకు సేవలు జేయగలదు. నీవు మండుటెండలో నుండి తపస్సు జేసి అలసి పోయి వచ్చినప్పుడు కల్పలత వలె నీకు చల్లని యుపచారములు జేయును. ఈ కన్యను మీ సేవ జేయుటకంగీకరించి, మీ వద్దకు చేరదీయుము, అని యామెను పులస్త్యునకప్పగించెను.

అప్పుడు పులస్త్యుడు తృణబిందుని కుమార్తెను చేరదీసి ఆయనను గౌరవించెను. తృణబిందుడు సంతోషించుచు కుమార్తెనచట విడచి గృహమునకు వెళ్ళెను.

పులస్త్యాశ్రమములో తృణబిందుని కుమార్తె, తన భర్త కనుకూలముగా సేవలు, గావించుచుండెను. ఆయన నదికి వెళ్ళి స్నానము జేసి వచ్చునప్పటికి, జపవేది కనలంకరించి, పూజకు గావలసిన వస్తువులు దర్భలు, జపమాల, తట్ట, ఉద్ధరిణి, ధూప, దీప, నైవేద్యములను సిద్ధము జేసి పెట్టియుండును. అతడు జపము జేసి వచ్చులోపల షడ్రసోపేతమైన భోజనము జేసి పెట్టియుండును. ఆయన భోంచేసి చేయికడుగుకొనునప్పటికి జింకచర్మముతో తయారు సేయబడిన పాన్పును సిద్ధపరిచి యుండును. ఆయన పవళించగనే, పాదములు తన తొడలపై బెట్టుకొని మెల్లగా ఒత్తుచు నిద్రింపజేయును. ఆయన స్నానము జేయునప్పుడు ఒళ్ళు రుద్దును. ఆకలి గొన్నాడని తెలిసికొని అన్నము బెట్టుచుండును. ఆయనకేసమయమున కేది యుచితముగా నుండునో దానిని సేయుచుండును. ఇదంతయు గమనించిన పులస్త్యుడు, తన మనస్సులో పొంగి పోయెను.

ఓ రామచంద్రా! ప్రాయపు భార్యలు జేసెడు సేవలకు ఎంత గొప్పవారైనా కరిగిపోక తప్పించుకొనజాలరు కదా! అంతియే కాదు, ఆమె ఆ మునీంద్రుని మాటలాడునప్పుడు అణకువగా, గౌరవముగా, హితముగా, మితముగా, మాటలాడి సమాధానమిచ్చు చుండును. ఇదంతయు పులస్త్యుడు గమనించి, తనలో గల్గిన సంతోషమును పట్టజాలక ఆమెతో ఓ లీలావతి! నీలో గల అణకువ మంచి గుణములను జూచి నా మనస్సు నందు సంతోషము గల్గుచున్నది.

నీవు నన్ను చూచుట వలన గర్భవతివైతివి. అందువలన నీ యందు నాతో సమానుడైన కుమారుడు కలుగగలడు. నేను వేదము పఠించునప్పుడు నీవు వినుచుంటివి, నీవు వినునప్పుడు నీ గర్భములో నున్న శిశువు కూడా వినియున్నాడు. అందువలన నీకు పుట్టబోవుకుమారునికి విశ్రవుడు అను నామకరణము సేయవలెను.

నీ కుమారుడు మంచి బుద్ధిమంతుడు. కుతర్కములు లేనివాడు. మంచి ఓర్పుగలవాడు. అన్ని విద్యల యందారితేరిన వాడై, వేదములో గల రహస్యములు నెఱిగినవాడై ఆత్మ విద్య యందు మిగుల నేర్పరియై, తండ్రి వంశము వారికిని, తల్లి వంశము వారికిని, ఘనకీర్తి దెచ్చువాడై యుండును. నీ కుమారుని తండ్రి గారి తండ్రి, తల్లి గారి తండ్రి, అతనిని చూచి చాలా సంబరపడగలరు అని పులస్త్యుడు పుట్టబోయే బిడ్డను గూర్చి తన భార్యకు చెప్పుచుండెను. నవగ్రహములు శుభదృష్టులు కల్గియుండెను. అట్టి ముహూర్తమున తృణబిందుని కుమార్తె గుమారుని బ్రసవించెను.

ఆ పుట్టిన శిశువు పరిశుద్ధాత్ముడు, తేజోవంతుడై ప్రకాశించుచుండుట వలన అతనికి విశ్రవుడు, అను నామకరణము గావించిరి. అతడు చిన్న తనము నందే తపస్సు జేయవలెనను స్వభావము గలవాడై, పురుష రూపమును ధరించిన బ్రహ్మ విద్యవలెను, దర్శనమిచ్చుచుండిన ధర్మదేవతవలెను. కాళ్ళు, చేతులు అతికించుకొని కనిపించెడు వైరాగ్య నియమముల వలెను. సంచారము జేయుచున్న, శాంతరసము వలెను గన్పుట్టు చుండెను.

ఆ విశ్రవోబ్రహ్మ తన తల్లిదండ్రుల నడిగి వారి అనుమతిబొంది, దిగ్విజయము గావించిన రాజేంద్రుని వలె, ఆశలను జయించి తపస్సు జేయుటకు ప్రారంభించెను. ఆ కుమారుడు జేయు తపస్సునకు మునీంద్రులాశ్చర్యమును జెంచుచుండిరి.

ఇట్లుండగా భరద్వాజ మునీంద్రుడు విశ్రవోబ్రహ్మ వద్దకు వచ్చి తన కుమార్తెనతనికి జూపుచు ఓ ముని కుమారా! ఈ జవ్వని నా కుమార్తె ఈమె పేరు దేవవర్ణి. ఈమె నీకన్ని విధములా ఈడుజోడై యున్నది. కావున నీవీమెను వివాహము జేసికొనుము అని దేవవర్ణిని విశ్రవునకప్పగించి, భరద్వాజుడు వెళ్ళిపోయెను. ఈ దేవవర్ణి తల్లిదండ్రుల ఆజ్ఞలననుసరించి, పతిభక్తి కలదియై, గృహస్థ ధర్మములను సమగ్రముగా నెరవేర్చుచుండెను.

## వైశ్రవణ జననము

విశ్రవోబ్రహ్మ దేవవర్ణితో కూడి గృహస్థ ధర్మములను చక్కగా నెరవేర్చుచు కాలము గడుపుచుండెను. కొంతకాలమున కామె గర్భవతియై యొక కుమారుని గన్నది. అతడు విశ్రవోబ్రహ్మ కుమారుడుడైనందున అతనికి వైశ్రవణుడు అని నామకరణము గావించిరి. ఆ సమయమున బ్రహ్మదేవుడచటికివచ్చి తమ మనమని జూచి, ఇతడు ధనాధిపతి కాగలడని చెప్పి, విశ్రవోబ్రహ్మకు కల్గినవాడగుట వలన,

వైశ్రవణుడని బ్రహ్మ అతనికి నామకరణము జేసి, తాను బ్రహ్మలోకమునకు వెడలిపోయెను. ఆ కుమారునకు తండ్రియగు విశ్రవోబ్రహ్మ, విద్యాబుద్ధులు, నేర్పించి, సకల శాస్త్రపారంగతుని జేసి, ఉపనయనము గావించెను. అతడు తన తండ్రితో సమానముగాఅన్ని విద్య లయందారి తేరెను.

తమ వంశమునందు పెద్ద వారివలెతాను కూడా తపమాచరించుటకు బోయెను. ఆ కుమారుడు జేయు తపస్సునకు అతనిముఖమున బ్రహ్మవర్చస్సు కలిగి గాలినే ఆహారముగా వేయి సంవత్సరములున్ను, నిరాహారిగా ఇంకొక వేయి సంవత్సరములును, ఓర్పును, నేర్పును గలవాడై, ఉగ్రతపస్సు గావించెను. అతని తపంబునకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై, నాయనా! నీకేమి వరము కావలెనో కోరుకో అనెను. వైశ్రవణుడు సంతోషించి నమస్కరించుచు స్వామీ! ఈ ప్రపంచములో ధనములన్నింటికిని నన్నధిపతిగా జేయుము, అనివైశ్రవుణుడు కోరగా బ్రహ్మదేవుడు నాయనా! నీకు ధనాధిపత్యమే గాక, ఉత్తర దిక్కునకధిపతిని జేయుచున్నాను అని చెప్పి బ్రహ్మదేవుడు ఒక పుష్పక విమానమునిచ్చి, దాని మహిమను కూడాతెలిపి, తాను సత్యలోకము జేరెను.

బ్రహ్మదేవుడిట్లు వెళ్ళగా వైశ్రవుణుడు వరములను, పుష్పక విమానము దీసికొని తన తండ్రియగు విశ్రవోబ్రహ్మ వద్దకు వచ్చి, తాను వరములు పొందిన విధానమును తెల్పి, నానివాసమెక్కడయని నేను బ్రహ్మదేవునడగలేదు. కావున నాకు తగిన చోటును నీవే నిర్ణయింపుము. అదెట్లుండవలెననగా ఈతిబాధలు, శత్రువులతో భయము లేని విధముగా నుండవలెను, అనగా ఆలోచించి, విశ్రవోబ్రహ్మ కుబేరునితో నాయనా దక్షిణ సముద్రము యొక్క మధ్యలో లంకాతీరము గలదు. దాని పేరు లంకాపురి. అది శత్రువులు చొఱరానిది. దాని గోపురములు మేడలు బంగారముతో తయారు చేయబడినవి. చుక్కల వలె మణి దీపములమర్చబడినవి. ఆ లంకానగరమును స్వర్గముతోసమానముగా విశ్వకర్మ నిర్మించి యున్నాడు. ఆ నగరము రాక్షసనివాసముగా నిర్మించి యుండెను. కానీ ఆ రాక్షసులు విష్ణుదేవుని ధాటి కోర్వజాలకవారు రసాతలమునకు వలసబోయిరి. ఆ నగరము నీకెట్టి భయములు లేనిదై యున్నది, అని తండ్రి దెలుపగా విని వైశ్రవణుడు దేవగంధర్వ, యక్షులతోనుగలిసితనను అప్సరసలు సేవించు చుండగా పుష్పక విమానములో నందరును బోయి లంకను చేరి పాలించుచు, అప్పుడప్పుడు లంక నుండి తన తండ్రిని జూజుటకు పుష్పక విమానములో వైశ్రవణుడువచ్చి పోవుచుండునని అగస్త్య మునీంద్రుడు శ్రీరామచంద్రున కాకథను దెల్పెను.

## రాక్షసుల కథ

అగస్త్యుడు మాటలసందర్భములో, ఈ లంకానగరము రాక్షసుల కొఱకు నిర్మింపబడినది. వారు విష్ణుదేవుని ధాటి కోర్వలేక సుతలమునకు వలసబోయిరి అని తెల్పుట వలన శ్రీరామచంద్రుడువిని మహాత్మా! లంకా నగరమును రాక్షసుల కొఱకు విశ్వకర్మ నిర్మించెనని చెప్పితిరి. నేనిది విన్నప్పటి నుండి నాకాశ్చర్యము గల్గుచున్నది. ఏలననగా పులస్త్యబ్రహ్మకు బుట్టిన రాక్షసులు, దేవతలకు కూడా మించిన బలవంతులని చెప్పగా విని యున్నాను. అందు వలన వారి వృత్తాంతమును వినవలెనని నాకు చాలా ఉత్సాహముగా నున్నది. వారి వంశకర్తయెవడు? వారి పేర్లేమి? వారి భుజబల పరాక్రమము లెట్టివి. వారు శ్రీహరితో యుద్ధము జేసి, ఓడిపోవుటకు కారణమేమి? వారు సుతలమెందుకు చేరిరి? మరల లంక కెందుకు చేరలేదు? ఇవన్నియు నాకు సవిస్తరముగా దెల్పుము అని శ్రీరామచంద్రుడగస్త్యుని కోరెను.

**అగస్త్యుడు:** ఓ రామచంద్రా! విను బ్రహ్మ దేవుడు మొదలు రాక్షసుల వంశము చివరి వరకు వినిపించు చున్నాను.

సృష్టికి మొట్టమొదట శ్రీ రామన్నారాయణుడు యోగ నిద్రలోనుండగా ఆయన బొడ్డునందు వేయి రేకుల గల బంగారు తామర పూవు బుట్టెను. ఆ పూవునందు బ్రహ్మదేవుడు జన్మించెను. ఆ బ్రహ్మదేవుడు నిష్ఠాగరిష్ఠుడై తపస్సు జేసెను. ఆ తపో ప్రభావము వలన లోకములను సృష్టి జేయు ప్రభావము బ్రహ్మదేవునకు గల్గెను. మొదటి సారిగా బ్రహ్మదేవుడు జలమును సృష్టించెను. ఆ నీరును రక్షించుటకు ఆ నీటి యందే జలచరములను సృష్టించెను. దేహధారులకు ఆకలి బాధ సహజమే కదా! ఆ నీటిలో దిరుగాడు జంతువులన్నియు తమను సృష్టించిన బ్రహ్మదేవుని వద్దకు బోయి. స్వామీ మాకాకలి యగుచున్నదని బ్రహ్మదేవునకు దెల్పుకొన్నవి. బ్రహ్మదేవుడునవ్వుచు, మీరిప్పుడు నీటిని రక్షించవలెను. అందువలన మీ సామర్థ్యమెట్టిదో గమనించవలెనని చెప్పగా జంతువులన్నియు ఆ నీటిని కాపాడెదమని బ్రహ్మదేవునకు దెల్పి తమ స్థానమును చేరినవి. కానీ ఆకలిబాధ భరింపరానిదగుట వలన ఆ నీటిని జలజంతువులు త్రాగుటకు ప్రయత్నించినవి.

## హేతి ప్రహేతుల వృత్తాంతము

ఆ జంతువులలో కొన్ని యక్షులనియు, కొన్ని రాక్షసులనియు రెండు రకములుగా బ్రహ్మదేవుడు వానిని విభజించెను.

ఆ విభజింపబడిన రెండు రకములలో హేతి, ప్రహేతి అను పేరులు గలవారుండిరి. వారిలో ప్రహేతి చాలా ఉదార స్వభావుడు, కామక్రోధాది అరిషడ్వర్గములను జయించిన వాడు, మఱియు తన దగ్గర చేరిన వారిని కల్పవృక్షము వలె కోరికలు నెరవేర్చి కాపాడెడువాడు. మంచి గుణములు గలవాడుగా నుండెను.

హేతి యనువాడు భయము లేనివాడు. భార్యాబిడ్డలు కావలెనను కోరికలు గలవాడుగా నుండెను. అందు వలన ఆయన తాతగారి కోరిక ప్రకారము భయ అను నామెను భార్యగా స్వీకరించెను. ఆ హేతికి భయ యను భార్య యందు, విద్యుత్కేతుడను కుమారుడు బుట్టెను. ఆ కుమారుడు తండ్రి పోషణ యందు దిన దిన ప్రవర్థమానుడై పెరుగుచుండెను. అతని తండ్రి అతనికి దగిన అందగత్తెను సంధ్యాపుత్రి అను కన్యను వివాహము గావించెను. భార్యాభర్తలిరువురును ఒకరికొకరు అనుకూలముగా మెలగుకొనుచుండిరి. సంధ్యాపుత్రి కొంతకాలమునకు గర్భవతియయ్యెను, కానీ తనకు గర్భము రావడం ఆమెకిష్టము లేదు. అందువలన ఆమె మందరాచల మను పర్వతము మీదికి బోయి, ఎవరికిని తెలియనీయక, చెడ్డసాహసము జేసి, బిడ్డను గని ఆ కుమారుని అక్కడనే విడచిపైచి, తమ భర్త వద్దకు వచ్చి, ఎప్పటియట్ల సుఖించుచుండెను. ఓ రామచంద్రా స్త్రీలు పాపము చేయుటకు వెనుదీయరు కదా!

సంధ్యాపుత్రి బిడ్డను గని మందర పర్వతము మీద పసికందును వదలి పెట్టి వెళ్ళిపోయెను. తల్లి దగ్గర లేనందువలన, ఆ నెత్తురు ముద్ద సహజముగా ఏడ్చుటకు ప్రారంభించెను. వానియేడ్పు పిడుగులు బడునప్పుడు ఉరిమెడు మేఘ శబ్దమన కంటే హెచ్చుగా కొండగుహలు ప్రతిధ్వనులిచ్చునటులుండెను. ఆ కఠోర శబ్దమును విని సింహములు, పులులు తక్కిన మృగములు దూరముగా వెళ్ళిపోవుచుండెను.

ఆ సమయమున కుమారస్వామి, వినాయకుడు, పార్వతీ దేవులతో గలసి, పరమేశ్వరుడు అచటికి వచ్చెను. అక్కడ భయంకరముగా నేడ్చుచున్న శిశువును జూచి శివుడా బాలుని వద్దకు బోయి, దయగలవాడై చూచుచుండగా, పార్వతి సమీపించి శివునితో స్వామీ ఈ పిల్లవానిని దయతో రక్షించుట మన కర్తవ్యముగా నున్నది. కావున ఈ బాలునిపై దయ జూపుమని వేడగా, పరమేశ్వరుడు దయగలవాడై ఆ బాలునకు కొన్ని వరములు ప్రసాదించెను, అవి ఏమనగా ఆ బాలునకు దేవత్వమును, సంపూర్ణ యౌవనమును, ఆకాశవీధిలో పయనించు శక్తిని, దిగ్విజయము సేయగల సామర్థ్యమును, ఆకాశములో తిరుగగల పట్టణమును, పరమేశ్వరుడు ప్రసాదించెను. పార్వతీదేవి అప్పటికప్పుడే యౌవనవంతునిగా జేసి,

అతనికి పరాక్రమ వంతమైన సంతానమును, ఆ సంతానము సూక్ష్మబుద్ధిగలవారై శత్రువులను జయించు సామర్థ్యము గల సంతానము గల వారైయుందురుగాక యని పరమేశ్వరుడు మెచ్చుకొను లాగున పార్వతీ దేవి కూడ వరములొసెగెను.

ఇట్లు పార్వతిని సంతోషింపజేయుటకు పరమేశ్వరుడును, పరమేశ్వరుని సంతోషింపజేయుటకు పార్వతియు, ఆ పిల్లవానికి వరములను ప్రసాదించిరి. వారి వరముల ప్రభావము వలన తేజోవంతుడై ఆ బాలుడు స్ఫురద్రూపియై ప్రకాశించు చుండెను.

ఓ రామచంద్రా! బిడ్డను గని తల్లి కొండల మధ్య వదలి వేసి వచ్చుటెక్కడ మహా ఋషులు కఠోర నియములతో తపస్సు గావించినను దర్శనము గాని ఆది దంపతులు పార్వతీ పరమేశ్వరులు ఆ సమయంలో పిల్లవానికి దర్శనమిచ్చుటెక్కడ ఇదంతయు వాని పూర్వ జన్మ సుకృత విశేషమే కదా!

ప్రపంచంలో ఎవరికి రక్షించు వారులేరో వారిని దేవుడే రక్షించునని పెద్దలు చెప్పుచుందురు. సుకేశుడు శివదత్త పట్టణమునకధికారియై, సూర్యుని వలె ప్రకాశించుచుండెను. ఇంద్రుని వలె ఐశ్వర్యమనుభవించుచుండెను. విష్ణువవలె వికాసము బొందుచుండెను. ఇట్లుండగా గ్రామణి అను గంధర్వుడొకడు రేవతి అను కుమార్తె నిచ్చి సుకేశునికి వివాహము గావించెను. రేవతి యను భార్య యందు సుకేశునకు ముప్వురు కుమారులు గల్గిరి.

## మాల్యవంతాదుల వృత్తాంతము

ఆ సుకేశునకు గల్గిన కుమారులలో పెద్ద కుమారుని పేరు మాల్యవంతుడు, రెండవ కుమారుడు సుమాలి, మూడవ కుమారుని పేరు మాలి, వారు ముప్వురును అదమరచిన వానికి వ్యాధి ముదిరినట్లు దినదినాభివృద్ధి జెందుచుండిరి. తమ తండ్రి సుకేశుని వలె, తాము కూడా దేవత్వమును పొందవలెనని తలంచి బ్రహ్మదేవుని గూర్చి తపస్సు చేసి అయనను మెప్పించి వరములు పొందవలెనను తలంపుతో మునీంద్రులు మెచ్చుకొను విధముగా ఉగ్ర తపస్సులు ప్రారంభించిరి. వారు జేయు ఉగ్ర తపస్సు నుండి తాపాగ్ని బుట్టి అది లోకులందరిని తపింప జేయుచుండెను. ఆ తాపాగ్నిని జూచి బ్రహ్మదేవుడాశ్చర్యమును జెందెను.

## బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై మాల్యవంతాదులకు వరములొసగుట

బ్రహ్మదేవుడు హంసవాహనారూడుడై మాల్యవంతాదుల వద్దకు వచ్చి బిడ్డలారా! మీ తపస్సుకు మెచ్చుకొంటిని. మీకేమి వరములు గావలెనో కోరుకోమ్మనెను. వారు బ్రహ్మదేవునకు మ్రొక్కి స్వామి? మాకు అన్ని దిక్కుల యందును అధిపత్యము కావలెను. విద్యలయందును, ప్రతిభ యందును, విశేష ప్రజ్ఞావంతులము కావలెను. మాకు విజయము పరాక్రమము దీర్ఘాయువు ఆరోగ్యములనిచ్చుచు మా అన్నదమ్ములమొకరితో నొకరు విరోధులము కాకుండా మిత్రులమై యుండునట్లు వరములను దయసేయుమని మాల్యవంతాదులు బ్రహ్మదేవుని వేడిరి. కమలాసనుడు వారు కోరిన కోరికను మన్నించి తథాస్తు అని వారికి వరములనొసగి సరస్వతీ భర్త సత్యలోకమునకు బోయెను.

## మాల్యవంతాదులు లోకములను బాధించుట

ఇట్లు మాల్యవంతాదులు బ్రహ్మ వలన వరములు బొందిరి. కాని వీరు కూడా తక్కువ తినలేదు. పదవి వచ్చినదా, మా వానిని పట్టలేమన్నట్లు వరములు బొందిన వారికి గరువము రాక మానదు. అన్నట్లు బ్రహ్మదేవుడిచ్చిన వరముల బలము వలన వారుమదోన్మత్తులై, దేవతలనోడించిరి. వారి స్త్రీలను చెఱబట్టిరి. మునీశ్వరులను ముప్పతిప్పలు బెట్టిరి. సిద్ధులను సాధ్యులను చావమోదుచుండిరి. మాల్యవంతాదుల పేరు వినగానే ప్రజలు, పాలకులు పారిపోవుచుండిరి. ద్వాదశాదిత్యులు బాధలు బడుచుండిరి. ఖేచరులు, గరుడులు గగనసీమలో తిరుగవెఱచిరి. తుషితులు పరువులెత్తుచుండిరి. అష్టవసువులు అష్టకష్టాలపాలైరి. ఏకాదశ రుద్రులు పాకలలో దాగిరి. మరుత్తులు మరుగున బడియుండిరి. సిద్ధులు దద్దరిల్లి పోయిరి. గంధర్వులు గాబరాబడి పోయిరి. ఈ విధముగా వారందరినీ హడలెత్తించిరి. మాల్యవంతాదుల దెబ్బకు భయపడి బ్రతుకు జీవుడాయని కాపురాలు వదలి గంపలకు కుండలు బెట్టుకొని దూరముగా బోయి ఇక్కడికి వారు రారని గంపదించి, తిరిగి చూచినపుడు వారక్కడ కనబడుట వలన బెదిరి పోయి అదిగోవచ్చిరి, ఇదిగో వచ్చిరని గంపనెత్తుకొని గబగబ పరుగెత్తుచుండిరి. ఈ విధముగా వారు పౌరులను, దేవతలను అందరిని చిందరవందర జేయుచుండిరి. ఈ విధముగా సుకేశుని పుత్రుల వలన సమస్త లోకవాసులందరును బాధలు బడుచుండిరి.

భూలోకమునందే స్వర్గలోకము నందుగల సౌఖ్యములతో నుండునట్లు పట్టణమొకటి నిర్మించవలెనని మాల్యవంతాదులు విశ్వకర్మను వేడుకొనిరి. వారికి విశ్వకర్మ ప్రత్యక్షమై మీరెందుకు నన్ను దలచితిరని యడుగగా వారు నమస్కరించుచు స్వామీ! మీరు అమరావతీ పట్టణమును సకలైశ్వర్యములతో దేవతలకు నిర్మించి యిచ్చియున్నారు. అంతకంటే ఎక్కువగా నుండు నటుల నీవు మాకొక పట్టణమును నిర్మించి యిమ్ము! ఆ పట్టణము మేరు పర్వతము నందు గాని, హిమాలయము నందు గాని, మహేంద్ర పర్వతము నందుగాని, ఏది యోగ్యముగా నుండిన ఆ పర్వతము నందు నిర్మించి యివ్వుమనికోరిరి.

**విశ్వకర్మ :** ప్రభువులారా! వినండి దక్షిణ సముద్ర మధ్యలో త్రికూట మను పర్వతము మీద దేవేంద్రుని యానతిచే నేనేయొకపట్టణమును నిర్మించి యున్నాను. ఆ పట్టణమరువది యోజనములు పొడవును, విస్తారమును, నూరు యోజనముల యెత్తును, కోట్ల శివాలయములును కలిగి బంగారముతో నిర్మించిన తోరణములు, గోపురములు, నవరత్నములతో పొదగబడి సమస్త భోగభాగ్యములకను కూలము గలదై, అగాధమైన అగడ్తలు గల్గి బంగారపు కోట గోడలతో నా శిల్ప చాతుర్యమంతయు జూపించి లంకానగర మనుపేరుతో నిర్మించి యున్నాను.

అందు వలన మీరందులో కాపురముండుటకు యోగ్యముగా నుండును. కావున మీరాపట్టణమందు జేరి సుఖముగా జీవింపుడని విశ్వకర్మజెప్పెను. మాల్యవంతాదులాయన వద్ద అనుమతి బొంది, సైనికసమేతముగా ప్రవేశించి అందు సుఖముగా కాపురముండిరి.

వారు లంకలో స్థిరపడిన తరువాత గంధర్వి యను వాడొకడు తన కుమార్తెలను వారికొసగి వివాహము గావించెను. మాల్యవంతునకు సుందరి అను భార్యయందు ఏడు మంది కుమారులు, ఒక కుమార్తె కలిగెను. వారికి అనిశక్రోధుడు, వజ్రముష్టి, విరూపాక్షుడు, దుర్ముఖుడు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, మత్తుడు, ఉన్మత్తుడు, అను పేర్లు కొడుకులకును, అనలయని కుమార్తెకును పేరుబెట్టిరి.

సుమాలికి కేతుమతి అను భార్య యందు ప్రహస్తుడు, అకంపనుడు, వికటుడు, శకటముఖుడు, ధూమ్రాక్షుడు, దండుడు, సుపార్శ్వుడు, ప్రఘనుడు, భాసకర్ణుడు అను పుత్రులు బుట్టి దిట్టతనము గలవారైయుండిరి. వీరికి తోబుట్టువులుగ బాల, పుష్పోత్కట, కుంభీనస, కైకసి అను కుమార్తెలు గల్గిరి. వారు చాలా అందగత్తెలై యుండిరి.

మఱియు మాలియను వానికి వసుధ అను భార్య యందు అనలుడు, అనిలుడు, హరుడు, సంపాతి అను నల్వురు కుమారులు గల్గిరి, వారు చతుర్విధ పురుషార్థముల వంటి వారు అని అగస్త్య మునీంద్రుడు శ్రీరామచంద్రునకు దెల్పి, ఓ రామచంద్రా ఆ నలువురే విభీషణుని మంత్రులు అని తెలియజేసెను.

ఇట్లు మాల్యవంతాదులు తమకు గల్గిన వీరపుత్రులవలన సమస్త సంపదలతో తులతూగుచుండిరి. మఱియు దేవతలను, గరుడ, గంధర్వ, యక్ష, కిన్నర, సిద్ధ సాధ్యులందరిని దారుణముగా హింసించుచు లంకలో కాపురముండిరి.

మాల్యవంతాదులీవిధముగా అందరినీ బాధించుచుండిరి. వారు బెట్టు బాధలను భరింపలేక ఋషులు నొకచోట జేరి ఆలోచించి ముందు కైలాసమునకు బోయి శివునకు మన బాధలను మనవిచేయుదము. అయన దయామయుడు అనెడి నమ్మకముతో అందరును వెండికొండకు బోయిరి, శంకరుని జూచి ఓ స్వామీ! శంకరా! కుజన భయంకరా! ఆపద్బాంధవా! అనాధరక్షకా! మావిన్నపము లాలకింపుము. ఆ సుకేశుని కుమారులు ముగ్గురును మా మీద దాడులు గావించు చున్నారు. ఆ బాధలకు మేము సహింపలేము. నీవు రౌద్రమూర్తివి. నీ మూడవ కన్నుతెరిచిన వారుమాడి మసైపోగలరు. పాహిమాం, పాహిమాం, అని ప్రార్థించిరి. కాని ఇతడు భోళాశంకరుడు కుడుమంటే పండుగనే వాడు. ఇతడు మమ్మెంత వరకు కాపాడగలడని ఊహింపరైరి. మన బాధలు విన్న స్వామికి దయగలుగునేమోయని చెప్పనారంభించిరి.

**ఋషులు :** స్వామీ! వారి బాణాగ్నులతో మాయాశ్రమములను గాల్చివెచిరి. మేము పూజించెడు దేవతా విగ్రహములను పెల్చివెచిరి. సిద్ధులను భయపెట్టిరి, దేవాలయముల పడగొట్టిరి, ఓంకార జపములొకరమూ చేయుజాలము, యజ్ఞములను భగ్నము జేయుచున్నారు. చదువులు సాగనీయరు. బ్రహ్మచారుల గురుకుల వాసము కుంటుబడినది. అని చెప్పి తమ బాధలను తప్పింపుడని వేడుకొనిరి, వారు చెప్పినంత సేపు విన్నాడు శివుడు. ఋషులరా! దేవతలారా! ఆ రాక్షసులు చావు లేనివారు. నేను వారికేమీ చేయజాలను. కాని నేను చేయలేక పోయినను చేయు వార్నైనా మీకు చూపవలెను కదా! అందుకు ఆ విష్ణుదేవుడే విధిగా ఆ పని జేయ సమర్థుడు. మీరు వైకుంఠమునకు బోయి ఆ భక్తపరాధీనునితో మీ బాధలు చెప్పుకొనుడు అని శివుడు వారికి మొగమోటము లేకుండా చెప్పి పంపెను. ఉమాపతి మాటలు విని, వారు ఉసూరుమని, కైలాసము నుండి కదలి వైకుంఠమునకు బోయిరి.

ఆ వైకుంఠమెట్లున్నదనగా, పాలసముద్రమున బుట్టిన బంగారు కణజము వలెను, నీటిలో బుట్టినవేయి రేకుల బంగారు తామరవలెను బంగారు కోట గోడలతో కనులకు మిరుమిట్లు గొలుపు మీనకేతునుని తండ్రి నగరమైన వైకుంఠమును జూచిరి. విష్ణుదేవుని హజారము ఎత్తుగాను గరుడకేతనముగల్దై యుండెను. అందరును అందులో బ్రవేశించిరి. తమరాకను ద్వారపాలుర ద్వారా అచ్యుతునకు దెల్పి ఆయన అనుమతి మీద హజారములోనికి బ్రవేశించిరి. కష్టములు గడతేర్చగల స్వామికందరును సాష్టాంగ దండ ప్రణామములాచరించిరి.

ఓ దేవ దేవా! జగన్నాయకా! కరుణా సముద్రా! కమనీయ గాత్రా! అని స్తోత్రము గావించిరి. ఆ సమయమున విష్ణుదేవుడు, వైష్ణ వీరత్నములైన, శ్రీ, భూ, నీళలతో చెలగాటములాడు చుండెను.

వీరి ప్రార్ధనలను విని విష్ణుదేవుడు వెనువెంటనే వచ్చి ఋషులారా! దేవేంద్రాది దేవతలారా! మీరిటకెందుకొఱకు వచ్చి యున్నారో నాకు తెలియును. ఆ సుకేశుని పుత్రులకు మహేశుడు, బ్రహ్మ, మితిమీరిన వరములనిచ్చి యున్నారు. అందువలన వారి యాగడములనింత వరకు సహించితిని, మీరిక భయపడవలదు. మీ నివాసములకు వెళ్ళుడు. నేను నా ధనస్సెక్కుబెట్టినప్పుడు, వారి పాపములు, మీ తాపములు తీరగలవు, అని శ్రీహరి వారికభయమొసగి మీ చింత దీర్చెదనని పంపివైచెను అని అగస్త్య మునీంద్రుడు రామచంద్రునకీ కథను వివరించెను. ఇదంతయు విన్న రామచంద్రుడు మహర్షి పుంగవా! మాల్యవంతాదులకును విష్ణుదేవునకును జరిగిన విడ్డూర సమర సమాచారమును వినిపింపవలసినదిగాకోరెను.

అగస్త్యుడనుచున్నాడు, రాముడును సభలోనివారును వినుచున్నారు. రామచంద్రా విను! మాల్యవంతాదులు, మహానిపుణులైన వేగుల వారిని బెట్టి యుండిరి. వారు ఋషులు, దేవతలు రుద్రుని వద్దకు బోవుట వారిని వైకుంఠమునకంపి వేయుట, వైకుంఠుడు వీరికభయ మొసగి, మాల్యవంతాదులను చిటికలో మరణమొందించెదనని వారికభయమిచ్చి పంపివేయుట జరిగిన దంతయు విరివిగా వినిపించిరి.

## మాల్యవంతాదుల మంత్రాలోచనము

మాల్యవంతుడు తమ్ములను బిలిపించి తమ్ములారా! దేవతలు, ఋషులు గలిసి కైలాసమునకు బోయి, మనతో వారికి గల్గిన బాధలను శివునకు జెప్పుకొనిరి.

ఈ పని నా వలన జరుగదని విష్ణు దేవుని వద్దకు వారిని బంపెను. విష్ణు దేవుడు వారికిప్పుడు అభయమిచ్చి యున్నాడు. విష్ణువు దేవతల పాలిట దైవము, ఆయన శరణన్న వారిని మరణము లేకుండా కాపాడే బిరుదాంకితుడు. మాట యిచ్చెనేని మాధవుడు తప్పడు. మనమెంత మేధాశాలురమైనను ఏదో యుపాయముతో మనలను సాధించగలడు. మనమెంత గొప్పవారిమైనను, విడువక, ముప్పుతిప్పలు బెట్టి యున్నాము. బలవంతులతో విరోధము, పనికిరాదు, తమకంటే తక్కువ వారితో యుద్ధము సేయవలెను. తనతో సమానులతో మిత్రులమై మెలగవలెను. తమకంటె అధికులతో సంధి పనికిరాదు. విరోధములేని వారమై, వారికి సేవలు గావించి వారి మన్ననలకు పాత్రులము కావాలెను.

అంతే కాదు, పుట్టుకతో బలవంతులు గాక, మధ్యలో బలమును సంపాదించి తమ కంటే గొప్ప వారులేరను గర్వముతో మూర్ఖముగా నెదిరించి గొప్ప వారిపై యుద్ధమునకు బోయినచో, భయంకరముగా మండుచున్న మంటల యందు చొరబడిన మిడుత చందముగా మాడి బూడెదయగుదురు మన బలము నడుమ సంపాదించిన విష్ణుదేవుని బలము మహిత్మ్యము పరాక్రమము సహజమైనవి. ఆ విష్ణుదేవుడు నాకింత బలమున్నదని మనవలె త్రుళ్ళిపడక నిలకడగల వాడైయుండునే గాని మనవలె అందరి మీదికి బోయి కయ్యమునకు కాలుదువ్విన వాడు కాదు.

మనలాంటి దుష్టులు తమ బలమును, తమ విరోది బలమును తూచి చూడక తమ మేలుగోరి మంచి మాటలు చెప్పిన వారి మాటలు వినక బలవంతు నెదిరించుట, బలమైన గాలినెదరించిన బూరుగమ్రానివలె నేలగూలిపోగలరు. కావున దేవతల రక్షణ కొఱకై మనమీదికి యుద్ధమునకు రానున్న విష్ణుదేవుని నెదరించుట మనకు క్షేమముగాదు.

ఆయన పుణ్యజనులను ప్రేమించువాడు. కావున మనము విష్ణుదేవుని శరణు వేడిన కాపాడగలడు. మనమాయన అనుగ్రహము సంపాదించినచో లోకములో మనము సంపాదింపరానిదేదియు నుండదు. ఆ విష్ణుదేవుడిది వరకు జేసిన కార్యములను కొన్నింటిని చెప్పెదను వినండి.

మధుకైటభాదులను వారు ఈ సముద్రమును మోకాలిలోతే యని విఱ్ఱవీగు చుండిరి. ఆ రాక్షసులను విష్ణుదేవుడు నష్టపరచి చంపియున్నాడు.

బంగారు కన్నులు గల హిరణ్యాక్షుని వరాహ రూపముతో వధించి యున్నాడు. హిరణ్యకశిపుని, అరణ్య మృగరాజు నరసింహ రూపముతోదును మాడినాడు. ఇలాంటి వారి నెందరినో, నీల్గదీసినాడు. వారందరకంటే మనమేమి గొప్పవారము గాము కావున, ఆ విష్ణుదేవుడెవరి మీదను నిష్కారణముగ పగబూనడు. ఆయన యందే తప్పును లేదు. తప్పంతయు మనయందే యున్నది. మన చెడు ప్రవర్తనలే దీనికంతయు కారణము. కావున దీనినంతయు మీరు బాగా ఆలోచించి, జరుగబోవు కార్యమునకు చక చకా నిర్ణయము దీసికొనుడు అని తన తమ్ములకు మాల్యవంతుడు మంచిగా హితోపదేశమును గావించెను.

అన్నగారి మాటలు విన్న మాలి, సుమాలి అను వారు నీతి దెలిసిన వారైయుండియు నీతి తెలియని వారివలె బ్రవర్తించిరి. వినాశకాలే విపరీత బుద్ధికదా. అన్నగారితో అన్నా! మా మాటలను వినుము నీవిప్పుడున్న చోటు చాలా పవిత్రమైనది. భాగ్యవంతమైనది. నీ ఆయస్సు నీ స్వాధీనములో నున్నది. నీ సదాచారము చాలా గొప్పది.

నీవు వేయు బాణములు అగ్ని జ్వాలల వంటివి. నీ యెదుట నిలుచు వాడొక్కడు కూడా కానరాడు. నీకుమారుల పరాక్రమమును చెప్పవలసిన పనేలేదు. వీరాధివీరులు ఈ లోకములో వారికెదురు నిలుచు ధీరుడే లేదు. నీవెందుకిట్లాలోచించు చున్నావు?

మనలను చెఱచుటకు దేవతలింత ప్రబల ప్రయత్నములను గావించిరి. నీకెందులకో వారిపై కోపము రాలేదు. ఆ దేవతలు పోయి మనమీద విష్ణుదేవునకు చాడీలు జెప్పినను ఆయన పక్షపాతబుద్ధి గలవాడైయెట్లు రాగలడు. అట్లు ఆయన వచ్చినచో దుష్టులమనుచున్న మనకంటే ఆయన గొప్పవాడెట్లు కాగలడు, తన సమానత్వమును వదలి పక్షపాతి యనిపించుకొనునా? అందువలన ఆయన ఈ పనికిరాడు.

ఇందులో మన తప్పు మాత్రమేమున్నది. దేవతలకు మనకును విరోధము సహజమైనది. అందువలన మనము దేవతలతో యుద్ధము జేయవలసియున్నది. చేసితిమి మనము విష్ణువునకేమి అపచారము సేయలేదు కదా? కారణము లేకనే ఆయన మనమీదికెట్లు రాగలడు. ఆయన నిజముగా మనలను ద్వేషించెనేని, ఆయనతో సంధి జేయుటెట్లుపొసగును. మనకు పగవారైన దేవతలు విష్ణుదేవుని వద్దకు పోయినంత మాత్రము చేతనే మనకు సహజ శత్రువులైన దేవతల మీద మనకు

గల కోపమును శత్రుత్వమును విడువవలసినదేనా? నీవు చెప్పినట్లు ఆ విష్ణు దేవుడు బలవంతుడని ఆయనను శరణు వేడితిమేని మన వీరత్వమునకు భంగము గల్గును. అందువలన మనలను జూచి ఇంతవరకు భయపడుచుండిన పగవారందరును మన పిరికి తనమును ఆసరాగా దీసికొని నవ్వగలరు.

అందు వలన మనమా విష్ణుదేవునకే యపరాధమును సేయలేదు. మన మీద చాడీలు జెప్పి మనపై విష్ణుదేవునుసికొల్పిన దేవతలపై పగతీర్చుకొనవలెను. కావున మనమిక ఆలస్యము సేయక ఆ దేవతలపై యుద్ధమునకు బయలు దేరవలెను. ఇది మా యభిప్రాయము అని మాల్యవంతునకు తన తమ్ములు సుమాలియును, మాలియును వారి యభిప్రాయములను దెల్పిరి.

అంతియే కాదు మన మా దేవతలతో యుద్ధము జేయునప్పుడు వారికి బాసటగా ఆ విష్ణువు వచ్చినను కాదనకూడదు. ఏలనగా మనకావిష్ణుమూర్తితో యుద్ధము సేయుట కంటే మించిన లాభమేమున్నది. మనమీలోకములో సేయదగిన వన్నియు చేసియున్నాము. వేదశాస్త్రములను చదివియున్నాము. మొనగాండ్రనందరినీ జయించి యున్నాము. యజ్ఞములు, దాన, ధర్మములు గావించి యున్నాము. భోగభాగ్యములు కోకల్లలుగా ననుభవించి యున్నాము. ఇక మనకేమి కావలయును. అందువలన మీతో నెదురాడితిమని కోపింపక మన్నించి మాకనుజ్ఞనిమ్ము. మేమిపుడే బోయి ఆ దేవతలను జయించి వచ్చెదమని వినయముతో ఆయన తమ్ములు ప్రార్థించిరి.

## మాల్యవంతాదులింద్రుని పై దండెత్తుట

మాల్యవంతుడు తన తమ్ముల అభిప్రాయమును తెలిసికొని, వారు విష్ణుదేవునితో సంధి జేయుటకిష్టపడనందున దేవతలపై యుద్ధమునకాజ్ఞ కోరినందున, మాల్యవంతుడు తన సేనాధిపతితో అమరావతి పట్టణముపై దండెత్తుటకు సర్వసైన్యములను ఆయత్తము గావింపుమని ఆజ్ఞాపించెను.

అపుడా రాక్షసులు రణభేరీలు మ్రోగించిరి, ఆ కఠోర శబ్దమునకు దేవతల భార్యలు బెదిరినందున వారి గర్భములోని పిండములు వారికి తెలియకనే జారి క్రిందబడినవి. కొండలు మారు మ్రోగెను. సముద్రములు బురదయ్యెను. ఈశ్వరుడాశ్చర్యపడెను, కలహభోజనుడు తనకు కడుపార భోజనములభించెనని పొంగుచు గంతులు వేసెను.

ఇట్లు భయంకరముగా కోలాహలముతో యుద్ధసన్నద్ధులై కొందరు శరభ మృగముల మీదను, మఱి కొందరు చమరీ మృగముల మీదను, ఇక కొందరు పులుల మీదను, కొందరెలుగు బంటుల మీదను, పలువురు రాక్షసులు, పక్షుల మీదను, పందుల మీదను, తక్కిన వాళ్ళు తాబేళ్ళ మీదను, మొనగాండ్రగు వారు మొసళ్ళ మీదను స్వారీ జేయుచు భయంకరములగు రూపములతో బయలుదేరిరి.

ఆ సమయమున లంకలో ఆడ నక్కలఱచినవి. భూత, ప్రేత, పిశాచములు ఘోరుకొల్పినవి. సముద్రము సలసలలాడినది. చుక్కలు మిక్కుటముగా రాలెను. పర్వతములు నెర్రెలు బారెను. గూబలు కూసెను. కాకులు కారాడెను. పిడుగులు పుడమిపై బడెను. నిప్పుల వానకుప్పలుగా గురిసెను. ఆ విష్ణుదేవుని చేతిలో విపరీతముగా ఓడిపోయెదరని ఆకాశవాణి ఆర్భాటించెను. మాల్యవంతుడిదంతయు గమనించి దైవ నిర్ణయమును తప్పింపజాలమని, విష్ణుదేవుని జూడయుత్సాహపడు చుండెను. మఱియు సైనికుల ముందు భాగమున తానే నడచెను.

ఇట్లు రాక్షసులు బయలుదేరునప్పుడు పైకెగసిన ధూళియును, శూరుల వీరాలాపములను ఒకదానితో నొకటి పోటీబడి రాక్షసులు మీమీదికివచ్చు చున్నారని చెప్పుటకాయనునట్లు అమరావతి పట్టణమునాక్రమించెను.

ఈ విధముగా రాక్షసులమరావతిపై దండెత్తి వచ్చుచున్నారని దేవేంద్రుడు బోయిచెప్పెనో. తాను సర్వాత్మ స్వరూపుడైనందున తనకే దెలిసియుండెనో కాని, అసురులు అమరావతి పైకి వచ్చి యున్నారని తెలిసి గరుడ వాహనారూఢుడై హరి యుద్ధమునకు బయలు దేరెను.

విష్ణువు బయలుదేరునప్పుడు గరుడుడు తన రెక్కలను విదళించి యాడించెను. ఆ గాలికి వృక్షములు వసుధపై గూలెను. పక్షుల వలె పర్వతములు పైకెగసెను. సముద్రమందు నీరు సమసిపోయెను, కుల పర్వతములుకదలాడెను. అష్ట దిగ్గజములల్లాడి ఘీ పెట్టెను. మ్రానులు మహిపై బడెను. సూర్యుని సారధికి పట్టుదప్పి పగ్గములు వదలెను, గుఱ్ఱములకు గుబులు పుట్టెను.

గురుత్మంతుడెగర గొట్టిన దుమ్ము రాక్షసుల కన్నులలో బడికంగారుబెట్టెను. వారికి కంటి చూపులు కానరావయ్యెను. ఏనుగులు, గుఱ్ఱములెగిరి పోయెను. సైనికులకు చావుబ్రతుకులయ్యెను.

ఇది యిట్లు జరుగుచుండగా దేవతలు విష్ణుదేవుని పై విరులవాన గురిపించిరి. తుంబురుడు, నారదుడు నాట్యమాడిరి, గంధర్వులు గానాలాపనము చేసిరి. దేవవేశ్యలాడిరి. చారణులు పొగిడిరి.

విష్ణు దేవుడాసమయమున పాంచ జన్యమును పూరించెను. రాక్షసుల గుండెలలో రైళ్ళు బరువెత్తెను వారి ఒడలు వడవడ వణికెను. ఆయన శరీరకాంతికి అదిగో విష్ణువు ఇదిగో విష్ణువని వారిలో వారు తన్నుకొనుచుండిరి.

ఈ విధముగా రాక్షసులు తూలుచు, తేలుచు, తునాతునకలైన తమ ధైర్యములను దట్టముగా కూడబెట్టుకొని, ఓరీ! శ్రీహరి! నీవు గర్వించి నిజమైన మొనగానివలె దేవతలను రక్షించెదనని మాట యిచ్చి మాతో యుద్ధము జేయుటకు వచ్చియున్నావా! నీవందరి యందును సమానముగా నుండెదనని చెప్పుచుందురు. ఇదేనా నీ సమానత్వము.

ఇక నీతో మాటలెందుకు చేతలతోనే చూపగలము. భద్రం, భద్రం యుద్ధములో తోక భుజానబెట్టుకుని వెళ్ళక మాయెదుట నిల్వుము. నీ విష్ణుత్వాన్ని, గిష్ణుత్వంజేసి వదలివేసెదము. అని ఆ రాక్షసులు గదలను, గండ్ర గొడళ్ళను, తోమరములను, గునపములను తమ చేతుల యందు ధరించి గొప్ప పర్వతమును ఢీకొను దోమల గుంపువలె, విష్ణుదేవునిపై దలపడిరి. విష్ణుదేవుని పై రాక్షసులు సమస్తా యుధములు జడివాన వలె గురిపించిరి. ఆ యుద్ధమునకు విష్ణుదేవుడు చలించలేదు. అయన అంజనాద్రి పర్వతము వలె స్థిరుడై యుండెను. మిడుతలవలె విజృంభించు రాక్షసులకాయన అగ్నిగుండము వలెను, దోమల వలె తమపై బడు రాక్షసులకు మేరు పర్వతము వలెను, మొసళ్ళవలె చెలరేగిన రాక్షసుల కంతు దెలియని సముద్రము వలెను, తేనె టీగల వలె తమపై బడు వారికి విష్ణుదేవుడు తేనెతెట్టెవలెను వివిధ రకములుగా విష్ణుదేవుడు హెచ్చుచుండెను. వారు వేయు ఆయుధములు శ్రీహరిపై బడి ఆయన శరీరములో లీనమై పోవుచుండెను. వారు వేయు ఆయుధములకు కలత జెందక ఒక ముహూర్త కాలము విష్ణుదేవునకు ఊపిరాడక ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసములు లేని యోగి పుంగవుని వలెను తమలో గల తిమింగలాలు పొరలినను తికమకలేని సముద్రమువలెను ధీరుడై నిలచియుండెను.

రాక్షసుల రాద్ధాంతమునకు కోపించి, తన శార్ఙమనే కోదండము నెక్కు బెట్టి అల్లెత్రాటిని గోటితో మీటుచు ప్రళయ కాలాగ్ని వంటి బాణములు వారిపై ప్రయోగించగా చెల్లాచెదురై యా రాక్షసులు చతికిల బడుచుండిరి. విష్ణుదేవుడు వేసెడు బాణ పరంపరలకు రాక్షసులు సోలి, వాలి, తూలి, నేలరాలుచుండిరి. సముద్రములో తుఫానుకు ఓడలు మునిగినట్లు నారాయణుని బాణములనే తుఫానుకు రాక్షసులు రాలి కూలుచుండిరి.

అప్పుడు నారాయణుడుత్సాహముతో తన జయశంఖమును పూరించెను. ఆ శంఖధ్వని విని రాక్షసులు కొందరు మూర్ఛబడిరి. కొందరు బీరులైరి. కొందరు పరుగులు దీసిరి. గుఱ్ఱములు గిఱ్ఱున దిరిగెను. మదపుటేనుగులకు మైకము గ్రమ్మెను. రథములు రస్తాలకడ్డు దిరిగెను. పదాతి దళములు ప్రక్క దోవలు బట్టెను. విష్ణుదేవుడు విజృభించగా సింహమును జూచిన ఏనుగుల వలెను, పులిని జూచిన జింకల వలెను, నిలిచిన చోట నిలువక ఒకరినొకరు పిలువక, తిరిగిచూడక, కత్తులనెత్తుకొనక చావగా మిగిలిన రాక్షసులు లంకవరకు పరుగులు దీసిరి. పరువెత్తెడు వారిని జూచి విష్ణుదేవుడు విజయశంఖమునూదెను.

పరుగిడి పోవుచున్న రాక్షసులపై విజయోత్సాహముతో విష్ణుదేవుడు వెంటనంటి తరుముచుండగా సుమాలి జూచి, రోషకాషాయ నేత్రుండై తన ప్రచండ బాణములతో విష్ణుదేవుని బాణములను ఖండించుచు, తన బాణములను విష్ణువుపై వర్షమువలె గురిపించెను. ఆ బాణములు, సూర్యుని గప్పివేయు మేఘమువలె విష్ణువును కనబడనీయక కప్పివేసెను. అప్పుడు సుమాలి దిక్కులు బిక్కటిల్లునటుల సింహగర్జనము గావించెను. ఇంతకు ముందు పరుగెత్తుతున్న రాక్షసులా సింహ గర్జన విని ఇది సుమాలిదేయని గుర్తించి చెల్లాచెదురైన రాక్షసులందరును మరలా గుమిగూడిరి. సుమాలికి బాసటగా గోవిందునెదుర్కొనిరి.

సుమాలి మదించిన యేనుగు వలె నిలిచి రా రమ్మని విష్ణువును బిలుచుచు తన రథమును విష్ణుదేవునకెదురుగ దోలించెను. విష్ణుదేవుడతనిని జూచి నవ్వుచు అతని సారథి శిరస్సును ఒకసాయకముతో నెగురగొట్టెను. సుమాలిపై విష్ణుదేవుడు ఉపయోగించిన బాణములతో నతడు మూర్ఛబడెను. గుఱ్ఱములు రథమును దూరముగా లాగుకొని వెళ్ళెను.

సుమాలి మూర్ఛబడగా చూచి అతని అన్న మాలియను వాడు విష్ణుదేవుని పై వీరాలాపముతో వచ్చి ముందు నిలిచి బహువిధములైన బాణములను విష్ణుదేవుని యెదపై బడునటుల వేయగా అవన్నియు క్రౌంచ ద్వీపములోనికి బ్రవేశించు హంసలవలె ఆయన వక్షస్థలములో బ్రవేశించి అందులోనే లీనమయ్యెను.

దేవతలది జూచి తమ మనస్సుల యందు బాధపడుచుండిరి. విష్ణుదేవుడు తన ధైర్యమును విడువలేదు. తనపై మాలి వేసిన బాణములకు విష్ణుదేవుడు మాలిని మెచ్చుకొనెను. తన విల్లెక్కుపెట్టి మాలి వేసిన బాణములను మధ్యలో ద్రుంచుచు కొన్ని మాలి శరీరములో దూరి, అతని రక్తమును ద్రాగి

పైచెను. కొన్ని వాని కిరీటమును పొడి పొడి జేసెను. మఱి కొన్ని వాని గుఱ్ఱములను కూల్చెను. మరొకటి వాని విల్లును ఖండించెను.

అందువలన మాలి రథములేని వాడై పాడైన రథము నుండి దిగి, తనగదను త్రిప్పుచు విష్ణుదేవుని వాహనమైన గరుత్మంతుని శిరస్సుపై దురహంకారముతో గొట్టెను. ఆ దెబ్బకు గరుత్మంతుడు గిరగిర తన చుట్టూ తానే తిరిగెను. మఱియు మగటిమి జూపిన మాలి వైపునకు బోవుటకు గరుత్మంతుడు జంకుచుండెను. అది జూచి విష్ణు దేవుడాశ్చర్యపడెను. ఆకసము నుండి చూచుచుండిన దేవతలకు దిగులు గల్గునట్లు రాక్షసులరచు చుండిరి.

విష్ణుదేవుడు గరుత్మంతునితో ఓ పక్షిరాజా! ఎందుకింత భయపడు చున్నావని గరుత్మంతుని తలపై తన చేతితో నిమిరెను. ఆయన హస్తస్పర్శ దగులగానే గరుత్మంతునకు ఘనముగా జవసత్వములు చేకూరెను. యుద్ధమునకు సిద్ధమయ్యెను. విష్ణుదేవుడు తనసుదర్శన చక్రమును మాలిపై ప్రయోగించెను. అది నిప్పులు గ్రక్కుచు నింగికి నేలకు పట్టరాని వెలుగులతో బోయి మాలి శిరస్సును చిటికలో ఖండించెను. అతని శరీరమొక కొండ గూలినట్లు భూమిపై కూలెను.

అది చూచి దేవతలు దిక్కులు బిక్కటిల్లునట్లు విష్ణుదేవుని వేనోళ్ళ బొగడుచు జయ జయ ధ్వానములు గావించిరి. మాలి కూలుట జూచి అతని అన్న యగు మాల్యవంతుడును అతని తమ్ముడు సుమాలియు, వారిసైనికులును ప్రాణాలు దక్కించుకొనుటకు పారిపోవుచుండిరి. విష్ణువు వారిని వెంబడించి తరుముచుండెను. మాల్యవంతుడది చూచి విష్ణుదేవునితో ఓకేశవా! భయపడి పరుగిడు వారిని తరిమి కొట్టుట ధర్మమా? అట్లుచేసిన ఎంతటి పుణ్యాత్ముడైనను తన పుణ్యము నశించి పోయి స్వర్గము రాదని చెప్పుదురు. పారిపోయెడు వారిపై బడిపోవనేల? ఇదిగో నేను వచ్చి యున్నాను. నన్నెదరించి పోరాడుమని అతడొక పర్వతము వలె పరందాముననెదురై నిలచెను.

తన కడ్డు వచ్చిన మాల్యవంతుని జూచి మాధవుడు కనులెఱ్ఱజేసి ఓయీ రాక్షసశ్రేష్టా! నీవిప్పుడు నాకు దెల్పుచున్న యుద్ధ ధర్మములు న్యాయములును ఆనాడేమయ్యెను? మీకు భయపడి పరుగెత్తుచుండిన దేవతలను మీరును మీ సైనికులును వెంటనంటి తరిమికొట్టితిరి. ఐనను మేము ధర్మము నుండి

వైదొలగము. న్యాయము దప్పి ప్రవర్తించము ఏలననగా బ్రహ్మదేవుడు మీకొసగిన వరములను త్రోసివేయలేక మీరెన్ని దుండగములను గావించినను నేను చేతగాని వాని వలె చూచుచు క్షమించి యూరకుండితిని. మాకు దేవతలు ప్రాణము వంటి వారు వారికి మీరు జేసిన అపకారమునకు ప్రతీకారము గావించెదను, మీరిప్పుడు రసాతలమునకు బోయినను పోనియ్యక పట్టిచంపెదను. మీరు దేవతలను బాధించుట వలన వారు నా వద్దకు వచ్చి శరణు వేడిరి. నేనప్పుడు మీ శత్రువులను చంపి మిమ్ము రక్షించెదనని మాట యిచ్చి యున్నాను. కావున మీరిప్పుడు భయపడినను సాష్టాంగ దండ ప్రమాణములు జేసినను, నన్ను మీరు శరణు వేడినను, మిమ్ములను చంపక విడువను అని మాల్యవంతునితో మాధవుడు నిష్కర్షగా జెప్పెను. మాల్యవంతుడు మాధవుని మాటలు విని, మాధవా! నీకు మరణములేదని మాకు తెలియును. మేము మరణించెడి వారమనీ మాకు దెలియును. నీవు జెప్పినటులె కానీ అని అఱచుచు విష్ణుదేవుని పై శక్తి బాణమునుపయోగించెను. అది గణ గణమను శబ్దములతో మంటలు గ్రక్కుచు బోయి మాధవుని వక్షస్థలముపై బడి, మేఘములో గనబడుమెరుపు తీగవలె మెఱయు చుండెను.

విష్ణువు అదే శక్తి బాణమును దీసి మాల్యవంతుని పై వేయగా అది మాల్యవంతుని ఱొమ్మును చీల్చెను. ఆ దెబ్బకతడు పిడుగు పాటునకు గూలెడు వృక్షము వలె నేలబడి మూర్ఛిల్లెను, మూర్ఛబడిన మాల్యవంతుడు మూర్ఛ నుండి తెప్పరిల్లి కోపముతో శూలాయుధమును ధరించి విష్ణుని ఱొమ్ముపై గ్రుమ్మెను. మాల్యవంతుని మహాపరాక్రమమును జూచి దేవతలు మెచ్చుకొనిరి. రాక్షసులు మేలు మేలు మాల్యవంతాయని పొగిడిరి.

ఇట్లు మాల్యవంతుడు మాధవుని నొప్పించి, అరెరే గరుత్మంతా ఇంకెక్కడికి బోయెదవని గరుత్మంతుని గాఢముగా నతని ముఖముపై మొత్తెను. ఆదెబ్బకు గరుత్మంతుడు కోపించి పరాక్రమించి తన ఱెక్కలను విసిరెను. ఆ ఱెక్కల నుండి వెలువడిన గాలికి తూలి వాలిపోవుచు నిలుచుకొన జాలక రక్కసుడగు మాల్యవంతుడును, అతని తమ్ముడు సుమాలియు, వారి సైనికులును నిలువజాలక సిగ్గుపడి, తమ కుమారులతో గలిసి సమరము చాలించి లంకకు పరుగులు దీసిరి. అని అగస్త్య మునీంద్రుడు రామచంద్రునకు రాక్షసుల చరిత్రమును జెప్పుచు మరలాయిట్లనెను. ఓ రామచంద్రా! విను, ఈ విధముగా పలు పర్యాయములు రాక్షసులు రమానాధునితో యుద్ధము జేసి దామోదరుని ధాటికోర్వలేక ఓడిపోయి లంకను విడిచి రసాతలమునకు వలసవెళ్ళిరి.

మొన్నటి రావణ సంహార యుద్ధములో మాల్యవంతుని సంతతి వారు చాలా మంది నీ చేతిలో నేలకొరిగిరి. రావణుడు మొదలగు రాక్షసులు పులస్త్య బ్రహ్మ సంతతి వారు. వారికంటే అధిక బలపరాక్రమములు గల్గిన మాల్యవంతాది సంతతికి చెందిన వారికి విష్ణుదేవుని చేతిలో దప్ప తక్కిన వారి చేతిలో వారు మరణింపరు.

ఓ రామచంద్రా! మేము విష్ణువు అని చెప్పుచున్నాము. నీవు వింటున్నావు. ఆ విష్ణువెవరో కాదు, నీవే. శంఖు చక్రములను యుద్ధమునందు ధరింపక, దుష్టులను దునుమాడుటకు నీవు మానవ రూపమును ధరించి మాయందరిలోనిట్లు తిరుగుచున్నావు. లంకను రావణునకు ముందే పరిపాలించిన రాక్షసులను గూర్చి నీవడిగి నందున అదంతయు వినిపించితిమి. ఇక చెప్పబోవు కథను కూడా విని యానందింపుమని అగస్త్య మునీంద్రుడు తెలుపుచున్నాడు.

ఓ రామచంద్రా! విష్ణువు ధాటికోర్వలేక రాక్షసులు లంకను విడిచి రసాతలమునకు చేరిరని మీతో చెప్పియుంటిని. తరువాత కథను కూడా వినండి.

రసాతలము బలవంతుడైన బలిచక్రవర్తి పరిపాలనలో నుండెను. కావున మాల్యవంతాదులకది చాలా అనుకూలమై యుండెను. కావున వారచ్చటనే కాపురాలుండి పోయిరి.

## సుమాలి నిర్దేశముచే కైకసివిశ్రవునాశ్రమంబు చేరి అతనిని వరించుట

ఇట్లుండగా భూలోకములో నొకనాడు కుబేరుడు తన తండ్రిని జూచుటకు పుష్పకవిమానములో పోవుచుండెను. ఆ సమయమున సుమాలి తమ కుమార్తెయగు కైకసికి ఆ పుష్పక విమానమును జూపి అయ్యారే! ఇతనికి చంద్రుడు కూడా సమానుడు కాదు. ఇతనిని గన్న విశ్రవోబ్రహ్మది కదా పుణ్యము అని యాలోచించి కైకసినిచ్చి విశ్రవోబ్రహ్మకు వివాహము జేసి ఆమెయందు గల్గిన సంతతి కుబేరునకు సమానుడగు నొక కుమారుడు గల్గెనేని, మారాక్షస వంశమునకు మేలు సమకూరగలదని యాలోచించి, లక్ష్మీదేవితో సమానమగు తమ కూతురును జూచి అమ్మా! ఆ విమానములో బోవుచున్న వాడు విశ్రవోబ్రహ్మ కుమారుడు అతని పేరు కుబేరుడు. మఱియు ధనదుడని, వైశ్రవణుడని కూడా బిలుచు చుండెదరు. అతడీశ్వరునితో సమానుడు. అతనికి ధనాధిపత్యము ఉత్తర దిక్కునకాధిపత్యమును గలవు. అందు వలన నేను నీకొక మాట జెప్పుచున్నాను.

నీవు కుబేరుని తండ్రి విశ్రవో బ్రహ్మ యొద్దకు బోయి సాధుత్వముతో అతని వద్ద చేరి అతనికుపచారములు జేయుచు అతని మనస్సును నీవైపునకు ద్రిప్పుకొని వివాహమాడి, అతని వలన నీవొక కుమారుని గనిన యెడల, ఆ కుమారుడు కుబేరుని జయించి, మన రాక్షస వంశమునకధికారి కాగలడు. కావున మా కులమునుద్ధరించుటకు నీవతనిని సేవింపుము అని తన కోరికను కైకసికి దెల్పి సుమాలి మరలానిట్లనెను.

అమ్మా! కూతురు యొక్క సంతానము వలన తమకు మేలు జరిగెనని పితృదేవతలు సంతోషించెదరు. ఎట్లనగా కన్యాదానము చేసిన పుణ్యము తల్లిదండ్రులకు లభించును. అందువలన అట్టి వయస్సు గల కన్యను తగిన వయస్సు, కులము, శీలము, రూపము, శుభలక్షణములు, బంధుత్వము, విద్య, శ్రేయస్సు, గల వరునకియ్య వలెనని సంతోషించు చుందురు. కానీ నీవు నాకు కూతురు మాత్రమే కాదు, నీకు లక్ష్మీతో సమానమైన రూపము, లావణ్యము, శీలము గలదానవు. కాని ఎవడైనను నా వద్దకు వచ్చి నీ కుమార్తెనిమ్మని అడిగిన వాడేలేదు. ఆధైర్యసాహసము లెవరికి కలుగలేదు. నేనొకవిధముగా కుమార్తెను గనుట మంచిదేయైనను మఱి యొక విధముగా వ్యసనము గల్గుచున్నది.

ఏలనగా కూతురు దుష్టురాలై మంచినడవడికలు లేకుండెనేని ఆమె తండ్రి వంశము వారికిని తల్లి వంశము వారికిని, ఆమెను వివాహమాడిన భర్తకును, కొడుకులకును అపకీర్తి గల్గినందున సమస్త బంధువులును నిందింతురు. కావున నీవలాంటి దానవు కావు. మంచి నడవడికలు గల దానవు. విశ్రవో బ్రహ్మ ప్రేమించునో లేదో యను సందేహమక్కర లేదు. అది దైవనిర్ణయమునకప్పగించి, మన ప్రయత్నములు మనము సేయవలెను. కావున నీవలన మా వంశము పవిత్రమయ్యెనని బంధువులు సంతోషించెదరు. అందువలన నీవావిశ్రవో బ్రహ్మను ప్రేమించి మాకోర్కెలను నెరవేర్చుమని సుమాలి తన కుమార్తెయగు కైకసిని ప్రార్థించెను.

తన తండ్రి ప్రార్థనను కైకసి విని నమస్కరించి సిగ్గుతో తలవంచుకొని అటులే కానిమ్మని చెప్పుచుండిన కుమార్తెను సుమాలి ఆశీర్వదించి విశ్రవో బ్రహ్మ వద్ద కంపివేసెను. తరువాత కైకసి విశ్రవో బ్రహ్మ ఆశ్రమమునకు బోయి ఆయన యెదుట నిలిచి, తలక్రిందికి వంచుకొని తన కాలి బొటనవ్రేలితో నేలను గీయుచు నిలబడి యుండెను.

విశ్రవో బ్రహ్మ ఆమె రూపలావణ్యములను జూచి ఆయన హోమ కార్యములు తీరిన వెనుక కైకసిని జూచి తరుణీ నీవెవతెవు? నీకు తోడుగనొక కన్యనైనను దీసకొనిరాక ఒంటరిగా నీవెందుకిటు వచ్చియున్నావు. నిన్నెవరైనా ప్రేరేపించి పంపియున్నారా! నీవే వచ్చి యున్నావా? ఉన్నదున్నట్లు దెల్పుమని విశ్రవో బ్రహ్మ అడిగెను. కైకసి నమ్రతతో ఆయనకు సమస్కరించి స్వామి! నేను సుమాలి కుమార్తెను. నా పేరు కైకసి, మా తండ్రి గారి ప్రేరణతో నిచటికి వచ్చి యున్నాను. మీ పాద సేవ గావింపుచు నేను మీ చెంతనే యుండి పోవుటకు వచ్చియున్నాను. నా మనస్సునెఱిగి నన్నాదరింపుమని కైకసి కోరి యూరకుండెను.

## రావణ, కుంభకర్ణ, విభీషణుల జననము

విశ్రవో బ్రహ్మ మగువా! నీ మనస్సులో గల నీ కోరికను నేను తెలిసికొంటిని నా వలన సంతానము పొందవలెనను కోరికతో నీవిటకు వచ్చియున్నావు. కానీ సాయంసమయమున నీవు నన్ను చూచి నాతో మాటలాడితివి నీ కోరిక దెలిపితివి. అందువలన కాలదోషము యొక్క ప్రభావము వలన నీకు పాపాత్ములైన రాక్షసులు సంతానముగా కలుగగలరని దెలిపెను. అందులకామె భయపడి నమస్కరించి ఓ పాపమేలేని పుణ్య మహాత్మా! బ్రహ్మ సంతతిలో నీవు మూడవ బ్రహ్మవు. మునీంద్రులందరి చేత పూజింపబడు వాడవు. అట్టి నీవీర్యమునకు పుట్టిన బిడ్డలు మాంసమును దిను రాక్షసులై, దుర్మార్గులై సాధువులకు విరోధముగా నుండుట న్యాయమా! మంచి గుణములు గలవారు, నీతో సమనులైన వారిని దయ సేయుమని ప్రార్థించెను.

అది విని విశ్రవో బ్రహ్మ ఓ జవ్వనీ! బ్రహ్మనిష్టయందు నాతో సమానుడు, రూపమునందు నీతో సమానుడుగా నుండి అతని వలన కులమునుద్ధరింపబడుటకు ఒక్క కుమారుడు కలుగగలడు అని జరుగబోవు భవిష్యత్తును దెలిపి యామెకు గర్భాదానమును గావించెను.

కైకసి గర్భమును ధరించి, ప్రసవసమయమాసన్నమయ్యెను. ఆ సమయమున పదునాల్గు భువనములు ( భూలోక, భువర్లోక అను పదునాల్గు పేర్లు గల లోకములు) కంపించు చుండెను. కుబేరుని గుండె గుభుళ్ళు మనెను. శని, రాహు, కేతువులుచ్చ స్థానమందుండిరి. దుష్టగ్రహములూరక విడువవుకదా? ఆ సమయమున పిడుగులు బడునప్పుడు గర్జించు మేఘముల వలె శబ్దములుద్భవించెను. ఆ పుట్టుచున్న శిశువు ఎఱ్ఱని రంగు, పది తలలు పొడవైన కోఱపల్లులు, బండ్ల కందెన వంటి

వెంట్రుకలు, పెదవులు, అగ్ని గోళముల వంటి కన్నులు, పెను మంటల వంటి నాలుకలు, ఇరువది చేతులు వికృతాకారముగా చూచుటకు సహింపరాని దేహముతో పాలసముద్రములో కాలకూట విషము బుట్టినట్లు కైకసి గర్భమునుండి యొక ఉగ్రరూపుడు జననమయ్యెను.

ఆ రాక్షసుడు పుట్టునప్పుడు గ్రుడ్లగూబలు ఘోరముగా కూసెను. మేఘములు రక్తమాంసములను వర్షించెను. భూత, ప్రేత, పిశాచములు అట్టహాసము గావించెను. దేవతలు దిగులుపడిరి. నక్కలు నిప్పులు గ్రక్కెను. సూర్యకాంతి శోభదప్పెను. దిక్కులు ధ్వనించెను. ఇట్టి విపరీతముగా నొక్క కుమారుని కైకసి కనెను. విశ్రవోబ్రహ్మ కైకసి కుమారుని గన్న సంగతిని దెలిసికొని అచటకు వచ్చి ఆ శిశువునకు దశగ్రీవుడను నామకరణము గావించెను.

మరికొంతకాలమునకు కైకసి గర్భమున తరువాత బ్రహ్మాండము బ్రద్దలు జేయజాలిన బలవంతుడు కుమారుడుగా బుట్టెను. వానికి కుంభకర్ణుడని పేరు బెట్టిరి. మరలా కొన్నాళ్ళకు కైకసి గర్భమున ఆడ శిశువు జన్మించెను. ఆ శిశువుకు శూర్పణఖయను పేరు బెట్టిరి.

తరువాత కైకసి గర్భమున రతనాల వంటి మంచి సుగుణములు గలవాడును, ఇంద్రియ సుఖములయందు నియమవంతుడును, సాధుజనులను పోషించువాడును, విద్యావంతుడును, విశ్రవు కాలమునకు హితమైన ఆచారము గలవాడును, సమస్త జీవులయందు దయగల వాడును, అగు కుమారుడు పాలసముద్రములో చంద్రుని వలె జన్మించెను. ఆ కుమారునకు విభీషణుడను పేరు బెట్టిరి.

ఇట్లు కైకసి కడుపున పుట్టిన కుమారులు ముగ్గురకును విశ్రవోబ్రహ్మ వేదోక్తముగా జాతకర్మలు జరిపి ఉపనయనాది సంస్కారములు తండ్రి వలనే జరుపబడి విద్యలు కూడా ఆయన వలననే నిర్వర్తింపబడెను. ముగ్గురు కుమారులును ముగ్గురు సూర్యుల వలె దినదినాభివృద్ధి జెందుచుండిరి.

## దశగ్రీవ, కుంభకర్ణ, విభీషణుల బాల్యక్రీడలు

ఆ కుమారులు ముగ్గురును బాల్యమునందాటలాడు కొనునప్పుడు దశగ్రీవుడు తమ భుజబలముతో ఒక తాకు తాకెనేని కొండశిఖరములు బంతులవలె పైకెగిరిపోవును. ఆకాశమున విమానాలు బోవుచుండగా చూచి

తూనీగను బట్టినట్లు ఆ విమానముల తోకలను బట్టి త్రిప్పినేలకు గొట్టి యఅచుచు సంతోషించెడు వాడు. మునీశ్వరులుండెడు ఆశ్రమములకు బోయి అచట చల్లగా నీడ నిచ్చెడు వ్రూనులను ఊపి పడద్రోచి మునులను ఎగతాళి జేయుచు కేరింతలు బెట్టి నవ్వుచుండెను. శరభమృగములను, సింహములను, మదపుటేనుగలను పట్టి తెచ్చి బారులుగ కట్టివేయుచుండెను. గరుడ, గంధర్వ, పన్నగాదులను జూచి మీతో నేను యుద్ధము సేయవలెనని పిలువగా వారు భయపడి పారిపోవుచున్నను తరిమి పట్టి ఆనందించెడు వాడు.

## కుంభకర్ణుడు

భూమికి మూలస్థంభముల వంటి కులపర్వతములను, అష్ట దిగ్గజములను, ఆది వరాహమును, ఆది శేషుని, ఆది కూర్మమును జతికిల బడునట్లు తమ పాదములను బెట్టి నడచునప్పుడన్నియు తసకలబడుచుండెను. సూర్యుని రథమును బట్టి నిలవేసి రవిబింబమును నాలుకతో నాకి వదలెడువాడు. అతడు చేతులుజాచినప్పుడు సురేంద్ర పట్టణముల నుండి అష్టదిక్పాలుర పట్టణముల ఇంటి ముందు గల ఉద్యానవనములను ఊగిసలాడించెడువాడు. ఆకసమున బోవు విమానములను చప్పున నోరు దెరచి లోనికి బోనిచ్చి సరాన దిగమ్రింగెడువాడు. గుఱ్ఱుపెట్టి నిదురించును. నడచునప్పుడు కొండవలె కనిపించును.

## విభీషణుడు

సాధుసద్గుణ సంపన్నుడితడు. మంచి వ్రతములాచరించుచు, తండ్రి దెలిపిన ప్రకారము వేదపారాయణము గావించుచు. వేదార్థములు వినుచుండును. ఇంద్రియ నిగ్రహము దయగలవాడై సమస్త ప్రాణులకు ఉపకారము జేయుచుండను. మృదు స్వభావము గలవాడై తమకుల ధర్మము ననుసరించి తిరుగుచుండును.

దయలేని దశగ్రీవ, కుంభకర్ణులు మునీంద్రులను బట్టి బాధించు నప్పుడు వారికడ్డుపడి నన్ను జూచియైనను వారిని విడువుమని ప్రాథేయపడి విడిపించెడి వాడు. కుంభకర్ణుని చేతిలో జిక్కగా విభీషణుడడ్డుపడి విడిపింపగా బ్రతికిపోయిన మునీశ్వరు లెందరో గలరు.

అందువలన మునీంద్రులు విభీషణుని సాధు స్వభావా నీవు సూర్యుడు, చంద్రుడు, చుక్కలున్నంత వరకు సుఖోజయముగా చల్లగా జీవింపుమని ఆశీర్వదించిరి.

వీరీవిధముగా పెరుగుచుండిరి. కుబేరుడొకనాడు పుష్పక విమానములో తన తండ్రియైన విశ్రవో బ్రహ్మను జూచుటకు యాశ్రమమునకు వచ్చెను. అప్పుడు కైకసి ఆ విమానము యొక్క అందచందములను చూచి ఓర్వలేక దశగ్రీవునకు దానిని జూపి కుమారా! యక్షుల కధిపతియగు మీ అన్న కుబేరుడు, పుష్పక విమానమునెక్కి తమ తండ్రిని చూడవచ్చెను. అతని సౌభాగ్యమును చూడుము. నీవు నీయన్నకు మించిన భోగభాగ్యములు గల వాడవై యుండునప్పుడు నిన్ను చూచి ఆనందించవలెనని నాకు కొరికగల్గుచున్నది. కావున నేను చెప్పినట్లు నీవు చేసితివేని శీఘ్రముగా భాగ్యవంతుడవు కాగలవు. బలహీనుని వలెనిట్లూరకుండ వలదని హెచ్చరించినది. అది విని దశగ్రీవుడీ విధముగా తల్లికి ప్రతినగావించెను.

అమ్మా! నేను ఘోరతపము గావించి, బ్రహ్మ దేవుని మెప్పించి ఆయన వలన వరములు బొంది ఈ కుబేరునకున్నంత వైభవమును మించునట్లుండెదను. అట్లు కాదేని నా పరాక్రమముతో కుబేరునకు సమానమగు ప్రభుత్వమును స్థాపించెదను. అతని కంటే ఎక్కువ గలవాడనై నీ వద్దకు వచ్చెదను. అంతకంటే తక్కువగా రాను తమ్ములతో గలసి వెళ్ళెదను దీవించుము అని తల్లిని శెలవుగోరెను. కైకసి నాయనలారా! మీరు శుభప్రదముగా బోయి విభవముతో తిరిగి రండని యాశీర్వదించెను. తల్లికి కుమారులు సాష్టాంగ దండ ప్రమాణమములాచరించి తమ్ములగు కుంభకర్ణ, విభీషణులతో కలిసి దశగ్రీవుడు గోకర్ణమను పవిత్రస్థలమునకు బోయి చేరిరి.

## దశగ్రీవాదులు బ్రహ్మను గూర్చి తపంబు సేయుట

గోకర్ణాశ్రమము చేరి దశగ్రీవుడు తమ్ములగు కుంభకర్ణ, విభీషణులను జూచి ఓయీ! తమ్ములారా! బ్రహ్మదేవుడు చాలా దయాళువు. అయనను గూర్చి మనము తపస్సు కావింతము. మన మీద కరుణించి మనము కోరిన వరములియ్యగలడు అని తమ్ములకు తెల్పి తపస్సు సేయవలసిన విధానమును వివరించి వారి నందులో నియమించి దశగ్రీవుడు తపస్సు ప్రారంభించెను.

## దశగ్రీవుని వీరహోమము, తపస్సు

దశకంఠుడు శాంత చిత్తుడై తన చుట్టును అగ్నిని రగుల్కొల్పుకొని ఎండాకాలములోను, వర్షాకాలము నందు వాగుల యందును గాలి కాలములో, పర్వతశిఖరముల యందును, మంచు కాలములో చలువ రాళ్ళ మీదను నుండుచు తపస్సు కావించెను. అదే విధముగా కుంభకర్ణుడు కూడా తపమాచరించెను. ఈ విధముగా వీరిద్దరును పదివేలేండ్లు తపస్సు గావించిరి.

వారే విధముగా తపస్సు జేసిరనగా తమ రెండు కన్నుల వద్దచూపులను, భ్రూమధ్యము (రెండు కనుబమ్మల మధ్య) పై భాగమున నుదుట (చుక్క బెట్టు చోటునకు) అరకన్ను మూతలతో కనుగ్రుడ్లను భ్రూమధ్య స్థానములో చూచుచు దృష్టిని నిలిపి సమస్త జీవుల యందును దయగలవాడై, ఇంద్రియములను విషయముల మీదికి పోనీయక (అనగా మనస్సును కోర్కెలయందు పోనీయక) ద్వంద్వములను ఓర్పుతో సహించి తమ హృదయ కమలము నందుండు బ్రహ్మను శోధించుచు ఒంటి కాలుపై నిలబడి విభీషణుడైదు వేల సంవత్సరములు తపస్సు గావించెను. మరియొక ఐదువేల సంవత్సరములు చేతులు పైకెత్తుకొని తెఱచిన కన్నులను మూయక సూర్యుని వైపు జూచుచు తపస్సు గావించెను. విభీషణుడు తపము సేయుచున్న ఆశ్రమము నందు జాతి విరోధము మరచి ఎలుకలతో పిల్లులాడుకొను చుండును. నెమళ్ళ పాములతో కలసి పొరాడుచుండును. ఏనుగులతో సింహములును, గండబేరండ పక్షులతో శరభమృగములును కలిసి మెలిసి ఆడుకొనుచుండును. ఆ విభీషణుని తపస్సును దేవతలు జూచి సంతోషించి విభీషణునిపై పూవులను కురపించిరి అని అగస్త్య మునీంద్రుడు శ్రీరామునితో చెప్పుచుండగా సభలో గల వారందరును వినుచుండిరి.

మరలా అగస్త్య మునీంద్రుడు కథను ప్రారంభించెను. ఓ రామచంద్రా! దశగ్రీవుడు గావించిన తపో విధానమును వినుము.

అతడు సమస్త లోకవాసుల కంటె ఎక్కువ మహిమను సంపాదించవలెనని బ్రహ్మ దేవుని దేవతగా దలచుచు బ్రహ్మ మంత్రమును జపించుచు అన్నాహారములను వదలి, నిరాహారుడై, ఒకకాలిబొటన వ్రేలిపై నిలబడి సూర్యుని వైపు జూచుచు తన హృదయాకాశమునందు బ్రహ్మదేవుని రూపమును చిత్రించుకొని వేయిసంవత్సరములు ధ్యానము గావించెను. తరువాత వీరహోమాగ్నిని వెలగించి కత్తితో తన తలనొకదానిని తెగగోసి హోమగుండములో వేసి బ్రహ్మార్పణమంటూ

దశగ్రీవుడుచ్చరించుచు తపమాచరించెను. ఇతరులు ఇతర జంతువుల తలలను నఱికి హోమములో వేసి వ్రేల్చుదురు గాని దశగ్రీవుడట్లు గాక తన తలనే నఱికి కుండములో వేయుచు తలమేథయాగమును గావించెను. ఆ దశగ్రీవుడందరివలె గాక విరుద్ధమైన ఆచారము గలవాడై వెయ్యేండ్లకొకసారి తన తలను అగ్నిలోవేసి హోమము సేయుచుండగా ఆ తలలు కాలినప్పుడు పటపటార్భటులతో శబ్దముజేయుచు పగులుచుండెను. ఆ శబ్దము బ్రహ్మాండము నిండిపోయెను. ఆ తలలగ్నిలో కాలుట వలన అందుండి ఆజ్యమునకు బదులుగా మేధోమాంసము కాలి నూనెగా మారుచు మండుచుండెను. ఆ మంటల నుండి పొగదట్టముగా బయలుదేరి రాబోవు కాలమునందు ఈ విధముగా దశగ్రీవుడు బాణములు వేయగా పుట్టిన అగ్నిజ్వాలలు మిమ్ము చుట్టుకొనగలవని సూచించెడు విధమున దశగ్రీవుని హోమము నుండి వెలువడిన పొగలుబోయి దేవేంద్రుని పట్టణమును చుట్టుముట్టెను.

హోమగుండములో వేయబడిన తలలు మాడి రక్తమాంసములును, మెదడును, ఎముకలును కాలి ఆ కుండములో నుండి భరింపరాని కంపు గొట్టుచు, చెడు వాసన భూమి నుండి ఆకసమంతయు నిండిపోవుట వలన ఆ వాసనను భరింపజాలక, ఈ దశకంఠునకు వరములొసగి లోకములకి కీడును తొలగింపగలడని ఆకాశమార్గమున బోవు దేవతలను కొనుచుండిరి.

ఇట్లు దశగ్రీవుడు వెయ్యేండ్లకొక తలచొప్పున తొమ్మిది తలలుపూర్తియై పదియవ తలను కోయుటకు యత్నించి కత్తిని తన పదియవ తలగలమెడ మీద బెట్టెను. ఆ సమయమునభయంకరమైన శబ్దములు బుట్టెను. సుడిగాలులు దిరిగెను. సముద్రములింకినట్లయ్యెను మేరువు భూమిలోనికి గ్రుంకుచుండెను. భూమికుమ్మ రిసారెవలె గిరగిర దిరిగెను.

మగ వారికే మగడగు నా దశగ్రీవుడు తన పదియవ తలను కుండములో వేయుటకు బ్రయత్నించినప్పుడు రగుల్కొల్పిన అగ్నికుండము నుండి మంటలెగయుచుండగా దేవేంద్రాది దిక్పాలురు భయపడి అందరును గలిసి బ్రహ్మయొద్దకు బోయి బ్రహ్మతో! స్వామీ! మేము భయముతో మీ వద్దకు వచ్చి యున్నాము. దశగ్రీవుడనే రాక్షసుడు మిమ్ము గూర్చి తపస్సు జేయుచు హోమగుండము నందు తన తలనే కోసివేయుచు తలమేధ హోమమును జేయుచు తన తొమ్మిది తలలను పూర్తిజేసి ఇప్పుడు పదియవ తల మీద కత్తి బెట్టి యున్నాడు.

ఆ తల గోసినచో లోకములేమి కాగలవో చెప్పజాలము. అందువలన, మీరు పోయి ఆ సాహసవంతుని తలను నిలిపి వేసి, అతడు కోరెడు వరములు దయసేయుడు. అతనికి వరములివ్వకున్నచో తరువాత వచ్చెడి బాధలను గూర్చి ప్రార్థించిరి. బ్రహ్మ దేవతలతో కూడి దశగ్రీవుని వద్దకు వచ్చి బ్రహ్మ తన చేతితో అతని చేతిని బట్టుకొని దశగ్రీవా! సాహసింపకుము, నీవు గావించిన తలమేధయాగ తపంబునకు మెచ్చితిని, నీకు వరములీయ వచ్చితిని. నీకేమి వరములు కావలెనో కోరుకో అనెను. అది విని రావణుడు తన యిరువది చేతులు జోడించి కంఠము గాద్గదికము చెందుచుండగా బ్రహ్మదేవుని యెదుట వినయ విధేయతలు గలవాడై, ఆయనననేక విధములుగా ప్రార్థించి కడపట స్వామీ! దేవ దేవా! జీవ కోట్లకు శుభములు గాని అశుభములు గాని నీ వలననే కలుగుచున్నవి. అవి దేవతలకు గాని నరులకుగాని, రాక్షసులకుగాని, నీవే ఇచ్చుచున్నావు. (బ్రహ్మవ్రాత అంటున్నారు కదా) అందువలన మీకు నేనొక విన్నపము జేయుచున్నాను.

అదియేదనగా పుట్టిన ప్రతి ప్రాణియు చావంటే భయపడుచున్నది. అట్లగుట వలన ప్రతి ప్రాణికి శత్రువు మృత్యువే కదా? ఆ మృత్యువు భయము నాకుండ కూడదు. ఆ చావు తనంతట తానుగా రాదు. ఏదోయొక శత్రువు రూపములో విరోధి రూపములో సంభవించుచుండును. ఆ విరోధులెవరనగా –

గరుడ ఖేచర రాక్షస మరుత్త గంధర్వ విద్యాధరుల చేతను, విబుధ యక్ష కిన్నెర గంధర్వుల చేతను, పిశాచ ప్రేత భూతాదుల చేతను, పన్నగ నవగ్రహ విశ్వసిద్ధుల చేతను, వసు రుద్ర దేవ దానవుల చేతను, మృగముల చేతను, యుద్ధములందు నాకు చావు కలుగకుండ జీవించునట్లును, నేను సకల మర్యాదలతో, సంపదలతో ఏవెలితి లేక జీవించునటుల నాకు వరములు దయసేయుము అని దశగ్రీవుడు బ్రహ్మదేవుని ప్రార్థించెను.

బ్రహ్మదేవుడందుల కంగీకరించి తథాస్తు! అని దశగ్రీవు నాశీర్వదించి, అతడు కోరిన వరములన్నింటిని బ్రహ్మదేవుడివ్వగా దశగ్రీవుడు ఇది వరకు తన తలలను కోసి అగ్ని కుండములో వేసి ప్రేల్చి కాలిపోయి యుండిన తొమ్మిది తలలను మరలా యథాప్రకారము మొలిచివచ్చెను. ఇక నీవు కోరిన వన్నియు అనుభవింపుము. ఈసమస్త లోకములందును నిన్ను జయించు వాడు లేడను కీర్తిని సంపాదింపుము అని దశగ్రీవుని తృప్తి పరచి అతడిచ్చు మర్యాదలందుకొని బ్రహ్మదేవుడు వెడలిపోయెను.

## రావణ, కుంభకర్ణ, విభీషణులకు బ్రహ్మ ప్రత్యక్షమై వరములిచ్చుట

దశగ్రీవునకు కోరిన వరములన్నింటిని వెలితి లేకుండా యిచ్చి అక్కడ నుండి చతుర్ముఖుడు దేవ గణాదులతో కదలి విభీషణుని వద్దకు వచ్చి అచట సమస్త ప్రాణి కోట్ల క్షేమమును గోరి తపమాచరించుచున్న విభీషణునకు ప్రత్యక్షమై కుమారా! సమస్త జీవుల మేలు గోరు స్వభావము గల నీ వంటి వాని నిదివరకు నేను చూడలేదు. అందరు, తన స్వార్థము కొఱకు తపము గావించి, మా నుండి వరములను పొందియున్నారు. నీ వటుల గాక సమస్తలోకాః సుఖినో భవంతు అను న్యాయము ననుసరించి తపస్సు గావించు చున్నావు. అందువలన నిన్ను మెచ్చి నీకు వరములీయ వచ్చి యున్నాను. నీకు కావలసిన వరములను కోరుమని విభీషణునితో బ్రహ్మదేవుడు బలికెను.

యోగిపైన వాడింద్రియముల నంతర్ముఖంబు జేసి, తనలో గల తత్త్వమును దెలిసికొనుచు దశ విధ నాదములను వినునప్పుడెంత ఆనందముగా నుండునో, బ్రహ్మదేవుని వాక్కులు వినిని విభీషణునకంత యానందము గలిగెను. వెంటనే ఓ విమలస్వాంతా! జన్మరహితా! దయానిధీ! శాంతమూర్తి! అనంతా! మీకిదే నా నమస్కారములు అంటున్న విభీషణుడు సూర్యుడు తన కిరణములతోను, అగ్ని తన మంటలతోను, చంద్రుడు తన కళలతోనువెలుగుచున్నట్లు, మంచి గుణములతో ప్రసిద్ధి బొందిన, లోకకర్తవు, నీవే నా వద్దకు వచ్చి నీకు వరము లిచ్చెదననుటచే, నేను కోరినది పొందినవాడనైతిని. ఐనను మీ దర్శనముగలుగుట మహాద్భుతము. స్వామీ! అన్నిటికన్నా భయంకరమైన ఆపదయొకటున్నది, ధర్మము దప్పి ప్రవర్తించుట. కావున అట్టి ధర్మము నుండి మనస్సును తొలుగనీయక ధర్మ మార్గమునందే బ్రవర్తించునటుల నాకు వరమును బ్రసాదింపుము. ధర్మము తప్పని వాడేయాశ్రమములో నుండినను విజయుడే కావున నా హృదయమెల్లప్పుడును, ధర్మమును తప్పకుండునటుల వరమును ప్రసాదింపుము.

మఱియు నాకు శిక్షణ లేకనే నా మనస్సునకను కూలముగా నుండునట్లు బ్రహ్మాస్త్రమును ప్రసాదింపుము అని విభీషణుడు బ్రహ్మదేవుని వేడగా నతని బుద్ధి కుశలతకు మెచ్చుకొని విభీషణుడు కోరిన విధముగనే వరములనిచ్చెను.

**బ్రహ్మదేవుడు:** నాయనా విభీషణా! నీవు రాక్షసయోనియందు పుట్టి యుండియు రాక్షస గుణములు లేని వాడవై యున్నావు. నా వెంట నుండెడు దేవతలు కుడా నీతో సమానులు కాజాలరు. నీ మాటలు వినుట వలన నా

మనస్సునకు చాలా తృప్తిగల్గుచున్నది. అందువలన నేను నీకు దేవత్వమును, మంచి శీలమును బ్రసాదించితిని. నీవిక మీదట దేవతలలోను, రాక్షసులలోను, గొప్పవాడవై జీవింపుమని బ్రహ్మదేవుడు విభీషణునకు వరములు బ్రసాదించెను. విభీషణునకు తక్షణమే దేవత్వము గల్గెను. అతనిని జూచి దేవతలందరును సంతోషించిరి.

## సరస్వతి తోడ్పాటుచే బ్రహ్మ కుంభకర్ణునకు నిద్ర వరముగా నిచ్చుట

బ్రహ్మదేవుడు, దశగ్రీవ, విభీషణులకు వరములిచ్చి, కుంభకర్ణుని చెంతకు బోవుచుండెను. దేవతలందరును బ్రహ్మదేవునకడ్డుపడిరి.

స్వామీ నీవిప్పుడు కుంభకర్ణునకు వరములియ్యకూడదు. ఏ వరములు గానీ అతనికి లేకనే, అతని ధాటికి లోకములల్లాడి పోవుచున్నవి. అతడు తన నోటిని తెఱచిన బ్రహ్మాండాన్నే మ్రింగి వేయగలడు. అతడు నడచునప్పుడు ఆయడుగుల తాకిడికి క్రింది లోకములు కలత జెంది అదురుచున్నవి. నిఱ్ఱున నీల్గితే అతని తల దగిలి పైలోకములు పటపటలాడుచు పైకి బోవుచున్నవి. అతడు సంతోషపడి శరీరముబ్బించితే దిక్కులు పిక్కటిల్లుచున్నవి. అతడు కేరింత బెట్టి నవ్వితే త్రిమూర్తులైన మీకే దిగులు గల్గుచున్నది. మా బోటులమాట చెప్పనవసరమే లేదు. కావున వాడు మాకిది వరకు బెట్టిన కష్టములు వినండి.

అమరావతిలోని నందనవనములో దేవేంద్రునితో కలిసి తిరుగుచుండిన, వారిని చేయి జాచి పట్టి చంపియున్నాడు. నరులను, మునులను, తపస్సంపన్నులను బట్టి చప్పున దిగమ్రింగి యున్నాడు. తనకంఠ కావరముతో ప్రపంచమున గల వారినందరిని కష్ట పెట్టి యున్నాడు. కావున కుంభకర్ణుని పై దయదలచవద్దు, వానిపై నీ మాయనుపయోగించి వాడేదైనా పనికి మాలిన వరములను కోరునట్లు జేసి వాని ధాటికి గుఱికానీయక నీవీలోకములనుద్ధరింపుము అని దేవతలు బ్రహ్మదేవుని బ్రతిమాలిరి.

బ్రహ్మదేవుడపుడు సరస్వతి వైపు సాదరభావముతో జూచి వాగ్దేవీ, నీవందరి వాక్కులలో నుండి మాటలాడించు మహాశక్తివి. అందువలన నీవు కుంభకర్ణుని నాలుకయందుండి వానిని యేదైనా నొక పనికి మాలిన వరమును కోరునటుల జేయుమని బ్రహ్మదేవుడనగా సరస్వతి ఆయనకు నమస్కరించి పోయి కుంభకర్ణుని నాలుక యందు నిలచి యుండెను.

బ్రహ్మదేవుడు కుంభకర్ణుని వద్దకు బోయి నిలచి, కుంభకర్ణా! లెమ్ము నీకేమి వరము కావలెనో యిచ్చెదెను. కోరుమనగా అతడు బ్రహ్మకు నమస్కరించి స్వామీ!

నాకు ఆరునెలలకొకమారు భోజనము, ఆరునెలలు నిద్రయును ప్రసాదింపుమని కోరెను. బ్రహ్మదేవుడు తథాస్తు! అనివరమొసగి తన పరివారముతో బ్రహ్మ లోకమునకు వెళ్ళెను. బ్రహ్మదేవుడు వెళ్ళిన తర్వాత కుంభకర్ణుడు తాను కోరిన వరములను దలచుచు అయ్యో బ్రహ్మదేవుడే నా దగ్గరకు వచ్చి, నీకు వరము లిచ్చెదను కోరుమనగా నిద్రనిమ్మని కోరెడు వాడెవడైననుండునా? ఐనను ఈ పలుకులు నా నోటి నుండి నాకు తెలియకనే వచ్చి యున్నవి. ఇదియేమై యుండును. ఓహో దీనికంతటికిని దేవతలే కారణమై యుండవచ్చును. ఈ వికల్పపు కోరిక నానోట బలికించిరి. మించిన పనికి యోచింపవలసి వచ్చుచున్నది. నా దురదృష్టము నన్నీ కోరిక కోరునటుల గావించినది. పౌరుషమునకు దైవము ఫలమునిచ్చు చుండునని ఆర్యులు చెప్పుచుందురు. కాని ఆ దైవమే విరోధియై ప్రవర్తించినప్పుడు పురుషుడేమి సేయగలడు. దేవుని దయకోల్పోయిన వాడు మంచి త్రోవ వెదకికొని పయనించినను అది చెడు త్రోవగా మారగలదు. కావుననేనెందుకిక జాలిజెందవలెనని వ్యసన పడుచుండెను.

కుంభకర్ణుడిట్లు తనలో తాను మథన పడుచుండగా అచటికి అన్నయగు దశగ్రీవుడు తమ్ముడైన విభీషణుడు గుంభకర్ణుని వద్దకు వచ్చిరి. కాని కుంభకర్ణుడు పరధ్యానముగా నుండెను. వీరలిదంతయు తెలిసికొని దైవము నిన్నీవిధముగా మోసగించెను. కావున ఇందులో నీ తప్పేమియులేదు. నీవు ఇంగితము దెలియని పామరుడవు కాదు. నీవిక వ్యసన పడియు లాభము లేదని వారతనికి ఊరడింపు మాటలు దెలిపినందు వలన కుంభకర్ణుడామనోవేదన నుండి తేరుకొనెను. ఓ రామచంద్రా! దశగ్రీవుడీ విధముగా తమ్ములతో గలసి శ్లేషాత్మకమను వనమునకు బోయి చేరిరి.

## సుమాలి ప్రముఖులు రసాతలము నుండి వచ్చుట

ఓ రామచంద్రా! విను. దశగ్రీవుడు బ్రహ్మ వద్ద వరములను సంపాదించుకొని వచ్చి శ్లేషాత్మక వనములో నున్నారని తెలిసికొని సుమాలి అతనిని చూచుటకు కొంతమందిరాక్షసులతో గలసి, రసాతలము నుండి శ్లేషాత్మక వనములోనికి వచ్చుచుండెను. సుమాలివచ్చుచున్నాడని తెలిసి దశగ్రీవుడు తన తమ్ములను వెంట బెట్టుకొని వారికెదురు బోయి వారిని పూజించి నిలిచెను.

సుమాలి నాయనా దశగ్రీవా! నీవు బలవంతుడవు. వంశకర్తగా మాకు గల్గితివి మేమింత వరకు విష్ణువుతోను, గరుత్మంతునితోను భయపడి లంకను విడచి

రసాతలములో తలదాచుకొని జీవించిన రాక్షసులందరికిని నేటి నుండి దిగులు దీరినది. ఇక రాక్షస జాతికంతటికిని నీవే ప్రభువు. అందరును యజ్ఞములు చేయునప్పుడు హోమగుండమున కట్టెలు వేసి, నేయి బోసి, దానిని బ్రహ్మార్పణ మన్నారేగాని, నీవలె తన తలలను గోసి కుండములో వేసి హోమము వ్రేల్చిన ధీరులెవ్వరును లేరు. భృగు మహర్షి కోపముతో తన రొమ్ముపై దన్నగా అతనినేమన జాలక వాని పాదములు బిసికిన విష్ణువునకు రాక్షసులమైన మేము భయపడి, ఆ విష్ణుని పాదములను బట్టవలసివచ్చెను. అట్టి రాక్షసులకు కల్గిన భయమీనాటితో పటాపంచలైనది.

నాయనా! దశకంఠా! నీవు బలవంతుడవు. వంశకర్తవు కాగల్గితివి.

ఇక నీతో దాపరికమెందుకు? ముందునాచే ప్రేరేపింపబడి విశ్వకర్మచే నిర్మితమైన లంకానగరము చాలా సుందరముగా మన కొరకే నిర్మింపబడి యున్నది. ఆ పట్టణమును మీరేల విడచితిరనగా, చెప్పెదను వినుము. పూర్వము మేమన్నదమ్ములను ముగ్గురము, మా భుజబలశౌర్యములతో ముల్లోకవాసులను గెలిచి అందరినీ బాధించుచుంటిమి. వారాబాధల కోర్వలేక, దేవతలు బోయి విష్ణుదేవునకు చెప్పుకొనగా ఆయన వారికభయమిచ్చి, దేవతలను బాధించెడు మాపై యుద్ధమునకు వచ్చి మాలో మాలి అను వానిని చంపి, మమ్మందరినీ జయించెను. అప్పుడు మేము మా నివాసస్థానమగు లంకలోనికి పోబోగా ఆ విష్ణువు పోనీయక కర్ధుపడి మమ్మందరిని దొడ్డికి దోలెడు పశువుల వలె తరుమగా మా బిడ్డలతో, భార్యలతో నందరము గలిసి యీ భూమి క్రింద గల రసాతలములో బ్రవేశించితిమి. ఆ దినము నుండి యీ దినము వరకును మేమిక్కడ తలదాచుకోగా లంకానగరము పాడుబడెను.

ఆ తరువాత మీ అన్నగారగు కుబేరుడందులో చేరి కాపురమున్నాడు. కావున నీవు ఆయనను దానమడిగి గాని లేక సామాద్యుపాయములలోనేయుపాయము చేతనైనను లంకను దీసికొనుము. తన సొత్తు ఇతరుల చేతిలోనికి పోయినప్పుడు మరలా వారి నుండి తీసికొనుట తన బంధువులు భయముజెంది. ఆపదలో నుండునపుడు వారి భయమును తొలగించి రక్షించుట, తన నిజకుల ధర్మములను నిలబెట్టుకొనుట బలవంతుని ధర్మము. దానికి ఫలితమని చెప్పుదురు.

చేయి వలన కంకణము, కంకణము వలన చేయి, అందగించినట్లు నీవు లంకా పట్టణము వలనను, లంకాపట్టణము వలన నీవును ప్రకాశించెదరు అని

సుమాలి చెప్పగా విని దశకంఠుడు, తాతగారు మీరు చెప్పెడి దంతయు నిజమే యైనను ఎంత పెద్దవాడైనను, అన్నయగు వానిని నీతి గలవాడు దుర్మార్గముగా బలవంతముగా ఇంటి నుండి వెడల గొట్టి ఆ యిల్లును స్వాదీనము చేసికొనవచ్చునా? నీవంటి వారే యీవిధముగా బోధించినప్పుడు మా వంటి వారికి బుద్ధి నిశ్చలతయెట్లు కుదురును అని సుమాలి జేసిన దుర్బోధకతడు సమ్మతించక, ప్రతి వచనము జెప్పియూరకుండెను. అటు తరువాత ప్రహస్తుడొకనాడు తగిన సమయమును కనిపెట్టి దశగ్రీవునకు చెప్పబూనెను.

ఓ పులస్త్య బ్రహ్మ వంశోత్తమా దశగ్రీవా అన్నదమ్ములపైన మంచితనమును బాంధవ్యమును కల్గియుండవలెననుట యుక్తముగాదు. ఎవడు బలవంతుడో వాడే ముల్లోకాలకధిపతి. ఆ నడతనే ధర్మమనెదరు కానీ కుబేరుని యందు నీకెందుకో మొగమోటము కలుగుచున్నది, కానీ లంకయేమైనా అతని సొత్తా? కాదు గదా! నీవెందులకిట్లు సందేహించెదవు. ఇక వేయి మాటలెందుకు. లంకను గట్టినది మీ తాతగారు. లంకనేలినది కూడా వారే. కానీ లంక మీద కుబేరునకే విధముగా హక్కు గల్గినది. అట్లుగాదు లంకకు రాజొకడే. ఇంత వరకు లంకనతడేలి యున్నాడు. ఇప్పుడు మీ వంతు వచ్చినది. తమ పాలికి వచ్చిన వంతు తామేలుట అన్నదమ్ముల హక్కులే కదా! అన్నను తరిమివేసి ఎంతటి పెద్ద వాడైనను అతని యిల్లు చేరవచ్చునాయని మీ తాతగారితో మీరనుచుండుట నేను విని యుంటిని. అట్లైనచో కశ్యపుని భార్య దితి అను నామె రాక్షసులను గనెను. అదితి అనునామె దేవతలను గనెను. వారిద్దరి బిడ్డలైన దేవతలును, రాక్షసులు అన్నదమ్ములే కదా! మఱి వారన్నదమ్ములైనను, మిత్రులుగా నుండక శత్రువులై యుండిరి కదా నీతో నేను ఎక్కువగా మాటలాడుటకు నాకు భయమగుచున్నది. కానీ నేనొక విషయమును వినిపించెదనాలకింపుడు.

దేవేంద్రుడు రాక్షసులను తన తమ్ములుగా భావించి కాపాడినట్లు నీకెక్కడైనా సాక్ష్యములు దొరకినవా? అవకాశము వచ్చినప్పుడు తానే వారిని కొట్టి తరిమినట్లు సాక్ష్యములున్నవి. రాక్షసుల బలము హెచ్చుగా నుండినప్పుడు వారిని జయించలేక దేవతలు విష్ణుదేవుని శరణువేడి, మమ్ము కాపాడుమని వారిపై విష్ణువునుసిగొల్పి వారిని చంపించియున్నారు. వారీవిధముగా చేయుచుండగా మనమెందుకు భయపడవలెను. మనము కూడా వారివలెనే ప్రవర్తించి దాయాదిని గెలుచుటయే మేలగును. బాగా ఆలోచింపుము అని ప్రహస్తుడు దశగ్రీవునకు బోధించెను.

ఈ విధముగా దశగ్రీవునకు ప్రహస్తుడు బోధింపగా విని ఆలోచించి మీరు చెప్పినదే తగిన విధముగా నున్నదని తాతగారిని గూర్చి మీరు చెప్పినట్లు చేసెదనని మాటయిచ్చెను.

తరువాత దశగ్రీవుడు ప్రహస్తాది మంత్రులు తనను సేవించుచుండగా తనకు లంకగావలెనను కాంక్షతో దక్షిణ దిశకు బోయి త్రికూటమను పర్వతము పై తాముండి తండ్రి సమానుడగు కుబేరుని వద్దకు ప్రహస్తుని బంపుచు నిట్లనెను.

ప్రహస్తా! మా అన్నగారగు కుబేరుని వద్దకు నీవు బోయి, నీవాచానైపుణ్యముతో మున్ను లంకను రాక్షసులేలిన విషయములను దెల్పుము. ఇప్పుడాలంకను మీ తమ్ముడు దశగ్రీవుడు కావలెనని కోరుచున్నాడని తెల్పుము అని ప్రహస్తుని రాయబారిగా బంపెను.

ధనదునివద్దకు ప్రహస్తుడుపోయి ఆయనకు నమస్కరించి స్వామీ! మీ ప్రియమైన తమ్ముడు దశగ్రీవుడు నమ్రతతో మీ క్షేమములను విచారించి తరువాత తమ వృత్తాంతమును తెలియజేసిమీతో ఒకమాట నుడువుమని నన్ను పంపియున్నాడు. ఆయన చెప్పినమాటలను నేనుమీతో చెప్పుచున్నాను.

మన తల్లిగారి తండ్రులు ముందీలంకను గట్టించి యేలి యుండిరట. ఇప్పుడా రాక్షస ముఖ్యులు నావద్దకు వచ్చియున్నారు. ఇది వరకెవ్వరును ఆ లంకలో లేనందువలన ఆ లంకనింత వరకు మీరేలితిరట. ఇప్పుడు వారితో కూడా కలిసి నేను కూడా కొంతకాలమేలవలెనని దశగ్రీవుడు కోరుచున్నాడు. కావున మీతో ఈ కోరికను దెలుపుమని నన్ను బంపియున్నాడు.

మీకు నేనొక యోచన చెప్పుచున్నాను. ఈ పంక్తి కంధరుడు తలమేధహోమము జేసి బ్రహ్మను మెప్పించి మేలైన వరములను పొంది యున్నాడు. అందువలన అతడిప్పుడు గొప్ప వాడైనాడు. అచ్చటి రాక్షసులు మీతో యుద్ధము జేయుటకు సిద్ధముగా నున్నారు. అందువలన అతనితో స్నేహమే క్షేమముగా నుండునని ప్రహస్తుడు జెప్పగా

**కుబేరుడు:** ప్రహస్తా! నేనింకా ఏమోయనుకొంటిని ఇంత మాత్రమునకే ఈ సంకోచమెందుకు. నా తమ్మునకు లంకనిచ్చుట యొక లెక్కగాదు. నా ధనమును నా ఐశ్వర్యమును కాపాడు శక్తి గలవాడు దశగ్రీవుడేయని మాకు తెలియును: ఇక భేద భావమునకు తావు లేదు. ఈ విషయమును నేనై చెప్పవలెనని ఆలోచించు చుంటిని. కాని నా తమ్ముడు తనకు తానుగా వచ్చి నాకిది కావలయునని యడిగినప్పుడు నేనీయకుండుటయా?

ఈ లంకను నేనేలుట కంటే అతడేలుటయే మేలగును కదా! అని తెలిపి ప్రతాపము గల తమ్ముడగు దశగ్రీవుని తన మనస్సులో దలంచి బింకముగా ప్రహస్తునితో ఇట్లు దెలిపెను.

ప్రహస్తా! రాక్షసులతో కలసి మా తమ్ముని రమ్మని దెల్పుము. లంకతో పాటు నా సంపదను కూడా తీసికొనుమని దెల్పుము. అనుమానింపవలదని ప్రహస్తుని వెంట తన దండనాధుని బంపెను.

దశగ్రీవుని వద్దకు కుబేరుడు దండనాధుని బంపి లంకనేలు కొమ్మని తెల్పి ఆ తక్షణమే తన అందమైన విమానమెక్కి ధనదుడు తన తండ్రి యొద్దకు బోయి నమస్కరించి, దశగ్రీవుడు జేసిన చేష్టలన్నియు తండ్రికి దెలిపి, ఇక నా నివాసమెక్కడ? జరుగబోవు కార్యములెట్లు జరుగవలెను? అని ధనదుడు తన తండ్రియగు విశ్రవో బ్రహ్మనడిగెను.

**విశ్రవోబ్రహ్మ :** కుమారా! ఆ దురాత్ముడు జేసిన ప్రయత్నమీ నాటిది కాదు. ఆనాడే వాడు నాతో చెప్పగావిని నేను మందలించితిని. ఈ దుర్బుద్ధి నీకే మూర్ఖుడు నేర్పెనురా! అయ్యారే బలవంతముగా అన్న యిల్లు దోచుకొనియెదవా? నీకింకెక్కడైనా చోటు లేదా? నీతిని విడిచెదవాయని మంచి బుద్ధిని బోధించితిని. పామునకు కట్టి జూపిన విధముగా నేను చెప్పిన బుద్ధి మాటలను వాడులెక్క జేయక కోపము గలవాడై కనులెర్ర జేసుకొని నాతో నేమియు బలుకకవెడలిపోయెను.

కుమారా! నీకొక మంచి విషయమును దెల్పుచున్నాను విను. తండ్రికి తగని కుమారుడున్నయెడల ఆ కుమారునిపై మమకారమును వదలుట తండ్రికి మేలేయగును. అట్లుగాక నీవు జేయు కార్యములు మంచివిగా గ్రహించకబోవుటచే ఈ తండ్రి కూడా ఆ కుమారుని వంటి వాడేయగును. కావున నీవు వానితో పొత్తుబెట్టుకొనుట మంచిదికాదు. నీవికకైలాసమునకు బోయి అచట నివసించుట మంచిది. అక్కడ త్రిపురారియగు శివుని స్నేహము నీకు గలుగగలదు. పోయి రమ్మని తండ్రి అనుజ్ఞనిచ్చెను.

తండ్రి యాజ్ఞను శిరసావహించి తన ధన మణి వస్తు వాహనములను దీసికొని, తన్నాశ్రయించిన వారిని వెంటబెట్టుకొని తన మిత్రులు, పుత్రులు, సైనికులు గొలుచు చుండగా కుబేరుడు లంకను విడచి కైలాసమునకు చేరి స్నేహ పూర్వకముగా శంకరుని శరణు వేడెను.

శంకరుడు కుబేరునాదరించి అలకావతియను పట్టణమును కుబేరునకిచ్చి మిత్రుడుగా పాలించుచుండెనని కుబేరుని గూర్చి అగస్త్య మునీంద్రుడు రామచంద్రునకు దెల్పి మరలా ఓ రామచంద్రా! ఇక దశగ్రీవుని గూర్చి తెలుపు చున్నాను వినుము.

## దశగ్రీవుడు లంకను పాలించుట

అరువది యోజనములు విస్తీర్ణము గలిగి బంగారముచే ప్రకాశవంతమై ఎత్తైన మేడలు గలిగి శోభాయమానముగా నుండు లంకను కుబేరుడు విడచి వెళ్ళి పోయెను. ప్రహస్తుని వెంట బంపిన కుబేరుని దండనాధుడు దశగ్రీవుని వద్దకు బోయి మీ అన్నగారు నన్ను మీ వద్దకు బంపి యున్నారు. లంకను మీరు స్వాధీనము జేసికొని సుఖముగా పరిపాలింపుమని మీకు తెలుపవలసినదిగా నన్ను బంపియున్నాడు. అని దశగ్రీవునకు దెల్పి దండనాధుడు వెళ్ళిపోయెను.

తరువాత శుక్రాచార్యుని పుత్రుడు, రాక్షస పురోహితుడు, దశగ్రీవునితో మీరిప్పుడు లంకలో బ్రవేశించుట శుభప్రదముగా నున్నదని దెలుపగా సకల పరివారములతో బయలుదేరిరి.

దశగ్రీవుని తాతగారేనుగుల మీదను, అతని తల్లి పల్లకి మీదను, అతని తమ్ములు కుంభకర్ణ, విభీషణులిరు వైపులను నడచుచు అందరును లంకలోనికి ప్రవేశించిరి. శుక్రాచార్యుడు నిర్ణయించిన శుభముహూర్తమున లంకకు దశగ్రీవుని రాజుగా పట్టాభిషేకమును గావించిరి. అధికారముల నొసంగగా అందరును కలిసి లంకను సుఖముగా సంపన్నముగా రాజసముతో దశగ్రీవుడు పాలించుచుండెను.

దశగ్రీవుని చెల్లెలగు శూర్పణఖను కాలకేయులను వారిలో నొకడగు విద్యుజ్జిహ్వుడను వానికొసగి వివాహము గావించెను.

ఇట్లు దశగ్రీవుడు రమ్యముగా లంకను పాలించుచు ఒక దినమున మనుష్య సంచారము లేని అడవికి బోయి వేటలాడి అచటనే స్వేచ్ఛగా తిరుగుచుండెను.

అచట తిరుగుచు తిరుగుచు అడవి లోపల ప్రవేశించెను. ఆ యడవిలో నుండి ఘుమ్మని పువ్వుల వాసన వచ్చెను. ఆ వాసన నాఘ్రాణించుచు దశగ్రీవుడు ముందునకు వెళ్ళెను. తన యెదుటనొక మునీశ్వరుని ఆశ్రమముండెను. అందులోనొక మునీంద్రుడు కనబడెను. ఆయన ప్రక్కనొక స్త్రీ యుండెను. ఆమె యొక అందాల రాశి. అంతియే కాదు ఆమెకింకను వివాహము కాని కన్య కామణి.

ఈ దశగ్రీవుడామెను జూచినపుడీవిధముగా తన మనస్సునందూహించెను. ఈ సుందరాంగిని నాకివ్వుమని నేను మునీంద్రుని మర్యాదగా కోరెదను. ఆ మాట మీద యిచ్చినచో మేలేయగును. ఇవ్వలేదన్నచో యుద్ధము చేసి గెలచియైనను, బలవంతముగానైనను, దీనిని నేను చేపట్టెదను అని నిశ్చయించుకొని, ఆశ్రమములోనికి వెళ్ళి, ఆ మునీంద్రుని యెదుట నిలచి మహాత్మా! మీరెవరు ఈ ప్రదేశముననెందుకు తిరుగుచున్నారు? చెప్పుటకు మీకభ్యంతరము లేనిచో వివరింపగోరెదను అని యడుగగా దశగ్రీవునకా మునీంద్రుడు తన కథను దెలిపెను.

## దశగ్రీవుడు మండోదరిని వలచి పెండ్లి యాడుట

అయ్యా నేను రాక్షస శిల్పాచార్యుడను. నా పేరు మయుడు. ఈ చిన్నది నా కుమార్తె.. నా శిల్పనైపుణ్యమునకు దేవతలు మెచ్చి హేమయనునొక అప్సర స్త్రీని నాకు బహుమతిగా నిచ్చిరి. ఆ హేమకు నేను హేమనగరము అనునొక నగరమును నిర్మించి ఆ నగరములో హేమతో గూడి ఐదు వందల సంవత్సరములు కాపురముంటిని. హేమ గర్భవతియై మాయావియైన దుందుభిని గనెను. మరికొంత కాలమునకు మండోదరియను కుమార్తెనుగనెను. ఇట్లుండగా హేమను దేవతలు పిలువనంపిరి. ఈమెయే మండోదరి. వారి యాజ్ఞానుసారము హేమ నన్ను విడచి వెళ్ళి పోయెను. ఆమె యెడబాటును సహింపజాలక నేను విరాగినై తపము సేయవలయునని యున్నాను. కానీ ఈమెకు వివాహము గావించి తపము జేసి కొనవలె నను ఉద్దేశ్యముతో ప్రపంచమంతయు నీమె కొరకు దిరిగి వరుని వెదుకుచున్నాను. ఇంత వరకు నాకు కానరాలేదు అనిమయుడు దెలిపెను. దశగ్రీవునకా వార్త రొట్టె విరిగి నేతిలో బడినట్లైనది.

**దశగ్రీవుడు :** మహాత్మా! బ్రహ్మదేవుడు నాకు మూడవ తాత, నేను విశ్రవో బ్రహ్మ కుమారుడను. తపస్సు జేసి బ్రహ్మను మెప్పించి వరములు పొందియున్నాను. లంకాధిపతిని. నా పేరు దశగ్రీవుడు. నా కింకను వివాహము కాలేదు అని దశగ్రీవుడు చెప్పగా మయుడు విని సంతోషించి, ఇతనికి నా కుమార్తెనియ్య వచ్చునని తలంచి మండోదరిని దశగ్రీవునకొసగి వివాహము గావించెను.

ఇట్లు మండోదరిని చేపట్టిన దశగ్రీవునకు ఆమె స్పర్శ వలన సాత్త్విక భావములు సమకూరెను. ఎంత తామసగుణములు గలవారికైనను సాత్త్వికులతో సంబంధము కలిగినప్పుడు సాత్విక గుణములు కలుగును.

ఇట్లు మండోదరిని దశగ్రీవునకు మయుడు వివాహము గావించి ఈశ్వరునైనను జయించు శక్తి గల శక్తిబాణమును దశగ్రీవునకొసగి, ఇది చాలా గొప్పశక్తివంతమైనది. దీనిని మహాబలవంతుని పై మాత్రమే వేయవలయును శత్రువుపై ఒకతూరి మాత్రమే వేయవలెను అనిచెప్పి ఆ బాణమునిచ్చి మండోదరిని దశగ్రీవుని వెంట బంపివైచెను అని తెల్పుచు అగస్త్య మునీంద్రుడు ఓ రామచంద్రా ఆనాడు మయుడిచ్చిన శక్తి బాణమే యుద్ధములో మన లక్ష్మణస్వామి పై రావణుడు వేయగా మూర్ఛితుడైనది. కానీ అది మహాలోభి వానిని యాచించిన పేదవాని వలె దాని ఆశయము నెఱవేరక వృథాయయ్యెను.

ఇట్లు దశగ్రీవుడు మయుని కూతురు మండోదరిని పెండ్లియాడెను. ఆ తరువాత కుంభకర్ణునకు బలిచక్రవర్తి మనుమరాలు వజ్రజ్వాలయను నామెను వివాహము గావించెను. చిన్నతమ్ముడగు విభీషణునకు శైలూషయను గంధర్వుని పుత్రిక సరమయను నామెను వివాహము గావించెను. అందరును తమ తమ భార్యలతో సుఖించుచుండిరి.

## మేఘనాధుని జననము

కొంతకాలమునకు దశకంఠుని భార్య మండోదరి గర్భవతియై ఉద్ధతుడగునొక కుమారుని గనెను. ఆ కుమారుడు పుట్టిన సమయమున ఆకసము బ్రద్ధలగునట్లును, దేవతలు భయకంపితులగునట్లును భయంకరమగునొక శబ్ధము గల్గెను. అందువలన దశగ్రీవుడు తన కుమారునకు మేఘనాధుడను పేరు పెట్టెను. అతడు తండ్రి ప్రాబల్యము వలన పుల్లలనెగద్రోయగా ప్రబలు మంటలవలె దినదినాభివృద్ధి యగుచుండెను. అతడే ఇంద్రుని జయించి ఇంద్రజిత్తను ఘనకీర్తిమంతుడయ్యెను అని అగస్త్య మునీంద్రుడు దెల్పి

ఓ రామచంద్రా! ఆనాడు బ్రహ్మదేవుని వలన గుంభకర్ణుడు నిద్రను వరముగా బొంది యుండినందు వలన అతనిని నిద్రయావరించెను. తాను నిద్రించుటకొక యిల్లును గట్టింపుమని కుంభకర్ణుడన్నను కోరెను. దశగ్రీవుడు ఇల్లు గట్టుటకు చాలా మంది శిల్పులను నియమించెను. కుంభకర్ణుడు నిదురించెడు ఇల్లు ఒకటిన్నరామడ వెడల్పు, మూడామడల పొడవు, చాలా ప్రకాశవంతముగాను అందముగాను నిర్మించి అందులో మెత్తని పరుపులు, ఇల్లు మొత్తమునంతయు తెఱపిలేక పరచిరి. అప్పుడా యింటిలో కుంభకర్ణుడు పరుండెను ఆనిద్రలోనతడు గుఱ్ఱు పెట్టుట వలన పుట్టిన శబ్ధములు వినిదేవతలే భయపడుచుండిరి. అతడు

కలవరించుచు పళ్ళు గొఱుకుచు దవడల నుండి జల్లులు కార్చుచు చప్పరించుచు చెమటలుకారుచుండగా పొరలుచు నీల్గుచు నిద్రించు చుండెను.

## దశగ్రీవుడు గరుడడు మొదలగు వారిని బాధించుట

ఓ రామచంద్రా! విను దశగ్రీవుడిట్లు ధనదుని తరిమివైచి లంకను చేరి రాక్షసులతో కూడి లంకనేలుచు అందరును వివాహములు గావించుకొని తనకు బ్రహ్మ యిచ్చిన వరముల వలన మహాబలవంతుడై హద్దులు లేక తన బుద్ధిని దుష్ట ప్రవర్తనలయందే బోనిచ్చుచు అందరిని బాధింపదొడగెను.

గరుడులను బట్టి స్థంభములకు గట్టివైచెను. గంధర్వులు బోవు త్రోవలడ్డగించెను. పక్షులను దరిమినట్లు యక్షులను పారద్రోలెను. ఈ విధముగా దేవజాతుల వారిని బాధలు బెట్టుచు మునీశ్వరుల యజ్ఞములను చెడగొట్టుచు మాయలుబన్నుచు మహోపద్రవకారి యయ్యెను.

దశగ్రీవుడీవిధముగా నందరిని బాధించుచున్నారని విని తన తమ్మునకు నీతులు గఱపుటకు ధనదుడు తన దూతను బంపెను. ఆ దూత లంకకు పయనమై బయలుదేరునప్పుడనేక దుష్ట శకునము లయ్యెను. ఆ దుశ్శకునములను జూచి భయపడలేదు. లంకలో విభీషణునింటికి బోయెను. విభీషణుడతనికి మర్యాదలు జేసి, తరువాత దశగ్రీవుని సభకు దీసికొనివెళ్ళెను. దశకంఠునకు ధనేశుని దూత నమస్కరించెను. దశకంఠుడతనిని నీవెవరవు? ఎక్కడ నుండి వచ్చితివని యడుగగా, నేను ధనేశుని దూతను. అన్నగారు నా వలన మీకొక సందేశమును పంపియున్నారు. అది నేను మీకు వినిపించెదను వినుమని చెప్పనారంభించెను.

పరులకు మేలు జేయుట వలన తనకును మేలే జరుగును. బాధలు గలిగించుట వలన తాను కూడా బాధలు పడవలసివచ్చును. బ్రహ్మకులములో బుట్టి దేవతలతో విరోధము బెట్టుకొనుట మంచిది కాదు. ధర్మము గల వారమగుట చేతనే మనమందరమును సుఖపడుచున్నాము. దేవుడు లేడను నాస్తికుడును, కులమును చెడగోట్టువాడును, చెడు ప్రవర్తన గలవాడును,మేలు పడజాలరు. కాని నీవట్టి ప్రవర్తనగల వాడవుకాదు. నీవు గొప్ప ఆస్తికుడవు బ్రహ్మను మెప్పించి వరములు బొందిన వజ్రసంకల్పుడవు. కాని దయలేని వాడవై దేవతలను బాధించు చున్నావు. నందనవనము మొదలు తక్కిన ఉద్యాన వనములన్నింటిని కూల ద్రోయించితివి. అప్సరసలను చెఱబట్టితివి. మునీశ్వరులను చంపితివి. వారేమందురో యను భయము లేనివాడవైతివి. ఇక నేను నిన్నే మనవలెనో తెలియుట లేదు.

తమ్ముడూ! నీవిట్టి కఠిన స్వభావముతోనే నన్ను లంక నుండి వెడల గొట్టితివి. నీవు నా తమ్ముడవగుట వలన నీతో తగువులు బడుట నాకిష్టములేక నీకు లంకను వదలివెళ్ళిపోయితిని. ముమ్మాటికిని బెట్టుగా బ్రవర్తించెడు వారిని చుట్టములైనను సహించరు కదా! మహాత్ములైన మునీంద్రులను జంపుట శూరుల లక్షణము కాదు. చెడులక్షణములను విడుచుటయే మంచిది.

నేను హిమాలయ పర్వతము మీద తపముజేసితిని. నీవు జేయుచెడు ప్రవర్తనలను విని నీకు హితమును బోధించుచున్నాను. నా హితవచనములను విని నీవును నావలనే మన వంశమునకు కీర్తి దెమ్ము.

ఇంకను వినుము. ఇతరుల కలుములను జూచి అసూయపడువాడు ఆపదల పాలు కాగలడు అని దూత దెల్పుచు, మీయన్న యగు ధనేశునకే ఇట్టి భావము కల్గినది. దానిని నేను నీకుదాహరణముగా చెప్పుచున్నాను వినుమని యాదూత చేతులు జోడించి, మదాంధుడగు దశగ్రీవునకు దెల్పెను.

మీయన్నయగు కుబేరుడొకనాడు హిమాలయమునకు బోయి సిరి సంపదలతో ఈశ్వరుని అర్ధశరీరమందుండిన పార్వతిని జూచి ఈమెకీబాగ్యమెట్లు సమకూరినదని అసూయా, ఈర్ష్య, రోషములతో ధనేశుడు తనకుడి కన్నుతో అనగా (ఓరగంటితో) చూడగా చెడుతలంపుతో చూచిన ఆ కన్నును ఆ క్షణమందే కాల్చివేయగా, నతడికనేనేమి సేయుదునని పరితపించి ఆ పర్వతము నందు గల ఉత్తర శిఖరము మీదికి బోయి నియమనిష్ఠలతో పదునెనిమిది సంవత్సరములు శైవవ్రతములు గావించెను. ఆ వ్రతములకు శివుడు మెచ్చి దర్శనమిచ్చి ధనేశా, నీ నియమనిష్ఠలకు, నీ తపస్సునకు మెచ్చితిని. ఈ వ్రతమును ఇంత నియమముగా చేసిన వారు లేరు. పూర్వము నేనీ వ్రతమును చేసి యుంటిని. ఇప్పుడు నీవు చేసి యున్నావు. కావున నేను నీకు నా స్నేహమొసంగితిని. పార్వతినే దృష్టితో జూచితివో ఆ దృష్టి, మట్టిరేణువులయందు జుట్టుకొన్న వెలుగువలె కంటి చూపుగా వెలుగగలదు. నీవు ఏకపిశంగనయనుడను పేరుతో నొప్పగలవని శివుడు ధనేశునకు వరములొసగి, ధనేశుని కైలాసమునకు దీసికొనివెళ్ళెను. కావున కోపము, అసూయ కీడును కలిగించును. ధర్మ వర్తనము వలన బంధువులకు మేలు చేకూరును అని అన్న ధనేశుడు చెప్పిన హితమును దూత తెలియజెప్పెను.

ఈ విధముగా ధనేశుని దూత చెప్పిన దంతయువిని దశగ్రీవుడు మండిపడి, నీదొర మంచితనముగా నాకు నీతి బోధించుసాకుతో ఆయన తపస్సు జేసినది, ఆయనకు శివునితో స్నేహము గలిగినది, నాకు తెలియపఱచుటకు నిన్ను

బంపియున్నాడు. తనకున్న ధనము, కలిమి, శివుని స్నేహమును, నమ్ముకొని దురుపదేశము సేయుటకు నిన్నంపునపుడు నేను పోజాలనని చెప్పక నీవెట్లు వచ్చితివిరా మూర్ఖా! అని ఒరలో నున్న కత్తిని దీసి ధనేశుని దూతను చంపుటకు దశగ్రీవుడు పోవుచుండగా, దూతను చంపుట ధర్మము గాదని విభీషణుడు చెప్పినను వినక వివేకములేని వాడై ఆ దూతను చంపెను.

ఇట్లు అతనిని చంపి, సభవారి వైపు జూచి ధనేశునికున్నంత నీతి మాకు లేదా? నేను తమ్ముడైనందున ఓర్పు వహించి లంకను నాకొసగి యున్నాడట. ఓర్పు వహించక ఎదిరించి యుండిన నన్నేమి సేయగలడు. అప్పుడు దయ దలచి లంకను నాకొసగినట్లు దెల్పి యున్నాడు. లంక సంగతెందుకు ఇపుడు అలకాపట్టణమునే ముట్టడింతము. ఇప్పుడు కూడ ఓర్పు వహించి దానిని మనకు వదలి వేయునో యెదరించి యుద్ధము జేయునో చూచెదము గాక. అతని మిత్రుడు శివుని తోడు జేసుకొని వచ్చినన్నేమి సేయునో చూచెదనుగాక.

నాకతడు అన్న పూజనీయుడని నేనింతవరకు మర్యాదగా నేనతిని మీదికి బోక విడిచి యుంటిని. కానీ ఇప్పుడు నన్నతడవమానించి యున్నాడు. కావున నేనతినినిగెలిచి నా ప్రతాపమును చూపించెదను అని ప్రహస్తుని జూచి మన సమస్త సైన్యమునుయుద్ధ సన్నద్ధము గావింపుము అని యాజ్ఞాపింపగా, ప్రహస్తుడు విని సైన్యమును సమాయత్తము గావించి సైన్యసమేతముగా అలకాపురిపై యుద్ధమునకు వెడలిరి.

ఇది రెండవ ఆశ్వాసము పూర్తి

**మూడవ ఆశ్వాస ప్రారంభము :**

## దశగ్రీవుడలకాపురిపై దండెత్తుట

అగస్త్య మహామునీంద్రుడు రామచంద్రునితో చెప్పుచున్నాడు. ఓ రామచంద్రా! దశగ్రీవుడలకాపురి పైకి పోవునప్పుడు సైనికుల వీరాలాపములు రథికుల శంఖారావములు, ఏనుగుల ఘీంకారములు, గుఱ్ఱముల సకిలింపులు, డప్పులు భేరీలు మఱియు యుద్ధ వాయిద్య శబ్దములు కలిసి బ్రహ్మాండమునిండెను. ఇట్లు దశముఖుడలకాపురిపైకి వచ్చి యున్నాడని తెలిసికొన్న ధనేశుడు తన సైనికాధికారికి ఆజ్ఞయొసంగెను. యక్షులు బోయి రాక్షసులతో భయంకరముగా యుద్ధము గావించిరి. యుద్ధభూమి పీనుగ పెంటలుగను, రక్తపు మడువులుగను మారెను. రాక్షస సైనికులతో యక్షులు పోరాడుట జూచి యక్షులతో శుకసారణులు దశగ్రీవుడు భయంకరముగా పోరిరి. రాక్షసులతో యుద్ధము జేసిన యక్షులు

యుద్ధమునుండి పారిపోయి పట్టణములో ప్రవేశించిరి. వారిని దరుముచు రాక్షసులు కూడా పట్టణములోనికి బ్రవేశించిరి. రాక్షసులు నగరములోనికి ప్రవేశించియున్నారని ధనదుడు దెలిసికొని, సంయోధకంటకుడను యక్షుని బిలచి తనసైనికులతో గలిపి రాక్షససైనికులపై యుద్ధమునకు బంపెను. రాక్షససైనికులతో భయంకరముగా యుద్ధము జేయుచుండెను. మారీచుడు వానినెదరించు తన గదతో మోదెను. ఆ దెబ్బకతడు మూర్ఛబడి కొంతసేపటికి తెలిసి బ్రతుకు జీవుడాయని పారిపోయెను.

రాక్షసులు పట్టణములోనికి బ్రవేశించి గోపురములును కోటగోడలును కూల్చి వేయుచుండిరి. దవ్వారికుడను వాడది చూచి వారిని అదలించి నిలువరించెను. వారు ముందుకు రాకనిలబడిపోయిరి. దశగ్రీవుడు నిలువక లోనికి వచ్చుచునే యుండెను. దశగ్రీవుని పై దవ్వారికుడు గదను విసిరెను. దశగ్రీవుడాగదను నడుమనే త్రుంచి వైచి తోరణ స్థంబమును బెరికి, దవ్వారికుని గొట్టెను. వాడా దెబ్బకు నేల గూలి ప్రాణములను వదలెను. అది చూచి యక్షులు పారిపోయిరి. దశగ్రీవుడీవిధముగా బాధించు చుండగా ధనదుడు మాణిభద్రుని యుద్ధమునకు బంపుచు క్రూరుడగు దశగ్రీవుడు మన యక్షులను నొప్పించు చున్నాడు. నీవు బోయి వానినెదుర్కొనుమనగా మాణిభద్రుడట్లే జేసెదనని పదివేల మంది యక్షుసైనికులతో బోయి రాక్షసులతో తలపడి, ఉధృతముగా పోరి వారినందరిని పట్టణములో నుండి వెడలకొట్టెను. మరియు రాక్షసులను దరుముతున్న మాణిభద్రునిపై ప్రహస్తుడు దలపడెను. ఆ సేనాధిపతులొకరితో నొకరు పోరుచుండగా సైనికులతో సైనికులు పోరాడుచుండిరి. మాణిభద్రుని సహాయ సైనికులను ప్రహస్తుని సైనికులు చంపుచుండిరి. మాణిభద్రుడు దశగ్రీవునిపై దలబడెను. దశగ్రీవుడు మాణిభద్రుని తలపై తన గదతో మోదెను. ఆ దినము నుండి మాణిభద్రుని పార్శ్వమౌళియని బిలుచు చుండిరి. ఆ దెబ్బ దిన్న మాణిభద్రుడు యుద్ధము నుండి వైదొలగెను.

ఓ రామచంద్రా! మాణి భద్రుడు యుద్ధము నుండి తొలగిపోయెనను ఈ వార్త విన్న ధనదుడు యుద్ధమునకు తానే బయలు దేరెను. అతని వెంట యక్షులు జయజయ శబ్దములతో బయలుదేరిరి. ధనదుడు బంగారపు రధమునెక్కి యుద్ధరంగములో బ్రవేశించి దశవదనుని చెంతకు బోయి అతనినిని చుఱచుఱ జూచుచు, తమ్ముడవని నీమేలు గోరి నీకు హితవును బోధించుటకు నీ వద్దకు దూతను బంపించితిని. నా మాటను వమ్ముజేసి నీవాదూతను జంపితివి. అది చాలక నా మీదికి యుద్ధమునకు వచ్చితివి. ఇక నిన్నేమనవలెను.

రోగముగల వానికి భక్ష్య భోజ్యాదిపదార్థములు బెట్టినచో అతనికా రోగము తగ్గక మరింత హెచ్చినట్లు మహాక్రోధుడవైన నీకది, మహాక్రోధమునే బెంచినది. నీ గుణములను గానీ, పనులను గానీ నేనేల నిందించవలెను. నీవు రౌరవ నరకమున బడి బాధలనుభవించునప్పుడు, నేను చెప్పిన హితవచనములు జ్ఞప్తికి రాగలవు అపుడు నీకే తెలియగలదు.

నీవే కాదు మూర్ఖులందరును నీవలె మహాపాపములను చేయుచునే యుందురు. విషముదాగిన మూర్ఖునకా విషము శరీరమంతయు బ్రాకినప్పుడు చింతించినట్లు మహాపాపములకు బద్ధులై దాని ఫలితమునను భవించునప్పుడు అయ్యో పాపములను జేసితిమేయని దుఃఖించెదరు. అన్నకు, తండ్రికి, గురువుకు ఆపదనెవడు కలుగజేయునో అట్టి వానిని చూచినచో, ఆ చూచిన వానికి కూడా మహాభయంకరమైన పాపములు సంభవించును. ఈ శరీరమును అమృత భాండములో బెట్టి కాపాడినను మృత్యు వాసన్నమైనప్పుడు చావక నిలుచునది కాదు. శరీరధారులకు చావెల్లప్పుడును సమీపమునందే యుండును. పుణ్యపురుషులకు సంపదగల్గును. ఇవన్నియును మనస్సులో నుంచుకొని మసులుకొనువాడు సుకృతార్థుడు కాగలడు.

శరీరమును ధరించినవాడు తన బుద్ధిపూర్వకముగా నేమేమి సేయునో వానికి తగిన ఫలితమునే అనుభవింపగలడు. ఇది మంచి, ఇది చెడు అని తెలిసికొని మంచిని చేయువారినందరినీ యెవ్వరైనను మెచ్చుకొందురు. కలిమి, బలము అనునవి ఇచటనే కలుగును. మరణించిన వెనుక పరలోకములో సుఖములు గల్గును. మణులు, ధనము, వస్తు, వాహనములు, స్త్రీ జనములను బల ప్రయోగము జేసి, సంపాదించితిని కదా. ధర్మమెందుకు సేయవలెననియు దేవతలు మాకు పగవారనియు ఆలోచించి గొప్ప ఆ పదలో చిక్కుకొనుటకు సిద్ధముగా నున్న నిన్ను నా తమ్ముడన్నను నాకు పాపమే రాగలదు. కావున యుద్ధమునకే రమ్మని దశగ్రీవుని కుబేరుడీవిధముగా మాటలాడుచుండగా మారీచుడు, ప్రహస్తుడు మొదలగు రాక్షసులు కుబేరునిపై క్రూరముగా దలపడిరి. కానీ కుబేరుని ధాటికోర్వజాలక పరుగున పారిపోయిరి.

దశకంఠుడది గమనించి కుబేరునిపై బాణములు జడి వానవలె గురిపించెను. కుబేరుడు తన గదతో దశకంఠుని కిరీటము నేలపై బడునట్లు గొట్టెను. ఆ దెబ్బ తిన్న దశగ్రీవుడు కుబేరుని గదపై గొట్టెను. ఆ దెబ్బ దిన్న కుబేరుడు దశగ్రీవునిపై యాగ్నేయాస్త్రము ప్రయోగించెను. దశగ్రీవుడు దానిని వారుణాస్త్రముచే చల్లార్చి వేసెను. ఇట్లాయన్నదమ్ములిద్దరును రెండు సింహముల వలె పోరాడిరి.

కొంతసేపీవిధముగా పోరాడి దశగ్రీవుడు న్యాయ పోరాటమును విడిచి కుబేరునితో మాయా యుద్ధమునకు దలపడెను.

ఎట్లనగా దశగ్రీవుడొకసారి ఆకసములో దట్టమైన మేఘమువలె గనుపించి ఆ మేఘములో నుండి ఉరుములురిమి పిడుగులు కుబేరునిపై కురిపించెను. మఱియొకసారి మహాపర్వతము వలె కనిపించి ధనదుని పటాళముపై బడును. ఇంకొకసారి సముద్రమువలె గనుపించి ఆయలలతో కుబేరుని ముంచివేయును. వేరొకసారి పులి రూపముతో వచ్చి ధనదునితో పోరాడును. మరల నొకసారి సర్ప రూపములో వచ్చి కుబేరుని జుట్టుకొని సతమతము గావించును. కనబడి మరలా కనబడక మాయమైపోవును. ఈ విధముగా మాయా యుద్ధము గావించి ఉన్నట్లుండి హఠాత్తుగా కనబడి కుబేరునెదిరించి అతని తల మీద తన గదతో దశగ్రీవుడు కొట్టగా ఆ దెబ్బకు కుబేరుడు కూలబడి మూర్చిల్లెను. ఇట్లు మూర్చబడిన గుబేరునకు అతని నిధులన్నియును వచ్చి శైత్యోపచారములు గావించుచుండెను.

ఇక్కడ వీరిట్లుండగా దశగ్రీవుడు పట్టణములోనికి బ్రవేశించి, కుబేరుని పుష్పక విమానమును స్వాధీనముగావించుకొని ఆ విమానములో తమ సైనికుల నెక్కించుకొని తానును కైలాసమునకు వెళ్ళెను.

## విమానము యొక్క మాహాత్మ్యము

ఆ పుష్పక విమానమును గుబేరునకు బ్రహ్మదేవుడిచ్చి యున్నాడు. ఆ విమానములో ఎంత మంది కూర్చుండినను వారందరికి తగినంత స్థలముండి మఱియొక మనిషికి తగినంత స్థలము మిగిలియే యుండును. ఆ విమానము తన యజమాని ఎక్కడికి బోవలెనని తన మనస్సునందు దలంచునో అక్కడికే వెళ్ళుచుండును. తన యజమానికేదయినా ముందు అపాయము రాగల చోటులున్నచో అటువైపు పయనింపదు. మొఱాయించును. అంతటి మహిమ గల విమానము కుబేరునునకు బ్రహ్మయివ్వగా అది దశగ్రీవునకు దక్కిపోయెను. ఆ విమానమునుపయోగించుకొని దశగ్రీవుడు దండయాత్రలు గావించెను. అది యేలోకమునకైనను పోగలదు. ధర్మము లెఱిగినదైనందున ఆ విమానము దశగ్రీవునకు వశమయ్యెను. ధనదుని దీశగ్రీవుడు జయించెను. అందువలన ధనదుని సొత్తంతయు దశగ్రీవునిదే కదా!

ఓ రామచంద్రా! దశగ్రీవుని తరువాయి కథను వినుమని అగస్త్య మునీంద్రుడు చెప్పనారంభించెను. దశముఖుడు ధనదుని మూర్ఛిల్లజేసి అతని పుష్పక విమానములో తన బలగముతో చేరి కైలాసమునకు వెళ్ళుచు త్రోవలో వెండి కొండలో గల వింతలను చూడదలచి వెండి కొండ శిఖరముపై దిగి తిరుగుచుండగా, మారీచుడు దశగ్రీవునితో ఓ రాక్షసరాజా! ఇట్లు చూడుము, ఇది కుమారస్వామి నివాసము. ఇవి పూదోటలు, ఇవి బిల్వ వృక్షములు. ఈ ప్రదేశమందంతటను తమ సఖులతో విచ్చేసి పార్వతీదేవి తిరుగుచుండును అని దశగ్రీవునకు వింతలు జూపుచుండగా విమానము పయనించు చుండెను.

ఇట్లు పోవుచున్న విమానము అకస్మాత్తుగా నిలచిపోయెను. దశగ్రీవు డాశ్చర్యపడి. దీనిని నిలుపగల సామర్థ్యము గలవాడెవడు. దీనిని నిలుపుటకెవ్వనికి సాధ్యముగాదు. కావున మీరు వెళ్ళి తెలుసుకొని రండని తన మంత్రులను బంపెను. వారు వెళ్ళి అంతటను వెదికి వచ్చి ఎవ్వరును మాకు కానరాలేదు. ఈ విమానము ధనదుని దప్ప మఱెవ్వరినీ మోయుటకిష్టపడదేమో లేక ధనదుడేకోపముతో పోనీయక నిలిపెనేమోయని వారనుకొనుచుండగా అచ్చటికి నంది వచ్చి ప్రత్యక్షమై దశగ్రీవునితో ఓ రాక్షసేశ్వరా! ఈ విమానమెందుకిట్లు నిలచినదని నీవాశ్చర్యపడవలసిన పనిలేదు. పార్వతీ సమేతముగా ఈ దినమిచ్చట శివుడు సంచరించు చున్నాడు. అందువలన దేవతలు కూడ ఇటువైపు చూచుటకు సాహసించరు. నీవిచటికి తెలియక ప్రవేశించి యున్నావు. ఆయన కోపమునకు గుఱియై సైన్య సమేతముగా ఎందుకు చెడవలెను. ఈ చోటును వదలి వెళ్ళుమని దశగ్రీవునకు దెలిపెను.

అది విని దశగ్రీవుడు పండ్లు పటపట గొరుకుచు పుష్పకము నుండి దిగి అహ్హాహ్హాహ్హాయని వికటముగా నవ్వుచు, అయ్యారే! నీ శివుడెవరు? నీవెవరు? నీ శివుని నిన్ను నేనిచట నిలువవిత్తునా? చూడుమని శూలమును ధరించి దశగ్రీవుడు కోనలోనికి బ్రవేశించెను. అతనికచట వానరముఖముతో నున్న నందికనబడెను. దశగ్రీవుడానందిని జూచి మరలా నవ్వెను. అప్పుడానంది రెండవ శివుని వలెనుండి తనను చూచి నవ్వినందుకు కోపించుచు

## దశగ్రీవునకు నంది శాపమిచ్చుట

ఓరీ! దశముఖా! నేను వానరముఖముతో గనబడుచున్న నన్ను జూచి నవ్వి యున్నావు. నా ముఖము వంటి ముఖముగల వానరులు గోరులే ఆయుధములు గలవారు నీ కులమును తుదిముట్టించెదరని దశముఖునకు శాపమొసగెను.

ఇట్లేందుకు శాపమియ్యవలెను. నాతో యుద్ధము సేయవచ్చును గదా అని సీవడుగవచ్చును. నీవిది వరకే నిందల బొంది యున్నావు. నిందలు బొందిన నీవు బ్రతికి యుండియు చచ్చినవానితో సమానము. నీ వంటి పీనుగు మీద విజృంభించుట నాకర్హముగాదు. మఱియు నీవు గావించు పాపముల వలన నీ పాపసముద్రములో నీవే మునిగిపోగలవు. నిన్నింక యుద్ధము జేసి ఓడింప జేయుటెందుకు అని నంది యనుచుండగా, నంది దశగ్రీవునకు శాపమిచ్చినందుకు లోకములోని వారందరును సంతోషించి నందిని ప్రశంసించిరి.

దశగ్రీవుడు నంది శాపము వినియు దానిని లెక్కజేయక కనులెఱ్ఱజేసి నీ పశుబుద్ధిని విడువక పోతివి, ఈక నాతడాఖా చూడుమని, నీ ప్రభువున్న వెండికొండనే తలక్రిందు జేసెదనని నందితో ప్రతిజ్ఞజేసి, ఆ వెండి కొండ శిఖరమున నొకదానిని బట్టి ఇట్టట్టూపగా ఆ కొండ అడుగు భాగమున నెఱియ లేర్పడెను. భూమికి సంబంధములేని విధముగా కొండ కదలి నెఱియలు కనబడెను.

## రావణుడు వెండి కొండ పెకలింపబూనుట

ఆ నెఱియలలోనికి వాసుకి వలెను, కొండ చిలువలు వలెను గల తన యిరువది చేతులను దశగ్రీవుడు చొప్పించెను. అతడు తన చేతులను చొప్పించునప్పుడు హుంకారము జేయుచు మూల్గుచు తన అహంకార గర్వమును ప్రదర్శించుచు, తన పదిమొగములెఱ్ఱజేసి, బొమ్మముడితో తన భుజములొకదానితో నొకటి ఒరసికొనుచుండగా మితిమీరిన సాహసంబును, ఉత్సాహంబును, పెనంగొనుచుండ హో... హో...యను అట్టహాసంబు ఆ పర్వత గుహలు ప్రతిధ్వనులిచ్చు చుండగా తన పదినోళ్ళయందు గల పండ్లు పట పట గొఱుకుచుండ పుట్టిన భయంకర శబ్ధమునకు అష్టదిగ్గజములు బెదురుచుండగా, తన నిజప్రతాపమును జూపించుచు ఏకారణము లేకనే దశముఖుడు ఈ భూమి నుండి కొండను కదలించి, వేరు జేసి పైకెత్తుటకు ప్రయత్నము జేయు సమయమున, పుట్టిన మహా ప్రళయమునకు ఆ కొండ ఇట్టట్టూగు చుండగా ఆ కొండమీద నివసించు జంతువులు, సింహములు, పులులు, లేళ్ళు, మొదలగునవి భయపడి తామెక్కడికి బోవుటకును దిక్కుదెలియక అవి అక్కడక్కడనే తొక్కిసలాడుచు తిరుగుచుండెను.

పక్షులాకసమునకెగురుచుండెను. విహారమునకు వచ్చి యుండిన దేవతాస్త్రీ, పురుషులు తన విమానములలో తరలి పోవుచుండిరి. ఆ కొండపై కాపురముండిన వినాయక, నందీశ్వర, రుద్రగణములు ఈప్రళయమేమిటో పరిశీలించి పరమేశ్వరుడిచ్చు అనుజ్ఞ కొరకై ఆయుధములతో హాజరు గానుండిరి.

పార్వతీ పరమేశ్వరులున్న ప్రాంగణమంతయు పత్తైలు వారెను. సూర్య చంద్రాది నవగ్రహములు దారులు దప్పెను. ఇంద్రాది దేవతలు నందు గొందులలో దూరుచుండిరి. పొట్ట క్రొవ్వుతోనిట్టి కట్టడి కార్యము గావించుచున్న దురంహంకారిని పరమేశ్వరుడెందుకు మట్టుబెట్టక మన్నించి యున్నాడని ఒకరితో నొకరు చెప్పుకొనుచుండిరి. దశగ్రీవుడు కొండనూడ బెరికి బంతివలె ఆటలాడుటకు యత్నించెను.

దశగ్రీవుడు కొండనుఘ్నాతలూగించినప్పుడు పార్వతీ దేవికి పదములు తొట్రుపాటుబడి పరమేశ్వరుని కౌగలించుకొనెను. ప్రళయమును సృష్టించిన భయంకర రాక్షసుని పరాభవించి, వాని గర్వమణగజేసి తరువాత వానిపై దయ జూపెదనను తలంపుతో పరమేశ్వరుడు తాను కూర్చొనియున్న ఆసనము మీద నుండి లేవకనే తన కాలిబొటనవ్రేలును క్రిందికి ఆనించి అట్లే నొక్కిపట్టెను. పరమేశ్వరుడు కాలిబొటన వ్రేలితో వెండి కొండను అదుమగా దశగ్రీవుని చేతులు ఆ కొండ క్రింద యిరుక్కొనిపోయినవి. చేతులనూడదీసి కొనుటకు శక్తి లేక నొక్కుకపోయిన చేతుల నొప్పికి భరింపజాలక, తమ పదినోళ్ళతో కొండగుహలు దద్ధరిల్లునట్లు అరువసాగెను. ఆయరుపులు వినలేక బ్రహ్మదేవునకు చెవులు బధిరములయ్యెను. పర్వత గుహలలో ప్రతిధ్వనులు హెచ్చెను. ఆదిశేషుడాశ్చర్య పడెను. చుక్కలు రాలెను. అతడిట్లు ఒకవేయి సంవత్సరములు విరామము లేక యఱచుచునే యుండెను. ఇట్లఱచుచున్న తమ ప్రభువును మారీచాదులు జూచి యొక ఉపాయమాలోచించి దశగ్రీవునకు హితబోధగావించిరి.

## దశగ్రీవుడు శివుని స్తుతించి అతని వలన వరములు బొందుట

ప్రభూ శివుడు చాలా కరుణామయుడు. మీరాయనను ప్రార్థించి నా తప్పును మన్నింపుమని నీవు భక్తితో వేడుకొన్నచో ఆయన మన్నించగలడు అని మంత్రులు దశగ్రీవునకు దెలుపగా ఆలోచించి భక్తి భావము గలవాడై పరమేశ్వరుని ప్రార్థించెను.

**రగడ:** జయజయ శంకర సాధు వశంకర, జయ జయరిపుభట శరణా శంకర అని అనేక విధములుగా దశగ్రీవుడు శంకరుని ప్రార్థించెను. కడపట నీదాసుడనిక నేరములెంచకు! నా దుర్వృత్తి మనంబున నుంచకు అని దీనముగా ప్రార్థించెను. అందుకు దయదలచి శంకరుడు దశగ్రీవునకు ప్రత్యక్షమై యతనిని చూచినవ్వుచు నీ ధైర్యసాహసములకు మెచ్చుకొంటిని. నిన్నిప్పుడు వదలితిని, ఇక నీ యిష్టమొచ్చిన

చోటునకు వెళ్ళవచ్చును. నీకు తప్ప ఇతరులకీపని జేయుటకు సాధ్యము కాదు. నీవు చాలా భుజబలసంపన్నుడవని తెలిసినందున, నిన్ను పరీక్షింపదలచి నిన్నీవిధముగా బాధించితిని. నేను నీ చేతులను నొక్కిపట్టినప్పుడు నీవరచిన యరుపు విరామము లేకుండా లోకభయంకరముగా నునందున, ఈ దినమునుండి నీకు రావణుడని పేరు పెట్టుచున్నాను. ఆ పేరు ఈ దినము నుండి జనులందరి చేత పిలువబడును అని చెప్పెను.

రావణుడు శివునకు నమస్కరించి ఓ స్వామీ! నన్ను మీరనుగ్రహింపదయ గల్గనేని నీ చంద్రహారమునిచ్చి ఇసుకరేణువంత కూడా తక్కువలేని ఆయుః ప్రమాణము నిమ్మని ప్రార్థించెను. శివుడతనికి నీవు కోరిన విధముగా హారము నిచ్చితిని, నీవు నీతి దప్పిక్రొవ్విదుర్మార్గుడవై ప్రవర్తించునప్పుడు మా వరము మమ్మే చేరునని ఈశ్వరుడానతిచ్చి అదృశ్యుడయ్యెను.

శ్రీ రామచంద్రునితో అగస్త్య మునీంద్రుడు చెప్పుచున్నాడు. ఓ రామచంద్రా! ఈ విధముగా దశగ్రీవుడీశ్వరుని వలన వరములను బొందగా, రావణుడు, సంతోషముతో ప్రహస్తాది మంత్రులను గలిసి పుష్పక విమానమెక్కి విహారార్థము బయలుదేరెను, హేమ కూటము, గంధమాదనము, నీలము, అను పర్వతముల మీద విహారయాత్ర గావించెను. పర్వతములపై గల కొలనులయందును, పూదోటలయందును విహరించుచుండగా నంతకుముందే అచట విహరించు చుండిన దేవతా జంటలు అతనిని జూచి పారిపోవుచుండిరి. రావణుడట్లు విహారయాత్ర జేయుచు పట్టణమును జూచినచో ముట్టడిజేయును బలవంతుడని పేరు విన్నచో అతనితో యుద్ధము జేసి, ఓడించుచు దేవజాతులవారని తెలిసినచో వారిని తప్పించుకొని పోనీయక తన యస్త్ర శస్త్రములచే ముంచివైచును. రాజున్నాడని విన్నచో అతనిని ఓడించు వరకు విడువడు. ప్రాయపుస్త్రీ కనబడినచో ఆమెను పరాభవింపక విడువడు. అందచందముల గల స్త్రీలను ఆగడము గావించు చుండను. ఈ విధముగా ఆచపలమతియైన రావణుడు అచ్చటచ్చట దిరుగుచు, ఒకనాడు హిమవత్పర్వతమునకు ఉత్తరభాగమున ఒక ఉద్యాన వనమును జూచెను. రావణునకచట పూర్ణిమనాటి నిండుచంద్రుని వంటి ముఖకాంతితోను, జటావల్కములతోను, తులసీ, రుద్రాక్షల హారములురము పై మెరసెడు పక్షోజములు గలిగి, ఆమె చూపులు లేడి చూపులవలెను, లేడి చర్మమును ఆసనముగా వేసికొని, స్ఫటికమాల జపమాలగా వ్రేళ్ళపై ద్రిప్పుచు, నుదుట విభూతి రేఖలు ధరించి తన శరీరకాంతి మెరుపుతీగవలె మెఱయు చుండ పార్వతీ దేవి

వంటరిగా నిచట నివసించు చున్నదా! యనునట్లు తపము చేయుచున్న ఒక కన్యకామణి యచట కానంబడెను. ఆమెను జూచి రావణుడు పుష్పకము దిగి వచ్చి ఆ యోగినితో ఓచినదానా, నీ పేరేమిటి? నీవేకులము దానవు? ఈ లేతప్రాయము నంతయు అడవి పాలు గావించు చున్నావు. ఎందులకింత కృశించి యున్నావు, నిన్నేలు భాగ్యవంతుడైన నీ మగడెవ్వడు? ఇంత వరకు నీవే తపస్సు చేసియుంటివో దాని ఫలితముగా నీవీయందమును తెచ్చుకొంటివి? నీవింకా ఎందులకీతపస్సు జేయుచున్నావు అని ఆమె అంగముల సౌందర్యమును వర్ణించి నీకిన్ని వైభవములు గల్గి యుండియు వానిని తెలిసికొనలేక అమాయకురాలవై ఎందులకిట్లు తపము జేయుచున్నావు. తెలుపుమని, రావణుడు ఆ కన్య తపస్వినడిగెను. ఇట్లడుగుచున్న వాడు నీచుడగు రావణుడని తెలిసి యుండియు, ఆమె గౌరవ భావముతో ఆతిథ్యమొసగి గౌరవించి తన వృత్తాంతమతనికి చెప్పదొడంగెను.

## వేదవతిని జూచి రావణుడు మోహించుట

ఓ రాక్షస రాజా! కేశధ్వజుడనునొక మహనీయుడుండెను. ఆయన వేదము పఠించు సమయమున నేను పుట్టి యేడ్చుచుండగా ఆయన ప్రేమతో నన్ను చూచి దయగలవాడై నాకు వేదవతియను పేరు బెట్టి పెంచి పెద్ద దానిని జేసెను. అప్పుడు నాకు లేత యౌవన గురుతులేర్పడుటచే దేవేంద్రుడును, మునీంద్రులును నా మీద మోహము గలవారై నన్ను పెంచిన నా తండ్రి యొద్దకు వచ్చి ఈ కన్యను నాకివ్వుము, నాకివ్వుము అని పోటీ బడుచు వచ్చి అడుగుచుండిరి. అందులకాయన మీకెవ్వరికి ఇచ్చుట లేదు. నేనా శ్రీవారికే యిచ్చెదనని వారందరికిని సమాధానము చెప్పెను.

ఇది యిట్లుండగానొకనాడు దంబుడను రాక్షసుడు ఈ కన్యను తనకిమ్మని మా తండ్రి నడిగెను. అందువల్ల అతనికి సన్నిచ్చుటకు నిరాకరించెను. అందులకా పాపాత్ముడు ద్వేషించి నిద్రబోవుచున్న నా తండ్రిని ఖడ్గముతో ఖండించెను. వాడా హత్యా దోషము వలన అంతమొందెను. తరువాత నా తండ్రి యగు కుశధ్వజునితో నా తల్లి సహగమనముపొందెను.

ఇట్లు తల్లిని తండ్రిని పోగొట్టుకొన్న భాగ్యహీనురాలను. నేను తండ్రి ప్రతిజ్ఞను నెరవేర్చుటకు హరిని గూర్చి తపము గావించు చున్నాను. ఓ రాక్షస రాజా! ఇక్కడికి నీవు వచ్చినందులకు ఇక్కడున్న వింతలు దర్శించినావు. నా కథంతా విన్నావు. నేనిచ్చిన ఆతిథ్యమును తీసికొన్నావు. ఇక పోయి రమ్మని సమాధానము జెప్పెను.

ఇదంతయు విన్న రావణుడు తనకు రొట్టె విరిగి నేతిలో బడినట్లు ఈ వేదవతి నాకు దక్కిపోయినదని భావించి కామోద్రేకము గలవాడై ఓ యువతీ, నీవెంత వెఱ్ఱిదానవు. అనుభవింపవలసిన నీ యౌవనమంతయు వృథాయైపోయినది. వృద్ధాప్యము వచ్చుచున్నది. విష్ణుడు విష్ణుడని తపస్సు చేయుచున్నావు. నీ కింకను కనువిప్పు గలుగలేదా? వెన్నుడు వెన్నుడంటూ నీ తండ్రి మరణించెను. నీకు కూడా అదే వెఱ్ఱి బట్టినట్లున్నది. అయ్యయ్యో నీకన్యాయము జరిగిపోయినది. నీకింత నమ్మకము కల్గియున్న ఆ హరి అంతబలవంతుడైనచో నీ తండ్రిని చంపిన వాని కడ్డుపడి వానిని చంపి నీ తండ్రిని కాపాడి యుండవచ్చును కదా! వెఱ్ఱిదానా హరి అంటే విష్ణువే కాదు ఆపేరు కప్పకు కూడా వర్తిస్తుంది. కావున ఈ వృథాయైన హరి భ్రమలో నెందుకు పడి యున్నావు. నన్ను వరింపుము. వయసునందును పరాక్రమము నందును నన్ను మించిన వారీ లోకమున లేరనెను.

వేదవతి ఆ మాటలు వినజాలక చెవులు మూసుకొని, ఓ దుర్మార్గుడా! నీవు బ్రహ్మవంశములో బుట్టియు ఆ శ్రీహరిని నిందించు చుంటివి. ఎంతటి పాపాత్ముడైనా హరిని నిందించడు కదా? ఆహరి ప్రభావము నీకు తెలియదా? వినుము.

ఈ సృష్టికంతటికి మొదటి కారణమైన నీ తాత బ్రహ్మదేవుని గన్నవాడు హరియే కదా. నీయందును నాయందును సమస్తము నందును ఆత్మస్వరూపములో నుండే నిఖిలాత్మ స్వరూపుడా హరియే. దుష్టులను శిక్షించుటకు శిష్టులను రక్షించుటకు యుగ యుగమునందును అవతరించు వాడా హరియే. యాగము సేయువారి యొక్క యాగము నందు గల రహస్యమాహరియే.

ఓయీ రాక్షసరాజా! నాకన్యప్రాయము నామనస్సు నా శరీరము అన్ని నేనా హరికే సమర్పించి యున్నాను. నీవు నీదుర్మార్గపు కోరికను వదులుకొని పెద్దలు జెప్పిన మార్గమున నడువుము. నీకన్ని విధముల మేలు కాగలదు. అని పలుకుచు వేదవతి అందుండుటకు భయపడి పిల్లిని జూచిన రామచిలుక వలె దూరముగా బోవ ప్రయత్నించగా రావణుడామె జడను బట్టి వెనుకకు లాగెను.

అప్పుడా వేదవతి తన చేతినే ఖడ్గముగా బెత్తచాచి ఆ జడను నడిమి భాగమునందు నఱికెను. ఆమె కరస్పర్శ కాజడతెగి రెండై జడ యొక్క చివరి భాగము రావణుని చేతిలోనికి మిగిలెను. అది చూచి రావణుడాశ్చర్యము జెంది ఇది ఈమె తపోమహిమగా వచ్చునని భావించి వాడచటనే నిలచి యుండగా కొంత దూరమున

నున్న వేదవతి తిరిగి రావణుని వైపు చుఅ, చుఅ జూచుచు ఓరీ దురాత్మా నీవు దుర్మార్గుడవని తెలిసి యుండియు నీ తండ్రి విశ్రవసుని జూచి నీకాతిథ్యమొసగి నీతో మాటలాడితిని. ఆ మర్యాదయే నిన్నింతకుదెచ్చినది. ఇక ఇక్కడ నిలువ కూడదని భావించి వేదవతి ఓరీ రావణా! విను నా భయంకరమైన కోపమనే అగ్ని మంటలకు నీ రూపమును అహుతి కావింపక విడచితిని. ఏలనగా ఇంత వరకు నేను తపమాచరించి సంపాదించిన పుణ్యము నశించునను లోభముచే నిన్నూరక విడిచితిని. నీ వంటిన యీ శరీరముతో నేనింక జీవింపదలచుకొనలేదు. సహజమైన అగ్నికి నా క్రోధాగ్నిని జతపరచి నా శరీరమును నేనే దహించుకొని భస్మమునై నిన్ను సంహరింపజేయుటకు నేనీ భూమిపై మరలా జన్మించెదను అని పలుకుచు రావణునియెదుటనే తనలో నున్న కోపాగ్నికి తోడుగా యోగాగ్నిని రగులు కొలుపుకొని రావణుడు వినుచుండగా నేనా శ్రీహరిని ప్రేమించినది నిజమయ్యేనేని నన్నా శ్రీహరి భార్యగా స్వీకరించుట నిజమయ్యేనేని, నేనీభూమి యందు మరలా అయోనిజగా జన్మించి, ఈ దశకంఠుని సహా పుత్ర, మిత్ర, సహోదరులతో అందరి చావులకు కారణమయ్యెదగాక! అని అగ్నిగుండమునందు వేదవతి ప్రవేశించెను.

అపుడాకసమునుండి వేదవతిమాటవేదము వలె నిజమగుగాక! అని దేవదుందుభులూ మ్రోగెను. ఆదిత్యాది నవగ్రహములు అకసము నుండివేదవతిపై పుష్ప వర్షమును కురపించిరి.

ఓ రామచంద్రా! ఆ మునీంద్రుని పుత్రిక రావణుడు జేసిన అవమానము వలన బూడిదయై దైవసంకల్పము వలన మరలా నవతరించెను. ఎక్కడ బుట్టినదనగా లంకలో ఒక కొలను కలదు. ఆ కొలనులో తామరపూవులు దండిగానుండగా ఆ పూవులలో నొకదాని యందు ఆడ శిశువుగా జన్మించెను.

## వేదవతియే సీతయని రామునకగస్త్యుడు దెల్పుట

ఆ తామర దుద్దునందు కాలుసేతు లాడించుచు కేరింతలు గొట్టుచున్న సమయమున ఆ ప్రాంతమునందు దిరుగుచుండెడు వారా శిశువును జూచి ఆశ్చర్యపడి, అది యెుక వింతగాదలంచి, ఈ బిడ్డను మన రాజుగారికి చూపించెదమనిఆ బిడ్డనెత్తుకపోయి సింహాసనముపై కొలువున్న రావణునకు చూపించిరి. రావణుడు వేదవతి ప్రతిజ్ఞను జ్ఞాపకము జేసికొని ఆ బిడ్డనొక పెట్టెలో భద్రపరచి ఆ పెట్టెను సముద్రములో పారవేయుమని తన భటుల కాజ్ఞాపించెను. వారటులనే గావించిరి. కానీ ఆ పెట్టె సముద్రములో మునుగలేదు.

సముద్రపుటలల మీద తేలియాడుచు అది విదర్భ దేశమునగల మిథిలానగరము యొక్క తీరమును చేరి అలల మీద ఎగురగొట్టబడి ప్రక్కనగల ఇసుకలో పూడిపోయెను.

ఆ దేశ ప్రభువు మిథిలా నగరపు రాజైనకుడు యాగము సేయ సంకల్పించి, యాగశాల నిర్మించు చోటును బంగారు నాగలితో దున్నించు చుండెను. ఈ విధముగా దున్ను చుండగా ఆ భూమిలో పూడియుండిన నొకపెట్టె నాగలికి దగుల్కొనెను త్రవ్వించి చూచిరి.

అందులోనొక పెట్టెయుండెను ఆశ్చర్యముతో నాపెట్టెను వెలుపలికి దీసి, దానిమూత దీసి చూడగానందులో నొక ఆడ శిశువు కాలుసేతులు కదిలించి యూపుచు బోసినవ్వులునవ్వుచు, చక్కని చుక్కవలెకనబడెను. ఆ బిడ్డను జూచినజనక మహారాజు తనకొక పుత్రిక దొరకినందుకు సంతోషించి యాబిడ్డకు సీతయని నామకరణము గావించిరి. ఈ విధముగా ఆనాడు రావణునితో ప్రతిజ్ఞ జేసి అగ్నిప్రవేశముజేసి నీకును నీవంశము వారి చావుకు కారణమయ్యెదననిన ఆవేదవతియే ఈసీత. ఆ విధముననే ఆ శ్రీహరివి నీవేయైనందున నీ మీద ప్రేమగలదియై నిన్ను పెండ్లియాడి తాను జేసిన తపస్సు యొక్క ఫలితమును కూడ సఫలముగావించుకొనెను.

నీ పంచాయుధములైన శంఖు చక్రము గద ఖడ్గము చాపము, ఆయుధములు, నీవాహనమగు గరుత్మంతుని వదలి మానవ రూపముతో సూర్యవంశమున శ్రీరామచంద్రుడుగా జన్మించి కీర్తి బొందుచున్న నిన్నా వేదవతి సీతగా ఆశ్రయించెను. ఆ సీతా దేవియే లక్ష్మీదేవి. అయోధ్యా పట్టణమే వైకుంఠము. వానరులే దేవతలు ఇదంతయు యదార్థము. కృతయుగములో వేదవతియై తపస్సుజేసి త్రేతాయుగములో జనకమహారాజుగారింట సీతగా బెరిగి. తన మనస్సులో నుండిన శ్రీహరివగు నిన్ను పెండ్లియాడి తన ప్రతినను దీర్చుకొనెను అని శ్రీరామచంద్రునకు సీతను జూపుచు అగస్త్య మునీంద్రుడా కథనంతను తెలియజేసెను.

ఓ రామచంద్రా! భక్తులమగు మా గొప్పతనమును లోకులకు తెలియ జేయుట కొఱకు తెలియని వానివలెనే నిట్లడుగుచున్నావు. కానీ నీకు తెలియని దేమున్నది. అని అగస్త్య మహాముని రామచంద్రునకు రావణుని కథను దెలిపెను.

**శ్రీరామచంద్రుడు :** మునీంద్రా! మీరు రావణుని కథను దెలుపుచుండగా వినుటకు చెవుల కానందము గలుగుచున్నది. ఆ నాడు వేదవతి యోగాగ్నిలో దగ్ధమయ్యెనని దెల్పితిరి అ తరువాత రావణుడెచటికి వెళ్ళెను? ఏమి జేసెను? తెలుపుమని అగస్త్యుని కోరెను.

**అగస్త్య మునీంద్రుడు :** ఓ రామచంద్రా విను రావణుడొకనాడు తమ పుష్పక విమానముపై కూర్చొని తమబలగములతో ఆకాశ మార్గమున బోవుచుండెను. ఒక చోట స్వరసహితముగా పలు విధములైన వేద మంత్రముల పఠనీయము వినబడెను. అచట స్వాహా శబ్దములతో యజ్ఞకార్యము జరుగుచుండెను. రావణుడది జూచి శుకసారణులనెడి వార్తాహరుల నచ్చోటుకు బంపెను. వారు పోయి చూచివచ్చి ఓరాజా! అచట యజ్ఞము జరుగుచున్నది. ఆ యజ్ఞమునకు జయశాలియైన మరుత్తుడు సర్వం సహాభర్తగాను కశ్యపుడు, వసిష్టుడు, అత్రి, విశ్వామిత్రుడు మున్నగు మునీంద్రులు యజ్ఞము నిర్వహించుటకాయా స్థానములయందుండిరి. దేవేంద్రాది దిక్పాలకులా యజ్ఞమునకతిథులుగా హవిర్భాగములను దీసికొనుటకు హాజరై యున్నారు. అదిమణి మండపము యాగశాల. ఇట్లందరును యజ్ఞకార్యములందు నిమగ్నమైయున్నారని వార్తా హరులు రావణునకు దెలియజేసిరి. రావణుడదివిని అరెరే! నేను జూచు చుండగా అవెట్టి రాజు యజ్ఞమును సేయుచున్నాడనగా అతనినింకేమనవలెను. నేనది జరుగనిత్తునా? ఈ దేవతలకు హవిర్భాగములు దొరుకనిచ్చెదనా? పదండి యజ్ఞమును భగ్నము గావింపవలెను. అని విమానమునుండిదిగి యందరును యజ్ఞశాలలో ప్రవేశించిరి. అచట గలవారందరును రావణుని జూచి వీనిని నమ్మరాదు. మనమునిజరూపములతో నుండరాదు. అని యెవరంతట వారూహించి మారువేషములు ధరించి అచటనే ఏమిజరుగునో చూచదమని పొంచియుండి దేవేంద్రుడు తన వేయి కన్నులను నెమలికిచ్చివేసెను. యమధర్మరాజు తన భాగమును ప్రేతలు గానుండుచు పిండములను దిను కాకులకిచ్చెను. పాలను నీటినివేరు సేయుహంసలకు నీటిలో తిరుగుమని వరుణుడు తన భాగమును హంసలకిచ్చెను. కుబేరుడు తలవెండివలెను, శరీరము బంగారమువలె నుండునటుల తొండలకిచ్చెను, ఈ విధముగా తమతమ సంపదలను అయా జీవుల కొసగి వారు తమతమ భాగములను యజ్ఞ

భాగములను పంచుకొని పోయిరి అనిశుక సారణులు చెప్పగా రావణుడు విని ఆహా! నాయెదుటనే యజ్ఞమును జేయుట కావెఱ్ఱిరాజు ప్రయత్నించు చున్నాడా? అరెరే! దానిని నేను జరుగనిచ్చుటయా! అది నిర్విఘ్నముగానెరవేరినప్పుడు కదా వీరందరికిని హవిర్భాగములు లభించగలవు, నేను ఆమరుత్తునితో యుద్ధక్రీడకు బోయి ఈ యజ్ఞమునకు విఘాతము గల్పించెదను అనిరావణుడా యజ్ఞవాటిక లోనికి ప్రవేశించెను.

ఇట్లు రావణుడువచ్చు చున్నాడనివిని వానిని నమ్మరాదు ఏమరు పాటున నిజరూపములతో నుండినచో నతడు నాపై బడిదొమ్మిసేయునేమోయని, దేవేంద్రుడు భయపడి నెమలి రూపమును ధరించెను, యమధర్మరాజుకాకి రూపమును ధరించెను, వరుణుడు హంస రూపమును ధరించెను. కుబేరుడు తొండగా మారెను, అందరును మారు రూపములను ధరించి అక్కడ నేనక్కియుండిరి.

రావణుడు భయం కరరూపముతో వచ్చి, మరుత్తరాజునెదుట నిలచి ఓయీ! నృపాలా! నేను నీపై యుద్ధము సేయవలెనను కాంక్షతో వచ్చియున్నాను. నాతో యుద్ధమైనను చేయుము. అటుగాకున్న వెఱచితిననియైనను తెల్పుము అనిచెప్పగా మరుత్తుడు నవ్వుచు యుద్ధము సేయువారైనను ఎదుటివాని కులగోత్ర నామములను తెలిసికొనకనే యుద్ధముసేయుదురా! నీవెవ్వడవు? నీవృత్తాంతమేమని యడిగెను.

**రావణుడు:** గర్వముతో మరుత్త భూపాలా! నేను పులస్త్య బ్రహ్మ వంశీయుడను. రావణ బ్రహ్మను. బ్రహ్మ సంతతి వాడను. బ్రహ్మను మెప్పించి ఆయనవలన వరములను పొందియున్నాను. మా అన్నగారగు కుబేరుని జయించి, అతని పుష్పక విమానమును తీసికొన్నాను. ఈ మూడు లోకముల కతీతమగు మాహాత్మ్యము కలిగియున్నాను. అట్టినేను నీ వద్దకు యుద్ధబిక్షకోరి వచ్చి యున్నాను. అని రావణుడు దెల్పుచుండగా, మరుత్త భూపాలుడు ఔరా! మీ అన్ననే కొట్టి అతని సొత్తగు పుష్పక విమానమును దీసికొంటివి. ఔను! ఇదినిజమేకదా! మొదట యింట గెలువు. పిదప రచ్చగెలువు. అన్న సొమ్మెతను నీవు సార్థకము జేసితివి. అన్న సొత్తును అపహరించుట చేతనేకదా యెవరికైనను లోకములో మంచి కీర్తియు, పుణ్యమును రాగలవు. ఇంతటి ధర్మశాలివైనందున నిన్నెవ్వరెదిరించి గెలువగలరు. రమ్ము నీతో యుద్ధము జేసి నిన్ను నేనే గెలువ గలనని మరుత్త భూపాలుడు ధనుస్సెక్కుబెట్టి యుద్ధసన్నద్ధుడై నిలిచెను.

ఇట్లు నిలచిన మరుత్త భూపాలుని జూచి సంవర్తుడను వాడడ్డుపడి భళీ, భళీ నీవు క్రతు దీక్ష పూని యుండి శత్రువుపై యుద్ధము సేయుట న్యాయము గాదు. ఈ క్రతువునకు విఘ్నము గలిగెనేని కులము నశించును రావణుడు సామాన్యుడుగాడు అతనిపై యుద్ధమునకు పోవలదని వారించెను. మరుత్తుడు రోషమును సిగ్గును విడనాడి తానెక్కు బెట్టిన ధనస్సును దించివైచి అట నుండి వెళ్ళిపోయెను. తరువాత రావణుడు కొండగుహలు ఘూర్ణిల్లునట్లు నాతో యుద్ధము సేయలేక జారుకొన్నాడని చాటింపజేసెను.

రావణుడు యజ్ఞశాలలో బ్రవేశించి అక్కడున్న మునీశ్వరులను చంపి, యూప స్థంభములనూడబెరికి, యజ్ఞ పశువులను చంపి, నేయినంతటిని కుండములలో గ్రుమ్మరించి హోతలనుసంహరించి, మేము హోతలము కాదన్న వారిని వదలివైచి ఆహోమ శాలనంతటినీ చిందరవందర జేసి యజ్ఞశాలను విడిచివెడలిపోయెను.

హరిహయులన్న వారందరును రావణుడన్నచో భయపడుచుండెదరు రావణుడిట్లు వెడలిపోయి ఎచ్చట రాజులున్నారని విన్నను పోయి వారిని తనతో యుద్ధము సేయుమని కోరుచుండును, ఎదరించిన వారిని ఓడించుచు, వెఱచితినన్న వారిని విడుచుచు, వారోడి పోయినట్లు చాటింపజేయుచు ఇట్లు భూలోకమంతయు దిరిగెను.

రావణునకు దుష్యంతుడు, గాధిరాజు, గయుడు, పురూరవుడు, సురథుడు వీరందరును రావణునితో పోరాడ జాలక నీకోడిపోయితి మనిన వారే. అని అగస్త్య మునీంద్రుడు శ్రీరామునకు దెల్పి ఓ రామచంద్రా! రావణుని గూర్చి నేనేమని చెప్పగలను ఈ ప్రపంచమునగల రాజులలెవ్వరును రావణుని జయించలేక ఓడి పోయిరి. అనరణ్యనృపుడను రాజొక్కడు మాత్రమే రావణునకు భయపడక యెదిరించెను.

రావణుడిట్లు జైత్రయాత్రజేయుచు ఒకనాడయోధ్యకు బోయి, ఆ పట్టణపు రాజైన అనరణ్యనృపుని జూచి ఓరాజా! నీ ప్రతాపమును శూరులగు వారు నాతో చెప్పగావిని యున్నాను. కావున నీతో యుద్ధము జేయుదమను సంకల్పముతో వచ్చియున్నాను. నీవనుమానింపవలదు నీకు శక్తియుండిన నాతో యుద్ధము జేయుము. శక్తి లేకుండినచో వెఱచితినని చెప్పుము. నిన్ను విడచి వెళ్ళెదనని రావణుడనగా విని అనరణ్యనృపుడు కోపముతో కనులెఱ్ఱజేసి, రాక్షస

రాజా! నీవిట్లు దుర్మార్గముగా మాటలాడుట న్యాయముగాదు. పెద్దలగు వారు తనబేలతనముతో తమ పెద్దఱికమును చెప్పుకొనరు. కానిమ్ము నాతో నెదిరించి పోరాడే బలము నీకుండెనేని ద్వంద్వ యుద్ధమున నిలచిపోరాడుము. నీరూపుమాపెదనని చెప్పుచు, ఈ భూమినే పెళ్ళగింపగల అనేక మంది సైనికులును అనేక రథములును, అనేక మదపుటేనుగులును, కొన్ని వేల రథములును, కొన్ని వేల గుఱ్ఱములును గల తనబలగముతో గలిసి రావణుని సైనికులతో అనరణ్యనృపుడు యుద్ధము గావించెను. ఆ యుద్ధము దేవాసుర యుద్ధమువలె కడు భయంకరముగానుండెను. ఆ యుద్ధములో అనరణ్యనృపుని సైనికులు చాలా మంది మరణించిరి. అది చూచి అనరణ్యనృపుడు రోషముతో సమస్తాయుధములతో నింపిన రథముపై నెక్కి రావణునెదిరించెను.

**రావణుడు :** ఓరాజా! ఆకలి దప్పులతో నరాహుతి గోరుచున్న రాక్షస సైనికులకు నరసైనికులను దెచ్చి ఆహారముగా బెట్టితివి, ఇక నీవు నాబాణ జ్వాలల కాహుతికాగోరి వచ్చితివి. అనగా అనరణ్యనృపుడు రావణుని పది కిరీటములను నేలపై బడగొట్టెను. ఆదెబ్బకు రావణుడు క్రుద్ధుడై తన అఱచేతితో అనరణ్యనృపుని తలపై యొకతట్టు దట్టెను. ఆదెబ్బకతడు పిడుగుబడినప్పుడు కూలు మహావృక్షము వలె క్రిందబడెను. రావణుడా రాజును జూచి ఓరాజా! నేను వెఱచితినని చెప్పుటకు సిగ్గుపడి నీవింత ప్రమాదముదెచ్చుకొంటివనగా ఓరావణా! మావంశములో ఒక మహాపురుడు పుట్టి నిన్ను చంపగలడు. నేను ధర్మము తప్పనుగాన నామాటలు నిజమగుగాక! అనగావిని దేవతలతనిపై పుష్పవర్షము కురిపించిరి.

రావణుడామాటలు విని రోషకాషాయ నేత్రుండై అనరణ్యనృపుని తనగదతో మోదగానతడు మృతుడయ్యెను అని అగస్త్య మహామునీంద్రుడు చెప్పగా శ్రీరాముడిట్లు ప్రశ్నించెను. మునివరా! విరోధియగు రావణునెదిరించుటకు రాజులీ భూమిమీద లేకనేయుండిరా? వీరధర్మమేమైనా చెడియుండెనా? రాజుల కుండిన శౌర్య, ధైర్యములు మట్టిలో గలసియుండెనా? శత్రువును జయించు వాడొకడైనను లేకపోయిరా? దయయుంచి నాకీసందేహమును తీర్చుమని రామచంద్రుడడుగగా మునిచంద్రుడు చెప్పుచున్నాడు.

ఓ రామచంద్రా! తనచే జయింపబడిన శత్రువు యొక్క ఓటమిని వినగోరు చుంటివి. నీ సద్గుణములనేనేమని పొగడగలను.

## రావణుడు కార్తవీర్యార్జునుని మీదికేగుట

రావణుడు భూలోకమునంతయు జయించినను అతడోడిన కథగలదు. మాహిష్మతియను పట్టణమునందు కార్త వీర్యార్జునుడను నొక రాజుండెడు వాడు. అతనికి వేయి చేతులు గల్గి మహాపరాక్రమవంతుడై తనకెదురు లేక రాజ్యమేలు చుండెను. అకాలమున రావణుడు జైత్రయాత్రజేసి కార్తవీర్యార్జునుడున్న మాహిష్మతియను పట్టణమునకు బోయెను. అచట కార్తవీర్యార్జునుని మంత్రులను జూచి మీ రాజుగారెక్కడికి వెళ్ళియున్నాడు యుద్ధము చేయుటకు వచ్చియున్నాను. మీరీసంగతి రాజునకెరిగింపుమని మంత్రులతోచెప్పెను. వారదివిని రాక్షస రాజా! మారాజు గారు రాణులతో విహారార్థముగ నర్మదానదికి వెళ్ళియున్నారు. ఆయన యీదినంగాని రేపుగాని రావచ్చును, అసలు వచ్చునోరాడో, స్త్రీలతో వెళ్ళిన రాజుల మాటయెవరు చెప్పగలరు.

నీ వీసందర్భములో వెనుదిరిగిపోయి మరొక సమయములో వచ్చుట మంచిదని అనగా విని రావణుడు నవ్వుచు నారాకను ముందే తెలిసికొన్న మీరాజు నన్నెదిరించుటకు భయపడి పారిపోయినవానితో ఈ రావణుడు పోరాడడని తెలుపుచు మంత్రులగు ప్రహస్తాదులతో కూడ మాహిష్మతి నుండి వెడలిపోయెను.

ఇట్లు మహిష్మతి నుండి రావణుడు వెనుదిరిగి పోవుత్రోవలో వింధ్య పర్వతము నుండి నర్మదానది ప్రవహించుచున్నది. ఆనదిలో జల పక్షులుండెను. తామరలు దట్టముగా నుండెను. అది చూచుటకు చాలా అందముగా నుండెను, అందువలన ఆనదిలో స్నానము జేయవలెనని రావణుడు తన భావంబున దలంచెను.

ఇట్లాలోచించి ప్రహస్తాది మంత్రులను జూచి, మీరందరును ఈనదిలో స్నానము జేయుడు నేను కూడ స్నానమాడి శివునకు పూజగావించెదను. మీరు వెళ్ళి పూజకు పువ్వులను తెమ్మనగా వారు పోయి పువ్వులనుదెచ్చి కొండవలె రాశిబోసిరి.

రావణుడానదిలో స్నానమాడి సంకల్పము జెప్పి మడిబట్టలు గట్టి మహానిష్ఠా, గరిష్ఠుడై, ఓం నమశ్శివాయ అను మంత్రమును పఠించుచు ఏకాంతముగా నొక ఇసుక తిన్నెమీదవసించి అందొక యిసుకతో నొకశివలింగముగా చిత్రించుకొని శివుని దేవతగా ప్రాణ ప్రతిష్ట గావించి ఆవాహమును, ఆసనమును, అర్ఘ్యమును, పాద్యమును, స్నానమును అమృతాభిషేకమును, వస్త్రము, యజ్ఞోపవీతము,

గంధము, పుష్పము, అక్షతలు ధూపము, దీపము, నైవేద్యము, ఆచమనము ఇట్లు రావణుడు శివునకు పూజగావించు చుండెను.

అతడు పూజకు ప్రారంభించినప్పుడు విఘ్నములు కలుగకుండినచో యుద్ధములలో జయము గల్గును. పూజకేదేని ఆటంకములు గల్గిన యుద్ధములో అపజయము గల్గును. ఐనను మదోన్మత్తుడై రావణుడు దానిని గమనింపక తన యిరువది చేతులతో ఈశ్వరునకు పూజ సేయుచు, తమ పదినోళ్ళతో హర హర, ఓంహరహర అను మంత్రమును ఆకసమున ప్రతి ధ్వనులిచ్చునట్లు పఠించుచు తన శరీరమును కొంచెమైనను కదలనీయక పూజగావించుట అనగా అది రావణునకే తగియున్నది. కాని మరెవ్వరు గాని ఇంత నిష్ఠాగరిష్టులై సేయుజాలరు. అందువలననే, అతడు తపోనిష్ఠయందుండి దేవుని మెప్పించి వరములను పొందగలిగెను.

రావణుడీవిధముగా నర్మదా నదీతీరమున శివలింగమునకు పూజగావించు చుండెను. కార్త వీర్యార్జునుడు తన రాణులతో వన విహారము జేసి, అలసిపోయి నర్మదానదికి వచ్చెను. ఆనది పశ్చిమ దిశగా ప్రవహించు చుండెను. అందరును ఆనదిలో దిగిరి. ఆయన తన వేయి చేతులను, ఆనదికి అడ్డుకట్టవలె అడ్డుపెట్టగా ఆనదీ జలము అతని చేతులనుండి తప్పించు కొనిపోజాలక నిలుచుచు అదియొకతటాకముగా మారెను. ఆ తటాకములో స్త్రీలు జలక్రీడలాడిరి. ఒకరిపై నొకరు నీళ్ళు చల్లుకొనుచు ఒకరు నీటిలో మునిగి లోపలనే బోయి మఱియొకరిని క్రిందనేకాలుబట్టి లాగుచు, ఒకరి వీపుపై మఱియొకరు కూర్చొనగా, క్రిందనున్న వారు పై నుండువారిని మోయుచు నీటిలో మునుగ కుండ ఈత గొట్టుచు, ఈ విధముగా రకరకములుగా ఆడుకొనుచుండిరి. ఆ నీరు దరులకెగదట్టి పడమరకు ప్రవహింపలేక తూర్పు దిశకు బారుటకు పారలుచుండెను, పర్వతములనైనను త్రెంచుకొని పోవు ప్రవాహ జలము, కార్తవీర్యార్జునుని కరములు అనెడి కట్టను త్రెంచజాలకపెల్లుబికి రావణుడు పూజసేయుచున్న శివలింగమును ముంచివైచెను.

ఆ నదీ జలము ఓ రావణా! కార్తవిర్యార్జునుడు నన్ను నిలగట్టి యున్నాడు, నీకిక్కడింకను పూజలేమిటి? నీవతనిపై దండెత్తి పోవలసిన కాలమాసన్నమైనది. లేలెమ్మని చెప్పుచున్నదా యనునట్లు ఆ నదీ జలము హోరుమని శబ్దము జేయుచున్నను దానిని లెక్కజేయక రావణుడు పూజసేయుచునే యుండెను. నీరెగదట్టి శివలింగము మునిగిపోవుచుండెను మౌనములో నున్న రావణుడు

చేతులను తట్టగా ఆశబ్దము విని మంత్రులు వచ్చిరి. శివలింగ మిట్లుమునుగుటకు కారణము తెలిసికొనుడని సైగతో జెప్పెను. మంత్రులలో శుకసారణులను వారు నదిగట్టుమీద కొంత దూరము వెళ్ళిచూడగానచట స్త్రీల కలకల ధ్వనులు వినబడెను, అదిచూచి వారు వెనుదిరిగి వచ్చిరి.

రావణునితో దేవరా! ఒక మహాపురుషుడు మద్దిమాని కంటె పెద్దవాడు రూపమున మన్మధుని మించిన వాడు, బలమైనవాడు. తన వేయి చేతులతో నదిని అడ్డగించినాడు. అందు వలననది పడమర దిశగా ప్రవహించుట మాని నీరెగడట్టి తూర్పునకు దిరిగినది. ఆయన తమకంటె గొప్పగా కనబడుచున్నాడు. రాజులలో మేమింత వరకు ఇంత బలవంతుని చూడలేదు అని మంత్రులు చెప్పగా విని శివపూజ చాలించి భళి, భళీ అతడు మాహిష్మతీపుర రాజు కార్త వీర్యార్జునుడుగావచ్చును. అతడింతకాలమునకు నాకు కనబడినాడు. కానీ అతడధికుడో లేక నేనధికుడనో యుద్ధము జేసి తేల్చుకొన గలను. ఇక మనకాలస్యమెందుకు లెండు, రండు, త్వరపడుడు అని సైనికులను సమాయత్తము జేసి యుద్ధము జేయు నుత్సాహముతో బలముగా అఱచుచు బయలుదేరెను.

ఆ సమయమున వారికనేక దుశ్శకునములయ్యెను. వారది లెక్కజేయక నదియొడ్డున పడమర దిశగా బోవుచుండిరి. కొంత దూరములో తన స్త్రీ జనముతో జలక్రీడలాడుచున్న కార్త వీర్యార్జునుడు కనబడెను. రాక్షసులతని వద్దకు బోవు చుండగా త్రోవలో కార్త వీర్యార్జునుని మంత్రులడ్డగించి మీరెవరు? మారాజుగారు తమ స్త్రీ జనముతో జలక్రీడలాడు చున్నారు. మీరు సభ్యత పాటించక అక్కడికి పోవుట మరియాదగాదని కార్త వీర్యార్జునుని మంత్రులనగా.

**రావణుడు :** నేను రాక్షసరాజును. లంకాధిపతిని. మీరాజు గారితో యుద్ధము సేయవలెనను కోఱికతో వచ్చియున్నాను. మీరు మీరాజు గారికి దెలిపి శీఘ్రముగా దీసుకొనిరమ్మనెను.

రాక్షస రాజా పోరానిసమయములో పోయి యుద్ధమునకు బిలుచుట మర్యాదకాదు. మీరు యుద్ధము గోరి వచ్చియున్నారు. ఆపని మేమే తీర్చెదము మారాజు అవసరములేదనిరి. ప్రహస్తుడదివిని మీతో మేమే యుద్ధము సేయ గలము మారాజు గారెందుకనిరి.

ఈ విధముగా వాదించుకొని మంత్రులతో మంత్రులు తలపడిరి, రాక్షసులు కార్తవీర్యార్జునుని సైనికులను కొందరిని తినివేయుచుండిరి. రాక్షస మంత్రులు వీరిని ఘోరముగా నొప్పించుచుండిరి.

అదంతయును చూచి కంచుకి పరుగెత్తుకొని పోయి దండము బెట్టి కార్తవీర్యార్జునునితో స్వామీ యెవడో రావణుడట మొనగాడట తమపై యుద్ధమునకు వచ్చి యున్నాడట మన మంత్రులతో సైనికులతో తలపడి యుద్ధము జేయు చున్నారు. రాక్షసులు మన సైనికులను తినివేయుచున్నారని చెప్పెను.

ఆ మాటవిన్న కార్తవీర్యార్జునుడు కోపముతో నది కడ్డుపెట్టియున్న చేతులను, దీసి గదను చేబూని కదనమునకు బయలు దేరెను. అతనికి రావణుని మంత్రి ప్రహస్తుడడ్డమై నిలచెను వానిని కార్త వీర్యార్జునుడు తనగదతో గొట్టగా వాడు కొండవలె క్రిందబడి మూర్ఛిల్లెను. మిగత రావణుని మంత్రులు కార్త వీర్యార్జునుని దెబ్బలకు తబ్బిబ్బై పారిపోయిరి.

ఇట్లు తన మంత్రులు పారిపోగా రావణుడు కార్తవీర్యార్జునితో గదా యుద్ధము గావించెను. వారిరువురురియుద్ధము చూచు వారికి చోద్యము కలిగించు చుండెను. సింహముతో మఱియొకసింహమును, ఏనుగుతో మఱియొక ఏనుగును, కొండతో మఱియొక కొండయును తాకులాడినట్లుండెను. వారు గదలతో ఒకరినొకరు కొట్టుకొనుచు, గదలను చక్రాకారముగా గిరిగిర ద్రిప్పుచు, గదతో గదనే గొట్టుచు రావణుడాగదా కౌశలమును జూపుచు మించు చుండెను, కార్త వీర్యార్జునుడతని దూకుడునరికట్టెను.

వారిరువురు పోట్టేళ్ళవలె దూరముగా బోవుచు, జోరుగా వచ్చి ఒకరి భుజముల నొకరు తాకుచుండిరి. బలిసిన గూలికోడెలవలె బలముగా ఒకరినొకరు తలలానించి తోపులాడిరి. కొంత సేపు ఆయుధములను విడచి మల్లులవలె మల్లయుద్ధమును గావించిరి. పిడికిళ్ళతో గ్రుద్దుకొనిరి తీటలు దీరువరకు తీవ్రముగా పోరాడుకొనిరి. మరలా గదలచే మార్కొని పోరాడిరి. కార్తవీర్యార్జునుడు తన గదచే రావణుని గొట్టెను. అనాడు బ్రహ్మయిచ్చిన వరప్రభావము వలన కార్తవీర్యార్జునుని దెబ్బకు చావక రావణుడు మూర్ఛబడెను రావణుని బంధించి కార్తవీర్యార్జునుడు మాహిష్మతికి తీసికొని వెళ్ళుచుండగా రావణుని మంత్రులు దారికడ్డు పడిరి. కానీ అతని నెదిరించి నిలువలేక ఓడిపోయి వెనుదిరిగి పోయిరి. తరువాత రావణుని కార్తవీర్యార్జునుడు పట్టణమునకు దీసుకొనిపోయి, బాగా బంధించి చెఱశాలలో బెట్టెను.

ఇట్లు కొంతకాలము జరిగెను. దేవతల వలన పులస్త్యబ్రహ్మకా సంగతి దెలిసెను. దేవతలు వెంటరాగా పులస్త్య బ్రహ్మమాహిష్మతికి వచ్చెను. కార్త వీర్యార్జునుడాయనకు గౌరవ మర్యాదలు గావించి తాము వచ్చిన కార్యమును తెలుప

వలసినదిగా పులస్త్యబ్రహ్మను కోరెను. పులస్త్య బ్రహ్మ ఓరాజా! రావణుడు నామనుమడు. మీతోయుద్ధము జేసి ఓడిపోయెను. అతనిని మీరు బందీగా చెఱసాలలో బెట్టితిరి. నన్ను జూచి అతనిని విడువ వలసినదిగా కోరుచున్నాను. అనగా, పులస్త్యబ్రహ్మను గౌరవించి రావణునకు గట్టినకట్లు విడిపించి పులస్త్యబ్రహ్మ కప్పగించెను వారందరును వెళ్ళిపోయిరి.

ఓ రామచంద్రా! రావణుడీ విధముగా దుర్మార్గపు ప్రవర్తనగలవాడై ఈ భూలోకమంతయు తిరుగుచు బలవంతులపై బోవుచు వాలి మహాబల శాలియని తెలిసికొని ఆయనతో యుద్ధము సేయవలెనను తలంపుతో ఒకనాడు కిష్కింధకు బోయెను. అచట ద్వారము ముందు నిలువగా రావణుని చూచుటకు వానరులందరును గుమిగూడిరి.

## రావణుడు వాలిపైకేగుట

రావణుడు వారిని జూచి మేఘములు ఉఱిమినట్లును పిడుగులు బడినట్లును సింహగర్జన జేసి శబ్దము గావించెను. ఆ శబ్దమును విని తారుడను వానరుడచటికి వచ్చి రావణుడని తెలిసికొని రావణా! నీవేమి కార్యార్థమై యిచటికి వచ్చియున్నావని యడిగెను. రావణుడతనితో వాలి మహా బలశాలియని విన్నాను. ఆయనతో యుద్ధము సేయవలెనను కోఱికతో వచ్చియున్నాను. అనగా తారుడువిని రావణునకు వాలి బలము నెఱిగించెను.

రావణా! వాలి మహాబలశాలి. ఆయన మందర పర్వతమునే కవ్వముగా జేసి వాసుకిని త్రాడుగా జేసి దేవదానవులే విధముగా సముద్రమునందు త్రిప్పియున్నారో, ఆ విధముగా ఈ భూమిని త్రిప్పగలడు. మాయావులైనరాక్షసులనే అరణ్యమునకు వాలి దావానలము వంటివాడు. వాలి తన పాదములతో గట్టిగా తన్నెనేని పర్వతములు పిండికాగలవు. వాలి వజ్రము వంటి తనవాలమును ఆకసములో త్రిప్పినప్పుడు ఆవాలముదగిలి చుక్కలు క్రిందికి రాలి పోగలవు. చావులేని అమృతము ద్రావినవారైనను వాలితో దలపడి యుద్ధముగావించినచో చావగల రేగాని అమృత ప్రభావము చేబ్రతుకగలరని నమ్మకములేదు. ఉన్న సంగతి నేను చెప్పుచున్నాను. అదంతా నీకెందుకు నాకాయనతో యుద్ధమే కావలెనను కోఱిక నీకుండినచో ఆయన ఇప్పుడే దక్షిణ సముద్రమునకు స్నానమునకు వెళ్ళి యున్నాడనెను.

తారుడు చెప్పగావిని రావణుడు దక్షిణ సముద్రమునకు వెళ్ళెను. అచట వాలిస్నానము జేసి సంధ్యవార్చుకొని సూర్యునకర్ఘ్యమిచ్చు చుండెను. ఆవాలి వాలకమును చూడగా కోతి రూపముదాల్చిన అగ్ని దేవునివలెను, గంభీర రూపుడగు యమధర్మరాజువలెను కనబడుచు, సూర్యునకర్ఘ్యమిచ్చు చుండెను. కానీ రావణుడాతనిని సామాన్యపు కోతిగా భావించి అతనిని మోసగించి పట్టుటకు యత్నించి పుష్పకముదిగి తన మంత్రులు చూచుచుండగా వాలి వెనుక భాగమున మెల్లమెల్లగా అడుగులు బెట్టుచు బోవుచుండెను. ఇతడెంత మెల్లగా అడుగులు బెట్టుచుండినను తనవెనుక భాగమున నెవరోవచ్చు చున్నట్లు వాలికనుమానము గలిగెను. కానీ తానుకూడ జాగ్రత్తపడి అటువైపు చూడనివానివలె ఓరగంటితో వెనుకవచ్చువానిని చూచి గమనించెను. కాని చూడని వానివలె తానును నటించు చుండెను.

రావణుడు వెనుకనేబోయి తూర్పుదిశకు మరలియున్న వాలి చంకలక్రింద వాలియొక్క వెనుకవైపు నుండి చేతులు బోనిచ్చెను. వాలి తన చంకలునుసళ్ళు పదలుతూవచ్చెను. రావణుడు పూర్తిగా వాలి ప్రక్కలలో చేతులు ముందుకు చాచి భుజముల వరకు పైకెత్తి అటువైపు చేతులను ఇటువైపు చేతులను వాలి మెడపైన కైదండ గూర్చినట్టు పట్టుకొనెను.

అంత వరకు వాలి సహకరించి రావణుని యిరువది చేతులును తన చంకల క్రిందనుండగా చంకలను బాగా అదిమిపట్టెను. ఆ పట్టునకు రావణుని చేతులు ఆనాడు వెండి కొండకింద నిఱుక్కొనప్పుడువలె ఇరుక్కొనిపోయెను. రావణుని ప్రాణముపైలోకములకు వెళ్ళునట్లుండెను. అక్కడ నుండి వాలి రావణునిఱికించు కొని పైకెగిరెను. నాల్గుసముద్రముల యందును రావణుని ఇఱికించుకొని స్నానము జేయుచు సంధ్యవార్చుచు ఆకసమార్గమున బోవుచు, కడపటకిష్కింధ ద్వారమున దిగి ఏమీ తెలియనివానివలె తన చంకలను సళ్ళువదలెను రావణుడు రాలిక్రింద బడెను. వాలి చంకలలోనలిగిన రావణుడు ప్రాణమున్న పీనుగువలె క్రిందబడెను.

ఏమియును తెలియని వానివలె వాలి రావణుని వైపు జూచి, ఓహో రావణులవారా! ఎప్పుడువచ్చితిరి అని యడుగగా రావణుడు గర్వము లేనివాడై శరీరమంతయు చెమటలు గ్రమ్ముచుండగా భయముతో గడగడవణుకుచు, కన్నుల యందు నీరుగార్చుచు, శరీరము వణుకుచుండ గ్రుక్కుళ్ళుమ్రింగుచు, లేచి మరలా పుట్టితినని దలంచుచు, వానరరాజగు వాలిని జూచి ఓ దేవేంద్ర తనయా

బలవంతుడైనను అపాయము జేయని దయామతివి. చలనములేని మనస్సుగల వాడవు. ధైర్యశాలివి. నీకునీవేసాటి, నీవింత బలవంతుడువని నేనిప్పుడు తెలిసికొంటిని. నా మదమణగి పోయినది. సమస్త జనుల చేత కీర్తింపబడు వానివి. నేను కైలాస పర్వతమును కదలించితిని. అష్టదిక్పాలకుల హడల గొట్టితిని. నేనే మహాబలవంతుడనని నీల్గుచుంటిని. నాకెదురులేరని గర్వించు చుంటిని. అట్టినన్ను నీవాకాశమార్గమున నెత్తుకొని తిరిగితివి. నీ భుజబలమునందు నాభుజబలము తీసికట్టు గాలివేగము గరుత్మంతుని వేగమును నీ వేగముతో సమానముగావు. నేనెందరినో బలవంతులను జూచియున్నాను. నీయంతటి బలవంతుని నేను చూడలేదు. ఇది నేను సేయు ముఖస్తుతిగాదు. నిజమే చెప్పుచున్నాను. నీవు నాకన్నదమ్ముడవు. నీ తమ్ముని సుగ్రీవుని జూచునట్లు నన్ను చూచిమన్నింపుము. నాధనమంతయునీది. నా మనస్సెప్పుడును నీ స్నేహమునే గోరుచుండును అని దీనముగా బ్రార్థించిన రావణుని వాలి తన యింట నెలదినములు బెట్టుకొని తన తమ్ముని సుగ్రీవుని జూచినట్లు చూచి తగిన మర్యాదలు జేసి వాలి రావణుని బంపివేసెను.

ఓ సీతానాయకా రామచంద్రా! ఇంతటి బలవంతుడగు వాలిని ఒక్క బాణముతో గూల్చితివి. కార్తవీర్యార్జునుని జయించిన పరశురాముని భంగపరచి యోడించితివి. కావున నిన్నింతవాడని తెలియుటకు సాధ్యముగాదు. రావణుడీవిధముగా దిరుగుచు రాజులనోడించుచు తిరుగుచుండెను.

ఇట్లు తిరుగుచున్న రావణునకొకనాడు త్రోవలో నారదుడెదురయ్యెను. ఆ నారదునకు రావణుడు నమస్కారములు జేసి మహాత్మా! ఇప్పుడు మీరెక్కడ నుండి వచ్చుచున్నారు. ఇంకెక్కడికి వెళ్ళుచున్నారు? ఈ ప్రపంచమున గల విశేషములేమి? నేను రాజులను గెలుచుట అందరికిని తెలిసినదా? నా బలశౌర్యములను గూర్చిలోకులు బాగా చెప్పుకొనుచున్నారా? అని నారదుని అడిగెను.

**నారదుడు :** ఓరావణా! నీకు క్షేమమేకదా? నీవిపుడెచటికి పోవుచున్నావు? ధైర్య శౌర్యశాలివగు నీవు మానవుల మీదికి బోవుట చూడగా నా మనస్సు పరితాపము చెందుచున్నది. ఏలననగా నీవు మానవులపై బోవుట పిచ్చుకపై బ్రహ్మాస్త్రము వంటిది. మా వంటివారు సంతోషింపవలెనన్న ఆ విష్ణువు మీదనో ద్వాదశాదిత్యుల మీదనో దేవేంద్రునో గెలచిచూపించవలెను. వ్యాధులతో ముదుసలి తనముతో వికార స్వరూపాలతో కృశించుచున్న భ్రాంతి పరులగు మానవులను నీవంటివాడోడించుట,

మా వంటివారు వినుటకు వికారముగా నుండును. నీ వింతవరకు జేసిన వీరవిహారమెట్లున్నదనగా ఏనుగు దోమలతో యుద్ధము జేసి జయము సంపాదించి నట్లున్నది. నీవు మనుష్యులతో యుద్ధము జేయుచున్నావు. బాగా ఆలోచించుము. నీవానాడు బ్రహ్మదేవుని వరములడుగు నప్పుడు నరుల, వానరులను లెక్కజేయనని చెప్పియుంటివి. ధీరత్వముతో నీవెదిరించవలెనన్న పాతాళలోకములో పన్నగులు, రాక్షసులు ఉన్నారు కదా? అని నారదుడు భూలోకవాసులకు మేలు సేయదలచి రసాతల వాసులను జయించవలెనను కోరిక రావణునకు గలుగునటుల జేసెను. నామాట హితబోధగా గుర్తించి పాతాళ వాసులను జయింపబొమ్ము అనిచెప్పగా నారదుని మాటలను వినిరావణుడాలోచించెను.

మునీంద్రా! మీరు మనుషులపై దయదలచి నాకిట్టియుపదేశమును గావించితిరి. ఔను మీరు చెప్పినది కూడనిజమే. భయపడువారిని కొట్టుట శూరుల లక్షణమనిపించుకోదు. కావున నేను పాతాళ లోకమునకు బోయి బలిచక్రవర్తిని జయించి. ఆ తరువాత పన్నగులను జయింతును. కావున నాకాశీర్వాదములిచ్చి ఆనతీయుమనగా!

నారదుడు ఓ రావణా! నీవు రసాతలమునకు పోవలెనన్న మొదట సమ్యముని త్రోవలో వెళ్ళుము. నీవు పోయినందుకు యముడు నిన్నెదిరిచును. సకల ప్రాణుల ప్రాణాలను దీయుచున్న యమధర్మరాజును నీవు జయించి, కీర్తిని సంపాదించ గలవు అనిన నారదమునీంద్రునకు నమస్కరించి, ఓ దేవమునీంద్రా! నీవు నాకిప్పుడు మంచిహిత బోధగావించితివి. నేను యమధర్మరాజుతో మొదలిడి దిక్పాలకుల నందరినీ జయించెదను. తరువాత రసాతలమునకు వెళ్ళెదనని ప్రతిజ్ఞగావింపగా రావణునాశీర్వదించి నారదుడు తనదారిన పోయెను.

నారదుడిట్లు యమధర్మరాజుపై రావణుని పురికొల్పి ఇట్లాలోచించెను. రావణుడు చాలాక్రూరుడు. మూడు లోకముల వారిని బాధించుటకు సమకట్టి యున్నాడు. యమ భటులకును రాక్షసులకును యుద్ధము తప్పదు. నేనాయుద్ధమును కన్నులకానందముగా చూడగలనని తలచుచు యమునకు యముడై రావణుడు సంయమ పురికి పోయియున్నాడు. ఎందుకైనను మంచిది ఏలననగా ఈ దినము నుండి భూలోకవాసులకు కష్టములు గట్టెక్కినవి. ఇకమీదట దేవతలపై పోగలడని తలంచుచు నేనిక ఆలస్యము సేయకూడదు నేనీవిషయమును యమధర్మరాజునకు తెలియజేయవలెనని నారదుడు యమసభకు బ్రవేశించెను.

యమ సభలో కణ్వ గార్గేయ మార్కండేయ మొదలగు మునీంద్రులు ఒకవైపు స్తుతివాదములు సల్పుచుండిరి. ఒకవైపున యమభటులు తాముదెచ్చిన జీవులను యమధర్మరాజునకు చూపుచు హెచ్చరికలు సేయుచుండిరి. మరొకవైపున దూతలు యమునితో స్వామీ! మేమెక్కడికి వెళ్ళవలెను. ఎవ్వరెవ్వరిని తీసుకొనిరావలెనని యడుగుచుండిరి. చిత్రగుప్తుడు చిట్టాపుస్తకములో నుండినట్లు జీవుల పాప పుణ్యములను తెలుపు చుండెను. ధర్మపీఠమున కాలము దండము మృత్యువులను తన సమీపమున బెట్టుకొని యమధర్మరాజు తనకొలువు నుండి నారదమునీంద్రుడు వచ్చుట గమనించి తానెదురుగ బోయి నారదుని తీసుకొనివచ్చి ఉచితాసనమున కూర్చుండబెట్టి, అర్ఘ్య పాద్యాదులిచ్చి ఓదేవమునీంద్రా! మీరిపుడెక్కడ నుండి వచ్చితిరి. మాతో మీకిక్కడ కావలసిన కార్యములేమైన నుండిన, సెలవిచ్చినచో చేసెదననెను.

## రావణుడు సంయమునిపై బోవుట

**నారదుడు :** ఓ యమధర్మరాజా! నీ ప్రతాపమును గూర్చిపొగడు చుండగా కొండను ఢీకొట్టుటకు వచ్చెడు మేకపోతువలె రావణుడు నీమీదికి వచ్చుచున్నాడు. అందువలన నీవిపుడు యుద్ధమునకు సిద్ధముగా నుండుట మంచిదని చెప్పెను.

**యమ ధర్మరాజు :** ముని శ్రేష్ఠా! మా పురము మీదికి వచ్చుటమేలే. అతడు వచ్చెనేని మీదయవలన ఆ రావణుడు నన్నెదిరించెనేని, నాశౌర్యము ఫలించునట్లు జేసెదను. ఈ కాలుని కాలదండములను వాడెరిగినట్లులేదు. మృత్యువాత బడుటకు కాలమువానికి దగ్గరించినది. అట్లుగాకున్న వానికీ బుద్ధి పుట్టియుండదు. కానిండు నా సాహసమును ధైర్యమును ఈ మునీశ్వరులును మీరును చూచెదరుగాక ఊరక మీయెదుట నేను గర్వపు మాటలు చెప్పనేల అని చెప్పిసభజరుపుచుండెను.

**అగస్త్యుడు :** ఓ రామచంద్రా! తరువాత కథను వినుము. నారదుని వలన దీవనలంది మహా ధైర్యవంతులు సాహస వంతులునగు రాక్షసులు తనను గొలుచు చుండగా రావణుడు యుద్ధసన్నద్ధుడై వచ్చి యమపట్టణపు గోపురమును జూచెను. ఇట్లు చూచి మరియు కొంత దూరమునకు వెళ్ళగా పోనుపోను చీకటులు దట్టమై యేమియు కానరాకుండుట వలన రావణుడున్న పుష్పకవిమానమున కమర్చియున్న మణుల ప్రకాశమాచీకటులను చీల్చుకొని పోవుచుండెను. లోనికిపోవుకొలది వారికనేక వింతలు కనబడుచుండెను. అక్కడ యమభటులు కొందరు ప్రేతలను కత్తులతో కోసివారి శరీరములను కారపు నీటిలో ముంచుచుండిరి. మఱికొందరు

బాకులతో గ్రుమ్ముచుండిరి. ఇంక కొందరు నీచవాక్యములతో తిట్టుచుండిరి. ఇంకా కొందరిపైన ఉక్కు కోరలుగల్గిన కుక్కలను సికొల్పి ఆకుక్కలతో కరిపించుచుండిరి. మరియు కణకణముండెడు నిప్పులుగల యేరులలో త్రోచి వారు లేచుటకు యత్నించునప్పుడు వారిని అమ్ములతో గొట్టి వారినక్కడనే బడద్రోయుచుండిరి. మరికొందరిని నెత్తురు చీమునిండియున్న బావులలో బడద్రోయుచుండిరి. ఆ బావిలో ఇనుప చీలల వంటి ముక్కులుగల పురుగులు కుట్టుచుండగా, ఆ బాధలను భరింపలేకయేడ్చు చుండిరి. వేరొక కొందరిని బాగా కాలిన ఇనుపరేకుల పెనములపై అటు యిటు దొరలించు చుండగా ఎగిరి పడి మూర్ఛబోవు చుండిరి. మరికొందరిని సలసలకాగెడు నూనెగల పెనములలో వేయగా బొబ్బలెగిరి యేడ్చుచుండిరి. ఆ యమదండనలను జూచి రావణుడు ఆశ్చర్యముతో తలలూపు చుండెను.

మరియు పంచాయతీలలో తమ వారికొక విధమును తనకు సంబంధము లేనివారి కొకవిధముగను చూచినది చూచినట్లుగా జరిగినది జరిగినట్లుగా గాక తప్పుడు సాక్ష్యములు చెప్పువారిని, ఎల్లప్పుడబద్ధములు చెప్పుచుండెడు వారిని, రౌరవమనెడినరకము నందు ద్రోచి బాధలు బెట్టుచుండిరి. తమ కులమువారిని అంతముజేసి, హత్యసేయువారిని మరియు నెలలునిండకనేగర్భమును పోగొట్టుకొను వారిని, గోవులను చంపువారిని ఊపిరాడనివ్వక ఉచ్ఛ్వాస నిశ్వాసము లాడనివ్వక ముక్కులనుబిగబట్టు చుండిరి. బ్రహ్మజ్ఞానిని చంపిన వారిని, కల్లు త్రావిన వానిని, బంగారమును దొంగిలించిన వానిని సూకరము అనే నరకమునందు ద్రోయగా వారు శిక్షలనుభవించు చుండిరి. మరియు గురుభార్యతో సంబంధమును బెట్టు కొన్నవానికి స్వశ్రుగామి, రాజును చంపినవానికిని తప్తకుంభమనే నరకమునందు వేసి శిక్షించుచుండిరి. మరియు కూతురును, కోడలిని పట్టుకొన్న చెడువారిని అగ్నిజ్వాలలో వేసిమాడ్చుచుండిరి. తమకు తగని స్త్రీలను పట్టుకొన్న చెడువారిని లవనయాతనమను నరకములో ద్రోయుచుండిరి. ఇట్టి నరకములనుభవించెడు వారిని చూచి రావణుడు మరొకవైపునకు జూచెను. వేతనము దీసికొని వేదములు నేర్పించువారిని, వేదములను నిందించువానిని విమోహము అనునరకము నందు బడద్రోయు చుండిరి. తమ యింటికి వచ్చిన అతిథులను తమ యింటిలో గలముదుసలులను, ఇంటి యజమాని వారికి భోజనము పెట్టియున్నారా? అని తెలిసికొని, వేళమీరి యుండినచో వారికి పెట్టించి, వేళ మీరక యుండినచో వారికి పెట్టించే ప్రయత్నము జేసి తరువాత తాను భోజనము సేయవలెను. అట్లుగాక

వారిని గూర్చి విచారించకనే భోజనము జేసినవారిని పురుగులనే అన్నముగా బెట్టి తినిపించు చుండిరి. యజ్ఞములు జేయుచుండగా చెడుగా భావించి చెప్పువారిని తలక్రిందికి బెట్టి వ్రేలాడదీయుచుండిరి. వ్యాపారము జేయు బ్రాహ్మణులను అంధకారమనే కూపమునందు శిక్షించు చుండిరి. పండుగ దినముల యందును, వ్రత దినముల యందును, అమావాస్య పూర్ణిమ దినముల యందును స్త్రీలతో కూడిన వారిని, ఇండ్లకగ్గిబెట్టిన వారిని, బంధువుల నేడ్పించెడు వారిని వైతరణి యనునది యందు త్రోయుచుండిరి. వనమునజెకిన వారిని, అసిపత్రవనము నందు త్రోయుచుండిరి. (అసిపత్రవనమనగా ఆవనములో చెట్ల ఆకులు కత్తువలె నుండును) ఇదంతయు జూచిన రావణుడు ఆశ్చర్య పడుచు తల లూపుచుండెను. మరియొకవైపునకు జూచెను.

కొందరు అలంకరించుకొని రత్నసింహాసనములపై కూర్చొని యుండిరి. మరికొందరు విమానములపై తిరుగు చుండిరి. కొందరు మందారపు పుష్పములతో నలంకరించుకొని తెల్లని గొడుగుల నీడలలో దిరుగుచుండిరి. కొందరు సువాసనలను బూసికొని యుండిరి. కొందరు పురాణములను వినుచుండిరి. కొందరు సూర్యునకున్నంత తేజస్సుతోను, మన్మధునకున్నంత అందముతోను, దేవేంద్రునకున్నంతవైభవముతోను, శివునకున్నంత సంపదతోను మహావైభవమునను భవించుచుండిన పుణ్యాత్ములను రావణుడు మరియొకవైపున జూచెను.

**రావణుని యూహ** : నేను ముందు చూచినవారిని అంతగా బాధలు బెట్టుచు, ఇప్పుడు చూచెడు వారికింత సౌఖ్యములను కలుగజేయుచున్న ఈ యమధర్మరాజు పక్షిపాతియని యూహించి దయయనగా నెటువంటిదో తెలియని దశగ్రీవుడు దయగలవాడై బాధలు బెట్టుచున్న యమదూతలను కొట్టి వారిని తరిమి వైచి కూపములలో నరకముల నుండు జీవులను విడిపించెను. నరకబాధలనుభవించు చుండిన జీవులు తమను ఆబాధల నుండి తప్పించిన రావణుని పొగడుచుండిరి.

ఆ నరకముల యందు బాధలు బెట్టుచున్నయమ దూతలను రావణుడు కొట్టి తరుముచుండెను. కొందరు ఆయుధములను ధరించి రావణునెదరించి ముందునకు అతనిని పోనీకనిలువరించిరి. రావణుని మంత్రులు యమభటులపై యుద్ధము జేసిరి. యమభటులు వారిని త్రిప్పికొట్టిరి. రావణుడు తన యిరువది చేతులయందును ఆయుధములను ధరించి యమభటులను ఆయుధములతో నొప్పించెను. వారతని ధాటికాగలేక పారిపోయిరి.

కానీ రావణుని మంత్రులోకరైనను యమభటులను ప్రతి ఘటించలేక, వారి ముందునిలువలేనందున రావణుడు పుష్పక విమానము దిగి విల్లెక్కు బెట్టి పాశు పతాస్త్రమును యమభటులపై వేసెను. ఆపాశు పతాస్త్రము నుండి అనేక శక్తులు, గదలు, తోమరములు అనేక ఆయుధములు వెలువడి అదిపొగలనుసెగలను గ్రక్కుచు బోయి యమభటులను సంహరించెను. రావణుడు పాశుపతాస్త్రమునుప సంహరించి సింహనాదముజేసెను.

కొందరు యమభటులు దూరము నుండి చూచి యమధర్మరాజు వద్దకు బోయి యమునితో ఓ రాజా! రావణుడు పాశుపతాస్త్రము వేసి మన యమభటుల నందరిని చంపవేసినాడు. కూపముల నుండిన ప్రేతలను విడిపించి సింహనాదము జేయుచున్నాడు. అని యమునకు దెలియజేయగా యముడు తన సారధిని జూచి మనరధమును సమాయత్తము జేసితీసుకొనిరమ్మని యాజ్ఞాపించెను.

**సారధి :** ఎనుబోతుకేతనముగా గల రథమును సమస్తాయుధములతో సమాయత్తముగావించుకొని రథమును దీసుకొనివచ్చి యమధర్మరాజుతో దేవరా! రథమును దెచ్చియున్నానని తెలియజేసెను. యమధర్మరాజు అగ్ని గోళముల వంటి నేత్రములతోను, కులిశాయుధముల వంటి కోఱపండ్లతోను, పండ్రెండు మంది సూర్యులవంటి తీక్షణ ప్రతాపముతోను, తాటి మానంత శరీరముతోను, కాలపాశము, దండము, మృత్యువులకుతోడుగా ఇంకా కావలసినన్ని ఆయుధములతోను రథముపై నెక్కిదేదీప్యమానముగా వెలుగుచు రథములో వచ్చి రావణుని ముందునిలిచెను.

ప్రళయ కాలమునందుండు సూర్యుని వంటి రథమును, ప్రచండముగా వెలుగు కాలదండమును, మరియు కాలపాశమును, ముద్గరాయుధమును, సమీపమున నుండు కాలమృత్యువును, ప్రళయ కాలభైరవునివలె నుండు యమధర్మ రాజును జూచి రాక్షసులు భయము జెంది అదిరి బెదిరి బ్రతుకు జీవుడాయని సత్తాదెలియక పారిపోయిరి.

యమధర్మరాజు రావణుని యెదుటకు వెళ్ళి అతనిపై బాణ వర్షము గురిపించెను. రావణుడు యమధర్మరాజుపై బాణములు గుప్పింపగా, ఆకసమును కప్పివేసి వెలుతురు లేక చీకటులు గ్రమ్మెను. ఆ చీకటులను తొలగించుచు బాణముల మెరుగు వెలుతురులు గ్రమ్మెను. అందువలన సూర్యప్రకాశమును చీకటియును ఒకేచోట కాపురముండినట్లుండెను.

సూర్యుని ప్రకాశము బడగనే చీకటులు తొలగినట్లు యమధర్మరాజు వేసిన బాణములు రావణుని బాణములను తొలగించి అతనిని నొప్పించెను. అపుడా రావణుడు రక్తపు మడువులో నుండినట్లుండియు. చేతులతో తమ భుజములను తట్టుకొనుచు తన పది కోదండములను పది చేతుల యందు పట్టుకొని ఇంకొక పది చేతులతో బాణములను సంధించుచు, గురిజూచికొట్టు చుండెను. ఈవిధముగా ఏడు రాత్రులు పగళ్ళును విరామములేక యుద్ధమును గావించిరి.

ఇట్లు పోరాడుచున్న రావణునిపై యమధర్మరాజు పదివేల బాణములను సంధించి కొట్టెను. ఆ బాణములు రావణుని శరీరము నందు సందులేక గ్రుచ్చుకొనగా నతడు తెలివిదప్పి మూర్ఛితుడయ్యెను. కొంతసేపటికి రావణుడు మూర్ఛ నుండి తెప్పరిల్లి లెక్కలేనన్ని బాణములు వేసి యమధర్మరాజును నొప్పించెను. ఆ దెబ్బల కోర్వజాలక యమధర్మరాజు కోపించి తన బాణములతో రాక్షసుల సైన్యమును అడవిని గాల్చెడుఅగ్నివలె కాల్చివేయు చుండెను. వీరియుద్ధమును దేవతలు జూచి అనేక విధముల ఇరువురిని మెచ్చుకొనుచుండిరి. అప్పుడు మృత్యుదేవత యమధర్మరాజుతో ఓ ప్రభూ! నన్ను బంపించుము. ఆయువు నిచ్చెడు బ్రహ్మదేవుడు కూడ నానుండి తప్పించుకొని బ్రతుకజాలడు కదా! నాకీ రావణుడనగా నెంత అని యమధర్మరాజు నడుగుచుండెను. యముడు తనలో తాను ఈమెను బంపిరావణుని జయించిన నాపరాక్రమంబునకు తక్కువగా నుండునని తలంచుచు మృత్యుదేవతను పంపుటకు సందేహించుచు తన వద్దగల కాలదండమును కాలపాశమును వేయుట యుక్తముగా నుండునని ఆలోచించు చుండెను.

యమధర్మరాజు కాలదండమును రావణునిపై వేయుటకు యత్నించు చుండగా బ్రహ్మదేవుడు గమనించి యమధర్మరాజునకు ప్రత్యక్షమై నిలునిలుమని వారించుచు బ్రహ్మదేవుడు ఓ ధర్మరాజా! నీవు రావణునిపై వేయుటకు యత్నించు చుండిన కాలదండము చాలాభయంకరమైనది. రావణుడు తపస్సుజేసి నన్ను మెప్పించి దేవతల చేతను, రాక్షసుల చేతను చావులేకుండా నావలన వరములను పొందియున్నాడు. నీవిపుడు కాలదండమును ప్రయోగించితివేని రావణుడు మృతి జెందినచో నేను రావణున కొసగిన వరము వృధాకాగలదు. నీవీకాలదండమునుప సంహరింపుము.

ధర్మరాజా! ఈ కాలదండము చాలా ప్రభావముగలది నేనావిధముగా దానిని సృష్టించియున్నాను. నీవు దానిని ప్రయోగించినచో రావణుడు మృతిచెందేనేని నేనతని

కొసగియున్న వరములు నిష్ప్రయోజనము. చావక బ్రతికినచో నేను కాలదండమును కొసగిన శక్తి లేనిదగునట్లగును. కావున నీవు కాలదండమునుప సంహరించి నాగౌరవమును కాపాడుమని బ్రహ్మదేవుడు యమధర్మరాజును కోరెను.

**యమధర్మరాజు:** స్వామీ! మీ యనుమతితో నేనిపుడు జీవులను పాలించుచున్నాను. కావున నేనిప్పుడు రావణునకు ఓడిపోయిన వానివలె యుద్ధమును చాలించి వెనుకకు బోవుచున్నాను. నీయాజ్ఞను పాలించుటయే నాకు గెలుపుగా భావించితినని తన రథముతో గూడ యమధర్మరాజు అదృశ్యుడయ్యెను తమసైన్యముతో కూడ తానదృశ్యుడైనందుకు రావణుడు యమధర్మరాజు తనకు ఓడిపోయెనని బీరములు బలుకుచు రసాతలమునకు బోయెను.

రసాతలములో నాగులు నివసించు చున్న భోగవతీ పట్టణమునకు బోయి ఆ పట్టణ ద్వారమునుగాచుచున్న ద్వారపాలునితో మీ ప్రభువుగారి వద్దకు నీవుబోయి రావణుడు మీపై యుద్ధమునకు వచ్చియున్నాడని తెలియజేయుమని వార్త జెప్పి పంపించెను. ద్వారపాలకుడు పోయి వాసుకికీ విషయము తెలుపగా వాసుకి రత్నములు మరియు కొన్నికానుకలను దీసికొని వచ్చి రావణునకు సమర్పించి మేము మీవారము మాకపకారము సేయక కాపాడుమనివేడెను. రావణుడవి తీసికొని వాసుకిని వీడ్కొని అచోటు నుండి మరెక్కడికోవెళ్ళెను.

ఈ విధముగా రావణుడు భోగవతీ పురమును జయించి మణి మయమను పట్టణమునకువెళ్ళెను. ఆ పట్టణము నందుండువారు నివాతకవచులను రాక్షసులు. వారు బ్రహ్మదేవుని వలన వరములను పొందియున్నారు. రావణుడు గర్వించి తమపై యుద్ధమునకు వచ్చి యున్నాడని తెలిసి వారు కూడ యుద్ధ సన్నద్ధులై భళిభళీయని ఉప్పొంగుచు రావణునిపై యుద్ధమునకు బోయిరి.

ఆ రాక్షసులు ఈ రాక్షసులు తలపడి పండ్రెండు నెలలు యుద్ధము గావించిరి. బ్రహ్మదేవుడు వారికి ప్రత్యక్షమై ఓరాక్షస వీరులారా! మీరెందుకిటుల పోరాడుచున్నారు. మీరొకరికొకరు తీసిపోని సమబలులు స్నేహముగా నుండవలెను. ఎక్కువ బలముగల వారితో సంధిజేసికొనవలెను. తక్కువ బలముగల వారితో సంధికిపోరాదు. కావున రావణుడు మీకు సమాన బలవంతుడు. అతనితో సంధి జేసికొనుట మంచిదని చెప్పి బ్రహ్మవెడలి పోయెను. నివాతకవచులు రావణునితో సంధి జేసికొనిరి. రావణుడచట కొన్ని నెలలుండి వారి వద్ద కొన్ని మాయలు నేర్చుకొని తరువాత వెడలిపోయెను.

**రావణుడు :** అశ్మపురము అను పట్టణమునకు బోయి ఆ పట్టణ సింహ ద్వారమునందు నిలచి నేను దశకంఠుడను. మీరు పోయి మీదొరగారితో రావణుడు యుద్ధమునకు వచ్చియున్నాడని తెలిపి రమ్మనుడు. లేకమీరే రాదలచి నరండు అనిచెప్పి తానక్కడుండెను. అక్కడ రావణునకు తెల్లని యొక గోవు కానవచ్చెను. అతడాగోవు వద్దకుబోయి అమ్మా నీవుకల్పవృక్షముతోను, అమృతముతోను, లక్ష్మితోను, చంద్రునితోను పాలసముద్రము నందు పుట్టిన దివ్యమూర్తివి. ఆకలిగొన్నచో దేవతల కమృతంబును తృప్తిని నిచ్చుచుండెడు దానవు ఏయింటిలో నీపాలు పితుక బడుచుండునో ఆయిల్లు పాలసముద్రమువలె సంపదలు కలుగజేయగల భాగ్యశాలివి. కోరిన కోరికలను దయతో నిచ్చు దానవతివి. ఇన్ని విధములుగా నీకు గల్గిన కీర్తి వలె నీశరీరము తెల్లదనముతో ప్రకాశించు చున్నది. ఓ గోవుల తల్లీ నేను నిన్నుకూడ చూచి శుభముల బొందితిని అని ప్రార్థించుచు. రావణుడక్కడున్న కామదేనువునకు ప్రదక్షిణగావించి అక్కడున్న ద్వారపాలకులను జంపి వరుణపుత్రులతో యుద్ధముగావించెను. వరుణ పుత్రుల సైనికులు రావణుని సైనికులు ఘోరముగా యుద్ధముగావించిరి. రావణుని సైనికుల మీధవరుణ పుత్రుల సైనికులు నిలువలేక పారిపోయిరి వరుణ పుత్రులు కూడ ఓడిపోయి వెడలుచుండిరి. అప్పుడు రావణుడు వరుణపుత్రులతో మీరు నిలువలేక పారిపోవుచున్నారు. మీ తండ్రిని యుద్ధమునకు బంపుమనగా పారిపోవుచున్న వరుణుని మంత్రివిని ఓ రావణా! వరుణుడిపుడు పట్టణములో లేడు బ్రహ్మసభకు వెళ్ళియున్నాడు. ఒకవేళ ఆయన ఉండియుండినను ఇంతేయని సమాధానము చెప్పెను. అదివిని రావణుడు ఆచోటువిడచి వెళ్ళిపోయెను.

ఓ రామచంద్రా! వరుణాలయము నుండి రావణుడు సుతలమునకు వెళ్ళెను. అచట ఉద్యాన వనములలో కోయిలలు గూయుచుండెను. పద్మములు గల సరోవరములుండెను. బంగారు పత్రములు కల్గిన సాలభంజికల చేతను మణులతోనమర్పబడిన గోపురముల చేతను, గరుడపచ్చలుగలతోరణముల చేతను, అంగడి బజారుల చేతను, క్రొత్తముత్తెములచే నమర్పబడిన పడికట్ల చేతను ఒప్పారుచున్న నొక పట్టణమును రావణుడు జూచెను.

రావణుడొక మంత్రిని బిలచి ఈ పట్టణమెవరిదో తెలిసికొని రమ్మని పంపించెను. ఆ మంత్రి పట్టణ ద్వారము వద్దకు బోయి చూచెను. అచట ఎవ్వరును అతనికి కనబడలేదు. ద్వారములలో ప్రవేశించెను. ఏడవద్వారము వరకు వెళ్ళెను అచట అరుణుని వంటి కాంతితో అగ్ని మంటలవలె నోటి నుండి వెలుపలకు

కనబడుచున్న భయంకరమైన నాలుకగల వాడునును క్రొత్తమేఘము వంటి శరీరపు రంగుగల వాడును, మొనలు దేలి భయంకరముగా గల కోఱపల్లులు గల నోరు గలవాడును, చింత నిప్పులవలె కంటిలో పాపలు గలవాడును, తామర రేకులవంటి కన్ను సోగలు గలవాడును, మోకాళ్ళ క్రిందికి పిక్కల వరకు గల పొడవైన చేతులుగల వాడును, బంగారు పట్టు పీతాంబరము కట్టియున్నవాడును. ఒకగదను చేతితో ఊనుకొని నిలచియున్న నొక మహాపురుషుని ఆ మంత్రి వర్యుడు చూచెను. ఆ మంత్రి ఆ దివ్య పురుషుని సమీపమునకు బోవు చుండెను. మంత్రిని జూచి ఆయన వికటముగా నవ్వెను. ఆయాకారమును, ఆ నవ్వును చూచివిని భయపడి, ఆ మంత్రి రావణుని వద్దకు బోయి నిలబడెను. అతని వాలకమును రావణుడు చూచి మంత్రి నీవు భయపడి వచ్చినట్లున్నావు. అచ్చటివిశేషము లేమియని అడుగగా అచట జరిగిన దంతయు మంత్రి వినిపించెను. ఓహో అచటి విశేషములను నేనే స్వయముగా పరిశీలించెదగాకయని రావణుడు పుష్పకమును దిగి ద్వారము వద్దకుబోయి ఆరు ద్వారములు గడచి ఏడవ ద్వారము వద్దకు బోయెను. తన మంత్రి దెలిపిన విధముగా నచ్చట నొక మహాపురుషుడుండెను.

ఆయన అగ్ని జ్వాల వంటి ఎఱ్ఱని నాలుక, కోఱపల్లులు గల భయంకర మగునోరు, కొత్తమేఘము వంటి నల్లని తలవెంట్రుకలు, ఏనుగు తొండముల వంటి పొడవైన చేతులు, ఆ చేతులలో శంఖచక్రములు, కుప్పలు కుప్పలుగా నిప్పులు వెలువడు చున్నకన్నులు, దొండపండుల వంటి పెదవులు రక్తమువలె గడుసెక్కి నిక్కబొడుచుకొని యున్న రోమములు, రోషముతో భయంకరముగా ముడి బడియున్న బొమముడి, ఎత్తైన గూళి కోడె (ఆబోతు) కు గల గోపురమున్నట్లు ఎగు భుజములు గలచేతులును కలిగి చేతిలో నొకగదను ధరించి ఆగదను భూమి కానించి, దానిపై చేయూని నిలచి యున్న నొకమహా పురుషుని రావణుడు చూచెను.

ఆ మహాపురుషుడు చూచుచున్న ఆగంభీరమైన చూపులకును, జంకెలకును, చేష్టలకును దగ్గరకు బోవుటకు భయము జెంది రావణుడట్లేనిలబడి చూచుచు ప్రాణము లేని కొయ్యబొమ్మవలె కదలక మెదలక నిలిచియుండెను. అట్లుండిన రావణుని ఆ మహా పురుషుడు చూచి మేఘగర్జన వంటి తన సహజ గంభీర స్వరముతో ఏమి రావణా! రాక్షసరాజా! యుద్ధము జేయుటకై నీవు వచ్చియున్నావు. భయపడి నిలిచియున్నావెందుకు? నీవు బలిచక్రవర్తిని జయించవలెనని వచ్చితివా? లేకనాతో పోరాడవలెనని వచ్చితివా? తెల్పుము వీరులైన వారు తన ధీరత్వమును విడువరు. కావున నీవిపుడెవ్వరితో యుద్ధము సేయతల పెట్టివచ్చితివి? తెలుపుమని

ఆమహాపురుషుడనగా రావణుడు తన దిగజారిపోయిన ధైర్యమును కూడ గట్టుకొని నేను బలిచక్రవర్తితో యుద్ధము సేయుటకై వచ్చియున్నాననెను.

ఆ మహాపురుషుడు పకపక నవ్వుచు బలిచక్రవర్తిని గూర్చి కొంత దెలిపెద వినుమని చెప్పుచున్నాడు. దానగుణమునందును బలశౌర్యముల యందును ఉజ్వలమగు కీర్తిని సంపాదించియున్నాడు. పాపాత్ములను శిక్షించుటయందు మహోగ్రుడు. యమధర్మరాజు వంటివాడు. అందగాడు. భగవదర్పితముగా నూరు యజ్ఞములను చేసియున్నాడు. చక్రమును తనయధీనము నందుంచుకొని యుద్ధము జేయువాడు. అట్టి మహాత్మునితో నీవు యుద్ధము సేయుటకు సాధ్యమగునా! కాని నీవు పోవలెనన్నచో పోయిరమ్మని దారివదలెను.

ఇట్లామహా పురుషుడు రావణునకు దారి విడువగా రావణుడు సభలోనికి వెళ్ళి తనచేతులతో తన భుజములను తట్టుకొనుచు సైయని వికటముగానవ్వెను.

బలిచక్రవర్తి రావణా! నీవు దేవవిరోధివి. నీవు విశ్రవో బ్రహ్మావంశమును వృద్ధిజేయువాడవు నీవు నాకతిథిగా వచ్చియున్నావు. దగ్గరకు రమ్మని చేరబిలిచి అతనిని తనతొడలపై కూర్చుండబెట్టుకొని గౌరవించి మృదు మధురముగా మాటలాడి బుజ్జగించుచు నీకును నీ బంధుమిత్రులకును క్షేమమే కదా నీవిచటికేమి పనిగా వచ్చితివి. నీవు వచ్చిన పని చెప్పితివేని చేసిపెట్టెదనని బలిచక్రవర్తి యడుగగా రావణుడు ఓమహాత్మా! శ్రీహరి నిన్ను కట్టివేసినాడని వినియుంటిని విన్నప్పటి నుండి నేనది సహింపలేక ఆవిష్ణువును జయించి దానగుణము నందు పేరు బొందినసైనిక సహాయములేని వాడగునిన్ను విడిపింపవలెనను ఉద్దేశ్యముతో నేనిటకు వచ్చితిని. ఆహరి యిపుడెచట నున్నాడో చూపుమనెను.

బలిచక్రవర్తి నవ్వుచు కడపటి వాకిటిలో నీవింత వరకు మాటలాడి వచ్చిన ఆమహానీయుడే హరి. ఆహరిని ఆయన మహిమలను గూర్చినేనెట్లు చెప్పగలను. కానీ నాకు తెలిసినంత చెప్పెదను వినుము.

రావణా! ఇప్పుడు నీవనుకొన్నట్లు మాముత్తాత హిరణ్యకశిపుడు తన కుమారుడగు ప్రహ్లాదునితో మనకు విరోధియగు హరిని స్మరింపవద్దన్న స్మరిస్తున్నావా? ఆహరిఎచ్చటనున్నాడో చూపుమని చాలా బాధించెను. ప్రహ్లాదుడు తన తండ్రికిజవాబు చెప్పుచు నీవెక్కడ కోరెదవో అక్కడనే కనిపింపగలడనెను. అట్లైన ఈ స్థంభమునందు చూపగలవా? అనగా చూపగలనని ప్రహ్లాదుడనెను. హిరణ్యకశిపుడా స్థంభమును తనచేతితో తట్టెను. ఆ స్థంభము పటపటమని చీలి అందులో నుండి నరసింహుడుగా ఉగ్రుడై వచ్చి హిరణ్యా కశిపుని సంహరించెను.

ఆ విష్ణుదేవుని చేతిలో మరణించిన వారిని తెల్పుచున్నాను. శుకుడు, వృత్రాసురుడు, సంహ్లాదుడు, అణువు, శుంభుడు, నిశుంభుడు, శంఖుడు, ముచికుందుడు, న్యోమధూముడు, అమలార్జునుడు, విరోజనుడు, కాలనేమి, హిరణ్యాక్షుడు, కాలకేయాదులు, మధుకైట భాదులు ఆయన చేతిలో కూలిపోయిరి. మన వంటి రాక్షసులెందరో ఆ విష్ణువుతో విరోధము బెట్టుకొని తమచావును కొని తెచ్చుకొనిరి. కావున బలవంతులతో విరోధమెందుకు?

ఓరావణా! విష్ణువునన్నొక్కనిని మాత్రమే కట్టివేసెనని భావించితివి. కాని సమస్త జనులను ఝుటిలమైన మోహమనే త్రాళ్ళతో సంసారమనే గుంజకు కట్టి వేయబడి యున్నారని తెలిసికొనుము. ఈ ప్రపంచమునంతటిని ఒక సమయమున సృష్టించు చుండును. ఒక సమయమున ఆ సృష్టిని చాలించి యూరకుండును. ఒక సమయమున రక్షితుడై పాలించును. మరొక సమయమున సాక్షిమాత్రుడై చూచుచుండును. ఒక సమయమున రక్షకుడై కాపాడును. మరొక సమయమున యూరకుండును మరొక సమయమున తానే అనేక రూపములు గల వాడై పేర్లుబెట్టుకొని నాట్యశాలలోనటునివలె నటించుచుండును.

ఇంకొక సమయములో ఆ నటనలు చాలించి యూరకుండును. ఇంకొక సమయములో దుష్టులగు రాక్షసులను సంహరించును. మరొక సముయమున వీరుదుష్టులనియు వీరు శిష్టులనియు భేదబుద్దిలేక సమబుద్ధి గలవాడైయుండును తనకేవిధముగా తోచునో ఆవిధముగానే స్వతంత్రుడైయటులే యుండును. ఆయనను ధ్యానము సేయువారిని ఆయన మరువడు అట్టి మహానీయుడు కట్టిన కట్లను అన్నారావణా! విడిపించుటకు నీకుగానీ నాకుగానీ సాధ్యముకాదు.

అని బలిచక్రవర్తి చెప్పగా వినిఔరా! భయంకరమైన మృత్యువును వెంట బెట్టుకొని వచ్చిన యమధర్మరాజునోడించితిని. ఈశ్వరుడు కాపురమున్న కొండనే యూడబెరికితిని. ఇట్టి భుజ బలముగల గొప్పవాడనగు నన్నా విష్ణువుగెలువగలడా? ఆ విష్ణు ప్రభావమును ఇంకా కొంత నాకు వినిపింపుమని రావణుడు కోరగా బలిచెప్పుచున్నాడు.

ఆ హరి వేదాంతమెరిగిన వారికి కూడా కనబడడు. మొదలు నడుమ కొనలేనివాడు. ఈ ప్రపంచమును పుట్టించుటకును పోషించుటకును సంహారము జేయుటకును శక్తిమంతుడు. బ్రహ్మ విష్ణుమహేశ్వరులుగా నున్నారు. ఆయన మహిమలను తెలుపుటకు నేను సమర్థుడనుకాను.

యాగము, యాగమును సేయువాడు, ఆయాగము నుండి లభించు ఫలితము మరియు దానమును, దానమును సేయువాడును, దానము సేయువస్తువు దానమునిచ్చుదాత, దానయోగ్యమైన కాలము అంతయు అవిష్ణు దేవుడే. యోగము, యోగి, యోగమసేవస్తువు, ఆయోగము నందు కలిగే ఆనందమును ఆయనయే. ధ్యానము, ధ్యానమునకు గల లక్ష్యము, ధ్యాత, ధ్యానమునందు గల్గు నిశ్చలత ధ్యానమునందు కనబడు రూపము అంతయు ఆ భగవానుడే. తనను గురించి చెప్పుట వినుట తెలిసికొనుట యనువారు, చేసిన పాపములను పోగొట్టుటకును వారి కోరికలు దీర్చుటకును, బంధముల నుండి విడిపించుటకు విష్ణువే కర్తయగును గాని వేరొకరు కానేరరని బలిచక్రవర్తి రావణునకు తెలిపినను రావణున కామాటలు రుచింపలేదు. తరువాత రావణుడు బలిచక్రవర్తి నుండి సెలవు దీసికొని బయలుదేరి వెళ్ళుచు ద్వారమువద్ద మునుపు తనకగపడిన పురుషుడు మరల ఇప్పుడు కనబడ లేదు. అందుకు రావణుడు ఆ హరినాకు ఓడిపోయినాడని వికటముగానవ్వి అచట నుండి పుష్పక విమానములో పోయి మేరు పర్వతముపైకి వెళ్ళి యచట నుండెను.

రావణుడు మేరు పర్వత శిఖరము దాటి వరుసగా మేఘ మండలమును, మరుత్తులు నివసించులోకమును, సాధ్యలోకమును, సిద్ధలో లోకమును, గంధర్వలోకమును మొదలగు లోకములను దాటుచు ఆయా లోకములలో గల వింతలను జూచుచు, ఆయా లోకపాలకులను తనతో యుద్ధమునకు బిలుచుచు, నీతో యుద్ధము సేయజాలమని వేడిన వారినేమనక వదలుచు భయములేనివాడై, లక్షయోజనములు గడచిపోయి అచట సూర్యుని పూజించెడు వారిని ప్రాతఃస్సాయం కాలముల యందు సూర్యునకర్ఘ్యమిచ్చెడు వారిని సూర్య భగవానుని భక్తులు నివసించు యోగ్యమైన సూర్యలోకమును జూచి విరామములేక చూపులతో చూచుటకు సాధ్యముగాని లోకములో బ్రవేశించి మాఠరుడు సహాయకుడుగాను అనూరుడు రథసారథిగాను ఋక్ యజుస్సామ వేదములను చెప్పుచుండగా ఛాయా దేవి వింజామరలు వీచుచుండ ఏకచక్ర రథము మీద సూర్యుడుండగా రావణుడు చూచి తన మంత్రులను సూర్యుని వద్దకనిపి తనతో యుద్ధము జేయుటకు సూర్యుని బిలిచెను. రావణుని మంత్రులతో నేను ఓడిపోతినని తెల్పుమనగా వారు తిరిగి వచ్చి సూర్యుడు మీకు ఓడినట్లు తెలుపుమన్నాడని తెల్పగారావణుడు అహంకారముతో సూర్యుడు దశగ్రీవునకు ఓడిపోయినాడని అచట చాటింపు జేయించి తిరిగిపోయి చంద్రుని జయించవలెనని మిహిరయను పర్వతమునకు బోయి అచట విశ్రమించెను.

రావణుడు విశ్రాంతి దీసికొనుచుండనతని కొక చిత్రముగానవచ్చెను. ఆమార్గముగా నొక్క విమానము బోవుచుండెను. ఆ విమానములో నొక దివ్య పురుషుడుండెను. అతని పేరు పర్వతుడు. ఆ పర్వతునితో రావణుడు మునీంద్రా నాతో సమముగా యుద్ధము సేయు వీరుని నాకు దెల్పుమని కోరెను.

## రావణుడు మాంధాతతో పోరిసంధిజేయుట

అప్పుడు నీవు యుద్ధము సేయవలెనన్న అయోధ్య పట్టణమునేలు మాంధాత నీతోసమానుడు నీతో యుద్ధము సేయగలడని పర్వతుడు రావణునకు దెల్పెను.

రావణుడు ఓ మునీంద్రా! ఆమాంధాత ఇపుడెక్కడ నున్నాడనియడుగగా మునీంద్రుడు చెప్పుచున్నాడు.

మాంధాత యిప్పుడు దిగ్విజయార్థము ఉత్తర దేశమునకు పోయియున్నాడు. అని పర్వతుడు రావణునకు చెప్పుచుండగనే వారికి యుద్ధభేరీ శబ్దములు వినబడెను. సైన్యములు కనబడెను.

**రావణుడు:** తన మంత్రులతో కలిసి మాంధాతకెదురుబోయి ఓరాజా! నేను దశముఖుడను లంకాధిపతిని నేను నీతో యుద్ధము సేయుటకై వచ్చియున్నాను. నాతో యుద్ధము సేయుము. కాదేని ఓడితినని యైనను ఒప్పుకొనుము. అని రావణుడనగా మాంధాత కన్ను లెఱ్ఱ జేసి, ఓరీ రావణా! నాతో యుద్ధమునకు వచ్చితివా? కానీ నిలువుము. అని విల్లెక్కు బెట్టి తన బాణములతో గొట్టెను ఆబాణములు రావణుని వక్ష స్థలమునందు దూరిపోయెను. రావణుడా బాణములను లెక్కజేయక ఆ ఉరుములకు ఈచినుకులా? అని హేళన జేయుచు తన పదికోదండముల నెక్కుబెట్టి మాంధాతమీద బాణ వర్షము గురిపించెను. ఆ బాణములను మాంధాత తమ బాణములతో నడుమనే ఖండించి రావణుని మంత్రులను తన బాణములతో నొప్పించెను. రావణుడది చూచి మిగత మంత్రులను కూడ మాంధాతపై నుసికొల్పెను. మాంధాత విజృంభించి శుకునిపై పంద్రెండు, సారణునిపై పది, యూపాక్షునిపై నాలుగు, త్రిశిరునిపై పదునైదు, జంబు మాలిపై నూరు బాణములు వేసి వారిని నొప్పించి తరిమివేసి, రావణుని తొమ్మ బగులునటుల ముద్గరముతో గొట్టెను. ఆ దెబ్బకు రావణుడు మూర్ఛిల్లి మరలా తెప్పిరిల్లి, రోషముతో కనులెఱ్ఱజేసి మాంధాతయున్న రథమును విఱుగ గొట్టెను. మాంధాత వేరొకరథముపైకెక్కి శక్తి బాణముతో రావణుని గొట్టగా అశక్తి బాణమును

రావణుడునడుమనే శూలాయుధముతో ఖండించెను. ఇట్లా యిరువురు యోధులును అనేక క్రూర బాణములనుపయోగించుకొని యుద్ధముగావించిరి. కానీ వారి నాబాణములేమియు సేయ జాలనందున మాంధాత బ్రహ్మాస్త్రమును! రావణుడు పాశుపతాస్త్రమును సంధించి ఒకరిపై యొకరు వేసికొనుటకు సమకట్టియుండగా ఆ సమయమున పులస్త్య బ్రహ్మ వారిరువురి మధ్య నిలిచి మీరిరువురును ఈ విధముగా యుద్ధము సేయవలదు. ఇరువురును ఆయుష్మంతులగుట వలన మీరు వేసికొను అస్త్రశస్త్రములు మిమ్మేమియు సేయజాలవు. కానీ అవిలోకములను బాధింపగలవు. అందువలన మీ యస్త్రములనుప సంహరింపుడని తెలుపగా వారప్పుడు వారివారి అస్త్రములను పసంహరించి యుద్ధము చాలించి ఎవరి దారిన వారు వెళ్ళిరి.

అని అగస్త్యమునీంద్రుడు శ్రీరామచంద్రునకు దెలిపి మరలా ఓ రామచంద్రా! రావణుడు చంద్రుని జయింపవలెనను ఇచ్ఛగలవాడై చంద్రలోకమునకు బోవునప్పుడు కొన్ని కళ్యాంతరములు గడచిపోవు చుండెను. అప్పుడతని మంత్రులు చలికి తాళలేక రావణునితో ప్రభూమేమక్కడ రాజాలమని తెల్పిరి. రావణుడు కోపించి చంద్రునిపై అగ్నేయాస్త్రమును, రౌద్రాస్త్రమును వేయుటకు ఎక్కుబెట్టెను. బ్రహ్మదేవుడది జూచి రావణుని వద్దకు వచ్చి చంద్రుడు చల్లని దొర అతనిపై నీ బాణములను వేయకూడదని రావణునకు మృత్యుంజయ మంత్రమునుపదేశించి ఇది నీవు పద్ధతిగ జపించుము. నీకాపదవచ్చినప్పుడు ఈమంత్రోచ్చారణ సేయుము. ఇది పూర్తియయ్యేనేని నిన్ను జయించు వాడుండడు. మధ్యలో భంగము గల్గిన నీకపజయము గల్గునని చెప్పి శివాష్టోత్తర మంత్రమును పదేశించి బ్రహ్మదేవుడు వెడలిపోయెను. తరువాత రావణుడు చంద్రడోడిపోయెనని చంద్రలోకములో చాటించి లంకకు బోవుటకు పయనమై మంత్రులతో యువప్రాయములో నుండి అందముగా నుండు పదుగురు స్త్రీలను చెప్పుమనియడిగెను. అట్లడిగిన రావణునకు ఆ మూర్ఖపు మంత్రులు చెప్పుచున్నారు.

## రావణుడు దేవాది స్త్రీలను చెఱబెట్టుట

**రావణుని మంత్రులు :** రాజా! ముదుసలి తనములేక ఎల్లప్పటికి యువకులుగా నుండు స్వభావము దేవతా స్త్రీలకున్నది. ఒయ్యారము, తళుకు బెళుకు చూపులు గల స్వభావము మనుష్య స్త్రీలయందు గలదు. పొడవైన జడలు, లావైన తొడలు, సన్నని నడుము, నాగకన్యల యందున్నది. విననింపుగా పాడుట, తియ్యగా మాట్లాడుట, గంధర్వకన్యల యందుగలదు.

ఈ విధముగా ఒక్కొక్క జాతియందు ఒక్కొక్క శుభలక్షణములు కలవు. కావున నీ యిష్టము వచ్చిన వారిని తేవచ్చునని రావణునకు మంత్రులు జెప్పిరి. అటులైనచో నేనందరిని దెచ్చెదనని రావణుడు జెప్పెను.

శ్రీరామచంద్రునకగస్త్యముని చెప్పుచున్నాడు. ఓ రామచంద్రా! ఆ మూర్ఖుడగు రావణుడు దయగానీ, పాపభీతిగానీ లేక, దేవ, రాక్షస, నర, విద్యాధర, నాగ, సాధ్య, సిద్ధ, ఆదిత్య, గరుడ, గంధర్వ, యక్షకిన్నర, కింపురుష, మరియు రాణివాసపు కన్యలందరినీ దెచ్చుటకు ప్రయత్నించి ఆయాకన్యలు గల స్థానములకు వెళ్ళి ఎవరు నాణ్యముగా కనిపించినను వారిని వారి యిండ్లలో చొరబడి వారిని పట్టుకొని వారరచి కూతలు బెట్టుచున్నను. కాలుసేతులు జాడించు చున్నను, అడ్డముగా బిడ్డలను చేతులపై నెత్తుకొనువిధముగా బట్టి రొమ్మునకదుముకొని వెళ్ళునప్పుడు ఆ స్త్రీలకు సహాయముగానెవ్వరైనను వచ్చి అడ్డుపడిన వారిని, కట్టెలతో దుడ్డుచు, ప్రక్కకు బడద్రోచి ఎదరించినవారిని పొట్టలు చీల్చి స్త్రీలను విడువక తీసుకొనిపోయి తన విమానములో వేయుచు మరలా వారి దగ్గరకు వచ్చుచు తిట్టిన వారిని దంభముగా మాటలాడుచు ఆ డవారి మాటలకు అర్థాలే వేరులే, ఔనంటే కాదనిలే, కాదంటే ఔననిలే తిట్టితే ఒప్పు కొన్నట్లులే, తిట్టకుంటే ఒప్పుకోనట్టులే, మీరు తిట్టుచున్నారు. కాబట్టి ఒప్పుకొన్నట్టు సూచనలులే ఇవేనాకు హెచ్చరికలులే అని వారితో దంబముగా మాటలాడుచు పోజులు గొట్టుచు ఓర్చుకొని నన్ను వరింపక ఎక్కడ పోగలరనుచు వారి ముందర వికటముగా నవ్వుచు తిరుగుబాటు సేయువారిని ముందరవెంట్రుకలను బట్టిలాగుచు కొప్పులను బట్టి కూడవేయుచు చేతులను బట్టి తనవద్దకు చేరదీయుచుండగా ఈయాగడములు పుకారులయ్యెను. కొందరు తమ యిండ్లలోగల మూలలో దాగియుండిరి. తారాడుచు బోయి తప్పించుకోలేవులే అనియు దండములు బెట్టినను ఏడ్చినను నీవు మాకు అన్నవు అన్నను. మేమునీ చెల్లెండ్రమన్నను దీనముగా ప్రార్థించినను దయలేనివాడై విడువక వినక స్త్రీలను చెఱబట్టెను.

వారందరు తల్లిదండ్రుల వద్దనున్న తలిరి బోడులు అత్తమామల వద్ద నుండిన అంబుజాక్షులు భర్తల చెంతనుండిన భామా మణులు భద్రేభగమనలు. ఎక్కడనుండిన వారిని అక్కడనుండియే తెచ్చి, పుష్పక విమానములో ప్రోగుజేసి స్త్రీలను రావణుడు చెఱబట్టెను.

రావణుండిట్లు దయలేనివాడై స్త్రీలను చెఱబట్టి తీసుకొనిపోవునప్పుడు ఆస్త్రీలందరు ఒకటియై ఈ రావణుడు మనవారినందరిని కొట్టి మనమిష్టపడ కున్నను మనలను దెచ్చి ఈ విధముగా తీసుకపోవుచున్నాడు. మనలాంటి వారినింకెవరిని చెఱుపగలదో చెప్పజాలము. అందువలన మన మితనిని శపింపవలెనని అందరును కలియబలుకుకొని ఏకగ్రీవముగా శపించిరి. ఓ పరమేశ్వరా! మేము పతివ్రతలమగునది నిజమయ్యేనేని మాశీలమును చెఱుపదలచిన ఈనీచుడు స్త్రీమూలముననే ఇతని తమ్ములతో, పుత్రులతో, బంధువులతో చెడిపోవును కాక అని అందరు ఏకకంఠముగా శపించిరి. మరియు మనవారి నితడు చంపిన విధముగా ఇతని పగవారు ఇతని వారిని చంపెదరుగాక! ఈ రావణుని చేతిలో మనము చిక్కిన విధముగా పగవారి చేతిలో ఇతని స్త్రీలు చిక్కెదరుగాక! మనలను బట్టి యీడ్చిన ఇతని చేతులు చెక్కలు ముక్కలై తెగిపోవునుగాక. స్త్రీలమగు మనమందరమునేడ్చుచుండగా దయలేక నవ్వుచున్న ఇతని తలలు తాటికాయలవలె తెగి ధరణిపై బడునుగాక అని అక్కడున్న స్త్రీలందరును రావణుని శపించి తమ ప్రాణముల మీద ఆశను వదలి, ఏడ్చుచుండగా రావణుడు ఎగ్గును, సిగ్గును లేక సంతోషముగా వారిని లంకకు దీసుకొనిపోయెను.

రావణుడు సమస్త లోకవాసులను జయించి వారిస్త్రీలను చెఱలుబట్టి, పుష్పక విమానములో వచ్చిలంకకు చేరెను. ఆ పుష్పక విమానములో గల స్త్రీలు ఏడ్చుచుండిరి. వారికి తోడుగా రావణుని చెల్లెలు శూర్పణఖ రావణుని పాదములపై బడియేడువసాగెను. ఇట్లేడ్చుచున్న శూర్పణఖను రావణుడు చేతులతో పైకెత్తి కన్నీరు దుడుచుచునేదో ఆమెకు చెప్పబోయెను.

**శూర్పణఖ:** అన్నా లోకములో నెందరో శూరులున్నారు. వారు ప్రతి వీరులమీద తమ శూరత్వమును చూపియున్నారు. నీ శూరత్వమును చూపుటకు మరొకరు చిక్కనేలేదా? నీవలెనే వీరులందరును తమ అక్కచెల్లెండ్ర మగళ్ళను చంపి అతిబలవంతులమని పించుకొన్నారా! నా మగనినిజంపి నాబ్రతుకు బద్దలుజేసితివి నీకు మహాపాపములంటవా! ఇకనేనేమిసేయవలెను ఎక్కడనైనను చెల్లెండ్రకన్నలు సహాయముజేయు చుండెదరు. నీవలె చెల్లెల యొక్క భర్తను చంపి ఆమెకు విధవతనమును తెచ్చి పెట్టెదరా! అని పలువిధములుగా నిందించుచు దుఃఖించు చున్న శూర్పణఖను రావణుడోదార్చుచు.

అమ్మా దొమ్మియుద్ధము జేయునప్పుడు వీరుతన వారు వీరు పరాయివారని తెలియక పొరబాటుగా నీభర్తను బలిజేసియున్నాను. తరువాత నీభర్తయని తెలిసికొని

నా మనస్సులో తల్లడిల్లు చున్నాను. చేయి జారిన పనికి చింతించి ఏమి ప్రయోజనము దైవ నిర్ణయమునెవ్వరును దాటలేరనుటకిది యొక సాక్ష్యము. రావణు నంతటివాడు రక్షింపవలసిన బావమరదిని శిక్షించువానినివలె శిరస్సును నఱకునా? ఆలోచింపుము నీవు నాచెల్లెలివి హుకుం చెలాయించగలవు. నీకేమి కొఱతలును లేవు. నీకిష్టమువచ్చిన విధముగా నీవన్ని చోటులయందును తిరుగవచ్చును.

మన పినతండ్రి కుమారులగు ఖరుడు, దూషణుడు మున్నగు తమ్ములతో కూడి వారు దండకారణ్యమునకు పోవుచున్నారు. నీవాతని వెంటపోయినచో నీకు కావలసిన సమస్త సామాగ్రులను నేనిక్కడ నుండి నీకు సమకూర్చు చుండెదను. నీవప్పుడప్పుడు నాచెంతకు వచ్చి పోవుచుండుము. నీకు నేనొకటిగాదు ఖరుడొకటి గాదు. మేమిద్దరమొకటేయని భావింపుము అని తన చెల్లెలు శూర్పణఖను ఒప్పించి ఖరుని బిలిపించి దండకారణ్యము రాక్షసులకు నిలయము కాగలదని కవి చెప్పియున్నాడు. కావున నీవు పదునాలుగు వేలమంది రాక్షసులతో పోయి అచట నొకపాళెము నేర్పరచుకొని ఈ శూర్పణఖను సమాదరణతో చూచుకొను చుండుమని చెప్పెను.

ఖరుడు రావణుని యాజ్ఞానుసారము త్రిశిరుడు మంత్రిగాను, దూషణుడు సేనాధిపతిగాను, నియమించి పంపగా వారు దండకారణ్యమునకు వెళ్ళి యచట భయంకర వృత్తితో అచుట్టు ప్రక్కల ప్రదేశముల వారికి మృత్యు దేవతలవలె దండకారణ్య రాజ్యమునేలు చుండెను.

ఈ విధముగా ఖరదూషణాదులను పంపి రావణుడు తన నివాస గృహమునకు వెళ్ళెను. తన యింటిలో పెద్దకుమారుడు మేఘనాథుడు లేనందు వలన మేఘనాథుడెక్కడున్నాడని యడుగగా.

## మేఘనాథుడు నికుంభళీయాగము సేయుట

అతడు నికుంభళీ యాగముసేయు చున్నాడని చెప్పిరి.

మేఘనాథుడు నికుంభళీ యాగముసేయుచోటునకు రావణుడు వెళ్ళెను. అచట యజ్ఞదీక్షలోనున్న కుమారుని తండ్రి చూచి ప్రేమతో కుమారుని యొద్దకు బోయెను. మేఘనాథుడు తన తండ్రికి వినయముతో మ్రొక్కెను. ఇట్లు నమస్కరించినమేఘనాథుని రావణుడు తన యిరువది చేతులతో నెత్తి ముద్దాడుచు కుమారా! అగ్ని సెగకు నీశరీరము ఉడుకెక్కి కాలుచున్నది. నీవిక్కడేమి సేయుచున్నావని యడిగిన రావణునకు రాక్షస గురువులు సమాధానమును చెప్పిరి.

నీ కుమారుడు వ్రతదీక్షలో మౌనముతో నున్నాడు. ఇంతకు మునుపు అగ్నిహో క్రతువులను చేసియున్నాడు. ఇప్పుడు మహేశ్వర క్రతువు సేయుచున్నాడు. మహేశ్వర క్రతువు సేయుట వలన నీ కుమారునకు ఈశ్వరుడు దర్శనమిచ్చును. ప్రత్యక్షమైన ఈశ్వరుని వలన అనుకొన్న చోటులకు వెళ్ళుట, కనబడని రథమును, బాణములు తరుగని అంబుల పొదిని, విఱుగని ధనుస్సును, భయంకరమైన చీకటులను గల్పించు మహామాయ, ఆయా అస్త్ర శస్త్రములను, యుద్ధము నందు విజయము గలుగజేయున వన్నియును ఈ యజ్ఞము వలన సంపాదించి తరువాత మీతో మాట్లాడగలడు.

ఈ యజ్ఞము సమాప్తమైన యెడల శత్రువులకు కనబడని యీ రథము నందుండి, పదునైన బాణములను, ధనుస్సును ధరించి ఆకస మధ్యమున నిలబడెనేని నీకుమారుని ఈశ్వరుడైనను జయింపజాలడు అనిపలుకగా.

రావణుడు ఆచార్యా! ఇదంతయు మంచిదే. యజ్ఞములు జేసి బలమైన శక్తులను సంపాదించి దేవేంద్రాదులను గెలిచెనేని శత్రువులగు దేవతలకును రాక్షసులకును నా కుమారుడందరికిని మిన్నగా నుండగలడని తెలిపెను.

రావణుడు మేఘనాథుని మెచ్చుకొనుచు వచ్చి మునుపుతాను దెచ్చి యున్న దేవతా కన్యలను విమానము నుండి దింపుమను చుండగా విభీషణుడు విని అన్నయగు రావణునిలో ఆస్త్రీలను బలవంత పెట్టి, పట్టితెచ్చుట నీతిగాదు. స్త్రీలు అబలలు వారిని దెచ్చుట వలన పరాక్రమమేమైనా పెరుగునా? ఎందుకీట్లు జేసితివి? దేవతా స్త్రీల వంటి అప్సరసలు నీకున్నారు కదా? నీవీపుణ్య స్త్రీలను పతివ్రతలను ఆర్యుల భార్యలను దెచ్చి వారిని బాధపెట్టిన పాపమువచ్చును. అంతేకాదు భరింపరాని అపకీర్తియు రాగలదు. దాని వలన ఆయస్సు గొప్పతనము తేజస్సు, ప్రతాపము, సంపదనశించి పోగలదు. పరస్త్రీలను తాకుట వలన అగ్నిజ్వాలలవలె పుణ్యమును దహించును. ఏనరుడు ఏకాలము నందేమి సేయునో దాని ఫలతము ననుభవింప వలసియుండును. అనువార్త నీ సమయమున తెలిపెదను వినుము.

నీవు స్త్రీలను చెఱబట్టి నిచటికి దెచ్చులోపలనే మాల్యవంతుని ప్రీతిపాత్రమైన కూతురు కుంభీనసను రాక్షసులమై యుద్ధము జేసినను వారినోడించి మధుండను రాక్షసుడు బలవంతముగా తీసికొని పోయెను. పరస్త్రీ మోహముతో కన్నకుమార్తెను పోగొట్టుకొంటివి. ఈ మాటను వినిన వారు మనలను చులకనగా చూతురు కదా? ఆమధుడు మనలంకలోనికి వచ్చునప్పుడు నేను సముద్రస్నానమునకు వెళ్ళి యుంటిని మన మేఘనాథుడు యజ్ఞదీక్షను పూని తావు కదలకుండెను,

కుంభకర్ణుడు తనువు మరచి తామస నిద్రలో నుండెను. కావున వాడు లంకను దాటిపోవుటకు వీలైనది. కానీ ఇప్పుడు మనము తని మీద కోపించ వలదు. ఏలననగా మధుడు మనచెల్లెలను తీసికొనిపోయెను. మన మతనిని చంపితిమేని బంధువులకు కీడుసేయుట అపకీర్తియు రెండును కలుగును. అందువలన శాంతింపవలెనని విభీషణుడు చెప్పగా రావణుడు విని అతనిపై కోపించి నీవు చాలా వివేకివి నీవునాకు చాలా మంచినీతులను పదేశించు చున్నావు. మధు రాక్షసుడు మనము కాపురమున్న లంకలో ప్రవేశించి భయములేనివాడై మనరాక్షసులను జయించి బలవంతముగా మన చెల్లెలిని దీసికొనిపోయి సంతోషముగా నున్నాడని విని ఓర్పుగలిగి యుండ వచ్చునా. భళి భళీ అరెరే మధురాక్షసుడింత మించి పోయెనా? వాడిపుడీ రావణుని మీద శూరత్వమును చూపియున్నాడు. వాడీకార్యము జేయుట యనగా అగ్నిని ఒడిలో బోసికొన్నట్లగును. సింహము మీసములు లాగుటకు పోవుమదాంధునివలె నుండెను. ఇకవేయి మాటలెందుకు ఆదుష్టుడున్న చోటునకిప్పుడే వెళ్ళి వానిమద మణగించెదనని ప్రహస్తుని జూచిచెప్పుచున్నాడు.

**రావణుడు:** ప్రహస్తా! యుద్ధమునకు తగిన సాధనములను భటులను సమకూర్పుము లంకరక్షణకు విభీషణుని నియమింపుము. మహేంద్ర క్రతువు జేసి వరములు పొందియున్న మనమేఘనాథుని వెంట రమ్మనుము. తొలుత మధురాక్షసుని గెలిచి తరువాత ఇంద్రుని మీదికి వెళ్ళవలెను అని చెప్పగా ప్రహస్తుడటులనే గావించెను. రావణుడు తన తమ్ముడు కుంభకర్ణుని తోను, పెద్ద కుమారుడు మేఘనాథునితోను కలిసి, మధురాక్షసునిపై దండెత్తి పోయి ఆ పట్టణమును ముట్టడించిరి.

**రావణుడు :** మధురాక్షసు నంతఃపురము ప్రవేశించి అందులో మధురాక్షసుని గానకవెదకు చుండెను. కుంభీనకీ సంగతి దెలిసి అన్నను జూచి అతని పాదములపై వ్రాలి అన్నా! నా భర్తనన్ను బలవంతముగా దెచ్చినను నేనతని భార్యనైతిని కావున నన్ను జూచియైనను నీవతనిని మన్నించి నాముత్తైదువ తనమును కాపాడుమని యేడ్చుచున్న తన చెల్లెలిని రావణుడు లేవనెత్తినవ్వుచు అమ్మా నిన్ను జూచి నీభర్తను మన్నించితిని ఇక భయపడవలదు. స్వర్గమునకు పోయి దేవేంద్రుని జయించ వలెను. కావున నీభర్తను పంపుమని చెప్పగా విని సంతసించి నిదురించు చున్న మధురాక్షసుని లేపి మా అన్నకు తోడుగా స్వర్గమునకు నీవు కూడా వెళ్ళవలెనట నిన్ను బిలుచుచున్నాడు. అని తెలుపగా విని సంతోషించి రావణుని యొద్దకు వెళ్ళి సగౌరవముగా నమ్రతతో నమస్కరించి ఆ దినము రావణుని అతని పరివారమును తమయింట నిలుపుకొని వారికి తగిన విందు బెట్టి సత్కరించెను.

## రావణుడు స్వర్గము మీదికి దండెత్తుట

తరువాత స్వర్గము మీదికి రావణుని సైన్యమునందు గుఱ్ఱములు, ఏనుగులు, రథములు, వీరసైనికులు నడచుచు స్వర్గ లోకముపైకి యుద్ధమునకు నడచుచుండిరి. రథ, గజ, తురగ, పదాతులు పాదముల రాపిడికి వాని పద ఘట్టనలకు భూమి అదరుటవలన ఆదిశేషుడదరిపడెను. పాదధూళి వెళ్ళి పావనమైన ఆకాశ గంగలోబడి, ఆజలము ఎఱ్ఱనయ్యెను. ఆరావణుడు అట్టహాసం పట్టపగలుగా తనసైన్యమును ఆదినమంతయు నడిపించి విరామమునకు వెండి కొండ సమీపమునకు దీసుకొని పోయిరి. రాత్రి అక్కడుండుటకు విశ్రాంతి కొఱకు విడిచెను.

రావణుడు ఆ పరిసర ప్రాంతములలో గల వింతలను జూచుచు వంటరిగా విహరించుచుండెను. అంతలో సూర్యుడస్తమించి చీకటులు గ్రమ్మెను మఱికొంత సేపటికి పాలారబోసినట్లు వెన్నెల కాంతులు తెల్లగావచ్చెను. రావణుడొక పూదోటలో దిరుగు చుండగా చల్లనిగాలులకు వెన్నెలలు తోడయ్యెను. అతడానంద పరవశుడై యటు నిటు దిరుగుచు నాకీసమయమున ఒక కులుకులాడియుండిన పలుకు దోడుగా హాయిగానుండి యుండెదము కదాయని ఆలోచించుచుండెను.

**రంభ**: నలకూబరుని ప్రేయసి ఆమె దేవసభలో దేవేంద్రునెదుట నృత్యము జేసి తిరిగి నలకూబరుని వద్దకు వచ్చుచుండెను. ఆమె వెంటనొక చెలికత్తె కూడా యుండెను. వీరిరువురు అలంకరించుకొని అర్ధరాత్రిలో నలకూబరుడున్న అలకాపట్టణమునకు పోవుచుండిరి. దారిలో గల రావణుని సైన్యమును జూచి నేనీదారిన పోకూడదని మరొక మార్గమైన కైలాసగిరి మీదుగా వెళ్ళుచుండిరి. రావణుడు నిద్రబట్టకమేల్కొని తిరుగు చుండెను. అతడున్నాడని తెలియక వీరాదారిన వెళ్ళుచుండిరి. వీరిని రావణుడు చూచి దారికడ్డము బోయినిలువరించి ఓ తరళాక్షీ! నీపేరేమి? నీఊరెయ్యది? నీవెవ్వరి దానవు? నీవెవ్వరి కొరకిటుల వెళ్ళు చున్నావు. ఆహా! నీప్రాయము నీచక్కదనము నీనీటు నున్నగ దువ్వివెట్టియున్న నీకొప్పు నీవక్షోజములు నీవు నీచెవి సందులలో నిరికించియున్న సంపంగి పూవులు, నీనాభికి తగులు నటుల వేసియున్న కుచ్చెలు ముడిచూడగా మన్మథునకే నీమీద మమకారము పుట్టగలదన్నచో ఇక సామాన్యుల మాట చెప్పనేల. కానినీ వీవిధముగా శృంగారించుకొని ఎక్కడికి వెళ్ళుచున్నావు. మఱియు చిలుక పలుకుల వంటి నీ పలుకులు, కోయిల కంఠము వంటి నీకంఠ స్వరము, గండుతుమ్మెదల వంటి

సిమూపులు, హంసనడక వంటి నీనడక, నీ సొగసును నిండుగా చూచుటకు లక్ష్మీదేవి వలెయున్నావు. నీవు నాదానవుగమ్ము అనియామెను రావణుడు ప్రార్థించెను. ఇట్లు ప్రాధేయపడు చుండిన రావణునితో.

**రంభ :** అతనిని చూచి ఇతడు రావణుడని తెలిసికొని గడగడ వణుకుచు రావణునితో ఓ రాక్షసరాజా శృంగార పురుషుల కొఱకు తిరిగెడు భోగము సానివలెనన్ను నీవు తలంచుచు మాటలాడుచున్నావు. ఇది నీకు న్యాయముగాదు. నీకు నేను కోడలిని నాకు నీవు మామవు. నీతి దెలిసిన వారు నీతిదప్పరు ఇతరులెవ్వరైనను నన్నిట్లు మాట్లాడినచో విని వారిని నీవు మందలించ వలసినవాడవు నీవేయీ విధముగా మాటలాడినప్పుడు నేనేమి సేయుదానను.

నీవు సామాన్యుడవు కాడు. బ్రహ్మ వంశమున పుట్టి వేదములను చదివి తపస్సులను జేసియున్నావు. యజ్ఞములను జేసిన పెద్దలు మీరే ఈ విధముగా మాటలాడి వావి వరుసలను దప్పినచో సామాన్యులు మాట చెప్పవలెనా అనినరంభతో రావణుడు ఓరంభా! నీవు నా కుమారునకు భార్యవై యేనాడు కాపురము జేసి యుంటివి. నేను నీముఖమే చూచి యుండలేదే? అనగా రంభ రాక్షసేశ్వరా! మీ అన్నగారగు కుబేరుని కుమారుడు నలకూబరుడు నీకును కుమారుడే కదా! ఆయననన్ను భార్యగా స్వీకరించి యున్నాడు. కావున నీవు కూడ మీ అన్నగారివలె నన్ను కోడలిగా మన్నించండి.

రావణుడు ఓహో నీవురంభవా తెలిసె తెలిసె నీ పేరువినుటలోనే తెలిసినది. నీవేనా వావివరుసలు మాట్లాడు చున్నావు. నేనడిగిన దానికి సమాధానమును చెప్పుము. నేను నీమాటకేప్రాధాన్యమిచుచున్నాను.

భూలోకములో తండ్రి యజ్ఞము జేయును. మరల తనయుడు కూడ కొంత కాలానికి యజ్ఞము జేయును. ఒక సమయములో అన్న యజ్ఞము జేయును. మఱి కొంత కాలానికి తమ్ముడు అదేయజ్ఞమును చేయును. ఒకయుద్ధములో బావమరణించి యుండును. మరొక యుద్ధములో అతని చెల్లెలు భర్త మరది మరణించి యుండును. ఒక యుద్ధములో మామ మరణించి యుండును. మఱొక యుద్ధములో అల్లుడు మరణించి యుండును. కానీ వీరందరును మరణించి స్వర్గమునకు వచ్చినప్పుడు దేవవేశ్యలైన రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ అనువారితో ఇప్పుడు నేను చెప్పిన వరుసలు గలవారందరును మీతో సంభోగించ వలసి యున్నది. ఇప్పుడు నీవు నాకు చెప్పిన విధముగానే వారికి కూడ బుద్ధి మాటలు చెప్పివారిని

ముట్టక వాపసు పంపియున్నావా! పంపియుండినచో అట్లు ఎవరెవరిని పంపి యుంటివి. వారి పేరులను నాకెరిగింపుము నిన్ను నేను విడచి పుచ్చెదను అని రావణుడు రంభను నిలదీసి యడిగి ఓరంభా నీవు వావివరుసలు జెప్పినన్ను తప్పించుకొనబోవుట న్యాయము కాదు. నాకు జవాబు చెప్పలేవు. ఇకవేయి మాటలెందుకు రా! అని రంభను రావణుడు చేయి బట్టిలాగుకొని పోయెను. తన పుష్పపాన్పుపై చేర్చి రంభతో రావణుడు మెలగుట చూడగా తామర కొలనిలో హంస తిరిగినప్పుడు పూవులు తావుగదులవు కొలనులో గలనీరు మురుకులుగావు ఇది సున్నితమైన చర్యతో హంసతిరుగాడి వెడలిపోవును.

రావణుడావిధముగా గాక హంస దిరుగవలసిన కొలనిలో దున్నపోతు చొరబడి తిరిగినప్పుడా కొలనెంతకలత జెందునో తామరలు తలక్రిందులై నీరంతయు బురదయగునట్లున్నా తామర కొలనువలె సున్నితమైన రంభ శరీరమును రావణుడు రక్కి చిందర వందరగావించి విడిచెను. రావణుడు విడువగా తప్పించుకొని వచ్చిన రంభను నలకూబరుడు చూచి ఆగ్రహించి ఇకమీదట తనను ఇష్టపడని స్త్రీని రావణుడు బలవంతముగా పట్టిరంభను చెరచినట్లు చెరచినచో అతనితలలు నూరు వ్రక్కలై చనిపోవునుగాక! అని నలకూబరుడు రావణునకు శాపమొసగెను. ఆ నాటి నుండి సమ్మతించని స్త్రీలను తాకుటకు రావణుడు సాహసింపడు.

**రావణుడు:** నలకూబరుని శాపమువిని కొంత సంతాపమంది. ఉదయమున లేచి తమదండును అమరావతీ పట్టణము చెంతకు పోయి దూరము నుండియు చూచి ఆశ్చర్యపోయి అమరావతి ఉపవనము లందు తనదండును దింపెను. రావణుడు ప్రహస్తునితో ప్రహస్తా ఈ యమరావతీ పట్టణము శిల్పసౌందర్యము గలదై వజ్రవైఢూర్య నీలగోమేధిక మరకత, మాణిక్యములను, మౌక్తిములను, నవరత్నములతో అమర్చి కట్టిన మేడలు కన్నుల పండువుగా నున్నది. దేవేంద్రునకీ పట్టణమే రాజధాని, భూలోకములో పుణ్యమెక్కువ జేసిన వారలును, యుద్ధము నందు మరణించిన వారలును, ఈస్వర్గమునకు వచ్చి సౌఖ్యములను భవించు చుండెదరు. ఈ పుణ్యప్రదేశమున కల్పవృక్షములు, శృంగార వనములు, బ్రహ్మకైనను వర్ణించుటకు వలను పడని దైయున్నది. ఈ పట్టణమునకెటు పైపు జూచినను, రాచవాకిళ్ళు గోపురములు విశాలమైన వీధులు, కేతకీ పున్నాగల తోటలు, బంగార రత్నములతో నమర్చి కట్టిన గృహములు ఎక్కడికక్కడనే కోర్కెలు దీర్చెడు ఫలవృక్షములు కలిగియున్నవి. అందువలననే ఈ పట్టణమున కింత ప్రఖ్యాతి కల్గినది.

ప్రహస్తుడా పట్టణ మంతయు పారజూచి రావణునితో రాజా! మనమింత కాలము ఈ పట్టణమును పేరినేల నిచ్చుట మహాపరాధము ఈ పట్టణమును మనమింతకు ముందెన్నడో వశపరచుకొని యుండవలసిన వారము మించిన పనికి చింతింపనేల ఇప్పుడే నేనీదేవేంద్రుని పట్టి కట్టి తెచ్చెదను అని ప్రహస్తుడు దెలుపగా.

రావణుడు నవ్వుచూ నీవంతటి వాడవేగానీ, మధురాక్షసుడు, మేఘ నాధుడు, కుంభకర్ణుడు నరాంతకుడు, ముఖ్యమైనవారందరు యుకటియై ఈ పట్టణమును ముట్టడించెదము. అప్పుడీ దేవేంద్రుడేమి సేయునో చూచెదముగాక అనగా ప్రహస్తుడు సరేయనెను. కుంభకర్ణుడును, నికుంభుడు తూర్పు దిక్కునందును, మాల్యవంతుడు సుమాలి మేఘనాథుడు ఉత్తర దిక్కునను ధూమ్రాక్షుడు, యూపాక్షుడు, దుర్ముఖుడు, మదురాక్షుడు దక్షణ దిక్కున తన మంత్రులతో రావణుడు పడమర దిక్కున ఈ విధముగా తన సైనికులను విభజించి అమరావతి పట్టణమును నాలుగువైపుల నుండి నాలుగు సముద్రములు గ్రమ్మినట్లు చేరి రణభేరులు సహా యుద్ధవాయిద్యములన్నియు మ్రోగించిరి.

దేవతలు భయపడి తమతమ యిండ్లలో గల వస్తుసామాగ్రులను విడచిపెట్టి, కొందరు విమానముల నెక్కి ఎక్కడికోవెళ్ళిరి. తగిన వస్తువులను మాత్రమేతీసికొని కొందరు వెళ్ళిరి. కొందరు తమ కుటుంబము వారితో కలిసి ఎగిరి మహర్లోకము చేరిరి. ఒకరితో నొకరు చెప్పుకొను ధైర్యము చాలక దాగుకొను చుండిరి. కొందరెక్కడికి పోవుటకును కాళ్ళాడక దిక్కు తెలియక అక్కడనేయుండిరి. కొందరు మూలలలో దాగి ముసుగులు పెట్టుకొని యుండిరి. మనమెక్కడికి పోబోయినను ఈ రాక్షసులు పోనీయరను వారును, ఇది గోలగ్గలు బట్టి రాక్షసులు వచ్చు చున్నారను వాడును. అమరవురిలో గల దేవతలందరును హడలిపోయిరి.

భూలోక యుద్ధములలో మరణించిన వీరులు అప్సరసలతో హాయిగా తిరుగవలెనను వారు అసురులకు భయపడి తిరుగుట చాలించిరి. అమరపురి దర్వాజాలు మూసి కోటగోడలపై మేటి శూరులు కాపుండిరి ద్వార పాలకులు ఇంద్ర సభకు బోయి స్వర్గమును ముట్టడించిన సమాచారము నింద్రునకు తెలిపిరి ఇంద్రుడు తన రాణులను రహస్య మార్గము నుండి తీసుకపోయి స్వర్ణగిరికి చేర్చెను కత్తి, డాలు, కవచములు ధరించి కామదేనువులు కల్పవృక్షమును అమృత కలశమును దేవమణి భూషణములను మున్నగు వానిని రాక్షసులకు దక్కనీయక దాచిపెట్టి ఎల్లప్పుడు జాగ్రత్తతో నుండెడు వారగు సిద్ధులు సాధ్యులు మున్నగు వారిని యుద్ధ శూరులుగా నియమించి ఇంద్రుడు వైకుంఠమునకు వెళ్ళెను.

అచట విష్ణుమూర్తిని జూచి సాష్టాంగ నమస్కారములు జేసి హరి, నారాయణ, విష్ణు, ముకుంద, నీభక్తులమైన దేవతలమగు మమ్మింత కాలమును శత్రువులను తొలగించి కాపాడితివి. ఇప్పుడు రావణ, కుంభకర్ణ, మేఘనాధ మదురాక్షసులు వచ్చి స్వర్గమును ముట్టడించి యున్నారు. వీరు బ్రహ్మ ఈశ్వరుల వలన వరములు పొంది యున్నారు. వారిని జయించుటకు మాకు సాధ్యము కాదు. అందువలన మీకు తెలుపుకొను చున్నాను. పాలముంచిన నీట ముంచినను మాకు నీవేదిక్కు వేరొక దిక్కు లేదని దేవేంద్రుడు ప్రార్థించెను.

**విష్ణు దేవుడు:** దేవరాజా! రావణుడు, కుంభకర్ణుడు మేఘనాథుడు ఈ ముప్వురును బ్రహ్మవలనను. ఈశ్వరుని వలనను వరములను పొందియున్నారు. అందు వలన వారిని నేనిప్పుడు జయింపజాలను. మీమీద ప్రీతితో నేను వచ్చినను, వారిని జయించలేక వెనుదిరిగితినేని విష్ణు దేవుడు కూడ వారిని జయింపలేక పోయెనను అపకీర్తికి లోనుకావలసి వచ్చును. కావున నేనచటికి వచ్చియు ప్రయోజనము లేదు. వారు దేవతల వలనచావులేని వరములను పొందియున్నారు. అందు వలన నేను దేవత్వముతో నుండి వారిని జయింప జాలను జయించు సామర్థ్యమున్నను బ్రహ్మ యిచ్చిన వరమునకు పరువు బోగొట్టినట్టు కాగలరు. అందు వలన నీకిప్పటికి తోచిన విధమున వారిసెదరింపుము. మీదట రామావతారములో వారిని వధించగలను ఆ విధముగా మీకు మేలుసేయ గలనని దేవేంద్రునకు విష్ణు దేవుడు తన అసహాయతను తెలియజేసెను.

అగస్త్య మునీంద్రుడు శ్రీరామచంద్రునకాకథను తెలుపు చున్నాడు ఓరామచంద్రా!

దేవేంద్రునకు వైకుంఠము నందు విష్ణు దేవుడు తెల్పిన నిస్సహాయతను మనస్సులందు తలంచుకొని అమరపురి చేరి యుద్ధము గావించుటకు ఉత్సాహ వంతులైన వారిని కూడగట్టెను. అందరును వారి వారి ఆయుధములతో ఉత్సాహ వంతులై ద్వాదశాదిత్యులు పదుముప్వురు విశ్వులు, ముప్పదారుగురు తుషితులు, ఎనిమిది మంది వసువులు, నలుబది నాలుగు మంది భాస్వంతులు, నలుబది తొమ్మిది మంది అనిలులు, పదునొకండు మంది రుద్రులు, పండ్రెండు మంది సాధ్యులు మరియు గరుడులు, గంధర్వులు, చారణులు, సిద్ధులు, జేచరులు, యక్షులు, కిన్నరులు కింపురుషులు, పన్నగులు గుహ్యకులు ఇంకా తక్కిన దేవవీరు లందరును దేవేంద్రునితో వచ్చుచుండ రావణునిపై యుద్ధమునకు బయలు దేరెను.

## దేవేంద్రుడు, దేవసైనికులు

దేవేంద్రుడు, దేవసైనికులు రాక్షస సైనికులతో తలపడిరి. వారిని ఈటెలతో శూలములతో గ్రుమ్ముచు దండములతో గదలచే మోదుచుండిరి. రావణుడు ! యజ్ఞకోపుని సుపార్శ్వుని, ధూమ్రాక్షుని, యూపాక్షుని, సుమాలిని, శతమాయుని, రుధిరాక్షుని, ఖరుని, మహోదరుని, మహాకాయుని దూషణుని, త్రిశిరుని, వృశ్చికరోముని, సర్పరోముని, అభేద్యకవచుని, విరూపాక్షుని, కాలనేమిని, దుర్ముఖుని, శుకుని, సారణుని ఇంకా తక్కిన వీరరాక్షసులు ప్రహస్తుని వెంట నడుచుచుండగా కన్నులకు మిఱుమిట్లు గొల్పు ఆయుధములు ధరించి దేవసైనికులను జయించు నుత్సాహముతో యుద్ధరంగమునకు వచ్చి దేవసైనికులతో దలపడిరి.

## దేవదానవుల యుద్ధము

ఇట్లు దానవసైనికులును దేవసైనికులును తలపడి ఒకరిపైనొకరు విజృంభించు చుండగా పోరు ఘోరమయ్యెను. ఆ సమయమున దేవతలును, రాక్షసులును ఒకరి కొకరు తీసిపోక సమానముగా పోరాడిరి. ఆ యుద్ధమును చూచువారలకు ఒకసముద్రము మఱియొకసముద్రముతో తాకినట్లుండెను.

రాక్షసుల పరాక్రమమునకు తాళలేక దేవతలు వెనుదీయుచుండిరి. సుమాలి అది చూచి నవ్వుచు పిరికి పందలారా! పారిపోవు చున్నారెందుకు నిలునిలుడని వారిని వెంబడించి రథమును పోనిచ్చుచు బాణములతో కొట్టుచుండెను. అప్పుడు సావిత్రుండను వసువు సుమాలినెదిరించి వాని రథమును నుగ్గు నూచనంబుగా వించెను. రథములేని సుమాలిని సావిత్రుడు తనగదతో తల బగులునటుల గొట్టెను. సుమాలి చావును జూచిన రాక్షసులు భయపడి పరువులు దీయుచుండిరి. ఇది చూచిన మేఘనాథుడు మహాకోపముతో దేవ సైనికుల నదిలించుచు వారిపై తన బాణములను వర్షమువలె కురిపించెను. అతని ధాటి కోర్వలేక దేవసైనికులు నలుదెసలకు పరువులెత్తిరి.

అని అగస్త్య మునీంద్రుడు రామచంద్రునితో ఓరామచంద్రా! ఆ మేఘనాథుని పరాక్రమమేమని వర్ణింపగలను. భయపడి పరుగెత్తు చున్న దేవసైనికులను దేవేంద్రుడు నిలువరించి భయపడవలదు, మన జయంతుడు మేఘనాథుని జయింపగలడని వారికి ధైర్యమును జెప్పి నిలువరించెను. జయంతుడంతకు మునుపే యుద్ధమునకు సిద్దముగా నుండెను.

## జయంత మేఘనాధుల యుద్ధము

దేవేంద్రుని కుమారుడగు జయంతుడు రావణుని కుమారుడగు మేఘనాథునితో యుద్ధము సేయుటకు నిశ్చయించి తన సారథియైన గోముఖునిచే తనరథమును సకలాయుధములతో సంపూర్ణముగా సమాయత్తము గావించు కొనిరమ్మని యాజ్ఞాపించగా, నతడదేవిధముగా దీసుకొనివచ్చెను. జయంతుడా రథముపై నెక్కి సింహనాదము జేసి మేఘనాథునిపై అమ్ములవాన గురిపించెను. మేఘనాథుని శరీరము రక్తముతో తడిసి పోయెను. దేవతలది జూచి జయంతుని యుద్ధకౌశలమునకు మెచ్చుకొనిరి.

మేఘనాథుడు జయంతుని జూచి పకపక నవ్వుచు, ఓరీ జయంతా! దేవతలందరిలో నీవే బలవంతునివి. నీకిది పరీక్షా సమయము. నా యెదుట పారిపోక నిలువుము అనుచు పదునైన బాణములతో గొట్టుచు, జయంతుని సారధిని గుఱ్ఱములను కూలిపోవునట్లు గొట్టెను. అందుకు జయంతుడు కోపించి మేఘనాథుని యెూధనంబులో వేంటియమ్ములతో సూటిగా గొట్టెను. మేఘనాథుడా దెబ్బలు దిని తన రథము నుండి పైకెగిరిపోయి ఆకసమున తన మాయతో మూసుకొనిపోయి కంటికి కానరానివాడై అక్కడ నుండి జయంతునిపై బాణములు, బల్లెములు, కత్తులు, పర్వత శిఖరములు మెండుగా కురిపించెను. అది చూచిన దేవతలు భీతిల్లిరి. జయంతుని తల్లిగారి తండ్రి, తాత పులోముడు అలసిపోయి యున్న జయంతుని తనమాయ వలన నితరులకు కనబడనీయక, జయంతుని దీసుకొనిపోయి సముద్రములో దాచెను. దేవ సైనికులది చూచి విధిలేక పారిపోయిరి. కదన రంగములో జయంతుడు కనబడలేదు.

దేవవిభుడు మాతలితో మనసైనికులు మరలిపోవు చున్నారు. మేఘ నాథుని బలము మించిపోయినది. మన జయంతుడు కనబడ లేదు. మనమిప్పుడు మేఘనాథుని మార్కొనవలెను. మన రథమును మేఘనాథుని రథమునెదురుగా బోనిమ్మనగా సారధియటులేజేసెను. రావణుడది జూచి దేవేంద్రుని ఢీకొనెను. మేఘనాథుడు మిన్నున నుండి మన్నుపైకెదిగి తన తండ్రిని తొలగొంచి తానే ఇంద్రుని యెదిరించెను. ఇట్లు మేఘనాథుడు దేవేంద్రు నెదరింపగా దేవతలకు రాక్షసులకు మరలా క్రొత్త యుద్ధము ప్రారంభమయ్యెను.

ఆ సమయమున రెండు వైపుల నుండి పేరుమోసిన ధీరులు వీరులై తారసిల్లిరి. ఓరామచంద్రా! విను. కుంభకర్ణుడు అన్నకు సంతోషమును కలిగింప

వలెనసి శూలమును ధరించి యుద్ధమునకు తారసిల్లి, దేవసైనికులను తనపాదములతో తన్నుచు, మోకాళ్ళతో మోదుచు, అఱచేతితో అణగదట్టుచు. దేవతలను దీనత్వము నొందించుచు రౌద్రముతో మించిపోయిన కుంభకర్ణు నెవ్వరును నెదిరింపజాలక దేవేంద్రాదులు దిగులుపడిరి.

కొండవలె మెండు శరీరముగల కుంభకర్ణుని మీద రుద్రులు మరుత్తులు కత్తులు గొడ్డళ్ళు, కొండశిఖరములు దెచ్చి గ్రుక్కిరి. ద్వాదశాదిత్యు లతనిపై దొడ్డ బాణప్రయోగములు గావించిరి. ఆ దెబ్బలకు కుంభకర్ణుని శరీరమునుండి రక్తము మేరుపై దిగజారెను.

ఇది యిట్లుండగా రాక్షసులు ఏనుగుల మీద, మొసళ్ళమీద, పాముల మీద, తాబేళ్ళమీద, చేపలమీద, పందుల మీద, ఖడ్గమృగములమీద, సింహముల మీద, చమరీ మృగముల మీద వాహనములుగా గల వారలైయెక్కి దేవతల మీద తల పడిరి. రెండు వైపుల వారికిని సంకుల సమరము జరిగెను. వారొకరిపై నొకరు ప్రయోగించు కొన్న బాణములు ఆకసమున దిట్టముగా నిలిచి నందున లోకమంతయు చీకటులు గ్రమ్మెను. ఆచీకటిలో తనవారెవరో పరాయివారెవరో తెలియజాలక వారిలో వారేపోరాడిరి. ఆ పోరాటములో రావణుని సైనికులలో పదియవ వంతును దేవతలు చంపివైచిరి. అది చూచి దేవేంద్రుడు, రావణుడు చావడు అతనికి బ్రహ్మావరములున్నవి. కావున నతనిని ప్రాణములతో బందీగావించెదనని, రుద్రాదులతో చెప్పి తన రథమును దక్షణదిశగా నడిపించెను. రావణుడు తన రథమును ఉత్తర దిక్కునకు నడిపించెను. వారొకరి కొకరు ఎదురైరి. ఆ యిరువురకు ద్వంద్వ యుద్ధము జరిగెను. రావణుని చేతులలో గల పదికోదండములను దేవేంద్రుడు ఖండించి చేతులలో ఆయుధములను లేని వానినిగా జేసి రావణుని పట్టుకొని దేవేంద్రుడు తన రథముపైకి లాగుకొని పోవుచుండగా రాక్షసులు జూచి భీతిల్లి దిక్కుతెలియని వారై, అదిగో దశగ్రీవుని దేవేంద్రుడు పట్టుకొనెను. రాక్షసులకు రారాని కష్టములు వచ్చెనని భోరున ఏడ్చుచుండిరి.

ఆ యేడ్పులను మేఘనాథుడు విని తన తండ్రిని ఇంద్రుడు పట్టుకొని పోవుచుండుట జూచి దండతాడిత భుజగంబువలె రోజుచు కోపమును పట్టజాలక, తాను మహేంద్రక్రతు వొనర్చినప్పుడు అగ్నిలో పుట్టిన రథమును, గుఱ్ఱములును, అమ్ముల పొది, శరాసనములను ధరించి, ఆ రథముపై యెక్కి

వెలుగుచు వచ్చి, దశగ్రీవుని చుట్టుముట్టి యున్న దేవతలను తన బాణములతో గొట్టి, తనకు ఈశ్వరుడిచ్చి యున్న తామసీ (కనబడని) విద్యనుపయోగించి దేవేంద్రుని సైనికులను చెల్లాచెదరు జేసి వారిని తరుమగొట్టెను.

మేఘనాథుడు తన రథమును తానును నితరులకు కనబడక, మాయా యుద్ధము జేయుచు, నలు దిక్కుల యందును చీకటిని సృష్టించి దేవతలకు కనబడక దేవేంద్రుని గూడ కప్పివైచి, అయన కిరువైపుల నుండు దిక్పాలురను భయపడునట్లు జేసి, మాతలిని, గుఱ్ఱములను తన బాణములతో నొప్పించి సింహనాదము జేసెను. ఆ రథమును దిగి దేవేంద్రుడు తన పట్టపు ఏనుగు ఐరావతముపై నెక్కగా, మేఘనాథుడు చూచి, తన మాయా ప్రభావముతో తాను దేవేంద్రునకు కనబడక తనకు కనబడు దేవేంద్రుని చుట్టు దిరుగుచు, తన బాణములతో దేవేంద్రుని కొట్టి దేవేంద్రుని సొమ్మసిల్ల జేసెను. మేఘనాథుడు చీకటులుడుగునట్లు జేసి దేవేంద్రునకు కనబడక అతని కాలు, సేతులు గట్టివైచి. నవ్వుచు తెచ్చి తన రథమునకు కట్టివేసెను.

దేవేంద్రా! నీవు నా కన్న తండ్రిని కట్టి వేయుటకు సన్నాహములు గావించి యుంటివి. విధి బలీయము వలన నీవేనాకు చిక్కిపోయితివి అని దేవేంద్రునితో ననుచు తన చిందమునూదెను. మేఘనాథుడు దేవేంద్రుని కట్టివేసినది చూచి రాక్షసులుబ్బి పోయిరి. దేవేంద్రుని పాటు జూచి దేవతలు రుద్రులు అశ్వినులు ఇంకా తక్కిన వారందరును వచ్చి రావణుని చుట్టుకొని బాణములతో గొట్టగా, అతని శరీరమంతయు జల్లెడ కుండు రంధ్రముల వలె తూట్లుబడెను. రావణుడలసిపోయి వారితో యుద్ధము సేయలేక సేయలేక సేయుచుండెను.

## మేఘనాథుడింద్ర జిత్తగుట

అలసిపోయి యున్న తన తండ్రిని ఆకసము నుండి మేఘనాథుడు జూచి దేవతల బాణములను వేయుచు గర్జించెను. పై నుండి రాళ్ళను, బాణములను దేవతలపైన వర్షమువలె కురిపించెను. మేఘనాథుని ధాటికి వారుతాళలేక రావణుని విడచి వెళ్ళిపోయిరి.

మేఘనాథుడు నాయనా! దేవతలు పారిపోయిరి, దేవేంద్రుడు మనకు చిక్కెను. మనమిక ఎవరితో యుద్ధము సేయవలెను. మనతో సమానముకాని దేవతలపై మనమెందుకు యుద్ధము సేయవలెను. ఇక స్వర్గ మర్త్య పాతాళములకు

నీవే అధిపతివి. కావుననిక మన్సైన్యమును మరలింపుమని దేవేంద్రుని జూపుచు, ఇతడే దేవేంద్రుడు అని చూపించెను.

రావణుడు తన కుమారుని కౌగలించుకొని, ఓ పరాక్రమ శాలీ కుమారా! నీవు ఇంద్రునంతటి వానిని జయించి చెఱబట్టితివి. అందు వలన నీ ప్రతాపము దేవతలందరికిని తెలిసిపోయినది. నీవంటి కుమారుడు నాకు కలుగుట వలన, నీ సహాయముతో నేనిప్పుడు మూడు లోకములకు నాయకుడనైతిని. కుమారా! మాయందరిలో నీవే జయమును పెంపును సంపాదించితివి. కావున నీ రథమును ముందు నడిపింపుము. ఈ వీరులందరును నీకు సేవలు జేయుచుండగా వారందరితో గలసి నేనును నీ వెంట వచ్చెదను అని తనకుమారుని ముందు బంపి రావణుడు అతని వెనుక భాగమున నడచు చుండెను.

అని అగస్త్య మహామునీంద్రుడు రావణుని వృత్తాంతమును శ్రీరామునకు దెలుపుచు ఓ రామచంద్రా! రావణుడిట్లు తన కుమారుని ముందుబెట్టి, తన మంత్రులతోను, సైనికులతోను, వెనుక భాగమున నడచుచు మేఘనాథుని బొగడు చుండగా విని దేవేంద్రుని గుండెలు గుభిల్లుమనెను. సమస్త రాక్షస సేనలు సేవించు చుండగా సాటిలేని సంపదగలవాడై రావణుడు లంకకు చేరి తన తమ్ములతో కూడ లంకాపౌరులును కూడి సంతోషించు చుండగా రావణుడు లంకారాజ్యమును తనకెదురు లేనివాడై యేలుచుండెను అని అగస్త్యమునీంద్రుడు శ్రీరామచంద్రునకు, మేఘనాథుని మేటి తనమును రావణుని రాజసమును రామచంద్రునకు తెలియజేసెను.

అగస్త్య మహామునీంద్రుడిట్లు రామచంద్రునకు చెప్పగా విని, ఓముని చంద్రా! దేవేంద్రుని చెఱబట్టుకొని లంకకు బోయిరని చెప్పితిరి. కానీ తరువాత దేవేంద్రుడు మేఘనాథుని చెఱ నుండి యేవిధముగా విముక్తి జెందెను? ఆ కథను దెలుపుమని రామచంద్రుడడుగగా అగస్త్య మునీంద్రుడు చెప్పుట కారంభించెను.

మేఘనాథుడిట్లు దేవేంద్రుని పట్టి కట్టుకొనిపోవుచుండగా దేవతలందరు అడ్డుపడి తమ ప్రభువును విడిపించు కొనుటకు తమ శాయశక్తులా పోరాడి మేఘనాథుని ధాటికి నిలువలేక విడిచి వెళ్ళిపోయిరి. మేఘనాథుడు లంకజేరెను.

దేవేంద్రుని విడిపించు కొనజాలని దేవతలందరును ఒకచోట గుమిగూడి, వృత్రాది మహావీరులను జయించిన ప్రతాపశాలి కీనాటికింత యాపదవచ్చెను. దేవత్వ మీనాటికి రాక్షసుల కపరాధిగా బందీయయ్యెను. దీనిని గమనించినచో

కాలగతి నెంతటివారైనను కాదనలేము అని దేవతలందరును యోచించి, మనమిప్పుడేమి సేయవలెను. దీనికంతటికి బ్రహ్మదేవుడు కర్త కావున మనమందరము ఆయన చెంతకు పోయి జరిగినదంతయు వినిపించి ఆయన మనలనేమి సేయుమనునో ఆవిధముగా చేయుదమని నిశ్చయించుకొని తక్షణమే బయలుదేరిరి.

ఇదియిట్లుండగా దేవతలు యుద్ధము నుండి తిరిగి వచ్చుచున్నారని విని కొందరు దేవతలు సైనికుల కెదురుగా బోయి, వారిలో దేవేంద్రుడు లేనందున తెలిసికొని ఆ బాధకుతాళ లేక తల్లడిల్లు వారును, ఇంద్రునంతటి వానికీగతి బట్టినది కదాయని యేడ్చుచుండిరి.

మనమిక జరిగిన దానిని గూర్చి వ్యసనపడుచు కూర్చుండుట బుద్ధిమంతుల పద్ధతిగాదు. జరుగబోవు కార్యమును గ్రక్కున యోచించి కర్తవ్యమును నెవేర్చవలెను లెండని సత్యలోకమునకు బోయి బ్రహ్మదేవుని సభలోనికి బ్రవేశించిరి.

అచట వేయిరేకుల కమలము మీద బ్రహ్మకొలువై యుండెను. ఆ బ్రహ్మ సభలో కపిలుడు, మార్కండేయుడు, కణ్వుడు ఇంకా తక్కిన మునీశ్వరులను జూచుచు బ్రహ్మదేవుడొక ముఖముతో వారితో మాటలాడుచుండెను. మఱియొక ముఖముతో ఉప బ్రహ్మలకు ఏవిధముగా సృష్టిని సేయవలెనో తెలుపుచుండెను. ఇంకొక ముఖముతో తన దేవీరియైన సరస్వతీ దేవితో సల్లాపములు ఛలోక్తులు, నర్మగర్భముగల నవీనవాక్కులు, శ్లేషార్థములతో సంతోషపెట్టు చుండెను. మఱియొక ముఖముతో మంచి నాట్యముగావించు అందగత్తెలైన అప్సరసల ఆటపాటలను గాంచు చుండెను.

ఆ సమయమున దేవతలు సభలోనికివెళ్ళి సరస్వతీ నిభునకు సవినయముగా మ్రొక్కిరి. ఓదేవా! రావణుని పెద్ద కుమారుడు మేఘనాథుడు మహేంద్రుని జయించి బందీగా పట్టి కట్టుకొని పోయియున్నాడు. మీరు మాపై దయయుంచి దేవరాజును విడిపింపుమని కోరిరి. బ్రహ్మదేవుడది విని తక్షణమే లేచి ఆదేవతలను, వెంటబెట్టుకొని లంకకు వెళ్ళెను.

## బ్రహ్మదేవుడుడింద్రజిత్తునకు వరములొసగి ఇంద్రుని విడిపించుట

బ్రహ్మదేవుడు లంకకు రాగా రావణుడు భయభక్తులతో సాష్టాంగ నమస్కారములు జేసి పూజించి, స్వామీ! మీరు మాసదనమునకు విచ్చేయుట వలన మాలంకయును, లంకలో గలవేమందరమును ధన్యులమైతిమి అని

పొగడుచుండగా బ్రహ్మదేవుడు రావణునితో, నాయనా దశగ్రీవా! నీయంత బలవంతుని నేనిదివరలో చూచియుండలేదు. దేవేంద్రునోడించి చెఱబట్టిన నీకుమారుడు నీకంటే బలశాలి. కావున నీకుమారునకు ఈ దినము నుండి ఇంద్రజిత్తు అనిపేరుబెట్టుచున్నాను. నేను దేవతలను రక్షించుటకు ముందు ఇంద్రుని సృష్టించి అబాధ్యతలను అతనికప్పగించి యున్నాను. ఆదేవేంద్రుడు నీవద్ద చెఱలో నుండుట కర్తుడుగాడు. నాకొఱకై యతనిని విడువుమని బ్రహ్మదేవుడు తెలుపగా, మేఘనాథుడంజలిఘటించి. బ్రహ్మకు నమస్కరించి తాతా! ధాతా! ఈ ప్రపంచమునకు ఆది కారణ భూతుడగు నీయాజ్ఞాను సారము దేవేంద్రుని వదలివైచితిని. నామీద దయయుంచి నాకు దేవత్వము ప్రసాదింపుము అని కోరగా, నాయనా మేఘనాథా! యక్షులకు కిన్నరులకు రాక్షసులకు దేవత్వము లేదు. అది కోరక మఱియేదియైనను కోరుమనెను.

మేఘనాథుడు బ్రహ్మతో స్వామీ! నేను శత్రువులతో యుద్ధము జేయు నప్పుడును, యజ్ఞము జేయునప్పుడు, అగ్నిలోబుట్టిన రథము నెక్కినప్పుడు, నాకు దేవత్వమివ్వుమ్మ. నేను యజ్ఞము జేయునప్పుడది విఘ్నమయ్యె నేని అదినశించిపోవుటకు సమ్మతించితిని. ఓతాతగారూ, అందరును తపస్సు జేసి దేవత్వమును కోరుచుండగా నేను పరాక్రమముతోనే దేవత్వమును కోరుచున్నాను. అని యడుగగా ధాత తథాస్తు అని సమ్మతించెను. వెంటనే కట్లు విప్పి దేవేంద్రుని బ్రహ్మదేవునకు అప్పగించెను.

దేవేంద్రుడు లజ్జతోను, వీడిపోయిన తలవెంట్రుకల ముడితోను, తెగిపోయిన కంఠహారములతోను, వాడిన ముఖముతోను మేఘనాథుడు కట్లుగట్టినప్పుడు త్రాడును బిగించిన వాతలతోను, నలిగిపోయిన శాలువతోను, శత్రువులు కొట్టినప్పుడు తగిలిన గాయములతో తలవాల్చి అడుగులు తడబడుచుండగా వచ్చి బ్రహ్మదేవుని పాదములపైబడెను. బ్రహ్మ దేవేంద్రు నూరడించుచ దేవేంద్రా! నేను సృష్టించిన స్త్రీలందరి కంటె అందమైన అహల్య అను స్త్రీనొక దానిని సృష్టించితిని. అహల్యయనగా నాగలి. హలము, అట్టి హల భావము అహల్య యందు లేనందు వలన నేనామెకా పేరుబెట్టితిని. నీవు ఆమెను నాకివ్వుమని కోరితివి. నేను నీకివ్వక గౌతమ మునీంద్రునకిచ్చితిని. నీవు అర్ధరాత్రిలో కోడివై కూసి మునీంద్రుని నదికి స్నానమునకు బంపి ఆమెతో అక్రమ సంబంధమును బెట్టుకొంటివి. అది గమనించి మునీంద్రుడు నిన్ను శత్రువులు చెఱబట్టెదరని శాపమిచ్చెను. ఆనాటి నుండి రూపవతులైన స్త్రీలు ప్రపంచమున పుట్టుచుండిరి.

ఈ నాటి నుండి నీకు మునీంద్రుడిచ్చిన శాపముతీరిపోయెను. జయంతుని అతని తాత పులోముడు తీసుకొనిపోయి సముద్రములో దాచియున్నాడు. నీవు వెదుక పనిలేదని బ్రహ్మదేవుడు ఇంద్రునకు దెలిపి తనలోకమునకు వెళ్ళెను. బ్రహ్మదేవుడు చెప్పినట్లు శాపవిముక్తి కొఱకు ఇంద్రుడు వైష్ణవ యాగము గావించి దుఃఖము మాని సౌఖ్యముగానుండెను.

ఓరామచంద్రా! రావణ కుంభకర్ణాదుల కంటె ఇంద్రజిత్తు పరాక్రమ వంతుడునుట నిజమేకదా అనగా విని శ్రీరాముడాశ్చర్యము నొందెను. సభలోని వారు లక్ష్మణుని పొగడుచుండిరి.

విభీషణుడు రామచంద్రుని జూచి, స్వామీ! సేనానాడు కన్నులతో జూచిన దంతయు ఈనాడు మునీంద్రుని వలన వింటిని. అయ్యారే ఈ అగస్త్య మునీంద్రుడింత మహిమగలవాడని సంతోషించి విభీషణుడగస్త్యుని గూర్చి పొగిడెను.

## రావణుడు కపిలమునిచే భంగపడుట

అగస్త్యుడు ఓరామచంద్రా! మఱియొక రహస్యమున్నది. రావణుడొకప్పుడు పడమటి సముద్రమునకు బోయి అక్కడ నొకవన మధ్యమున నుండెను. ఇట్లున్న రావణునకు సేవకులు పరిచర్యలు జేయుచుండిరి. రావణుడు సముద్రపు టిసుకపై పచారములు సేయు చుండెను. ఆ సమీపమున హిమాలయ పర్వతము వంటి ఒక పర్వత ముండెను. అందులో నొక కోనయుండెను. ఆ కోనలో నొక మహాపురుషుడు జటావల్కాములు ధరించి తామర రేకుల వంటి కన్నులు గలవాడై, తామర పువ్వులతో నమర్చిన కంఠహారముగలవాడై, చిగురుటాకుల వంటి పాదములతో పద్మాసనము వేసికొని కూర్చుండి, కన్నులు మూసికొని చేతిలో నొకతులసి మాల ప్రేలాడుచుండ, నిర్మలచిత్తుడై ఆత్మ సుఖముననుభవించు చున్నట్లు కనబడెను.

రావణుడామునీశ్వరుడెవ్వడో చూచెదమని ఆయన సమీపమునకు బోవుచుండెను. ఆమునీంద్రుని కన్నుల నుండి అగ్ని జ్వాలలు బుట్టెను. ఆయన లలాటము బొమముడిబడి, చూచుటకు భయంకరముగా నుండెను. ఆయన ముఖము నుండి చేతుల నుండి పదునైన బాణములు ఆయుధములు బుట్టి విజృంభించెను. ఆయన శరీరములో మరుత్తులు, రుద్రులు, వసువులు, గ్రహములలో సూర్యుడు, దేవతలలో ఇంద్రుడు పర్వతములలో మేరువు

ఏనుగులలో ఐరావతము, వృక్షములలో కల్పవృక్షము మఱియు బ్రహ్మదేవుడు, ఈశ్వరుడు, ముఖ్యమగు దేవతా రూపముల తనియందు ప్రకాశించుచు కనబడెను. ఆయనను తేరిపార జూచుటకు సాధ్యపడని వెలుగులు విఱజిమ్ముచున్న రూపములా గొప్ప పురుషుని యందు రావణునకు కనబడెను.

రావణుడు ఔరా మునీంద్రుడు నాయందు మాయలుబన్ను చున్నాడు. మాయలను గీయలు జేసెదనని ఆయనపై బాణవర్షమును గురిపించి, వీరావేశముతో సింహనాదము జేసెను. ఆ సింహనాదమును విని మునీంద్రుడు మహాకోపముతో ఉరిమి చూచెను.

ఆయన కన్నులందు నిప్పులు కుప్పలుగా రాలెను. ఆయన తటాలున లేచి తన పిడికిలి బిగించి ఓరీ నీచుడా! నీవు నన్ను సాధించుటకిక్కడికి వచ్చితివా? అని రావణుని వక్షముపై నొకపోటు పొడిచెను.

అగస్త్యుడు రామచంద్రునితో, ఓరామచంద్రా! ఆ బలశాలి పొడిచిన పోటుకు కులిశాయుధముతో దెబ్బదిన్న పర్వతమువలె రావణుడు నేలగూలి పోయెను. కూలిన రావణుని జూచి అతని మంత్రులు ఆబలశాలి నెదిరింపగా, తన హుంకార క్రియలచేతనే వారిని తన దగ్గరకు చేరనీయక, నిలిపి వేసి అక్కడనే యుండిన గుహలోనికి వెళ్ళెను.

కొంత సేపటికి రావణుడు తెలివి దెచ్చుకొని లేచి నన్ను పొడచి పడద్రోచిన వాడెక్కడ బోయెనని తన మంత్రులనడిగెను.

రాజా! అతనిమాట ఇక మనకెందుకు. భయపడి ఈ గుహలోనికి వెళ్ళి యున్నాడు. భయపడి పారిపోయిన వారితో నీవంటి బలవంతులు పోరరుకదా? దొరలి పోవుచున్న దోస పండ్లకు పాదములు చాచుట మంచిది కాదు. అతడు కూడ భుజబల సంపన్నుడగునట్లు కనబడుచున్నాడు అని రావణునకు మంత్రులు దెలుపగా, రావణుడు విని, ఓహో ప్రళయ సమయమున విజృంభించు యముడైనను నేను పోనియ్యను మీరిక్కడనే యుండుడు అని తన మంత్రులనచటనే నిలిపి, మూర్ఖుని మనస్సువలె నుండెడు దట్టమైన చీకటితో నుండెడు గుహలోనికి, పోవుచు తన బాణముల వెలుగుల వలన చీకటులను తొలుగ ద్రోయుచు, గుహలోపల ప్రవేశించెను. ఆగుహలో మహా ఉగ్రరూపులై అస్త్ర శస్త్రములను ధరించి యుండిన వీరు లచట మోహన రూపము గల దేవతాస్త్రీల చూపులతోనే ఈ బ్రహ్మాండమును బూడెదగావింప జాలిన సిద్ధులను, మఱియు శంఖము, చక్రము,

గద, ఖడ్గము, శార్జములను, నాలుగు భుజములు గల పురుషవరులను, వారియందుగల తేజస్సు, గంభీరత్వము కలిగి తనను భయకంపితుని జేయుచుండగా రావణునకు తత్తరపాటు గలిగి, తనువుప్పొంగుచు వారిని జుచి భయపడి గుహలోనికి బోయెను. ఆగుహలో రావణునకు ఊహింపలేని చిత్రములు కనబడుచుండెను. ఏమనగా ఒక మహాపురుషుడు పరుండి యుండెను. ఆయన దేవతలు బూయు చందనము పూయబడిన వాసనలోనుండెను. ఆయన వక్షముపై దేవతా హారములు మెండు శోభను కలిగించు చుండెను. ఆయన మకరకుండలములకు గల మణులకాంతి గుహలోగల చీకటులను తొలగించు చుండెను. ఆకసము నగల నక్షత్రములవలె ఆయన రొమ్ముపై గల హారములలో గల మణులు తేజోవంతముగా నుండెను. ఆయనకు కొందరు స్త్రీలు వింజా మరలు వీచు చుండిరి. వారి చేతుల యందు కంకణముల శబ్ధము ఘల్లు ఘల్లుమని చెవులకానందము గొలుపు చుండెను. ఆయన శయనించి యున్న పాన్పు తెల్లని కాంతులీను చుండెను. ఒకయువతి ఆయన పాదములను తనతొడల మీదబెట్టుకొని మెల్లగా ఒత్తుచుండెను. ఆయన కన్నులు మూసి నిదురించు చుండెను.

రావణునకు స్త్రీలు కనబడినప్పుడు చిత్తము భ్రమించు చుండును. ఆ సౌఖ్యనిధికి, పాదములొత్తు చున్న స్త్రీని చూడగా చిత్త భ్రమణముగలిగెను. అందు వలన తెప్పలార్పక ఆమెవైపు జూచుచు, ఆమె సమీపమునకు పోవు చుండెను. ఆ నిదుర బోవుచున్న పురుషుడదిదెలిసికొని తాను ముసుగు బెట్టుకొని యుండిన సన్నపు చెల్లాను తొలగించి తటాలున పైకి లేచి రావణునివైపు జూచి, అహ్వాహ్వాహ్వాయని అట్టహాసము జేసి గట్టిగానవ్వెను. ఆనవ్వును విన్న రావణుడదిరి పోయి నిశ్చేష్టుడై నిలబడిపోయెను. కొంతసేపటికి తనను తాను తెలిసికొని గర్వము నిర్వీర్యమైపోయి, వినమ్రుడై, ఆమహాపురుషుని సమీపించి దోసిలి యొగ్గి, సన్నని యెలుగుతో స్వామీ! మీరెవరు తెలిసికోవలెనను కోఱిక గలిగినది. తెలియజేసి నా సందేహము నివారణ సేయగోరుచున్నాను. నేను పుట్టినది మొదలు ఎందరెందరినో చూచియున్నాను వారిని మీకు తెలియజేయుచున్నాను.

రుద్రుని చూచి యున్నాను. ఆయనలో మీయందున్నంత రౌద్రము కానరాలేదు. యమధర్మరాజు నెదిరించి యుద్ధమే జేసియున్నాను. నీశరీరము నందుగల కఠినత్వ మాయన శరీరము నందు కానరాలేదు. సూర్యుని జయించినాను. సూర్యునిలో నీ యందున్నంత ప్రచండమాయన యందు కానరాలేదు. మేరు పర్వతముపై తిరుగాడితిని. నీయందున్నంత ధైర్యమా మేరుపర్వతము నందు

కానరాలేదు. ఇంద్రుని, చంద్రుని జూచి యున్నాను. ఇంకా తక్కిన దేవతలెందరినో జూచితిని. కానీ మీయందున్న ప్రభావమెవ్వరి యందును కానరాలేదు. నివురులోగల నిప్పువలె మీ చరిత్రము మాకేమియు తెలియకున్నది. మహాత్మా! నాకు తెలియజేయుమని రావణుడడుగగా ఆ మహా పురుషుడు నవ్వుచూ ఓ రావణా! నేనెవడనో నీవిపుడు తెలిసికొనజాలవు. రాబోవు కాలములో తప్పక నన్ను తెలిసికొనగలవు. ఆ సమయము రాకనే నేనింతవాడను అంతవాడనని నీతో చెప్పుట యోగ్యము కాదు.

అది యట్లుండనిమ్ము. నీకు బ్రహ్మదేవుడు శంకరుడు ఇచ్చియున్న వరముల ప్రభావము వలన ప్రపంచములో గల వారినందరినీ నీవు బాధపెట్టుచున్నావు. బ్రాహ్మణము చెడగొట్టిన నీకు ఇక మీదట నా భుజబలమును తెలియజేయగలను. కైలాసాధిపతి అడ్డు పడినను విడువక నిన్ను యుద్ధములో జయించగలను అని రావణునకా మహాపురుషుడు తెలియజేయుచు, నేనెవరినో తెలిసికొనవలెనన్న నానిజ రూపమును నీవే తెలిసికొనుమని తన నోరుదెరిచెను.

## కపిల మునియైన నారాయణుడు రావణునకు స్వస్వరూపము జూపుట

రావణునకామహా పురుషుని నోటిలో కొన్ని అద్భుతములు కానవచ్చెను. అందులో కొన్ని వేల అగ్నిజ్వాలలు, కొన్ని లక్షల మంది సూర్యులు, కొన్ని కోట్ల మంది చంద్రులు, నరులు, దేవతలు, రాక్షసులు, వియచ్చరులు, సిద్ధులు, సాధ్యులు, రుద్రులు, పన్నగులు, గంధర్వులు మొత్తము మొత్తములుగా కనబడిరి. ఇంకను సమస్త లోకములు, భూమి, గాలి, చుక్కలు, పర్వతములు, ఆమ్నాయ విద్యలు అతని ముందుకనబడెను.

మఱియు అనేక ముఖములు, కన్నులు, చెవులు, ముక్కులు, పాదములు, చేతులు, భూషణములు, వస్త్రములు, అస్త్రములు, శస్త్రములు ఇంకను ఎన్నెన్నియో అద్భుతములు కనబడెను. వెండికొండ నూడబెరికి చేతులతో నెత్తిన రావణుడు, ఆ మహా పురుషుని దగ్గరున్నప్పుడు చూడగా, తనకు తానే ఆయన ఏనుగువలె పెద్ద శరీరముగలవాడై యుండగా, రావణుడు ఆయన వద్ద దోమవలె అల్ప శరీరము గల్గియుండి, ఆ రూపమును చూడలేక గడగడ వణుకుచూ, తన యిరువది కన్నులను మూసి తన యిరువది చేతులను జోడించి నమస్కారములు సేయుచూ,

ఓ మహాత్మా! నన్ను నీవు యుద్ధములో చంపుటకంటే మించిన సుఖము నాకింకేమి కావలెను అని పలుకుచు స్తోత్రముగావించుచు, తన్మయుడై యుండి కొంత సేపటికి కన్నులు దెరిచి చూచెను. అప్పటికే మహాపురుషుడు ఆ పర్వతముతోను, ఆగుహతోను పత్తాదెలియక మాయమైయుండెను. అంతకు ముందున్న వేమియు కానరాలేదు. అదిచూచి రావణుడు తన మంత్రులతో గలసి అటనుండి వెడలి పోయెను అని అగస్త్య మునీంద్రుడు శ్రీరామునకు రావణ వృత్తాంతమును దెలుపుచు, ఓ రామచంద్రా! ఆనాడు రావణునకు కనబడిన దెవరో కాదు ఆయనే కపిలావతారుడుగు విష్ణుమూర్తి. ఆయనే నీవు. ఇకమీదట నేను నిన్ను సంహారింప సమకట్టియున్నాను జాగ్రత్త అని హెచ్చరించియున్నాడు.

ఓ పట్టాభి రామా! ఋషులు, స్నానము సంధ్య, జపము, తపము, వేదపఠనములతో నెవనిని స్మరించు చున్నారో ఈ ప్రపంచము పుట్టి పెరిగి సమసిపోవుట అనునవి ఎవనికి ఆట వస్తువులైయున్నవో, లక్ష్మీదేవి తన పాపటిలోని సింధూరమువలె ఎవని పాదధూళిని ధరించి యున్నదో, ఎవని పేర్లను గురువులు తమ శిష్యులకు మంత్రములు గానుపదేశించు చున్నారో, బ్రహ్మదేవుడు, దేవేంద్రుడు ఎవని మాయలో బడి తప్పించుకొన జాలకున్నారో ఆహరివి నీవైయున్నావు.

నీ పాదధూళి తగులగనే శిల స్త్రీగా మారుట, ధనుస్సు దీసుకొను నెపమున, పరుశరాముని శక్తిని నీలోనికి లాగివేయుట, ఒకేనొక బాణముతో వజ్రము వంటి శరీరము గల వాలిని కూలనేయుట, సముద్రములో గల నీటినంతటిని బాణము యొక్క మొనకు తేగల్గుట, ఇదివరకెవ్వరికి జయింపవీలుకాని రాక్షసులను జయించుట అను నీ మహాకార్యములను చూచి ఆయాదినారాయణుడు నీవేయని తెలియగల్గితిమి.

ఓ దశరథనందనా! దశముఖుని చంపుటకు నీవీవిధముగాన వతరించితివి. ఆరావణుని సంహారము జేయుట కొఱకు తలపెట్టిన, నీకార్యములను జరిపించుటకు గాను, రుద్రుడు హనుమంతుడుగాను, బ్రహ్మదేవుడు జాంబ వంతుడుగా, సూర్యుడే సుగ్రీవుడుగా, ఆదేవేంద్రు డంగదుడుగా, ఆయా దేవతలు ముఖ్యమైన వానరులుగా జన్మించిరి. అందరు దేవతలేయయ్యును, వారిలో హనుమంతుడు నీయందధిక భక్తిగల మహాత్ముడు ఉదాత్తగుణములు గలవాడు. రాక్షసులనందరినీ ఇతడొకడే జయించుశక్తి గలవాడు. కుంభకర్ణుని శరీరము

గొప్పదనుకుంటే ఆంజనేయుని శరీరమంతకంటే గొప్పది. ఏలననగా ఎంతైనా పెంచగలడు. మామూలుగా మలచు కోగలడు. బలవంతుడు. ఇతనిని పొగడుటకు సాధ్యముగాదు.

ఇతడు కళంకము లేనివాడు. ఏలాంటి అపాయముల నొందనివాడు. ఉపాయము లెరిగినవాడు. నీవితని ప్రభావమును తెలిసికొనియే మరెవ్వరినీ లెక్కజేయక, వానరులు సీతను వెదుకుటకు బోవునప్పుడు నీవతనితో సీతను చూచి, ఆనవాలుగా ముద్రికనిచ్చి ఆమెతో పరిచయము చేసికొనుమని హనుమంతుని పొగడి పంపించితివి. కావున సర్వజ్ఞుడగు నీకు తెలియని దేమియులేదు.

ఈ హనుమంతుని గూర్చి తెలిసినవారిని చెప్పుచున్నాను. సముద్రముపై హనుమంతుడెగిరిపోవునప్పుడు, మైనాకుడనే పర్వతము సముద్రములో నుండి పైకిలేచి ఆయన దారికడ్డమై నిలచినది. దానిని తన పిడికిలితో నొక పోటు బొడిచినాడు. ఆపోటుకాకొండ పిడుగును సహించలేని పెనువృక్షము వలె ప్రేలినది.

వేయిమాటలెందుకు, ఓరామా! రావణుని కంటే, ఇంద్రజిత్తుకంటే, వాలికంటె హనుమంతుడే గొప్ప బలవంతుడు. హనుమంతునకు కోపముగలిగినచో లోకాలే చీకాకు చెందగలవు. కానీ అతనికి మహా ఋషులు శాపముబెట్టుట వలన తన బలము తనకు తెలియదు అని మాటల సందర్భము వలన హనుమంతుని గూర్చి శ్రీరామచంద్రునకగస్త్యు మునీంద్రుడు తెలియజేసెను. ఆ మాటలు శ్రీరామచంద్రుని చెవులకమృత ధారలయ్యెను.

అగస్త్య మునీంద్రునితో ఓమహాత్మా! నీవు చెప్పిన దంతయు నిజము ఆంజనేయుడనే తెప్పను నేను సహాయముగా గొని, ఆపదయనే సముద్రమును దాటితిని. ఈ సుగ్రీవుని లాంటివారిని నాకు సేవజేయుటకు సమకూర్చిన దీమహాత్ముని మృదుమధురమైన మాటలేకదా! ఈ మహా వీరుడు నామీదగల భక్తితో జేసిన కార్యములు ఇంత అంత అని నిర్ణయించుటకు సాధ్యము గాదు. ఈ వాయునందనుడానాడు లంకలో అశోకవనములో సీతను చావనీయక అమృతధారల వంటి మాటలతో, నిలబెట్టి అచట నుండి వచ్చి, నాకున్న దుఃఖమును సంశయమును తొలగించెను. విభీషణుడు వచ్చి నన్ను శరణుగోరినప్పుడు, ఇతనిని చేర్చుకొనుమని సమయోచిత సలహానిచ్చి మాకు సందేహనివృత్తి గావించినాడు.

శత్రువుల చేత చచ్చిన వానరులకు అమృతము బోసిమరలా ప్రాణములు నిలబెట్టియున్నాడు. యుద్ధరంగములో రావణుని తన పిడికిలితో పొడిచి సగము

చంపియున్నాడు. రావణుని శక్తిబాణము తగిలి, మూర్ఛబడియున్న లక్ష్మణుని సంజీవిని దెచ్చి బ్రతికించియున్నాడు. అంతేగాదు లక్ష్మణునితో పాటు సూర్య వంశమునే నిలిపియున్నాడు. వేయిమాటలెందుకు నాకొఱకయి అనేక మంది రాక్షసుల నితడొకడే చంపియున్నాడు. ఓ మునిచంద్రా! నేను నాతమ్ములతోను, తల్లులతోను, బంధువర్గముతోను, ఈ సీతతోను కలసి మరలా అయోధ్యకు రాజై సుఖపడుటంతయు, ఈ హనుమంతుని సహాయమువలననే. ఇది సత్యమైన మాట. నేనెన్ని జన్మలనెత్తియైనను ఇతని ఋణమును తీర్చుకొనజాలను. అదియట్లుండ నిమ్ము. ఈ మహామహుడు వాలిని చంపునంత బలముండియు బలవంతుడగు వాలిని గొట్టక ఎందుకుపేక్షించి యుండెను. తన శక్తిని తాను తెలియకుండును గాకయని మునీశ్వర్వరులెందుకు శాపమిచ్చియుండిరి. ఎందువలన ఇతడు తమ బలమును తామెరుగజాలక వాలిని విడిచెను. ఇదిగాక వాలిని సుగ్రీవుని సమానముగా చూచి సేవ జేసియున్నాడు. కావున వాలితో విరోధము బెట్టుకొనలేదు. అట్లుగాకుండిన హనుమంతునెదుట వాలి గీలి నిలచియుండలేరు. ఓ రామచంద్రా! హనుమంతుని జన్మవృత్తాంతమును చెప్పుచున్నాను వినుము.

## హనుమంతుని జననము

మేరు పర్వతమునకు మించిన ధైర్యము గలవాడు, దేవతలకు రాక్షసులకును మించిన బలముగలవాడు, కేసరియను వానర శ్రేష్టుడొకడుండెను. అతనికి మాతులుడను వానరుడు, తన కుమార్తెయగు అంజనాదేవినిచ్చి వివాహము గావించెను. వారికి చాలా కాలము వరకు సంతానము లేకుండెను. వాయుదేవుని గూర్చి తపస్సుజేసి, ఆయన వలన పుత్రసంతతి బడయుమని కేసరిఅంజనాదేవిని నియమించెను. అంజనాదేవి తన భర్త యనుమతితో వాయుదేవుని గూర్చి నీవేగతి నీవేగతి యని చాలాకాలము తపస్సుజేసెను. అంజనాదేవి ఘోరతపస్సునకు మెచ్చి ఈశ్వరునినుమతితో, వాయుదేవుడు శంభుని వీర్యమును దెచ్చి అంజనాదేవి కియ్యగా అంజనాదేవి సంతోషమున, ఆ వీర్యమును తన గర్భమునందు ధరించెను. ఇట్లంజనీదేవి గర్భమును ధరించిన యొక్క సంవత్సరమునకు మంచి ముహూర్తమున దేవతలు పుష్ప వర్షమును కురిపించు చుండగా, అప్సరస లాడుచుండ దేవదుందుబులు మ్రోయుచుండ ఇతడంజనీదేవి గర్భము నుండి బాల సూర్యునివలె ప్రకాశవంతముగా పుట్టెను.

ఇట్లు జన్మించిన నితని శరీరఛాయమెరుపు తీగవలెను, అరుణునివలె ఎఱ్ఱటి ముఖకాంతియు, తెల్లటి కన్నులును, మోకాళ్ళ క్రింది వరకు వేలాడుచున్న పొడ్డైన చేతులును, తెల్లని జందెమును, హారములతో వెలుగు చుండు మనోహరమై బలిసిన వక్షస్థలమును, చేతుల కందమైన కంకణములును, జ్వాజ్వాల్యమానముగా ప్రకాశించుచు దేవేంద్రుని తేరుపై నుండెడు ధ్వజమువలె కనబడు తోకయును, బంగారు పట్టువస్త్రములు గలిగి పుట్టిన కుమారుని జూచి తల్లియగు అంజనీదేవి ఎంతో సంతోషించి ఆ కుమారుని కౌగలించుకొని నాయనా! నీకు పండ్లు కావలెనా? కావలసినన్ని తెచ్చి పెట్టెద ఏడువకుమని, ఆ బాలుని అచటనే యుంచి పండ్లు దెచ్చుట కొఱకు అడవికి పోయెను.

అంజనాదేవి అడవిలోనికి పోగా, ఆసమయమున సూర్యోదయము జరుగు చుండెను. అప్పుడప్పుడే వికసించు జపాపుష్పమువలె సూర్యుడు ఉదయ పర్వతముపైకి వచ్చుచుండెను. ఎర్రగానుండు ఆ సూర్యుని హనుమబాలుడు జూచి ఇది యొక పండు కాబోలునని భావించి తానాకలితో నుండుట వలన గాలివేగము, గరుత్మంతుని వేగము, బాణవేగములను మించిన వేగము గలవాడై, పైకెగసి పోవుచుండగా అతని తెగువను జూచి ఆకసములో తిరుగుచున్న గంధర్వులు, గరుడులు, యక్షులు, సిద్ధులు, సాధ్యులు ఆశ్చర్యపడి భయముతో ఈ మహా బలవంతుడెవ్వరని చూచుచుండగా, ఆనెత్తురు కందైన శిశువు సూర్యుని దగ్గరకుపోవుచుండగా, అతనికెండ వేడిని తగులనీయక, గాలి బలముగా వీచుట చాలించి ఆబాలునిపై చల్లగా మెల్లగా వీచుచు, ఆ బాలుని గప్పుకొని వాయు దేవుడతని వెంటబోవుచుండెను. ఆ సమయమున బాలుని పాదముల తాకిడికి గొప్పగొప్ప వృక్షములు దూది పింజలవలె పైకెగిరి పోవుచుండెను. ఇతనితొడలు తగిలి గంధర్వ నగరములు (మేఘములు) చిన్నాభిన్నములై పోవుచుండెను. ఇతని చేతులు దగిలి అటునిటుబోవు విమానములు కూలిపోవు చుండెను. ఇతడు తోక తిప్పునప్పుడు చుక్కలకు దగిలి రాలుచుండెను. ఇతని శరీర కాంతిని చూడజాలక ఖేచరులు చెల్లాచెదరైపోవు చుండిరి. ప్రపంచములోనే గొప్ప చరిత్ర గల ఈ మహానుభావున కదియేమియు తెలియరాకుండెను. ఇట్లు పోయి పోయి అప్పుడే ఉదయించుచున్న బాల సూర్యుని బట్టుకొనెను.

హనుమంతుడిట్లు బాల సూర్యుని బట్టినప్పుడు సూర్యుని వద్ద సేవలు జేయుచున్న ఛాయదేవి భయపడి చేతులు బిసికికొనుచుండెను. భయమును

పోగొట్టు మంత్రమును జపించుచు వాలఖిల్యాదులు ఒక ప్రక్కనక్కియుండిరి. మాఠరుడు, పింగళుడు భయపడి తమచేత నున్న ఆయుధములను వదలి ఆవలకు బోయిరి. సూర్యునితో యుద్ధము చేసి చావగా మిగిలినవారు సూర్యునికిట్లు గావలసిన దేయని లోలోన సంతసించు చుండిరి.

అపుడీ బాలుడు ప్రకాశించుచున్న సూర్యుని బట్టి నోటిలో బెట్టుకొనుచు, వేడిమి యెక్కువైనప్పుడు తటాలున నవతలివైచు చుండెను. ఈ వానర బాలుడు మున్ముందు ప్రపంచమునకు మేలుచేయువాడని, సూర్యుడు తన వేడిమినతనిపై చూపక తగ్గించు చుండెను. ఇట్లు రెండు ఘడియల కాలము జరుగునప్పటికి ఆ దినమమావస్యయగుట వలన సూర్యుని బట్టుటకు రాహువక్కడికి వచ్చెను. ఈ వింతను జూచువారందరును ఆశ్చర్యము జెందుచుండిరి. సూర్యుని బట్టుచున్న వానర బాలుని జూచి రాహువు కోపించి, హుంకారము చేయుచు ఈ బాలుని వద్దకు వచ్చెను. ఆ బాలుడారాహువును జూచి ఔరా! ఇంత వరకు నాకు ఎఱ్ఱని పండే దొరికినది. ఇప్పుడు నల్లని పండు కూడ దొరకుచున్నదని సూర్యుని వదలి రాహువును బట్టుకొనెను. రాహువు భయభ్రాంతుడై ఆ బాలుని చూచుటకు కూడ ధైర్యము చాలక విడిపించుకొని వేగముగా దేవేంద్రునొద్దకు బోయి ఈ బాలుడు జేయు పనులను దెలిపెను.

అదివిని దేవేంద్రుడాశ్చర్యపడి, అంతటి మహావీరుడెవడో చూచెదనని నాలుగు కొమ్ములుగల ఐరావతమనే తెల్లటి యేనుగుపైనెక్కి చేతిలో వజ్రాయుధము ధరించి తన చుట్టును దేవతా పరివారముండగా వారితో గలిసి సూర్యుడున్న చోటునకు వెళ్ళెను. అక్కడ ప్రతి సూర్యుని వలె ప్రకాశించుచున్న వీడెవడోయని మహాకోపముతో తన తెల్లటి యేనుగునతనిపై కెగదోలెను. దేవేంద్రుడు సింహనాదము జేసెను. ఈ బాలుడు తనవైపు వచ్చుచున్న తెల్లటి యేనుగును జూచి, ఇదివరకు ఎఱ్ఱటి పండు, ఆ తర్వాత నల్లటి పండు, ఇప్పుడు తెల్లటి పండు నావైపు వచ్చుచున్నదని బావించి యేనుగు మీదికెగిరెను. కేసరీ పుత్రుడుడీ విధముగా బంతులతో నాడుకొనువానివలె పైబడిపోవుట చూచి, దేవేంద్రుడు భయపడి ప్రక్కకు దొలిగి, ఏనుగుమీదికెగ బ్రాకుచున్న వాయుపుత్రుని జూచి వీనిని మరొక ఆయుధముతో జయింపలేనని నిశ్చయించి పర్వతములనే ముక్కలు జేయు వజ్రాయుధమును బాలునిపై విసరివైచెను. అది వాయు కుమారుని ఎడమదవడకు దగులగా అబాలుడాబాధను భరింపజాలక ఉదయాద్రి పర్వతముపై బడెను. అదిచూచి రాహువు చాలా సంతోషించెను.

## హనుమంతుడు దేవేంద్రుని వజ్రాయుధముచే మూర్ఛిల్ల వాయు దేవుడాత్మమూర్తినుపసంహరించుట

ఆ సమయమున మూర్ఛబడి యున్న కుమారుని చూచి, వాయు దేవుడు దుఃఖముతో తల్లడిల్లిపోయి, ఇంద్రునిపై కోపించి ప్రపంచమున నిండియుండి ప్రాణముగాగల తన ప్రాణశక్తియగు గాలిని ఎక్కడా లేకుండా ఉపసంహరించెను. వాయుదేవుడిట్లు గావించుట వలన గాలి సంచారము లేక, జడములై కదలిక లేక స్థంభించిపోయెను. వాయుదేవుడు తన కుమారుని తీసుకొని ఒక కొండ గుహలోనికి వెళ్ళెను. ఇట్లందరియందును ఉచ్ఛ్వాసనిశ్వాసములుగా తిరుగుచున్న వాయుదేవుడు గాలి ఎవ్వరికిని ఆడక పోయినందున జీవులు శవములవలె మారిపోయిరి. గాలి ఆగిపోయిన సమయమునకు ఎవ్వరెవ్వరే భంగిమలలో నుండి రోవారట్లే కొయ్యబొమ్మలవలె నుండిపోయిరి. యజ్ఞములు సేయువారు యజ్ఞ కుండములలోనికి చేయిచాచిన నదిచాచినట్టుగను, విమానములాకసమున కెగిరినవి ఎగిరినట్టే యుండెను. మునీశ్వరులు నదులలో స్నానమును చేయుటకు వెళ్ళి వారానీటిలో మునిగిన వారు మునిగినట్టును, లేచిన వారు లేచినట్లును, పశువులు, జనులు, మృగములు నడచునప్పుడు పాదము పైకెత్తినవి పైకిని, దించినవి దించినట్లును సూర్య మండలమున సూర్యుని నడక నిలబడి పోయెను. గ్రహ నక్షత్రముల కాలగమనము జరుగలేదు. ఇలాంటి విపరీతము లేర్పడినదందున దేవతలు మునీశ్వరులుఎట్లెట్లో బహు ప్రయాసతో బ్రహ్మయొద్దకు పోయి జరిగిన దంతయు జెప్పగా, వెంటనే బ్రహ్మదేవుడు వాయుదేవుడున్న గుహయొద్దకు వచ్చినిలువగా, వాయుదేవుడది గమనించి తన కుమారుని దెచ్చి బ్రహ్మదేవుని పాదముల చెంత బెట్టి నమస్కరించి నిలబడెను. నిలచిన వాయుదేవుని బ్రహ్మ దేవుడు చూచి కుమారా ఎందుకు ఇటువంటి కఠినమైన పనిచేసితివి. నీ కుమారుడెక్కడున్నాడు వీడేనా! అని తెలివిదప్పిన వానరబాలుని జూచి బ్రహ్మదేవుడు తన చేతితో శిరస్సు నుండి పాదముల చివరి వరకు నిమిరెను.

బ్రహ్మదేవుని చేయి బాలునకు తగులగానే వర్షములేక యెండి యుండిన లేత పైరు వర్షమునకు తడువగానే కళకళ లాడుచు క్రొత్తగా ఊపిరితో నెట్లు లేచి నిలబడునో ఆవిధముగా ఈ వానరబాలుడు స్పృహకలిగి లేచి నిలబడెను. ఇట్లు లేచినిలబడిన వానర బాలుని బ్రహ్మ తన ఒడిలోనికి తీసుకొని ముద్దుపెట్టు కొనుచుండగా వాయుదేవుడది చూచి సంతోషించి, తాను ప్రపంచములో లేకుండుట అనునది చాలించి సమస్త ప్రపంచమును నిండిపోయెను. సమస్త జీవులకు ప్రాణాపాయము తొలగిపోయెను.

## బ్రహ్మేంద్రాదులు హనుమంతునకు వరములొసగుట

పిమ్మట బ్రహ్మదేవుడు అక్కడున్న దేవతలందరిని చూచి ఓ దేవతలారా! ఈ వానర బాలుడు జరుగబోవు కాలములో మదించిన రాక్షసులను చంపి ప్రపంచ జనులకెంతో మేలుచేయవలసియున్నది. కావున నితడు శౌర్య ధైర్యములు కలవాడగునటుల మీరందరును నితనికి వరములిచ్చుట మంచిదని వారి నాజ్ఞాపించెను.

నా వజ్రాయుధము దగిలి ఈ వానర బాలుని దవడ విరిగినది. అందు వలన ఇతనికి హనుమంతుడని ఈ దినము నుండి పిలువబడునుగాక! అని దేవేంద్రుడు పేరుబెట్టెను. మఱియు నావజ్రాయుధముతో ఇతడు చావడు నొప్పిబడడని వరమొసంగెను.

బ్రహ్మదండముతో గాని, బ్రహ్మాస్త్రముతో గాని ఇతనికి చావులేదు మఱియు దీర్ఘాయుస్సు కలవాడై జీవించునని బ్రహ్మదేవుడు వరమొసంగెను.

తన త్రిశూలముతో గానీ, రౌద్రాస్త్రముగానీ, పాశుపతాస్త్రముతో గానీ ఇతనికి చావులేదని శివుడును తనకాల పాశముగాని, దండాయుధముగాని, మృత్యువేగాని ఇతని నేమిచేయజాలవని యమధర్మరాజు బలికెను. నేను నాతేజస్సులో నుండి పదియవభాగమిప్పటికే యిచ్చియున్నాను. ఇకనితనికి విద్యలు కూడనేర్పించెదనని సూర్యభగవానుడనెను. వరుణపాశము అందరిని కట్టివేయును కానీ నాపాశమీబాలుని కట్టజాలదని వరుణుడు జెప్పెను. నా మంటలితని కాల్పజాలవని అగ్నియు, నా గదచే దెబ్బతినడని కుబేరుడును, నాచే తయారుచేయబడిన యే ఆయుధము చేత నొప్పిబడడని విశ్వకర్మయును ఈ విధముగ తక్కిన దేవతలందరును ఒక్కొక్కరుగా వరములొసగిరి.

ఆ తరువాత బ్రహ్మదేవుడు, వాయుదేవుని జూచి సమస్త దేవతలు వినుచుండగా నిట్లనెను. ఓ వాయుదేవా! నీ కుమారుడుగ్రముతోను శౌర్యముతోను ధైర్యములతోను, బలవంతుడై, శ్రీరామ కార్యభారమును వహించి మీకు శత్రువులైన రావణాది రాక్షసులను ప్రతాపముతో జయించగలడు. ఇతనికి లోకమునందు అసాధ్యమనునదేదియు నుండదు అని వాయుదేవునకు దెలిపి దేవగణముతో వారివారి స్థానములకు వారు వెళ్ళిరి. బ్రహ్మసత్య లోకమునకు వెళ్ళెను.

ఇట్లు దేవతలందరును వెళ్ళినవెనుక వాయుదేవుడు హనుమంతుని దీసికొని వచ్చి కుమారుని గానకవెదుకచు తల్లడిల్లుచున్న తల్లి అంజనీదేవికి అప్పగించి అతని

ప్రభావమూమెకు తెలియజేసెను. ఓ రామచంద్రా! అటు తరువాత ఈ యాంజనేయుడు బాల్యక్రీడలతో మునీంద్రులాశ్రమములకు బోయి అచట వారు క్రిందబరచుకొను జింక చర్మములను, వారుకట్టుకొను కౌపీనములను చింపివేయుచుండగా వారితనిపై కోపించి శాపమొసగిరి.

ఋషులు తనకు శాపమిచ్చుటవలన పశ్చాత్తాపము నొంది తన భుజ బలమును జూపక అణుకువతో ఋషులకు సేవ జేయుచుండెను. ఈ తరువాత సుగ్రీవునితో చేరెను. హనుమంతుడిట్లు బోనులో నుండిన సింహమువలె బ్రాహ్మణశాపము వలన తనబలమును తాను తెలియకయుండెను. సుగ్రీవుడితని బలమును దెలిసి ఇతనిని సన్మానించుచుండెను. అగ్నిదేవునితో మిత్రత్వముగల వాయుదేవునివలె సుగ్రీవుడు హనుమంతునితో మైత్రి గలిగి యుండెను.

## హనుమంతుడు సూర్యనొద్ద వేద శాస్త్రములను జదువుట

అగస్త్యమునీంద్రుడు ఓ రామచంద్రా! నీకొక అద్భుత విషయమును దెలిపెదను వినుము. దేవతలు హనుమంతునకు వరములిచ్చి నప్పుడు సూర్యుడితనికి విద్యలు నేర్పెదనని చెప్పి యుండెను. ఆ మాటనితడు జ్ఞాపకమునకు దెచ్చుకొని శ్రుతులను వినదలచి, ఒకనాడు హనుమంతుడు సూర్యుని వద్దకు బోయి నమస్కరించెను.

సూర్యుడు దయగలవాడై ఓ కుమారా! నాదగ్గర చదువులు నేర్చుకొన వలెనని వచ్చియున్నావు. నేనొక చోట నిలుచువాడను కాను. నా ప్రయాణము జరుగుచునే యుండవలెను. నీవు నా ముందుభాగమున నిలువకూడదు. నేను నీకు పాఠము చెప్పునప్పుడు నీమనస్సేకాగ్రమగునా? చెప్పుమని సూర్యుడడుగగా, వీరుడగు హనుమంతుడు నవ్వుచు తన దేహమును పెంచి ఉదయాద్రి పర్వతముపై నొక కాలును. అస్తాద్రిపై మరొక కాలును బెట్టి ఆనాడు విష్ణుదేవుడు త్రివిక్రముడై దేహమును పెంచి లోకములనాక్రమించినట్లు ప్రపంచ జనులందరును భయము చెందిరి.

హనుమంతుడిట్లు తన నిజరూపముతో దేహమును పెంచుటను చూచి, సూర్యుడాశ్చర్యము జెందెను. హనుమంతుడు సూర్యునకెదురై ఆకసమార్గమున, సూర్యుడు నడచుచున్నంత వేగమున తానును బోవుచు సూర్యుడు చెప్పుచున్న పాఠమును వినుచుండగా ఆయన సూక్ష్మబుద్ధికిని, ఏకాగ్రతకును, శ్రద్ధా సక్తులకును సూర్యుడు సంతోషించెను.

ఈ నాటి విద్యార్థులు సుష్టుగా భోజనము జేసి చల్లని నీడనిచ్చెడు చోటులలో గూర్చుండి పైన పంకాలు తిరుగుచుండగా ప్రక్కలలో కరెంటు దీపములు కాంతినిచ్చుచుండగా సీటులపై నీటుగా గూర్చుండి గురువులు చెప్పెడు పాఠములను తాను వినక ప్రక్కవారిని విననియ్యక కూనిరాగములు దీయువారును గురువులకు మారుపేరులు బెట్టువారు, వారి మంచిని గోరి కఠినముగా శాసించెడు గురువుపై కసిదీర్చుకొను మహానుభావులున్నారు.

హనుమంతుడట్లుగాక ఆహారములేని వాడై తీక్షణమైన మండుటెండకోర్చి సూర్యభగవానుడు చెప్పు పాఠములను ఏకాగ్రతతో వినుచు ఏక సంథాగ్రాహియై విద్యలను నేర్చుకొనెను.

ఈ హనుమంతుడు మృదుమధురమైన భాష , మాటల యందు చాక చక్యము, పాఠములను వినుట యందును జ్ఞప్తికి బెట్టుకొనుట యందు శ్రద్ధ, సూక్ష్మబుద్ధియను వానియందు శతధృతిగాని, బృహస్పతులుగాని ఇతనితో సమానులుగారు.

సూర్యుడుదయించు చున్నప్పుడు హనుమంతుడు ఉత్తరదిక్కుకు మరలి తన కుడిచెవిని సూర్యుడు బోధించెడు పాఠములను వినుటకనుకూలముగా బెట్టుకొని తన కుడికాలిని ఉదయాద్రిపై మోపి ఎడమ కాలిని అస్తాద్రిపై బెట్టి ఉదయకాలములో కుడి ప్రక్కకు వంగి వినుచు సూర్యుని నడకననుసరించి, క్రమముగా పైకి లేచుచు మధ్యాహ్నమగునప్పటికి తానును తలపైకిలేపి, సాయంకాలము అస్తాద్రికి సూర్యుడు చేరునప్పటికి, హనుమంతుడు తన ఎడమ వైపునకు వంగి వినుచుండును: విన్నదానిని మస్తకములో నిక్షేపము జేసికొను చుండును. ఈ విధముగా హనుమంతుడు సూర్యుని వద్ద వేదశాస్త్రములను నవవ్యాకరణములను చదివెను.

ఓ రామచంద్రా! వైరాగ్యమునకు, వినయమునకు, శమమునకు, దమమునకు, దాక్షిణ్యమునకు, సుశీలత్వమునకు పరులకుపకారము జేయుటకు, పరాక్రమమునకు, గంభీరత్వమునకు, బ్రహ్మచర్యము పాటించుటకు, విద్యకు తపముజేయుటకు, ధైర్యమునకు, భక్తికి ఈ పుణ్యాత్ముడగు హనుమంతుడు ఏ కొఱతలు లేనివాడు. నిధివంటివాడు. హద్దులు దాటి ఈయాకనమును ముంచివేయు సముద్రము కంటెను ఈ ప్రపంచమునొకేసారి బూడిద గావించెడు కల్పక్షయాగ్నికంటెను అనేకములగు పర్వతములను అరణ్యములను పొడి

పొడిజేసెడు పిడుగులకంటెను ఈ బ్రహ్మాండ భాండమునొకేసారి పగులగొట్టెడు విలయకాలభైరవుని కంటెను, ఎక్కువగు గాంభీర్యము సాటిలేని పరాక్రమము అధికమైన వేగము అద్భుతమైన రౌద్రము. ఈ హనుమకంటే అన్నియు తక్కువే. వాలీ గీలీ ఈ హనుమంతునెదుట నిలువజాలరు అని యీ విధముగా హనుమంతుని గొప్పతనమును అగస్త్యమునీంద్రుడు శ్రీరామచంద్రునకు దెలిపెను అదంతయు శ్రీరామచంద్రుని సభలోని వారందరును వినుచు హనుమంతుని వైపు అద్భుతముగా చూచుచు పదివేల విధముల అతనిని ప్రశంసించు చుండిరి.

## వాలి, సుగ్రీవుల జననము

శ్రీ రామచంద్రుడగస్త్య మునీంద్రునితో మహాత్మా! మీరుచెప్పగా నేనీకథలను వింటిని. హనుమ వృత్తాంతమును కూడా వింటిని. ఆనందమున నోలలాడితిని. కానీ వాలి దేవేంద్రుని పుత్రుడనియు, సుగ్రీవుడు సూర్యుని పుత్రుడనియు విని యున్నాను. అందువలన వారి జన్మవృత్తాంతము కూడ వినవలెననియున్నది తెలుపుమని కోరగా అగస్త్యుడు చెప్పుచున్నాడు.

ఓ రామచంద్రా! పూర్వము నేను తపస్సు జేసికొనుచుండిన చోటునకు నారద మునీంద్రుడు వచ్చెను. నేనాయనను గౌరవించి స్వామీ! వాలి సుగ్రీవుల జననమును గూర్చి వినవలెనని యున్నదినాకా కథను తెలుపవలెనని కోరగా ఆ మాహాత్ముడాకథను చెప్పియుండెను. ఆయన వలన విన్న దానిని మీకు వినిపించెదను వినుమని చెప్పనారంభించెను.

ఎల్లప్పుడు దేవతలు నివసించునట్టిది, పర్వతములలో శ్రేష్ఠమైనది, మణులతో శోభాయమానమైనది అయిన కాంచన పర్వతము గలదు. ఆపర్వత శిఖరముపై మధ్య భాగమున గూర్చుండి బ్రహ్మదేవుడు నియమనిష్ఠలతో తపస్సు జేసికొను చుండెను.

ఆయన తారక యోగమున సమాధి నిష్ఠయందుండ ఆయన కన్నుల యందు జలబిందువులు రాలెను. ఆజలబిందువులను ఆయన తన దోసిలిలో బట్టుకొనెను. ఆ నీటినుండి ఋక్షవిరజుడనునొక కుమారుడు బుట్టెను. ఆకుమారునితో బ్రహ్మదేవుడు నాయనా! కుమారా! నీవీకాంచన పర్వతముపై గల పండ్లు, కంద మూలములు, తేనెలను దిని జీవింపుమని తెలుపగా అటులనే సేయుచు తండ్రికి కావలసిన పుష్పములు, ఫలములు, పూజకు కావలసినవి తెచ్చియిచ్చు చుండెను.

ఇట్లుండగా నొకనాడు ఋక్షవిరజుడా పర్వత శిఖరమున కుత్తర భాగమునకు వెళ్ళెను. అచ్చటనొక సరోవరము నిర్మలమైన తేటనీటితో నిండియుండెను. ఋక్షవిరజుడా సరోవరములోనికి దిగి కడుపారనీరుద్రాగి పైకి వచ్చి గట్టున నిలబడి ఆ నీటిలోనికి తొంగి చూచెను. అప్పుడానీటిలో అతని నీడలో మఱియొక వానరుడున్నట్టు కనబడెను. అప్పుడు తనజాతి సహజమగు మూర్ఖపు బుద్ధితో ఇందులో మఱియొక్క వానరమున్నాడని యూహించి వానిని పట్టు కొనుటకు నీటిలోనికి గుభాలున దూకెను. కాని అందెవ్వరును కనబడనందున అయ్యో! నేనే మారి ఈ కొలనిలోనికి దిగి శరీరమంతయు తడుపు కొంటిని అని యాలోచించుచు గట్టుపైకి వచ్చెను. ఆ కొలనతని స్త్రీగా మార్చివేసెను. అది ఉదయసమయము. బ్రహ్మదేవుని పూజించి దేవేంద్రుడు విమానములోబోవుచు క్రిందికి జూచెను. ఉదయించుచున్న సూర్యుడు పడమరగా జూచెను. ఈకొలనిలో నుండివెలికి వచ్చిన ఋక్షచరుడు అందమైన స్త్రీగా మారి గట్టుమీదనుండగా వీరిద్దరును చూచుటవలన తమ ప్రయాణములను చాలించి ఆమెవైపు చూచు చుండిరి. ఇట్లాయిరువురకును మక్కువ యెక్కువైనందువలన పై భాగమునున్న దేవేంద్రుని ఇంద్రియము జారి యామె తల వెనుక భాగము నుండి పోయి యామె వాలముగల చోట నిలచెను. సూర్యునకు ఇంద్రియము జారి తమకిరణముల ద్వారా వచ్చి యామెకంఠము నందు జేరెను. ఆమె వాలముండిన చోటనొక కుమారుడు బుట్టెను. అతని పేరువాలి. కంఠము (గ్రీవము) నందు పుట్టి కుమారుడు సుగ్రీవుడు. అని వారికి పేర్లు కలిగెను. దేవేంద్రుడు తన కుమారునకు తనమెడలోనుండిన హారమును వేసి వెడలిపోయెను. సూర్యుడు తన కుమారుడగు సుగ్రీవునితో నాయనా! నీకు వాయు పుత్రుడగు హనుమంతుని స్నేహము లభించుగాకయని దీవించి వెళ్ళిపోయెను.

ఇట్లు వారిరివురు వెళ్ళిన పిదప ఆ ఋక్షచరస్త్రీ తమ కుమారులతో ఆరాత్రంతయు అచటనే యుండి ఆ మరు దినమున నిద్రలేచి చూచునప్పటికి తన ఆడరూపము పోయి ఎప్పటివలె పురుష రూపము వచ్చి యుండెను. సంతోషించి ఇక ఇక్కడనిలువ కూడదని కుమారులను వెంటబెట్టు కొని బ్రహ్మదేవుడు తపస్సు జేయుచున్న చోటునకు వచ్చెను. స్త్రీ రూపమును ధరించి బిడ్డలను గని మగరూపమును ధరించి యున్న మొదటి వానరుని బ్రహ్మదేవుడు జూచి నాయనా! నీవు భూలోకమునకు వెళ్ళి అచట విశ్వకర్మచే నిర్మింపబడియున్న కిష్కంధకు వెళ్ళి ఆ పట్టణమును నీవు రాజధానిగా జేసికొని సమస్త వానరులకును రాజువై యుండుమని ఆనతిచ్చెను.

ఇట్లానతిచ్చిన బ్రహ్మదేవుని యాజ్ఞకు సమ్మతించి ఋక్ష విరజుడు బ్రహ్మదేవునితో స్వామీ! నేను ఆకొలని యందు దిగినప్పుడు స్త్రీ రూపమును, ఆ మరుదినమున పురుష రూపము నాకెందుకు వచ్చెను చెప్పుమని బ్రహ్మను ప్రార్థించెను.

బ్రహ్మదేవుడు చెప్పుచున్నాడు. నాయనా! ఋక్షవిరజా! విను పూర్వ మొకప్పుడు పార్వతీదేవి ఈ కొలనిలో చెలికత్తెలతో పోయి స్నానము జేయుచు జలక్రీడలాడుచుండెను. ఇట్లు జరుగుచుండగా దుష్టులగు రాక్షసులు స్త్రీల రూపములను ధరించి వారితో గూడ కొలనిలో గలసి జలక్రీడలాడుచు అటు ముమ్మరముగా విచ్చలవిడిగా నుండుచు తిరుగుచు ఉన్నట్లుండి మగవారుగా మారిపోయెడువారు. అందుకు పార్వతీదేవి కోపించి ఈ కొలనిలో దిగి మగవారు ఆడవారై పోవుదరుగాక! అని శాపము బెట్టెను. అది వినియుండిన నేను కొంత కాలమునకు పార్వతీ దేవిని చూచుటకు బోయినప్పుడు కొలనులో మునిగిన వారలకు ఆడువారలై పోవునటుల శాపమిచ్చియున్నారు. కానీ కొలనులో నీరున్నప్పుడు ఎవరైనను దిగి నీరుద్రాగి స్నానము కూడ చేయవచ్చును. వారందరు శాశ్వతముగా ఆడువారైపోయే అవకాశమున్నందున అపరాధము చేసిన వారికి మీరిచ్చిన శాపము తెలియక దిగిన వారికి కూడ వర్తించుచున్నందున తప్పుచేసినవారికే కాక నిరపరాధులను కూడ దండించినట్లగును అందువలన ఆలోచించి మీరిచ్చిన శాపమును మార్పుజేయవలసినదిగా నేను అమ్మవారిని కోరినందున అమ్మ వారాలోచించి అందులో దిగిన వారికి ఒక దినము మాత్రమే ఆడరూపముండును, మరుసటి దినము మరలా మగవారుగా మారగలరని శాపమును సడలించెను.

కావున నీవింక భూలోకమునకు బోయి కిష్కిందను రాజధానిగా వానరరాజ్యమునేలుమని బ్రహ్మదేవుడు నిష్కర్షగా చెప్పెను. అతడటులనే పోయి కిష్కిందకు రాజై రాజ్యమేలు చుండెను.

ఓ రామచంద్రా! వాలికిని, సుగ్రీవునకును తల్లియై తానే కని తండ్రియై సాకి కిష్కిందకు రాజై రాజ్యమేలుచు ముదుసలివాడైనందున తన పెద్ద కుమారుడైన వాలిని కిష్కింధకు రాజుగా జేసి సుగ్రీవుని యువరాజుగా జేసి తాను తపమునకు వెళ్ళిపోయెను. అటు తరువాత కథయంతయు మీరు విన్నదే చూచినదేయని అగస్త్యమునీంద్రుడు శ్రీరామచంద్రునకు జెప్పెను.

## రావణుడు బోధార్థియై సనత్కుమారుని సన్నిధికి బోవుట

అగస్త్య మహాముని ఓ రామచంద్రా! రావణాసురుడు కపిలమునిచే భంగపడెనని చెప్పియుంటిని కదా. ఆ తరువాత రావణుడు కపిలమునియైన నారాయణుని జూచి ఆయనను చూచినప్పటి నుండి ఈయన రాక్షస సంహారకుడైన విష్ణువే కావచ్చును. ఆయనగాకున్న వేరొకరికింతటి ప్రభావముండదని రాత్రింబవళ్ళు ఆయన రూపమును తనకన్నులకుగట్టినట్లుగా తనమనస్సునకు అదృశ్యమునే చూచినట్లుండెను. అప్పటి నుండి తన లోపరివర్తనము కలుగుచుండెను. ఇదేమిటో తెలిసినవారినడిగి తెలిసికొని సందేహమును తీర్చుకొనవలెనను తహతహ అతని మనస్సు నందేర్పడెను. ఈ దశనే జిజ్ఞాసయని వేదాంతుల నిర్ణయము. దీనికి సరియైన సమాధానమును చెప్పి సందేహ నివృత్తి సేయగల మహాశయుడు సనత్కుమారుడేయని నిశ్చయించి ఆయన వద్దకు బయలుదేరెను. తనలో తానీవిధముగా తర్కించుకొనెను.

మా రాక్షస వంశీయులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులా విష్ణువు చేతిలో మరణించిరి. వారివలె నేను కూడ ఆగోవిందుని విరోధినై ఆయన చేతిలో మరణించెదను గాక అని నిశ్చయించుకొని దీనిని సక్రమముగా తెలియజేయగల ప్రజ్ఞానిధియైన సనత్కుమారుని గురువుగా భావించి ఆయన నివసించుచున్న చోటునకు బయలు దేరివెళ్ళెను.

సనత్కుమారుడు హిమవత్పర్వతము మీద గల తన యాశ్రమములో తపస్సు గావించుకొను చుండెను. రావణుడచటికి బోయి చూచి తన దేహము పులకించు చుండగా ఆయనకు నమస్కరించి వినయముతో నిట్లు ప్రశ్నించెను.

ఓ మలినములేని జ్ఞాననిధీ! ప్రపంచమునందు గోచరముగాని రహస్యములు మీకు కరతలామలకము. కావున మీరు సర్వస్వము తెలిసిన సర్వజ్ఞులు మీవంటి మహాత్ములు దొరకుట మహాదుర్లభము. కావుననేను మీ శరణుజొచ్చితిని. శిష్యులను దయతో మన్నించి కుటిల స్వభావములేని వారై నిజమును దాచి పెట్టక శిష్యులకోరిక ననుసరించి వారికను కూలమగు పద్ధతిలో సమాధానమును చెప్పుచుందురు కదా మీరెంతటి మహానీయులు. అట్టి మీకు నేను శిష్యుడను.

ఓ పాపము లేని మునిచంద్రా! ఎవనికి ఇదిమొదలు, ఇది నడుము, ఇది కొనయనునవి లేనివో, ఎవరికిని కానరాకున్నాడో ఈ ప్రపంచమంతయు ఎవనిచే

తయారు చేయబడినదో ఎవనిని ధ్యానించుట వలన బంధవిముక్తి (సంసార బంధములు జనన మరణ బంధములు) తొలగునో, మహా మునీంద్రులందరును ఎవని చేష్టలను తెలియజాలక తికమకబడుచున్నారో ఆ గొప్ప మహాత్ముని గూర్చి నాకొకమారు నిశ్చయముగా బోధింపగోరుచున్నాను.

అని యీవిధముగా రావణుడు సనత్కుమారుని గురువుగా నమ్మి శిష్యుడనంటున్న రావణుని జూచి సనత్కుమారుడతనిని శిష్యుడుగా భావించి ఓ రాక్షస రాజా నీవు మంచి యుద్దేశ్యముతో ఆభగవత్తత్వమును తెలిసికొన గోరి నన్నడిగిన దేవుని మహిమను వినిపించుచున్నాను వినుము.

ఆయన పాపము లేనివాడు, తరుగుదల లేనివాడు, మాటలతో చెప్పుటకు సాధ్యముకానివాడు. జారిపోవుట లేనివాడు. మలినములేనివాడు. కన్నులకు కనబడనివాడు మరియు ఈ సమస్తమునకును ఈశ్వరుడు కదలనివాడు. జయించుటకు సాధ్యముకానివాడు అని ఎంతో కాలమునుండి వేదము చెప్పుచున్నందున ఏ బ్రహ్మామైతే పొగడబడుచున్నదో అదియే ఆబ్రహ్మాము. ఆ బ్రహ్మామునే, నారాయణ, కృష్ణ, విష్ణు, ముకుందా, గోవింద అని అనేక పేరులతో పిలువబడు చున్నది. మఱియు ఆ భగవంతుడు (ఆబ్రహ్మాము) ఎట్లుండునో తెలిపెదను వినుము. ఎక్కడగాని సూదిమొన మోపునంతటి వెలితిలేనివాడై యుండియు ఒకచోటనే యున్నవాని వలె పాలసముద్రములో ఆదిశేషుని పాన్పుగా జేసికొని పవళించి యున్నాడు. ఈసమస్త బ్రహ్మాండముల కన్నింటికి ప్రభువుగా నుండియు వైకుంఠము అనేపట్టణమునకు మాత్రమే ప్రభువుగా తెలియబడు చున్నాడు. తెలుపు, నలుపు, ఎఱుపు, నీలము, పసుపు మొదలగు రంగులు గలవాడుగా నుండియు నీలమేఘము వంటి దేహచ్ఛాయగల వాడు. తనదేహము నీలవర్ణమగునటుల కనబడుచున్నాడు. సమస్త జీవుల యందును ఆత్మస్వరూపుడుగ నుండియు పాపాత్ములను శిక్షించుట సాధువులను రక్షించుట ధర్మమును కాపాడుటయను కార్యములను సేయుచున్నాడు. తాను పుట్టుకలేని వాడుగా నుండియు వినోదము కొఱకు పుట్టుచున్నాడు. మాయలేనివాడుగా నుండియు మాయ అను దానిని స్వాధీనము చేసికొని దానినుపయోగించి మహిమలను చూపుచున్నాడు. సమస్తజీవులను పోషించువాడుగా నుండియు దుర్మార్గుల యందు క్రుద్ధుడై వారిని సంహరించు చున్నాడు. ఆ హరిని ఇంతటివాడని చెప్పుటకు మాటలు లేవు ఉన్నను అవిచాలవు.

ఓ రావణా! ఆహరి కన్ను దెఱచునప్పుడు బ్రహ్మాండములన్నియు పుట్టి కళకళ లాడును. ఆయన కన్నుమూసినప్పుడు సర్వము శూన్యము ఏదీ కనబడదు. ఆయన ఏదికావాలనుకొన్న అది ఏదైనా జరుగగలదు. అనుకొనకపోతే ఉన్నవి కూడా కనబడవు. అన్నీ మాయ ఆయన తన మనస్సులో దయదలచి పాపాత్ములను తన దగ్గరకు తీసుకొన్నచో వాడు పుణ్యాత్ముడై సాధువై పోవును. (ఇందుకు వాల్మీకియే ఉదాహరణ) ఆయన దయ తప్పితే విద్యావంతుడైనా, సాధువైనా పామరుడుగా అజ్ఞానిగా మారిపోవును. ఆయన ఏరూపము కావాలనుకొంటే ఆరూపమును ధరించి వ్యవహరించును. ఏరూపము వద్దనుకుంటే రూపమే లేనివాడై ఆకసమువలె నుండి ప్రకాశించును. ఆయన తనకు మొదలు నడుమ, కొన అనునవి లేనివాడు (కనబడనివాడు) ఈ కనబడు సమస్త బ్రహ్మాండాలను సృష్టించుటకు కారణమైన వాడు. కావున ఓ రావణా! ఆ హరిని మనస్సునందు మరువక ధ్యానము సేయుటకు తగిన దేవుడుగా భావింపుము.

ఓ రాక్షసరాజా! ఆయన విభువు (ప్రభువులను తయారుసేయువాడు) ఆ విభువు యొక్క ధర్మములను జ్ఞానులు బోధించెదరు. వారు బోధించెడు ఆనందమనే సముద్రము నుండి తరంగములుగా లేచి హృదయమనే తామరలను ముంచివేయును. హృదయకమలము ఆబ్రహ్మానంద సముద్రములో మునిగి పోగలదు. ఆయన హరి ఆహరి యొక్క ప్రభావము వలన జిజ్ఞాసువులైన వారికి అంటిపెట్టుకొనియున్న (అరిషడ్వర్గములు) కామ క్రోధ లోభ మోహమద మచ్చరములనే మదపుటేనుగుల యొక్క మదమణిగిపోగలదు. ఆయన మాధవుడు (లక్ష్మీ దేవికి ధవుడు అనగా పతి) ఆయన నామజపము సేయుచు దానిని మననము జేయు స్వభావముగల వారికి ప్రజ్ఞ అనేవనములు చిగురులు వేయును. ఆయన పేరులను చెప్పి ఆయనను దర్శించుట వలన పుట్టుట లేక చచ్చుట అనునవి ఉండవు. పుట్టుటయనునది చాలా క్లిష్టతరమైనది. సమస్త జీవులు ఆ చక్రబంధములో చిక్కుకొని సతమతమై పోవుచున్నారు. సంసారమనునది దాని పేరే. రావణా! అసలుకు మాట్లాడితే ఇల్లు, పొలాలు, గొడ్డు, గోదా, గాదయ్యా సంసారము పుట్టుట, చచ్చుట, చచ్చుట పుట్టుటలే అసలు సంసారము. ఇది సామాన్యమైనది కాదు. పర్వతమంత వృక్షాలను కూడా పడనూకే జంఝూ మారుతము పర్వతానికి తాకి ప్రక్కదారిని బట్టినట్లు చక్రధారియైన చక్రిని చూడగనే, చావు పుట్టుకలు సమూలముగా ఆగిపోగలవు.

దశగ్రీవా! ప్రతివారికి తాపత్రయములనునవి సహజముగా నుండును. అద్యాత్మికము, ఆదిభౌతికము అదిదైవికము అనునవి తన శరీరమున కలుగునవి చలిజ్వరం అనారోగ్యములవంటివి అద్యాత్మికములు.

అద్దిదైవికము : తన శరీరానికి గాక దైవికముగా సంభవించు ఉపద్రవము పిడుగులు భూకంపముల వంటివి. ఆది భౌతికములనగా ఇతర ప్రాణులవలన తనకు కల్గు ఉపద్రవములు ఎలుకలు, పాములు దుష్ట జంతువులతో కలుగు బాధలు మొదలైనవి. ఆ చక్రిని చూచినవారికి ఎలుకల వంటి తాపత్రయములు తక్షణమే తలకొక దారిన పారిపోవును. ఎలుకలు మన పోలాలను పాడుజేయును. గోడలను త్రవ్వివేయును పంటలను గింజలను తినివేయును. ఇవి చేయున వంతయు దుష్టకార్యములే. ఇటువంటి దుష్ట గుణములు మనలో నుండి పారిపోగలవు. దుష్టగుణములు గలవారు పాపాలు చేయుదురు. పాపాలకు శిక్ష ఉండును. అందు వలన కష్టాలు రాగలవు. భక్తులలో నుండి ఆదుష్టగుణములు తొలగి పోగలవు. పాపాలు రావు ముక్తి లభించును. అని రావణునకు సనత్కుమారుడు విష్ణువును గూర్చి తెలియజేసెను. అదంతయు విని రావణుడు తన గురువుగారిని వ్యతిరేక పద్ధతిలో ప్రశ్నించుచున్నాడు.

**రావణుడు :** మహాత్మా! మావంటి రాక్షసులు విష్ణువునకు విరోధులై ఇప్పుడు మీరిదివరకు చెప్పిన దుష్టచేష్టలు చేసి ఆయనకు కోపము కలిగించు విధముగా ప్రవర్తించి ఆయనతో యుద్ధము చేసి ఆయన చేతిలో మరణించి యున్నారు. వారు దైవవిరోధులు వారిలో నేనొకడను. అటువంటివారి కేగతి కలిగినది. చెప్పుమని ప్రార్థించెను.

ఇట్లడిగిన రావణునకు సనత్కుమారుడు చెప్పుచున్నాడు. ఓ రాక్షసరాజా! రావణా! ఆ శ్రీహరిపై విరోధముగా ప్రవర్తించినవారు శ్రీఘ్రముగా ఆయన చేతమరణించి ఆయనలోనైక్యమొందిరి. అట్లు లీనము కాలేదనుకున్నచో. ఆవిష్ణులోకములో చేరి విష్ణువవలె రూపముగలవారై తిరిగి చావు పుట్టువులులేని ముక్తిని పొంది, బ్రహ్మానందమున నుభవించు చుందురు. వారి ఆనందమే ఆనందము. భావగ్రాహీ జనార్థన అనుసామెతగా భగవంతునకు భావము ముఖ్యము. సాధువులకు భావములు చాలాకాలము వరకు సరిగా భగవంతుని యందు నిలువవు. సాధనచేసి మనసును ఆయనవైపు మరలించవలెను. మరలించినను మరలా తిరుగుబాటు చేయుచుండును. విరోధి భావముల ట్లుండవు. అయస్కాంతమువలె అతుకుకొని పోవును. వాటి తేడాచెప్పుచున్నాను. సాధువులు

ప్రణవము అనగా ఓం కారమును చాలాకాలము జపము గావించినంత ఫలితము విరోధియైన వాడు ఆ లక్ష్మీనాథుని వద్దకు పోయి ఆయనను చూచి వికటముగా నవ్వినంత మాత్రము చేతనే హరివిరోధికి ఫలితము రాగలదు. ఆ విష్ణువు వేసెడు బాణములలో మునిగిపోయిన వానికి గంగానదిలో స్నానము జేయుసాధుజనులకు వచ్చినంత పుణ్యము రాగలదు. ఆభగవంతుని గూర్చి సాధువులు మననము జేసిన వచ్చినంత పుణ్యము, కోపముతో విరోధియగు వాడు ఆ నారాయణుని ముఖమువైపు చూచినంత మాత్రముననే రాగలదు. మరియు నందకమనెడి ఖడ్గమును ధరించినవాడగు విష్ణువును విరోధిగా ఆయన యెదుట నిలబడి ఆయనవైపు చేయిచాచి తిట్టినంత మాత్రముచేతనే, సాధువులను వారు ఉదయకాలములో లేచి స్నానసంధ్యాదులు తీర్చి సుప్రభాతము పాడినంత ఫలితము రాగలదు. ఆపద్మనాభుని యెదిరించి యుద్ధములో నిలువరించి తమ శరీరమును వంచినంత మాత్రముచేతనే సాధువులు ఆహారములేకుండ శరీరమును శుష్కింపజేసి తపస్సు చేయగానెంత ఫలితము వచ్చునో అంతఫలితము రాగలదు. విష్ణుదేవునితో విరోధము కంటే ముల్లోకాలలో ఎంత వెదికినా వేరొకటి కనబడదు.

ఓ రావణా! ఇంకా వినుము ఆశౌరిని చాపల్యములేని రోషమైన చూపులతో మాటిమాటికి ఆయన ముఖమును చూచుచు విశాలమైన యుద్ధరంగములో ఉత్సాహవంతులై ఆయన పేరులతో రారమ్మని బిలుచుచు మితిమీరిన యుద్ధోన్మత్తులై క్రోధమనస్కులై ఆ శ్రీహరి యొక్క శరీరమును తాకి తన శరీరముతో రాచుకొనుచు ఆభగవంతుని యెదుట నిలిచి ఆయన ముఖమును చూచుచు ఆయన చేతిలో సంహరింపబడి ప్రాణము వదిలిన వారికి వచ్చెడు ముక్తి అనెడి పదవీ భాగ్యమును గూర్చి నేనేమని చెప్పగలను. సాధువులుగా నుండి ఎంత పుణ్యమును జేసిన వారికైనను ఆయన చేతిలో సంహరింపబడిన వారికి వచ్చినంత పదవి తదితరులకు రాదు.

రావణా! విను, రాక్షస విరోధులు ఆయననేవిధముగా అరాధించు చున్నారో తెలుపుచున్నాను. సాత్విక భక్తులు స్నపయామి, స్నానం సమర్పయామి అనుచు సాలగ్రామశిలకు నీటితో స్నానము చేయుదురు. విరోధభక్తులు తన బాణములకు ఆచారి పెట్టిన నీటిపదును అను బాణముల మొనలతో గ్రుచ్చి ఆ నీటితో స్నానం సమర్పయామి అంటున్నారు. భక్తులు, సాధువులు, అష్టోత్తర నామములు జపించుచు ఆయనపై పుష్పములు వేయుచు పుష్పం సమర్పయామి అనుచున్నారు. ఆయన విరోధియైన భక్తులు ఆయనను తన బాణములు అనే పూవులతో

గొట్టుచున్నారు. ఆ బాణముల మొనలు దగిలి ఆయన శరీరము నుండి కారిన రక్తమును ఆయనకు ఎఱ్ఱచందనముగా భావించి గంధాన్ధారయామి అని పూజించు చున్నారు. ఇట్లు సాధువులగు భక్తులు స్వాధ్యాయ యజ్ఞము, తపోయజ్ఞము మున్నగు యజ్ఞములు సేయు సాధువుల కంటె విష్ణు విరోధులు యుద్ధమనే యజ్ఞముతో అయనను మెప్పించి రాక్షసులు భగవంతుని పూజించి శీఘ్రముగా ముక్తిని బొందెదరు. ఇకవేయి మాటలెందుకు ఆమధుసూదనునిపై కోపించుట యనగా తపస్సు చేసి సంపాదించినంతటి ఫలితమని రావణునకు సనత్కుమారుడు తెలుపగా, శ్రద్ధతోవిని సంతోషించి అయనతో రావణుడు ఓ మహాత్మా! శాంతినిధీ నాకాముకుందునితో యుద్ధప్రాప్తి కల్గునా? నేనా విభుని చేతిలో మరణించి చలనములేని శాశ్వత ముక్తి అనే పదవిని పొందగలనా? అని అడుగగా సనత్కుమారుడు : రావణా! మేరుపర్వతమంత గొప్ప శరీరము గల ఆ విష్ణుమూర్తి నెదిరించి ఆయనతో యుద్ధముజేసి ఆయన చేతిలో మరణింపగలవు. కావున నీవు మనస్సులో సందేహింపకుము అని చెప్పెను. మరియు

**సనత్కుమారుడు :** రావణా! ఇది కృతయుగము. ఈ యుగము తర్వాత వచ్చు త్రేతాయుగము ప్రథమభాగము నందు నిరాకారుడైన శ్రీ విష్ణుమూర్తి నరావతారుడై నరులకు రాజుగా అయోధ్యలో శ్రీరాముడై పుట్టి నీతో యుద్ధము చేసి నిన్ను వధింపగలడు. అది యెట్లుండునో తెలిపెదను వినుము.

నీవు పెట్టుబాధలకు దేవతలు సహించలేక వారు విష్ణుమూర్తి వద్దకు పోయి ఆయనతో చెప్పుకొందురు. అప్పుడా శ్రీహరి దయామయుడు కావునిక ఈ రావణుని సంహరించవలెనని నిర్ణయించుకొని వారికభయమొసగి పంపివేసి, తాను సూర్యవంశమునందు దశరథ మహారాజునకు పుత్రుడుగా పుట్టి రాముడను పేరుతో విశ్వామిత్రుని యాగసంరక్షణము జేసి ఆయాగమునకు విఘ్నములు కలిగించుటకు వచ్చిన మారీచసుబాహులను జయించును. అహల్యయను స్త్రీని రాయిరూపము నుండి స్త్రీ రూపముగా మార్చును. జనకమహారాజు గారింటిలో గల శివధనుస్సును విఱిచి సీతను పెండ్లియాడి అయోధ్యకు వెళ్ళుదారిలో పరశురాముడెదురై ప్రగల్భములాడు చుండగా అతనిని జయించి అయోధ్యకు పోయి పితృవాక్య పరిపాలన అనే మిషతో మునీశ్వరుల వేషములతో దండకారణ్యమునకు సీతా లక్ష్మణులతో కలిసివచ్చును. అచట నీ సహోదరియైన శూర్పణఖ సీతను తినివేయుదునని భయపెట్టి రామలక్ష్మలను తనతో రమింపుమని కోరగా ఆమెకు వారుముక్కును చెవులను ఖండించి పంపించెదరు. అందులకాగ్రహించి శూర్పణఖ

అక్కడున్న ఖరదూషణులను రాక్షస వీరులతో చెప్పగా వారు వెళ్ళి ఆ శ్రీరామునితో యుద్ధము గావించి కంచురథములు గలిగిన వారు పదునాలుగు వేలమంది మొనగాళ్ళను రాముడొకడే జయించును. అది చూచిన శూర్పణఖ లంకకు వచ్చి సీత యొక్క అందమును గూర్చి నీతో చెప్పగలదు. అప్పుడు నీవు పోయి ఆ సీతను చెఱదీసుకొనిపోయెదవు. అదివిని శ్రీరాముడు సీతను విడిపించుకొని రావల యునను నెపముతో వానర సైన్యముతో కూడి లంకకు వచ్చి నీపుత్ర మిత్రులతో సహా రాక్షసులనందరినీ యుద్ధములో ఆ రామచంద్రుడు నిన్ను చంపగలడు. ఇది జరుగబోవు వృత్తాంతము. ఓ రాక్షస రాజా! ఈ విధముగా నీవా విష్ణువుచేతిలో మరణించగలవు. ఆ శ్రీహరి యెట్లుండునో ఒకసారి వినిపించెదను వినుము.

ఆయన మణులతో తయారుచేయబడిన కిరీటమును ధరించి యుండును. మకరకుండలములు మెఱయుచుండగా అద్దముల వంటి ఆయన చెక్కుల యందు ఆ కుండలములు కనబడుచుండును. ఆయన కన్నులు చాలా నిడుపైనవి. ఆయన శరీరము నీలి రంగు గల్గి స్థూలముగలదై యుండును. ఆయన కంఠము శంఖమువలెనుండును. ఆయన వక్షస్థలము నందు కౌస్తుభమణి మరియు లక్ష్మీదేవి యుండును. ఆయన వక్షము విశాలమైనదై యుండును. ఆయన బంగారు పట్టు పీతాంబరములు కట్టియుండును. ఖడ్గము, గద, శంఖము, చక్రము, ధనుస్సు అను ఐదు ఆయుధములు ధరించి నాలుగు భుజములు కలిగి యుండును. పాములను తిను గరుత్మంతునిపై నెక్కి ప్రయాణములు సాగించు చుండును. లీలగా పెద్దపాము ఆదిశేషుడు పాన్పుగాగల్గి పాలసముద్రములో గల వైకుంఠములో పవళించి యుండును. రావణా! నీ మనస్సులో గల కోరికను ఆ విష్ణుమూర్తి తప్పక నెరవేర్చగలడు ఇది నామాటగా నమ్ముము. సాసవగింజంత యైనను సందేహము వలదు.

నా మాట ముమ్మాటికీ నమ్ముము. అని సత్కుమారుడు రావణునకు చెప్పగా విని నమ్మి సంతోషించుచు గురువునకు ప్రణామములు చేసి ఆయన వద్ద శుభం భూయాత్ అని దీవనలువడసి ఆచోటు విడచి వెళ్ళెను.

అగస్త్యమునీంద్రుడు ఓ రఘుకుల భూషణా రామచంద్రా! రావణుని నిజమైన మనస్తత్వము ఏదో వింటివి కదా! రావణుడు సీతను కామించియె తీసుకొనిపోయెనని తెలియని వారు చెప్పుచుందురు. కాని ఆరావణునకు సీత లక్ష్మీదేవియని, శ్రీరాముడవగు నీవా శ్రీహరివని తెలిసి, ఆ హరివైన నీచేతిలో

మరణించవలెనని భావించి నిన్ను లంకకు రావించుట కొరకై నీ సొత్తైన సీతను తీసుకొనిపోయి లంకలో పెట్టుకొని నీకు కోపము కలిగించి నీమందీమార్బలముతో అక్కడికి రాబట్టుకొని, మహాపాపాది పాపులైన తన వారందరిని నీచేత చంపించి వారిని పునీతులను చేసి తానును నీచేతిలో మరణించి అందరితో కలిసి ఆవైకుంఠపురములో ఆహ్లాదముగా బ్రహ్మానంద భరితులై యున్నారని అగస్త్యమునీంద్రుడు శ్రీరామచంద్రునకు చెప్పుచు. ఓ రామచంద్రా! రావణుడు సనత్కుమారుని వద్దకు పోయినప్పటి నుండి ఆకలిగొన్న వాడన్నము కొఱకు, ఎండలోగల వాడు నీడకొఱకు, దప్పిగొన్న వాడు నీటి కొఱకు, తహతహలాడినట్లు గోవిందుడవైన నీరాక కొఱకు ఎదురు చూచుచుండెను.

ఆహరి సూర్యవంశమునందెప్పుడవతరించునో ఆవీరునిపై నాకెప్పుడు యుద్ధము సంభవించునో, ఆయన చేతితో కొట్టిన బాణముల చేతనేనెప్పుడు నేలగూలిపోయెదనో, చెప్పుటకు సాధ్యముగాని; చావులేని అమృత పదవి నాకెప్పుడు లభించునో, అని తలచుచు వైరాగ్యముగల వాడై తిరుగు చుండెను. ఓ రామచంద్రా రావణుడు సనత్కుమారుని వద్ద నీమహిమలు విన్నప్పటి నుండి నీవతనిని సంహరించుటకు వేగిరముగా నిన్ను వచ్చునటుల జేయుటకాలోచించి నీకు కోపమును గలిగించు కార్యములు జేయుచుండెను.

అవి యేవనగా, దేవతలను బాధించుట మునీశ్వరులను ముప్పుతిప్పలు బెట్టుట, పతివ్రతా స్త్రీలను బట్టి తెచ్చుట, యజ్ఞములకు విఘ్నములు గలుగ చేయుట ఇట్టి దుష్టకార్యములు గావించినచో వారిని రక్షించుటకు నీవవతరించ గలవని తెలిసికొని దుండగుడై తిరుగుచుండెను.

ఓ రఘునందనా! రావణుడలసిపోని వాడై ఈ విధముగా దిరుగుచు పైలోకముల నన్నింటిని పలు విధములుగా బాధించుచు దిరుగుచుండగా, ఒకనాడు రావణుడు తన పుష్పక విమానములో తమ సిబ్బందితో నెక్కడికో బోవుచుండెను. ఇట్లు పోవుచున్న పొలసుతిండి యగు రావణునకు పోరుదిండియగు నారదమునీంద్రుడెదురయ్యెను. ఎదురైన మునీంద్రునకు రావణుడు నమస్కారములు చేసి మహాత్మా! మీరిప్పుడెక్కడ నుండి వచ్చితిరి. ఇంకెక్కడికి బోవుచున్నారు. లోకములో వింత లేమైనాగలవా? అని నారదు నడుగగా, నారదుడు నవ్వుచూ ఓ రావణా నీకేమని ఆ వింతలు వినిపింతును. నీ విజయధాటికి భయపడి, నీవు వచ్చుచున్నానని తెలిసికొని పైలోకమందలివారు తట్టాబుట్టా తమ గంపలలో నింపుకొని తప్పించుకొనుటకు వలసలు బోవుచున్నారు.

## రావణుడు నారద ప్రేరితుడై శ్వేత ద్వీపమునకు బోవుట

నేనిప్పుడక్కడ నుండియే వచ్చుచున్నాను నీకిప్పుడే లోకములలోను సాటివాడే లేడంటే, మేటివాడెక్కడున్నాడు? అందువలన నీకు నీవేసాటి అని నారద మునీంద్రుడు చెప్పుచుండగా విని రావణుడు బిగ్గరగా కేరింతలు బెట్టి మీసములు మెలిబెట్టి వికటముగా నవ్వుచు బింకముగా నిట్లనెను.

ఓ ఋషివర్యా! ఏమంటిరి నాధాటికాగలేక పైలోకముల వారు వలసలు బోవుచున్నారా? అట్లయినచో భయపడిన వారిపైకి నేనేలపోవలెను, మహాత్మా! నన్నెదిరించి పోరాడ గల వీరులెచ్చటనున్నారో తెల్పుము అని నారదుని రావణుడడిగెను.

**నారదుడు:** ఓ రావణా! నీవు యుద్ధము జేయవలెనని ఉవ్విళ్ళూరు చున్నావు నీ భుజముల తీట తీరవలెనుకదా. అట్లయినచో తెలిదీవికి బొమ్ము. ఆ తెలిదీవిలో గలవారు నాలుగు బుజములు గల్గి తామర రేకుల వంటి కన్నులు తెల్లని తేజస్సుతో జయించుటకు సాధ్యముకానివారచట నుండెదరు. వారు సూర్యుని వంటి తీక్షణమైన ప్రకాశముతో బంగారు వంటి దేహచ్ఛాయతో ఎత్తైన గొప్పదేహములు ధరించి సాక్షాద్విష్ణు దేవునివలె వెలుగుచు నుండెదరు. వారు శ్వేత ద్వీపము నందున్నారు. వారైతే యుద్ధములో నీతీటను దొలగించి నీగర్వమును గట్టెక్కించి పంపగలరు అని నారదమునీంద్రుడు దెలిపెను.

**రావణుడు :** ఓ మునిసత్తమా! ఆ సముద్రపు గట్టునయే తపస్సు జేసిన వారు పుట్టుచున్నారు. నీవారూఢజ్ఞానము కల వాడవు నీకంతయు తెలియును. కావున నాకా వృత్తాంతమును తెలుపుమనెను.

**నారదుడు :** రావణా! విను, ఆవిష్ణుదేవుని సేవాతత్పరులు విష్ణుదేవుని నామ జపము సేయువారు. మాధవుని సేవించుటయందు ఆశగలవారు. ఆ నారాయణు నారాదించుచువారు. భక్తితో ఆయన కథలను వినువారు. ఆయన చక్రాయుధము చేతెగినవారును తెలిదీవియందు జన్మించెదరని నారదుడు దెల్పెను.

**రావణుడు :** ఇదంతయు విని వారిని శీఘ్రముగా చూడదలచి పుష్పక విమానములో పయనించుచు అనేక పర్వతములు, నదులు, అరణ్యములు దాటుచు పోయి తుదకు పాల సముద్రమును తమ ముందు భాగమున జూచి తన మంత్రులకు జూపించుచు, ఈ సముద్రము దేవతలు, దానవులు కలిసి మందర

పర్వతమును కవ్వముగా వాసుకిని త్రాడుగా జేసి చిలికి అమృతమును దీసినప్పుడు ఈ సముద్రములో కామధేనువు, కల్పవృక్షము, చంద్రుడు, లక్ష్మీదేవియు పుట్టిరి. విషము పుట్టగా దానిని ఈశ్వరుడు మ్రింగి శ్రీకంఠుడని పేరుబడసెను. ఇవన్నియు ఈ పాలసముద్రము వలననే కలిగినవని చెప్పుచుండగా పుష్పకవిమానము పాలసముద్రము శ్వేత ద్వీపము చెంతకు బోయి, యచట గాలికెదురు వెళ్ళలేని మేఘమువలె ముందుకు వెళ్ళలేక వెనుకకు మరలెను.

**మంత్రులు :** రాజా! ఈ తెలిదీవి చాలా మహిమగలదై యున్నది. మేమవతల రాజాలము. ఈ విమానము వద్దనే యుండెదమనగా, విని నవ్వుచూ మీరును విమానమును ఇక్కడనే యుండుడు. నేను పోయివచ్చెదనని వారినక్కడనే నిలిపి తాను మాత్రమే వెళ్ళెను.

అక్కడగల విచిత్రములన్నింటిని జూచుచు ఒకచోట నొక శృంగార వనమును జూచెను. ఆవనములో విహారము చేయుచు ఆడుకొనుచుండిన స్త్రీలను జూచెను. వారిని చూడగనే ఆహా! ఈ లావణ్యవతులెంత అందముగా నున్నారు. అహో! ఓహోయని మతిభ్రమణము జెందుచుండెను. ఇంతలో వారిలో నొక బిబ్బోకవతి ఈ రావణుని చూచెను. ఆమె కతడొక విచిత్రముగా కనబడెను. ఆమెకూడ ఆహో, ఓహోయని తన చేయిని జూచి తటాలున రావణుని చేతిలోని కెత్తుకొని ఏయ్ నీవెవడవు? నీవిక్కడకేమి కార్యార్థము గావచ్చి యున్నావు అని గద్దించి యడిగెను.

**రావణుడు :** లోపల హడలిపోయి, పైకి బింకముగా మేకపోతు గాంభీర్యము నటించుచు నన్ను గూర్చి తెలియని వారీ ప్రపంచములో లేరు. మీకు మాత్రమే తెలియనట్లున్నది. నేను బ్రహ్మ సంతతి వాడను. విశ్రవో బ్రహ్మ కుమారుడను. బ్రహ్మను హోమములతో మెప్పించి వరములు పొంది యున్నాను. ప్రపంచములో నాకెదురేలేదు. నాపేరు మర్మోగుచున్నది. మీకెందుకు తెలియలేదు. మీరు వార్తా పత్రికలు చదివినట్లు లేదు. పాపం మీ దేశమే మారుమూల ఇక్కడికి పత్రికలెలా చేరగలవు. నా పేరు వినగానే ఆడవారు హడలైపోతారు. నాకు దశగ్రీవుడని, దశకంఠుడని, దశముఖుడని, పంక్తి కంధరుడని పైగా రావణుడను పేర్లతో పిలుచు చుందురు. ఇక నేను వచ్చిన పని. ఈ తెలిదీవిలో యుద్ధవీరులున్నారట ప్రపంచవీరుల నోడించితిని. ఇక ఇక్కడున్న వారిని కూడ చూచెదమని వచ్చితిని. మీరు మీయిండ్లకు బోయి మీ మగవారిని పంపండి అని రావణుడా యువతికి తెలియజేసెను.

ఆ మాటలు విని ఆ గంభీరవతి కిలకిల నవ్వుచు తన చుట్టునున్న తన స్నేహితురాండ్రను బిలిచి వారికి తన చేతిలోనున్న రావణుని జూపుచు అమ్మలారా! ఈదినమొక విచిత్రము చూడండి. వినండి. వీడట మన మగవారితో యుద్ధము జేయుటకు వచ్చినాడట కాదుకూడదని ఇతనిని ఒడిసి పట్టుకుంటే అరచేతిలోనికి చాలడు. మనయెదుట వీడీ విధముగా ప్రేలుచున్నాడని తన చేతిలో నుండిన రావణుని అక్కడున్న వారందరికిని చూపించెను. వారిలోనొక వారిజాక్షి రావణుని మొదటి యామెచేతిలో నుండి తన చేతిలోనికి లాగుకొనెను. రావణుడు మొదటియామెచేతిలో నలిగియుండెను. రెండవయామె అతనిని అటుయిటు మెదలనీయక వింతగా జూచుచు ఔరా! ఔరా! ఓహో హో! ఇదేమి చిత్రమమ్మా! మనమెప్పుడును చూచియుండలేదు. ఇదియొక విచిత్రమైన పురుగు. మనకిప్పుడు దొరికియున్నది అని యామె సంతోషించు చుండగా మఱియొక మందగమన ఆమె చేతిలో నుండి బలవంతముగా లాగికొని అమ్మా యీ పురుగెంత వింతగా నున్నదో చూడవే దీనికి రెండు కాళ్ళు, ఇరువది చేతులు, పది తలలు. భలే, భలే యనుచుండగా మఱియొక మదవతి వచ్చి రావణుని ఆమె చేతినుండి లాగికొనెను ఆ మత్స్యకంటులిట్లు లాగుకొనుచు, బూచి బూచి యని పేర్లు బెట్టుచు గంతులు వేయనారంభించిరి. వారి చేతులలో రావణుడు బాగా నలిగిపోయెను. విడిపించు కొనుటకు శక్తిలేదు. వీరు విడువరు ఈమె యివ్వమంటుంది. ఆమె యివ్వ నంటుంది. వీరిద్దరు బట్టి గుంజులాడుతారు. ఆ గుంజులాటలో రావణుని సన్నసన్న యెముకలు విఱిగినవి. తనకు బ్రహ్మదేవుడిచ్చిన వరముల బలమువలన చావడు. వీరు తమ చేతులలో మార్చుకొనుచు నలుపుట వలన బ్రతుకలేడు.

రావణుడు రంభను బట్టి యామెను కష్టపెట్టిన పాపమును దేవతా స్త్రీలను చెఱబట్టినప్పుడు వారేడ్చు చుండగా చూచి కేరింతలు బెట్టి నవ్విన పాపమును వారి గోడులిచట కామినుల రూపమున రావణుని కంఠ క్రొవ్వణగించు చున్నదా యన్నట్లు స్త్రీలచేత బడియున్న పంక్తి కంఠుని పదితలలు ప్రక్కలకు దిరుగుచుండెను. శరీరమంతయు చెడమాగిన మామిడి పండు వలె చిక్కుళ్ళు బారెను. బ్రహ్మవరము చావనివ్వదు. వీరు బ్రతుకనివ్వరు. వీరి చేతుల నుండియే విధముగా విడిపించుకొన వలెనో తెలియరాలేదు. హరుడున్న కైలాసమగలించిన రావణుడు నారీమణుల చేతులలో నలిగిపోవుచుండెను. మగవారికి మగడననుకొన్న రావణుడు ఆడువారి అఱచేతులలో నిఱుకుకొని పోయెను. ధీరుడనంటున్న రావణడు భీరువయ్యెను. తలోదరుల చేతులలో కీలు బొమ్మయయ్యెను.

వీరవిహారము చేసిన రావణుడు పారిపోవుటకు ప్రయత్నించెను. తనకు పుట్టినప్పుడే దేవుడు కోఱపల్లులనిచ్చి యున్నాడు. ఇందులకే కాబోలు ఆ పల్లులకు పనిని కల్పించెదను. ఇంతవరకు నేనా పల్లులను దేనిమీదను పయోగించలేదు అని నిశ్చయించుకొని తనను పట్టుకొనియుండిన ఒక స్త్రీని తన పదినోరులతో చేయిని కొరికెను. గోరులతో బరికెను. ఎంతైనా ఆడవారేకదా! ధీరవనిత భీరవనిత యయ్యెను. అమ్మా చేయి గరచినదీ పురుగని అఱచుచు అవతల స్త్రీ పైకి విసరివేసి నా చేయిని కొరికి వేసినదని నారీమణి భోరున యేడ్చెను. ఇంకొక స్త్రీ రావణుని బట్టి కోపముతో ఓ చెడుపురుగా! మా చెలిని కరచితివి చావుమని రావణుని ఆమె అరచేతిలో నుండి ఆకసమునకు ఎగురవేసెను. అక్కడెగిరిన రావణుడు గ్రుక్క ద్రిప్పుకొను లోపుల సముద్రములోబడెను. చావడు కనుక సముద్రము నుండి వెలుపలకు వచ్చెను. ఆకాశమున గల నారదుడు నారీమణుల చేతిలో నలిగిపోవుచున్న రావణుని జూచి సంతోషముతో గంతులువైచి వింతలు దలచుచు వెడలిపోయెను. రావణుడు రాత్రించరులున్న విమానమెక్కి వెడలి పోయెను.

ఓ రామచంద్రా! రావణుడిట్లు శ్వేత ద్వీపము స్త్రీలు తనను బాధపెట్టగా నతడు భయమును ఆశ్చర్యమును గలవాడై, ఇదంతయు ఆ సృష్టికర్త గొప్ప ప్రభావమేనని యాలోచించుచు సముద్రములో నుండి లేచివచ్చి సిగ్గును భయమును బాధయు పెనంగొన తన మంత్రులందరితో లంకకు వెడలిపోయెను. రావణుడు నేనీ విధముగా స్త్రీల చేతిలో చిక్కి విడిపించుకొనలేక పోయితిని కదా! ఆ విష్ణుమూర్తి నెదిరించి ఎట్లు యుద్ధము సేయగలనని మనస్సు నందూహింపడు సందేహింపడు. ఎట్లయినను ఆ విష్ణునంశలో బుట్టిన శ్రీరామచంద్రు నెదరించి తీరెదనని నిశ్చయించు చుండెను. నాకెవ్వరును ఎదురులేరని వీరాలాపములాడు చుండెను. అతని మాటలు వినువారందరును ఇది వానికి మదగర్వమే యనుకొనుచుందురు. బ్రహ్మదేవుడిచ్చిన వరగర్వముతో తిరుగుచుండగా శ్వేతద్వీప స్త్రీలచేతులలో వానినిఱికించి బాధించినది నీవే కదా. కావున నీకు తెలియనిదేమున్నది. వైకుంఠమున ద్వారపాలకులగు జయ విజయులు ఉత్తమ బ్రాహ్మణులైన సనకసనందనులను విష్ణుదర్శనమునకు లోపల ప్రవేశింపనీయక వారి నడ్డగించిరి. వారు కోపించి మీరు భూలోకములో రాక్షసులై పుట్టుమని శాపమొసంగిరి. ఆ జయవిజయులే నీకు విరోధులుగా జన్మించిరి. మూడు జన్మములలో వచ్చి మరలా నిన్ను చేరుకొనెదమని నిన్ను వేడుకొనిరి. అందువలన వరాహమూర్తివై హిరణ్యాక్షుని, నరసింహ మూర్తివై హిరణ్యకశిపుని సంహరించితివి. రెండవ జన్మలో రావణ కుంభకర్ణులై వారు

జన్మించిరి. నీవు శ్రీరామచంద్రుడవై వారిని సంహరించితివి. శాప ప్రభావము వలన రావణుడు నీకు విరోధియై అతడు కోరిన విధముగా నీచేత మరణించెను. ఇక ద్వాపర యుగమునందు కూడ నీకు విరోధులై పుట్టి నీచేతిలో మరణించెదరు. ఆ తర్వాత ముక్తిని బొందెదరు అని అగస్త్యమునీంద్రుడు శ్రీరామచంద్రునితో మహాత్మా! నీ మాహాత్మ్యమును కొంచెమైనను తెలియజాలము కదా అని శ్రీరామచంద్రుని అగస్త్యమునీంద్రుడు శ్లాఘించెను.

## అగస్త్యాది మునులు రాముని వీడ్కొని వారి నివాసములకు బోవుట

ఈ విధముగా అగస్త్యాది మునులు శ్రీరామచంద్రునకు రావణుని వంశ క్రమమును రావణ, కుంభ, కర్ణ, విభీషణ, హనుమ, వాలి, సుగ్రీవుల జనన ప్రకారమును, రావణుడు లోకములను బాధించుట, విష్ణుదేవుడు రామావతారమెత్త వలసిన విధానమును తెలియపరచి, ఓ రామచంద్రా! రావణుని నీవు చంపుట వలన మా కానందము గల్గెను. దేవతలకు భయము దొలగింప బడినది. ఇక మాకేలాంటి కొరతలు లేవు. నీదర్శన భాగ్యము కలిగినది. మా కమితానందము చేకూరినది. మేమిక మానివాసములకు పోయివచ్చెదము నీకు శుభమగుగాక! దయసేసి మమ్ములను పంపుమని అగస్త్యమునీంద్రుడడుగగా రామచంద్రుడు వారితో మహాత్ములారా! మీరు తపోమహిమగల వారు. మీ దర్శనము జేసికొన్నవారికి పాపములు తొలగిపోవును. సమస్త శుభములు సమకూరును ఈదినమునకు మీరు వెళ్ళినను నేను క్రతువులు సేయ దలచినప్పుడు మీరందరును తప్పక రావలెను అని చెప్పి వారికి నమస్కరించెను. వారు శ్రీరామచంద్రుని ఆశీర్వదించి వెడలిపోయిరి.

# రామ రాజ్యము

అటు తరువాత తామచంద్రుడు మునీంద్రులిచ్చిన దీవనల వలన తృప్తి నొందినవాడై తన సభయందున్న విభీషణ, సుగ్రీవ అంగద జాంబవంతాదులను, లక్ష్మణ, భరత శత్రుఘ్నులను, తక్కిన వారందరినీ సన్మానముతో చూచి ఋషివరుల మాహాత్మ్యమును వారికి దెలిపి ఆనాటి సభను చాలించి తన మేడకు పోయెను.

ఆ మరునాడుదయకాలమున వందిమాగదులు రామచంద్రుని మేడకు వెళ్ళి మేలుకొలుపులు పాడుచుండగా శ్రీరామచంద్రుడు విని నిదురమేల్కాంచెను. అంతకు మునుపే లేచి తమ కొరకెదురుచూచు చున్న సీతాదేవి ముఖమును ముందుగా జూచి మణులతో బొదివిన అద్దమును చూచి, లేచి కాలకృత్యములు

దీర్చుకొని స్నానపు గదిలోనికి రాగా, అంతకు ముందే గంగానది, నర్మదానది మరియు తక్కిన నదుల నుండి తేబడిన పుణ్య నదుల నీటిని సీతాదేవి చెంబులతో నింపి తన చెలికత్తెల చేతుల యందుంచి సిద్ధముగా బెట్టుకొని రామచంద్రుడు స్నానపు గదిలోనికి రాగానే ఆయన కానీటితో స్నానముజేయించి ఆయనకు వళ్ళుదుడిచి క్రొత్త వస్త్రములను కట్టబెట్టగా ఆయన పుణ్యవేదికపై కెక్కి సంధ్య వార్చి దేవతార్చన జేసి జపనిష్ట సలిపి హోమమును గావించి ఉత్తమ బ్రాహ్మణులకు దానములిచ్చి నమస్కరించి కుల్దైవము సూర్యునకు నమస్కారములు చేసి తన నియమము లన్నియు తీర్చుకొని అటు పిమ్మట భోజనాది క్రియలు నాచరించి సభకు ముస్తాబయ్యెను.

## శ్రీరాముడు సుగ్రీవాది వానరులను విభీషణుని వీడ్కోలుపుట

రామచంద్రుడు తమనియమములన్నియు దీర్చుకొని మణుల కిరీటమును ధరించెను. నుదుట కస్తూరి తిలకము చెవులకు ముత్యాల హారము కమ్మని సువాసనలమై పూత ముత్యాల అంగీయును ధరించి వజ్రవైఢూర్యము -లమర్చిన కంకణములు దొడగికొని ధోవతి గట్టి నీలమేఘశ్యామ నిండుకొలువుకు బోవదలంచి, బయలుదేరుచుండగా సీతాదేవి, చెలికత్తెలిచ్చిన బంగారు పాదుకలుదొడుగుకొని గండపెండేరము కాలికి ధరించి, తన సతీమణి సీత యిచ్చు తాంబూలపు మడుపులందుకొని, పండ్రెండు దరవాజాలు వరకు భక్తితో తనను సేవించుచు చేదోడుగా వచ్చిన సీతను వెనుకకు బంపి, సంతోషముతో తమకెదురు వచ్చిన ఆంజనేయుని హస్తమును బట్టుకొని సభకు బోయెను.

అంతకు మునుపే వసిష్టాది ఋషులతో సభ నిండియుండెను. వసిష్టాదులకు వందనములాచరించెను. వారందరును ఆశీర్వదించిరి. వంశ పారంపర్యముగా వచ్చిన బంగారు సింహాసనము మీద శ్రీరాముడు కొలువు దీరెను. కామరూపములతో నుండిన వానరులు అంగదుడు మున్నగు వారితో వచ్చి సుగ్రీవుడు తమ కుడివైపున కూర్చొని యుండగా సుగ్రీవుని సుహృద్భావముతో పలుకరించి తమ నలుగురు మంత్రులతో తమ కెడమవైపున నున్న విభీషణుని విశేషముగా గౌరవించి తన పాదములను బట్టుకొని పీఠము దగ్గర నుండు భక్త శ్రేష్ఠుడు ఆంజనేయుడు ఉపమాద్యలంకారములతో తన వర్తన కీర్తనము జేయుచుండగా సంతసించుచు మఱియొకవైపున పండితులు జేయు తర్కప్రసంగములను వినుచు

స్నేహితులకు పురోహితులకు మంత్రులకు సామంతులకు వారివారి కర్హమైన విధముగా సమాధానములను జెప్పుచు పౌరులు, పట్టణవాసులు, పల్లెటూళ్ళ ప్రజలు ప్రకృతి జనులు సేయు విజ్ఞాపనంబులు వినుచు దీనులు అనాదలు కోరినందు వలన వారికి కావలసిన ధనము బంగారమును, వస్త్ర వాహనములనిప్పించుచు, నేర్పుతో పౌరాణికులు దెల్పు ఉచితములైన పురాణ పుణ్యకధలను వినుచు, చుక్కల నడుమనుండు చక్కని చంద్రుడు వలె, నవగ్రహముల నడుమ నుండు సూర్యుని వలె చింతామణిసింహాసనమున పై కొలువై యుండెను.

శ్రీరామచంద్రుని రాజ్యపరిపాలనమును వినయమును, స్నేహమును ఉదార గుణములను ఐశ్వర్యమును, తారుణ్యమును, అందమును మెచ్చుకొని, రాజులందరును తమకు ముందున్న రాజ్యములను మరచి ఆ రాజ్యములను రక్షించుట మరచి రామచంద్రుని జూచుచు స్థిరమనస్కులై అయోధ్య యందుండి పోయిరి.

పౌరులును, పట్టణ వాసులును, పల్లెటూళ్ళ ప్రజలను, తమ పనులను చాలించి రామచంద్రుని జూచుచు పరమానంద పరవశులై యుండిరి. భక్తులు బ్రహ్మమును ధ్యానము జేసినంత మాత్రముననే బ్రహ్మానందము నను భవించుచున్న ఆసాక్షాత్తు బ్రహ్మమే తమయెదుట కనబడుచుండగా చూచి జనులు ఆ యానంద సముద్రములో మునుగకుందురా! ఇట్లు కొన్ని దినములు గడచినను వారి వారి నివాసములకు పోవలయునను ఉద్దేశము లెవ్వరియందు కనబడలేదు.

సూర్యవంశమునకు తలమానికము వంటి రామచంద్రుడు సమస్త తరగతుల జనులను సంతోషింపజేయుచు స్వర్గములో దేవేంద్రుని వలె తన దొడ్డ కొలువునందు వెలుగొందుచు ఒకానొకదినమున తమ మామగారగు జనకమహారాజును జూచి ఉపచార పూర్వకముగా నిట్లనెను.

ఓ మహాత్మ! మీరు ప్రజలను తండ్రి వలె పాలించుట వలన మీకు జనక మహారాజు అను పేరు మీకెంతగానో తగియున్నది.

నేను శత్రువులను జయించి సీతను చేకొని సుఖమును బొందుటయును సదయహృదయులగు మీ యాశీర్వాదముల చేతనే కదా మిమ్ములను మాట వరుసకు మామగారనవలెనేగాని మా తండ్రి గారికిని మీకును భేదమేమున్నది.

మామగారూ! మీరు మమ్ములను చూచుటకు వచ్చి చాలా దినములైనవి. కానీ మీరిక్కడెంత కాలముండినను మాకానందముగానే యుండును. కానీ ప్రజలను సంరక్షించుట అను మీకొక ధర్మమున్నది. ఆ ధర్మమును కాపాడుటకై మీరు మీనివాసములుకు పోయిరండు. మీరు సదా నామీద దయగలిగి యుండుడు అని తన మామ గారికి రామచంద్రుడు దివ్యమణి భూషణముల నర్పించెను.

జనక మహారాజు : ఓ రామచంద్రా! ఇవి మాకెందుకు. మీరు మమ్మి మామగారూ! అని సంబోధించిన మాటలే వెలలేని రత్నములు. అవే మాకు బహుమతులు. సీత లక్ష్మియని నీవు విష్ణువని భావించుచు ఊరికి పోయి వచ్చెదను అని తెలిపి రామచంద్రుని యనుజ్ఞ వడసి తనకు తోడుగా భరతుని బంపగా అతనితో కలసి మిథిల చేరెను.

అటు తరువాత రామచంద్రుడు కేకయ రాజును యధాజిత్తును జూచి ఓ రాజా! మాకేసౌభాగ్యము గల్గుటకు గురువులు మీరే కదా? మీరిక్కడా లస్యము జేసిన తండ్రిగారు వ్యసనపడుచుందురు. కావున మీరాలస్యము సేయక పోయిరండని వారికి తోడుగా లక్ష్మణుడు వచ్చుచున్నాడని కొన్ని బహుమతులు ఇవ్వగా ఆయన తీసికొని మరలా వెనుకకు ఇచ్చి రామచంద్రుని పొగడుచు వెళ్ళెను. తరువాత కాశీపుర రాజు ప్రవర్ధమానుని సగౌరవముగా కౌగలించుకొని పంపివేసెను. ఇట్లు రామచంద్రుడు అయోధ్యకు తమ పట్టాభిషేక సమయమున వచ్చిన రాజులనందరినీ గౌరవించి పంపివేసెను.

తరువాత సుగ్రీవుని మఱియు వానరులను వారి వారి స్థోమతకు తగిన విధముగా గౌరవించి విలువైన రత్న భూషణములనిచ్చి, మీరు నాకు చేసిన సహాయమును మరువలేను. ఏదైనా అవసరములు వచ్చినపుడు వచ్చి పోవుచుండుమని చెప్పి నీవు రాజుగాను, అంగదుడు యువరాజుగాను ధర్మముతో వానర రాజ్యము నేలుమని సుగ్రీవునకు దెలిపి వారిని పంపివేసెను.

పిమ్మట విభీషణుని జూచి ఓ సాధుశీలా! నీవు సత్యధర్మానుష్టానపరుడవు. నీ మంత్రులు కూడ అట్టి వారే సమయమునకు మీరు మాతో చేరి యుద్ధములో సహకరించితిరి. మీ అన్నగారగు రావణ కుంభకర్ణులు రజోగుణముతో రాక్షస స్వభావముగలవారై దుండగములు గావించిరి. కాని నీవు వారిని చెడ్డవారని భావింపక వారికి తద్దినాది సత్కార్మలుగావించుచుండుము. నీ ప్రజలు రాక్షసులు

వారి స్వభావ గుణములు వారికి సహజముగా నుండును. కావున వారిని సరియైన సాధుస్వభావములు కలవారినిగా తర్ఫీదునిచ్చి మార్పు చెందునటుల జేయుము. సరియైన ప్రజలనుగా దిద్దుకొనుటకు నీకు చాలా కాలము పట్టును. మాకవసరముండినను మీకవసర ముండినను అప్పుడప్పుడు వచ్చి పోవు చుండుము అని తన జ్ఞాపకార్థము విలువైన హారములు ఆభరణము కొన్ని యిచ్చి వారిని సంతోషపరచి పోయిరమ్మని సెలవొసంగెను.

ఇట్లు శ్రీరామచంద్రుడు చెప్పిన హితవచనములు విని వానరులును, రాక్షసులును శ్రీరామచంద్రునీ విధముగా పొగడిరి.

ఈ మనీషియగు రామచంద్రునకు గల బుద్ధికుశలత యందు నూరుమంది బృహస్పతులు చాలరు. సూక్తులు హితోక్తులు తెలుపుట యందు వేయి మంది బ్రహ్మ దేవుళ్ళు చాలరు. బలమునందు లక్ష మంది ఆదిశేషులు చాలరు. అందమునందు కోటి మన్మథులు చాలరు. ధైర్యము నందు నూరుకోట్ల మేరు పర్వతములు చాలవు. నీ యొక్క గుణములకు సరిపోలవనగా ఒక్కొక్కటి యెట్లు సరిపోగలవు అని రామచంద్రుని పొగడిరి.

తరువాత హనుమంతుడు శ్రీరామచంద్రునకు ప్రణమిల్లి ఓ మహాత్మా! నీకథ ఎంత కాలమీభూమి పై నిలిచి యుండునో అంతకాల మీ శరీరమిటులనే యుండునటుల వరమొసగుము. నీ కథలను నేనెల్లప్పుడును వినుచు, నీ పాదములను నేనెల్లప్పుడును దలచుచు, నా హృదయకమలము నందుంచుకొని ధ్యానించుచు, నీ దయారసమునకును, చూపులకును, నీ స్వభావ ప్రభావములను నెమ్మదిగా, ఎల్లప్పుడును మనస్సు నందూహించుకొనుటకు గాక, వృధాగా దీర్ఘాయువు పొంది ఈ వానర దేహము నీవిధముగా భూమి మీద నిలుపుకొని ఎందుకు జీవించవలెను. కావున ఈశరీరమును నిలుపుకొన్నట్లు సర్వకాల సర్వావస్థలయందును, నీపదధ్యానమును మరువక బ్రతుకు కొఱకే నేనీ ఆయుస్సును కోరుచున్నాను. కావున ఓ రామచంద్రా అమృతము వంటి నీ కథలను చెవులతోద్రావు పుణ్యాత్ములు ధన్యాత్ములైవారు. దేవత్వమును కోరరు. వారిని జనన మరణములు గానీ, భయంకరమైన వ్యాధులు గాని భాధింపవు. నీ కథలను వినని దినము పాపపు దినము. నిన్ను ధ్యానము సేయని క్షణము కాల మృత్యువు. అది జరుగక జడముగా నిలచిపోయిన క్షణమే కాలము అగును. నిన్ను పూజింపని జాము మృత్యువు నిలబడుగీము.

నిన్ను చూడని కాలము అది కాలముగాదు వాని గొంతులోని గాలము. కావున నేనెల్లప్పుడును నీ కథలను వినుట నిన్ను దలంచుట మా వంటి వారి కుచితమే కదా! అని హనుమంతుడనుచున్న మాటలకు శ్రీరామచంద్రుడుప్పొంగి సంతోషించి సింహాసనము నుండి దిగి వచ్చి హనుమంతుని తన రెండు చేతులతో పట్టుకొని పొంగి పొరలు ప్రేమతో బిగియార కౌగలించుకొని నాయనా! హనుమా! తన కాపద వచ్చినపుడు ముందుగా నేను సహాయము జేసి ఆయాపద నుండి తొలగించెదనని చెడ్డ పురుషుడు తలంచుచుండును. కానీ ఇది సామాన్య లక్షణము. కార్య పురుషుడట్లు కాదు, ఏలననగా తాను ప్రత్యుపకారము సేయవలెనని తలంచుట అనగా నీకాపద రావలెనియే కదా! దాని ఉద్దేశ్యము. ధన్యుడవైన నీకు ఆపద యనునది రానేరాదు. అందువలన నీకు నేను ప్రత్యుపకారము సేయవలెనని భావించుటలేదు. ఇంకను వినుము. నిన్నెవ్వరు పూజించెదరో వారు నాకు కూడా స్నేహితులే యగుదురు. నేనెల్లప్పుడును నీలోనే కనిపించెదను. నీ కథలను దేవతలు సంతోషముతో చెప్పుకొనుచుందురు గాక. అందువలన నీవు కీర్తి గలవాడవై వర్ధిల్లుము అని హనుమంతునితో బలికి తనమెడలో నుండి ఎల్లప్పుడును తీయని హారమును దీసి హనుమంతుని మెడలో వేసెను. ఆ హారమును రామచంద్రుడు వేయగా హనుమంతుడు వానరులందరిలో చుక్కలలో చంద్రుని వలె కనబడుచుండెను.

రామచంద్రుడీవిధముగా తనకాశ్రయులైన వారందరిని బుజ్జగించుచు వస్త్రములను, మణిభూషణములను కావలసినన్ని యిచ్చి ఇకపొయిరమ్మనగా సుగ్రీవుడు, విభీషణుడు ఓ రామచంద్రా! మేము నిన్ను విడిచి యెట్లు పోగలము. పోవుటకు మాకు కాళ్ళాడుట లేదని వారు ఏకగ్రీవముగా బలుకుచు, వలవల యేడ్చుచు నీరు కారుచున్న కన్నులతో శ్రీరామచంద్రుని మాటిమాటికిని చూచుచు రామా! మా స్థలములకు మమ్ము పొమ్మని పంపి వైచితివివే, నిన్ను విడచి మేమెట్లు పోగలమని రామచంద్రుని విడిచి పోలేక పోలేక ఎట్లో వెడలి పోయిరి. కావున దయ గల రాజులకెవ్వరికిని విడిచిపోవుటకు సాధ్యముకాదు కదా!

ఈ విధముగా శ్రీరామచంద్రుడు సుగ్రీవ, విభీషణాదులను పంపివేసి వారి శౌర్య ధైర్యములను మాటిమాటికిని తన మనస్సున దలంచుచు, సభలో నుండిన ఆర్యులతోను, బంధు, మిత్రులతోను, తన తమ్ములతోను సాయంకాలము వరకు అనేక జనులు తన్ను బొగడుచుండగా రామచంద్రుడు సభలోనుండెను.

## ధనేశుని పనుపున పుష్పకంబు రాముని గొలువ వచ్చుట

శ్రీరామచంద్రుడిట్లు సభలో నుండు సమయమున దేవస్వరూపుడొకడు రాముచంద్రుని కొలువు లోనికి వచ్చి రామచంద్రుని యెదుట నిలిచి నమస్కరించి ఓ దేవా! నేను కుబేరుని పుష్పక విమానమును. మీ సేవ జేయుటకై వచ్చి యున్నాను. నన్ను స్వీకరింపుము అనగా శ్రీరామచంద్రుడు ఓ విమానరాజమా! నీ యజమానుని విడచి ఇచటకెందుకు వచ్చితివి. అనగా ఓ మహాత్మా! మీరు చెప్పిన విధముగా నేను కుబేరుని దగ్గరకు వెళ్ళితిని. అయన మీ మంచి గుణములను మెచ్చుకుని నన్ను మీ వద్దకే పంపి వేసెను. మీ సేవ సేయుమని నన్నాజ్ఞాపించెను. యజమాని చెప్పినట్లు జేయుట సేవకుని ధర్మము. కావున ఆయన చెప్పకుండినచో నేను వచ్చి యుండను. నా యందు దయ యుంచి, నన్ను సందేహింపక మీ సేవకంగీరింపుమని కోరగా, రామచంద్రుడు విని ఆ పుష్పక విమానమును పూజించుట కొప్పుకొని ఓ దివ్య విమానరత్నమా! నేను నిన్ను తలచినపుడు రమ్ము, నీవిపుడుండుటకు తగిన చోటెక్కడున్నదో అక్కడడికి వెళ్ళుము అని పుష్పక విమానమును పంపివైచెను.

అపుడా పుష్పకవిమానమును బంపుటకు సంతోషించి కుబేరుని యుదార గుణమునకు మెచ్చుకొని పొగిడి తనతోనతడు స్నేహము గోరుటను ప్రశంసించెను.

భరతుడు కలుగజేసుకుని అన్నకు నమస్కరించి అన్నా నీ ప్రతాపము వలన సాధు విరోధి, తన విరోధియగు రావణుడు హతమయ్యెను. అందువలన కుబేరుడు సంతోషించి, మీకీ విమానమును పారితోషికముగానిచ్చెను. అంతియే కాదు దుర్మార్గుడగు రావణుని మోసిన దోషమీపుష్పక విమానమునందున్నది. ఆ దోషమెంతటిదనగా విమానము మోయలేనంత దోషమందులోనున్నది. ఆ దోషమును దూరముగా తొలగించవలెనన్నచో అవిమానం నిన్ను మోయవలెను. మోయకున్నచో దానినంటి యున్న పాపభారము తగ్గదుగదా.

ఒక్క కుబేరుడే కాదు సమస్త దిక్పాలకులు నీతో స్నేహము కోరుచున్నారు, ఏలనగా వారికిపుడున్న సమస్త భోగములన్నియు నీవు రావణుని చంపుట వలన వారికి మిగిలినవే లేకున్నచో వారిని జయించిన రావణుని సొత్తులే కదా! అందువలన వారికవియన్నియు మీరిచ్చినటులేయని భావించుచున్నారు.

అన్నా రామచంద్రా! మీతో వారు స్నేహము గోరి తూర్పు దిశకు అధిపతియైన దేవేంద్రుడు మేఘములకధిపతి యగుట వలన ప్రజలకు పయోగడునట్లు ఆ ప్రజలు కోరిన చోటులయందు నెలకు మూడేసి వానలు కురిపించుచున్నాడు. ఆ వానలు తగినంతే యుండును. అధికముగా గాని, అల్పముగా గాని యుండవు.

ఆగ్నేయ దిశకు అగ్నిదేవుడధిపతి ఆయన మీ వలన సమ్మానితుడు కాగోరి అన్ని సమయములందును ఎడతెఱిపిలేకుండా హోమములతో మండుచు ఆ మంటలు ప్రదక్షణలు సేయుచున్నవా యనునట్లు తక్కువ మండుచు ఆ మంటలు సుడులు దిరుగుచు తనలో వ్రేల్చబడుచున్న నేయి పుల్లలు ఆహుతులను దీసికొని వాని అసలు రూపమును మంటగా మండించి అందు వేయబడిన వానిని హవిస్సుగా మార్చి దేవతలకందించుచున్నవి. రావణుని కాలములో వీటినన్నింటిని అతడు జరుగనివ్వలేదు.

దక్షిణ దిక్కునకు యమధర్మరాజధిపతి. కావున ఆయన నీ స్నేహమును గోరుచు పండు ముదుసలులను దప్ప తక్కిన వారిని మరణింపజేయుట లేదు. ఏలనగా పండు ముదుసలులు మరణించక పోతే కష్టము. వారికి తన శరీరమే తమకు బరువై తినుట, తిరుగుట, కూర్చొనుట, లేచుటలకు కాళ్ళు వంగవు. కండ్లు కనబడవు. చెవులు వినబడవు. కదలలేరు. మెదలలేరు. మూత్ర పురీషాలక్కడనే తనకున్న వారు ఏవగించుకొందురే గాని ముందున్న గౌరవ మర్యాదలుండవు. మాకు ఈదశ గల్గుతుందని వారనుకోరు. అందువలన జీవితము పై రోత బుట్టి స్వామీ నన్ను దీసుకొనిపోరాదా! అనుకొన్న వారిని మాత్రమే యమధర్మరాజు మరణింపజేయుచున్నాడు. అందువలన ముదుసలులకు మేలు జేయుచు తక్కిన వారితంటకు బోడు.

తక్కిన వారి తంటకెందుకు పోవుట లేదనగా వారెంత కాలము జీవించిన అంత మంచిది. ఏలనగా పరోపకారమిదం శరీరం. ఈ శరీరము సాటి వారికి తమ శక్తి కొలది సహకరించుచుండవలెను. అట్లుగాక బాల్యయౌవన సమయములో తన సంసారము జరుపుకొనుట కొఱకు ఉద్దేశ పూర్వకముగా కొందరును విధిలేక కొందరును, న్యాయ మార్గములను విడిచి అక్రమమార్గముల యందు ధనసంపాదనలు మాత్రమే గాక తమ కోర్కెలు నెరవేర్చుకొనుటకు తప్పుదోవలు త్రొక్కి యుందురు. అలాంటి వారు వయసు మళ్ళిన తరువాత తమ గడచిన జీవితమును తర్కించుకొని చేసిన పొరబాట్లకు పశ్చాత్తాపపడి ఆ

దోషములను తొలగించుకొనుటకు దేవుని యందు భక్తి దానధర్మములు మొదలగు మంచి కార్యములను జేయుచు మార్పు చెంది యుండెదరు. అలాంటి వారు ఎంత ఎక్కువ కాలము ఆరోగ్యవంతముగా జీవించిన అంత గొప్ప పుణ్యములను సంపాదింపగలరు. అందువలన అట్టివారిని యమధర్మరాజు మరణింప జేయక విడిచి యుండెను.

ఇక్కడొక సందేహము మీకు కలుగ వచ్చును. మంచి వారు ఎంత ఎక్కువ కాలము జీవిస్తే అంత మంచిదే కాగలదు. మరివయసు మళ్ళిన తరువాత కూడా తమలో మార్పు చెందక కోర్కెలు దీర్చుకొనుటకు సంపాదనలకు అలవాటు పడిన వారికి యమపట్టణము లేదు. యమధర్మరాజూ లేడు. యమ బాధలుండవు. నరక కూపాలు లేవు అని జీవించెడు వారు ఎక్కువ కాలము జీవించుట వలన వారు ఎక్కువ పాపములు సేయుదురు కదా! అందువలన వారెంత త్వరగా మరణించిన వారికంతమేలు జరిగినట్లగును. ఏలనగా వారు పాపాలు ఎక్కువ సేయలేరు అని మీకు సందేహము కలుగ వచ్చును అన్నా! నిరాకార పరబ్రహ్మము నరాకారములో వచ్చి నీవిక్కడుండగా నీ హయాములో పాపాలు సేయువారే ఉండరు. అందువలన యమధర్మరాజు పండుముదుసలులను కానివారిని కరుణించి విడిచి పెట్టుచున్నాడు.

ఇక ఉత్తర దిక్కునకధిపతి కుబేరుడు. ఆయన ధనధాన్యాది సంపదలకన్నిటికి అధిపతి ఆయన కూడా నీ స్నేహమును కోరుచున్నాడు. అందువలన ఒకతూరి భూమిలో విత్తనములు రైతులు వేసినచో అవి పైరైపంట వచ్చును. ఆ పంట మార్పిడి సేయునపుడు పంట నుండి భూమి పై కొన్ని విత్తనములు రాలు చుండును. అందువలన మరల ఆ భూమిలో ఆ విత్తనములే మొలచి పైరై పండుచుండును. ఆ పంటలు దీసి తినుచుందురు. ఈ విధముగా భూమినుండి పంటలు లభించుచుండును. అన్నా రఘుకుల భూషణా మీరేలుచున్న రాజ్యములో ప్రజలకింత సుఖసౌఖ్యములు కలుగుచున్నవి.

అంతేకాదు, ఇంకను చెప్పుచున్నాను వినండి. అన్నగారూ! మీరు రాజ్య పాలన చేపట్టినప్పటి నుండి ఏస్త్రీగాని నాకు బిడ్డలు లేక పోయిరని వ్యసనపడు వారులేరు. అనగా అందరును సంతానవతులే అట్లు సంతానము కలిగిన తరువాత నా బిడ్డ చనిపోయినాడని యేడ్చే ఆడపడుచులులేరు. మీ పరిపాలనలో అధర్మాలు లేవు. అందువలన శిశుమరణాలు లేవు. తల్లిదండ్రులుండగానే

వారిసంతానము యుద్ధములలో దప్ప సహజముగా మరణించ కూడదు. అన్న ఉండగా తమ్ముళ్ళును, భార్య ఉండగానే భర్త చావకూడదు. అందువలన భర్త చనిపోయినాడని దుఃఖించు స్త్రీలులేరు. అంతేకాదు బ్రతికుండియునేమి ప్రయోజనము, వారుండుటకు ఇల్లు, తినుటకు తిండి, కట్టుకొనుటకు వస్త్రము దీనికి తక్కువలేకుండా కలిగిఉంటేనే బ్రతికినందుకు ప్రయోజనము. కూటికి, గూటికి, గుడ్డకు తక్కువ గలిగి దరద్రమనుభవించువారు మీ పరిపాలనలో లేరు. అదే విధముగా సకల సంపదలు కలిగియున్నా, ధన గర్వముచేత తక్కిన వారిని తిరస్కరించు పాపాత్ములసలే లేరు. ఉండియు మఱియాదగా అందరిని అనుసరించు వారున్నారు. ఆరోగ్యములు చెడినవారు శారీరక వ్యాధులూ మానసిక వ్యాధులు పిచ్చి మూర్చ వంటివి కలవారు లేరు. మరియు వ్యభిచారం సేయువారు లేరు. దొంగలు లేరు. అతివృష్టి, అనావృష్టి, అడవులు గాలుట, ఇండ్లు గాలుట, పులిసింహం లాంటి క్రూరమృగ బాధలు కూడా మీ రాజ్యములో లేవు. కఱువు కాటకాలు తుఫానులు లేవు. ఎలుకలు, నల్లులు దోమలు, తేళ్ళు, పాములు ఇలాంటి బాధలు మీ రాజ్య పరిపాలనలోనే లేవు.

ప్రభూ మరియు వినండి బ్రాహ్మణులు యజ్ఞము సేయుట యందును, పౌరోహితమునందును, రాజులు ప్రజలను రక్షించుటయందును, దానము సేయుటయందను, దేశ రక్షణకు తమ తమ భుజబలమును చూపుట యందును, వైశ్యులు వ్యాపారము సేయుటయందును, శూద్రులు తమ సేవా కార్యముల యందును తాముఖచ్చితముగా నడచుచున్నారు. నాల్గు రకముల కులముల వారును స్వార్థమనునది లేక పరార్థ బుద్ధితో వారివారి కులాచారములను పాటించుచున్నారు అని భరతుడు దెలుపగా విని శ్రీరామచంద్రుడు మిగుల సంతోషించెను.

ఈ విధముగా శ్రీరామచంద్రుడేలిన రాజ్య వైభవమును చదివిన వినిన, వ్రాసిన అందరికి తెలియజేసిన వారు ఆ రామచంద్రుని దయకు పాత్రులై ఈ లోకమునందు ఏ కొరతలు లేని వారై జీవించి జీవితానంతరం పరమ పదమైన వైకుంఠము నందు వసియించెదరు. (అరవ ఆశ్వాసము సమాప్తము).

## ఏడవ ఆశ్వాసము - ప్రారంభము

ఈ విధముగా శ్రీరామచంద్రుడు ప్రజలను తమ బిడ్డలవలె జూచుచు రమ్యముగా రాజ్య పాలనము సేయుచుండెను. రావణాది రాక్షసులను చంపి

నిష్కంటకముగా రాజ్యమేలుచుండెను. ఎందరో రాజులు రాజ్యములేలి యుండిరి. కాని రామునివలె రాజ్యమేలిన వారు లేరు. కృత యుగము వలె నాలుగు పాదములలో ధర్మమును నడిపెను. అందువలననే అందరు రామ రాజ్యము కావలెనని కోరుచుందురు.

ఇట్లు ప్రపంచమున ప్రభువై రామచంద్రుడు రాజ్యమేలుచు సీతాదేవితో గలసి ఉద్యానవనమునుకు బోయి ఉల్లాసముగా సీతారాములు శృంగార చేష్టలచే సురత క్రీడలతో సుఖసౌఖ్యములనుభవించుచు తల్లిగారు పంపిన తగిన వంటకములు, భోజనాదులు నారగించుచు కొంత కాలమక్కడుండి తిరిగివచ్చిరి. తరువాత సీతాదేవి గర్భవతియై కనంబడుచుండెను. రామచంద్రుని రాజ్యములో గల ప్రజలిట్లూహించెడువారు.

ఈ రామచంద్రుడిట్లే పదివేల కోట్ల సంవత్సరములు రాజ్యపాలనము గావించిన బాగుండెడిదని కోరుచుండిరి.

**సీతాదేవి గర్భవతియై యుండెను :** సీతాదేవి రామచంద్రునితో ఓ మనో నాయకా! ఋషుల ఆశ్రమముల యందు సహజ జాతివైరములు లేక మెలగు చుండును. ఆకలిగొన్న లేడి పిల్లలు అరచినపుడు ఆడపులులు తమ పాలనిచ్చి వానిని నిద్రబుచ్చును. సింహమడవిలో సంచరించి వచ్చి అలసి పండుకొన్నపుడు ఏనుగు తొండములో నీరు తెచ్చి ఆ సింహము మీద పోసి దాని యలసట దీర్చును. ఎలుకలతో పిల్లలు చెలగాటమాడుచుండుననట. నెమళ్ళు, పాములు నిరంతరము కలసి జీవించునట. అలాంటి మునుల ఆశ్రమములు గంగాతీరములో నున్నవట. ఆ మునీశ్వరుల ఆశ్రమములకు బోయి మునీంద్రులను దర్శించుకొని వారి భార్యలతో కలసి ఫలాహారము లారగించి రావలెనని నాకు గోరిక గలుగచున్నదని శ్రీరామునకు సీతాదేవి విన్నవించెను. అటులే పోయివత్తమని శ్రీరాముడంగీరించెను.

ఎప్పటి యట్లు రామచంద్రుడు తన పరివారముతో కలిసి కొలువునకు వచ్చెను. అచట ముందే బంధుమిత్రులు భటులు నాయకులు హాజరైయుండిరి. రామచంద్రుడు సింహాసనమలంకరించెను. సభ కార్యక్రమములు పరిశీలించి ముఖ్యులైన వారిని సభలో నుంచుకొని తక్కిన వారిని పంపి వైచెను. భద్రుని జూచి రామచంద్రుడు భద్రా మన పట్టణములో తిరుగుచు నా రాజ్యపాలనమును గూర్చి ప్రజలేమనకొనుచున్నారు. అందులో వింతలేమైనా వింటివా? అలాంటి

విషయము అన్నిచోటుల యందును మాటలాడరు. ఇంకెక్కడనెదవా, ఎవరును లేని చోట తల్లిదండ్రులును అన్నదమ్ములును కలసిన చోట వారు సరదాగా మాటలాడుకొనుపుడు ఆ మాటలలో నా ప్రస్తావన వచ్చినపుడు వారి మనసులలో నిజమైన భావములను నిర్భయముగా చెప్పుకొనుచుందురు. పదుగురిలో ఆ విధముగాక మనసులో నొకటియున్నను పైకి మెరమెచ్చులకేదో జెప్పుచుందురు. అందువలన నీవు విన్నవి నాకు తెలియజేయుము. నాలో పొరపాటులేమైన ఉండినచో దిద్దుకొనెదను అని భద్రుని శ్రీరామచంద్రుడడిగెను.

భద్రుడు శ్రీరామచంద్రునకు నమస్కరించి స్వామీ! నీ చరిత్రను పరిపాలనమును ప్రజలు పదివేల విధములుగా చెప్పుకొనుచున్నారు. తండ్రియాజ్ఞను పాలించుట సముద్రమునకు వారధి గట్టుట రాక్షసులతో కలిసి రావణుని సంహారము. వింత వింతలుగా జెప్పుకొనుచు మన రామచంద్రుడు సాక్షాద్విష్ణువుగానీ ఈశ్వరుడు కానీ కావచ్చును. సామాన్య నరులకిది సాధ్యముకాదు అని చెప్పుకొనుచుండిరి. అనగా రామచంద్రుడు భద్రా! నీవు చెప్పునదంతయు నిజమే కావచ్చును. కానీ రాజులను గూర్చి చెప్పునప్పుడు వారిని గూర్చి విమర్శలు కూడా సేయుచుందురు. అలాంటివి నన్ను గూర్చిగాని, సీతను గూర్చి గానీ నిందా వాక్యములేమైనా చెప్పుకొనుచుండిరా! ఉండినచో దాపక అబద్ధమాడక చెప్పుము అని రామచంద్రుడనగా.

భద్రుడు: మహాత్మా! నిజముగా ఏమనుచున్నారో తెలుపుమని మాటిమాటికి నన్ను అడుగుచున్నారు. ప్రజల స్వభావమును గూర్చి నా అనుభవమును తెలుపుచున్నాను. ప్రజల స్వభావములెటువంటివనగా వారు చెప్పుకొను వాక్యములు సరిగా నుండవు. గొప్పవారిని గూర్చి అంచనాలు గట్టే సూక్ష్మ బుద్ధి వారికుండదు. చీమ సముద్రపులోతును తెలియగలుగునా! సముద్రాన్ని విమర్శించ గలుగుతుంది. ఇది చాలా దుర్మార్గురాలనియు మావంటి చిన్న జీవులను అలలతో విసరికొట్టుననియు దాని విమర్శలు.

అదే విధముగా ఈ ప్రజలు పరిపాలకులను గూర్చి పనికి మాలిన విమర్శలు జేయుచుందురు. ఎట్లనగా

**భద్రుడు శ్రీరామునకు పౌరులాడునిందావాక్యములను తెల్పుట**

ప్రజలుదయామయులైన రాజులనందరిని తప్పు జేసిన వారిని దయతో జూచి ఇది మొదటి తప్పు మరల ఇటువంటి తప్పులు ఇక మీద చేసితివేని

నిన్ను క్రూరముగా దండింపవలసి యుండును అని దయతో వదలినచో ఇతడు మెత్తనివాడు, అసమర్థుడు, పరిపాలనకు పనికి రానివాడని అతనిని మెచ్చుకొనరు. తప్పుజేసిన వానిని కఠినముగా దండించుచుండు రాజును గూర్చి ఇతడు దయ లేనివాడు, అందరిని హింసించెడివాడు, కఠినుడు అని అతనిని నిందింతురు. సాధువులకు సహాయము జేసి దుర్మార్గులను దండించు రాజును ఇతడు పక్షపాతి, ఒక కంటిలో వెన్న ఒక కంటిలో సున్నము ఇతడు పరిపాలనకు పనికిరాడని నిందింతురు. ధైర్యము గల రాజును జూచి అతడు కఠిన స్వభావము గలవాడని ఆ రాజువద్దకెవరును చేరరు. ఈ విధముగా ప్రజలు రాజుల మీద నేదో యొక నేరమును బెట్టుచుందురు. అందువలన ప్రజల మాటలను పట్టించుకోవలదని నా మనవి. కానీ మీరు తన మీద ఒట్టుపెట్టుకొని తప్పక చెప్పుమనుచున్నారు. నేను విన్నది చెప్పుచున్నాను వినండి.

అయ్యో! ఇంతవరకు సూర్య వంశీయులకు ఎట్టి కళంకము గాని కలిగియుండలేదు. అటువంటి కుటుంబములో శ్రీరామచంద్రుడు జన్మించి యున్నాడు. రావణుడు పుట్టుకతోనే రాక్షసుడు. చెడువారిలో మొదటివాడు. అతడు శ్రీరాముని ఇల్లాలైన సీతను తన తొడ మీద బెట్టుకొని పోయి సంవత్సర కాలము తన యింట బెట్టుకొని యుండగా, భార్య మీద మరులు ఎక్కువైనందున రావణుని చంపి మరలా తెచ్చుకొని కాపురము జేయుచున్నాడు. మన రాజుగారు కొంచెమైనను ఎగ్గు సిగ్గులు లేక పగవాడు దీసుకొని పోయిన ఆమెను దెచ్చి యేలుకొనుచున్నాడు. కామానికి కట్టుబడిపోయినాడు. పగవారు తీసుకొనిపోయిన స్త్రీని తెచ్చుకొనుటకు ఆ పగవారిని చంపి ఆ స్త్రీని తెచ్చి తన యింటిలో బెట్టుకొని ఎవరైనను కాపురము జేయించుకొనుచున్నారా? ఇది రాజుల ధర్మమేనా? యధా రాజా తధా ప్రజా రాజెట్టివాడయిన ప్రజలట్టి వారను సామెత గలదు. గడ్డపారలు గాలికి కొట్టుకొని పోవుచుండగా పుల్లాకులు మా గతియేమిటి అన్నాయట. రాజే యీ విధముగా ప్రవర్తించిన ఇక ప్రజల మాట చెప్పవలెనా? ప్రజలెవరైనా ఇట్లు చేసిన దండించవలసిన రాజే ఇట్లు చేసిన రేపు ప్రజలు కూడ ఇట్లే చేయగలరు. అందువలన రాజుగారు అనుసరించిన పద్ధతి ధర్మ పద్ధతి కాదని ప్రజలు గుంపులు గుంపులుగా చేరి చెప్పుకొనుచున్నారు. ఆ మాటలు నేను వినివిని వేసారి పోతిని. ఏ వీధిలో జూచినను ఇట్టిమాటలే చాటుమాటుగా చెప్పుకొను ప్రజల నోళ్ళను మనమెట్లు మూయగలము అని భద్రుడు దెలుపగా శ్రీరామచంద్రునకు ఆ మాటలు మొనలు దేలిన శూలములు

చెవులలో బెట్టి త్రిప్పినట్లైనది. రాముడు తన దగ్గరనున్న స్నేహితులను బిలిచి మిత్రులారా! మన భద్రుడు చెప్పిన మాటలు వింటిరి కదా! అనియడుగగా వారేమియు సమాధానము చెప్పలేక తలలు క్రిందికి వాల్చి స్వామి! మేమేమని చెప్పగలము అని యూరకుండిరి. రామచంద్రునకు తన మనస్సు కలవరపాటు జెందినదయ్యెను.

ఎవరితో నేమియు ననలేక మౌనముగా నుండెను. కొంతసేపావిధముగా నుండి అక్కడున్న వారిని వారి వారిండ్లకు బంపి కంచుకిని బిలిచి నీవు పోయి నా తమ్ములను పిలచుకొని రమ్మనగా వాడు పోయి లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను పిలుచుకొనివచ్చెను.

తమ్ములు వచ్చి చూచునప్పటికి చలించి పోయిన తన మనఃక్లేశమును భరింపజాలక దుఃఖితుడై యుండిన అన్నను జూచి నమస్కరించి నీవింత దీనముగా నుండుటకు కారణమేమని యడిగిరి.

శ్రీరామచంద్రుడు: తమ్ములారా! మీరీనాడు అండదండలుగా నుండి సేవలు జేయుచు నా చేత రాజ్యమేలించుచున్నారు. మీకు చెప్పక నేనే పని చెయ్యను వినుడు. ప్రజలనుచున్న మాటలని రావణుడు సీతనెత్తుకపోయి సంవత్సర కాలము తమ యింటిలో బెట్టుకొని యుండగా ఆమె మీద గల మోహముతో రామచంద్రుడు పోయి వానిని చంపి సీతను తెచ్చి తన యింటిలో పెట్టుకొని కాపురము సేయుచున్నాడు అని నిందించుచున్నారట.

లక్ష్మణా! ఆనాడు లంకలో సమస్త దేవతలు చూచుచుండగా సీత అగ్ని ప్రవేశము చేయగా తన నిర్దోషిత్వము నిరూపింపబడినది. దేవతలందరు ఈమె మహాసాధ్వి ఈమెను పరిగ్రహించుమని బ్రహ్మదేవుడును అగ్నిదేవుడును చెప్పగానేనంగీకరించి సీతను దీసుకొనివచ్చితిని. కానీ వారికది తెలిసినదో లేదో? ప్రజలీవిధముగా నిందించుచున్నారు. నింద మోయుట చాలా కష్టతరమైనది. అనాడు రావణుని బాధల కోర్వజాలక యున్నందున నేనీ రావణుని చంపగా ఈ దేవతలకందరికిని మేలు జరిగి నందున దేవతలందరును ఆ విధముగా కప్పి పుచ్చి చెప్పి యుండవచ్చునా. ఏది ఎట్లున్నను సీతకును నాకును ఋణము తీరియున్నది. అట్లగాకుండిన ప్రజలీవిధముగా నిందించి యుండరు. మంచి దైనను, చెడుదైనను నేనొక మాట చెప్పుచున్నాను. నా మాటకడ్డు, చెప్పవలదు

అట్లు మీరు అడ్డుచెప్పితిరేని నామీద ఒట్టు అని వారిని కట్టడి చేసి లక్ష్మణా! మీ వదిన సీత నాతో మునీంద్రులాశ్రమములను చూడవలెనని కోరియున్నది. అందువలన నీవు రేపు ఉదయమునే లేచి సుమంత్రుని రథము తీసికొనిరమ్మని ఆ రథములో మీ వదినె సీతను దీసుకొనిపోయి గంగా నదీతీరమున వాల్మీకాశ్రమున్నది. ఆశ్రమము చెంత విడచి రమ్ము అని చెప్పి కన్నీరు దుడుచు కొనుచు లేచి తన మేడకు వెళ్ళెను. తమ్ములు అన్న ఆజ్ఞకెదురు బలుకలేక దుఃఖమునాపుకొనుచు వారి వారి మేడలకు వెళ్ళిరి.

తన మేడకు బోయిన శ్రీరామచంద్రునకు నిదురబట్టలేదు. ఆ రాత్రి యొక బ్రహ్మకల్పము వలె కనబడెను. ఇక్కడ తమ్ములకు నిదురబట్టలేదు. ఆమరునాడుదయమున లక్ష్మణుడు ప్రాతఃకాలకృత్యములు, స్నాన సంధ్యాదులు దీర్చుకొని సుమంత్రుని బిలిపించి గంగా తీరమున మునుల ఆశ్రమములు చూడవలయునని మా వదినగారు కోరి యున్నారు. అందువలన నీవు రథమును సమాయాత్తము జేసికొని శీఘ్రముగా తెమ్ము, ఆమెను తీసుకొని వెళ్ళవలెనని తెలుపగా సుమంత్రుడట్లే జేసెను.

లక్ష్మణుడు స్థిరచిత్తమ గలవాడు. తనమనసులో గల ఆందోళననితరులకు తెలియనీయక ఎప్పటి యట్ల సీతాదేవి వద్దకు బోయి నమస్కరించి అమ్మా! గంగాతీరమున గల మునీంద్రుల ఆశ్రమములను చూడవలెనని మా అన్న గారిని కోరి యుంటిరట అందువలన మిమ్ము దీసుకొని వెళ్ళి ఆ మునీంద్రాశ్రమములు చూపుమన్నాడు. మనేము పోవుదము రథమిపుడు సిద్ధముగా నున్నది. బయలుదేరుమని లక్ష్మణుడు చెప్పగా సీతాదేవి విని సంభ్రమ పడుచు తన కోరికను రామచంద్రుడు మన్నించినందుకు సంతోషించి బయలుదేరుటకు సిద్ధమయ్యెను.

## లక్ష్మణుడు గంగదాటి రామాజ్ఞను సీతకు దెలుపుట

ఈ విధముగా ప్రయాణమైన సీతను లక్ష్మణుడు జూచి ఈమెకిక మీద జరుగబోవు సంగతులేమియు తెలియవు. ఈమె మాయమర్మాలెరుగని మర్యాదస్తురాలు. ఇట్టి యమాయకురాలిని నేనడవులకు దీసుకొనిపోయి దిక్కులేని దానిని జేసి అడవులలో నీమెను నేనెట్లు విడిచి అయోధ్యకు రాగలను అని లక్ష్మణుడు తన మనస్సునందు దలంచుచు లోలోన తల్లడిల్లిపోవుచుండెను.

సీతాదేవి ఆశ్రమములందున్న మునిపత్నుల కొసగుటకు బంగారు పట్టువస్త్రములను రత్నభూషణములను తీసికొని వచ్చి రధముపైకెక్కెను. తరువాత లక్ష్మణుడు రథముపై కెక్కగా సుమంత్రుడు రథమును తోలుచుండెను.

లక్ష్మణుడు శ్రీరామాజ్ఞను మనసునందు దలచుచు దానిని సీతాదేవికి తెలుపుటకు భయపడుచు ఇది వరకు మునుపటి వలె ఆమెతో నేమియు మాట్లాడక చాలా దీనత్వము గల వాడైపోవుచుండగా వారికి త్రోవలో కొన్ని దుష్టశకునములు కానవచ్చెను. ఆదుశ్శకునములను చూచి సీతకు ముందున్న సంతోషము పోయి దిగులు పడి దీనురాలై అన్నా లక్ష్మణా! మున్ముందు మనకేవో అశుభములు జరుగబోవుచున్నవి. ఎట్లనగా అదిగో అటు చూడుము. గరుడపక్షి, పాలపిట్ట మన రథమునకు ముందు భాగమున ఎడమవైపున నుండి వచ్చి కుడివైపునకు బోయి చెట్టుపై గూర్చొన్నవి. అది చూచిన వెనుక రథము మరికొంత దూరమునకు వెళ్ళగా సీత జూచి అన్నా! కుందేలుఎదురుగా వచ్చుచున్నది. ఏమి విపరీతము. మరికొంత దూరము రథము పోగా చమరకాకి కుడితెక్కను మనకు చూపించుచు ఎడమ నుండి కుడి వైపునకే వెళ్ళినది. ఇది చాలా చెడ్డ శకునము. అంతే కాదు పైడి గంటి అనే పక్షి మాటి మాటికి మన పై భాగమున తిరుగుచున్నది. ఇది కూడా దుష్టశకునమే. రథము ఇంకా కొంత దూరముగా బోయినది. ఎక్కడనో సుడిగాలి లేచి అదిబ్యార కొలుపుచు రథము చుట్టును తిరిగి రథమును గ్రమ్ముకొన్నది. అది దాటి కొంత దూరము పోగా రథముకెదురుగా ఒక గుంటనక్క తన నోటిలో నుండి మంటలను వెళ్ళగ్రక్కినది. అది మరియు విపరీతమైన శకునము. అది దాటి రథము ముందుకు సాగుచుండగా నల్ల నాగుపాము త్రోవ కడ్డముగా బోయి పుట్ట పైకెక్కి యున్నది. ఇది చెప్పలేనంత దోషము. ఇవన్నియు ఈ విధముగా నుండగా మనము పయనించెడి రథము మీద గ్రద్దలు కారాడుచు తిరుగుచున్నవి. ఇంతే కాదు అన్నిదిక్కుల యందును ఎఱ్ఱకావరమెగిరి యాకసమును కప్పివేసినది. సూర్యుడు మసక బారి యున్నాడు. పట్టపగలే గ్రుడ్లగూబలు కూయుచున్నవి. ఇంత విపరీతములగు దుశ్శకునములు కానవచ్చుట వలన మనకు భయంకరములగు కష్టములు రాగలవని తెలియచున్నది.

ఈ విధముగా దుశ్శకునములను చూచుట వలన రాబోవు కష్టములను సూచించుచున్నవి. నా కుడివైపున శరీరమదరుచున్నది. నాకు ధైర్యము

తగ్గుచున్నది. శరీరము స్వాధీనము తప్పుచున్నది. ఇక నేనేమి చెప్పగలను. అన్నా! లక్ష్మణా! నాకు ప్రభువు మనోహరుడు, సఖుడు శ్రీరామచంద్రుడుండగా ఎక్కడనో అడవులలో నుండు మునీశ్వరుల భార్యలను చూడవలెనని నేనేల కోరవలెను. కోరితినిపో ఆడవారు మంచి చెడులెరుగని కోరికలను కోరుచుందురు. ఈ కోరిక మంచిది కాదని వారింపక నాకోరిక నెఱవేర్చుటకు రామచంద్రుడేల సమ్మతింపవలెను. నీకేదైనా కోరిక యుండిన నెరవేర్చెదనని రామచంద్రుడేల నన్నడిగి ప్రోత్సహించవలెను. నేనిదివరకు ముందు పదునాలుగు సంవత్సరములు అడవులలో తిరిగినది చాలక మరలా నేనడవులను చూడవలెననియేల కోరవలెను హా! దైవమా! ఇట్టి విరుద్ధపు కోరిక గోరు పాప జాతినైన (పాప పుట్టుక) నాకు దుశ్శకునములు గాక మంచి శకునములేలయగును వినాశకాలే విపరీత బుద్దిః. చెడు బుద్ధిగల వారు తమకు వినాశకాలము వచ్చినపుడు బుద్దిఃకర్మాను సారిణి అని ధర్మవిరుద్ధములగు చెడు కోరికలను గోరి అవి నాకిష్టములని భావించి కష్టములనుకొని తెచ్చుకొందురు. అట్లే నేనును జేసితిని. రాబోవు కష్టములకీ దుశ్శకునములే సాక్ష్యములు. ఆడువారికి ప్రత్యక్షదైవము భర్త అట్టి నా ప్రత్యక్ష దైవమైన నా భర్త రామచంద్రునకును వారి తల్లులు మా అత్తగారు కౌసల్య, సుమిత్ర, కైకమ్మ గారికిని ఇంకా తక్కిన బంధు వర్గమునకును దేశ ప్రజలకును, పౌరులకును అందరికిని శుభములు గల్గించుమని దేవతలకు నమస్కరించుచున్నాను.

లక్ష్మణుడు ఆ సీతామాత చిత్తశుద్ధికిని, నీతికిని అశ్చర్యపడి, లోకములకేకైక మాతయగు సీత తన భర్తతో చివరి వరకు కలిసిమెలసి సుఖించునట్లు గాక నడుమనే ఎడబాటగునట్లు సేయుట దైవలీలగా భావించి విధిని నిందించుచు, ఆమెతో నేదో చెప్పవలెనని ప్రయత్నించుచు, చెప్పుటకు సంకోచించుచు, ఉస్సుమని తలయూపుకొనుచు, తల వంచుకొని యున్న లక్ష్మణుని విరామము లేక నింతవరకు తనకు గల్గుచున్న దుశ్శకునములను సీతామాత ఊరక చూచు చుండెనేగాని యేమియు సేయలేకుండెను. కావున దైవనిర్ణయమునెవరు కాదనగలరు. సీతాలక్ష్మణులు అడవులు, ఏరులు పర్వతములు పల్లెలు దాటిపోయిరి.

తమ ముందు భాగమున గోమతియను నదిని సమీపించునప్పటికి పొద్దుగ్రుంకెను. అక్కడ దంతికాశ్రమము నందు ఆరాత్రి వసించి ఆ మరునాడు

ప్రొద్దున లేచి రథములో పయనించుచు మధ్యాహ్నమగునప్పటికి గంగా తీరము జేరిరి. ఆ నదీతీరము చల్లని గాలుతోను పెద్ద పెద్ద అలలతోను పొంగి పారుచున్న నదిని జూచి సీత సంతోషించుచుండెను.

లక్ష్మణుడామెను జూచి ఈమె చాలా సున్నితమైన హృదయము గలది. శ్రీరామచంద్రుడిచ్చి యున్న ఆజ్ఞ చాలా భయంకరమైనది. భరింపరానిది. బాధను కల్గించునది. ఆ విషము వంటి వార్త ఈమెకు నేనేవిధముగా తెలుపవలెను అని లక్ష్మణుడాపుకొనలేని దుఃఖము గలిగినవాడై తనకన్నులందు ధారా పాతముగా నీరుగారుచుండగా సాహసించి చెప్పబోవుచు చెప్పుటకు నోరాడక దానిని దిగమ్రింగి కొనుచున్న లక్ష్మణునితో.

సీతామాత: అన్నా లక్ష్మణా! మనమయోధ్య నుండి బయలు దేరినప్పటి నుండి నీ ముఖమును చూచుచుండగా నాకేమో దిగులు కలుగుచున్నది. అక్కడ మనవారన్నదమ్ములకును బంధువులకును క్షేమమే కదా? నీ కన్నుల యందు నీరేవిధముగా కారుచున్నదెందులకు? సంపదలన్నీ వదలి పదునాల్గు సంవత్సరములు మా వెంట అడవులకు వచ్చునపుడుగానీ, వీరుడగు ఇంద్రజిత్తుతో యుద్ధము జేసినపుడు గానీ, రావణుని శక్తి బాణము నీ రొమ్మున గ్రుచ్చుకొన్నపుడు గానీ, నీ కన్నులయందీ విధముగానీ నీరు రాలేదు. ఇపుడెందు కిట్లేడ్చుచున్నావో తెల్పుము.

మనోవ్యధను తొలగించు పుణ్యరాశియగు ఈ గంగానది చెంతకు మనము చేరి యున్నాము. నీవీ విధముగా దుఃఖించుటెందుకు? వెనువెంటనే మనము మునులాశ్రమములకు బోయి వారి భార్యలను జూచి ఈ తెచ్చి యున్న వస్త్రభూషణాదులను వారికర్పించి వారు మనకొసగు దీవనలంది. సంతోషముగా తిరిగి అయోధ్యకు బోవుదము అని చెప్పినను లక్ష్మణుని ముఖమునందు వికాసముకలుగలేదు. అన్నా నేను చూడరాని దుశ్శకునములు చూచినప్పటి నుండి నాకు కలవరపాటు కలుగుచున్నది. నీ ముఖము చూడగా ఇంకను కలవరపాటు అధికమగుచున్నది. ఇక తపోవనములకు మనమేల పోవలెను చాలించి మరలా వెనుకకు వెళ్ళుదము అని సీతాదేవియనగా లక్ష్మణుడాలోచించి తన అన్నగారు దెలిపినది మనసునందుంచుకొని బలవంతముగా దుఃఖము నాపుకొని ఓ తల్లీ మనకు నిన్నటి దినమునందు గల్గిన దుశ్శకునములు నాకీ బాధ గలిగించినవి, ఇంత మాత్రామునకే మనమయోధ్యకు బోనేల.

నీవు కోరిన విధమునే గంగానదిని దాటి పోయెదము అని ఆ చతురుడైన లక్ష్మణుడు సీతమ్మతో ధీరత్వముగా బలికి రథమును సుమంతుని రథము వద్దనే నిలిపి సీతాదేవియు లక్ష్మణుడును పడవ మీద నెక్కి నదిని దాటి ఆవలి వైపునకు చేరిరి.

అటు పిమ్మట అపుటకు సాధ్యముగాని దుఃఖ సముద్రములో మునిగి యున్న లక్ష్మణుడు జానకిని జూచి ఓయమ్మా! శోకసముద్రము అనే దావాగ్నిలో కాలిపోక నా హృదయమనే గుండెలో గల దుఃఖమనే ఎముక తొలగజాలదు. నేనీ దుఃఖముతో బ్రతుకుట కంన్న మరణించినను మేలేయగును. ప్రపంచ జనులందరి చేత తిట్లు దిను పని జేయుటకై నేనిక్కడికి వచ్చియున్నాను. కావున నన్ను శపింపుము అని లక్ష్మణుడు సీతాదేవి పాదములపై బడి యేడువసాగెను.

జానకి: లక్ష్మణుని జూచి అంతకు ముందు తాను ఎదబడి పెదవు లెండిపోయి యున్నందున ఆ పెదవులను నాలుకతో తడుపుకొనుచు అదరి బెదరి పోయి అన్నా లక్ష్మణా! మనము ప్రయాణమై వచ్చునపుడు అనేక దుశ్శకునములెదురైనవి. అపుడు నీవింత బాధపడలేదు. కానీ ఇపుడు నీవెందులకిట్లు దిగులుపడుచున్నావు. నీవు చాలా ధైర్యము గలవాడవని అందరు అనుచుండగా వినియున్నాను. నీవిపుడెవ్వరికి కీడు సేయతలపెట్టితివి. ఎంతటి ఆపద వచ్చినను నీవబద్ధమాడవు. మీ అన్నగారగు రామచంద్రుడు నీ మీద దయలేనివాడై నిన్నేమైనా అన్నాడా? అయన్నగారి మీద నీకేమైనా భక్తి తొలగిపోయినదా? లేక నీ కన్నతల్లి సుమిత్ర నేమైనను ఏడ్పించితివా? లేక నీ గురువుగారగు వసిష్టునేమైనా నిందించితివా? మీ అన్న గారి ఆజ్ఞ లేకనే నన్నేమైనా ఈ యరణ్యములకు తీసుకొనివచ్చితివా? అదీగానిచో ఆ రామచంద్రుడు నామీదేమైనా దయ తప్పి యున్నాడా? నీవిపుడుట్లేల యేడ్చుచున్నావు. తెలుపుము. నాకేదో తెలియరాని బాధగల్గుచున్నది. పట్టణములో ఆ రామచంద్రుడు క్షేమముగానే యున్నాడు కదా? మనుధర్మశాస్త్రము నెల్లప్పుడును అనుసరించు రామచంద్రుడు దయ దప్పి నిన్నేమైనా తొలగించి యున్నాడా? లేక నన్నేమైనా తొలగించెనా? అని లక్ష్మణుని గ్రుచ్చి గ్రుచ్చి యడుగుచుండిన సీతాదేవితో ఏమి చెప్పవలెనో తెలియక ఆలోచించి అసలు విషయమునే నెంతకాలము దాచినా చెప్పక తప్పదని తీర్మానించుకొని తన చేతులు జోడించి సీతకు నమస్కరించుచు కన్నుల యందు నీరు కాలువలై పారుచుండగా

లక్ష్మణుడు : ఓ తల్లీ! ఇంతటికి పూనుకొని వచ్చి యున్న నేను నీతో చెప్పక యెట్లు పోగలను. చెప్పెద వినుము. రాక్షసుని చేత చెఱబోయిన సీతను రామచంద్రుడు మరలా తెచ్చుకొని యేలుచున్నాడు. ఆయనకు భార్యపైన ఎంత మోహమో కదా! అని ప్రజలు ఎగ్గులు బల్కుచున్నందున ఆ నిందను బాపుకొనుటకై నిన్ను దీసికొని పోయి అడవులలో విడిచి రమ్మని నన్నాజ్ఞాపించి యున్నాడు. కావున ఆ మహాతపోధనులైన మునీంద్రులు చాలా దయా మయులు. వారాశ్రయించి జీవించుచున్న అడవులలోనే ఇక నీవు కూడా కాలము వెళ్ళబుచ్చుము. నీవుండుటకు, వినుటకు అర్హములు కాని మాటలను నీకు నేనిపుడు వినిపించుటకు నానాల్క సిద్ధమైనది. నీయనాదతనమును జూచి నా మనస్సిష్టపడినది. కావున నేనెంత సాహసవంతుడనో ఆలోచింపుము.

నిందలు భరించలేని రామచంద్రుడు నిన్నడవులలో విడిచి రమ్మని నన్నాజ్ఞాపించినాడు. ఈభయంకర కీరారణ్యమునే నీవిక పూతోటగా భావించుము. భయంకరమైన మొసళ్ళు, పాములు గల మడుగులు నీవిక జలక్రీడలాడుకొనే తామర కొలనులు. దట్టమై గట్టిగా గుట్టలుగా నున్న మిట్ట ప్రదేశములు నీకిక చంద్రకాంతపుటరుగులు. అయ్యయ్యో ఇట్టి ప్రదేశములలో వంటరిగా నీవిక్కడెట్లుండగలవు! ఈ నీ నివాసమును గూర్చి నేనమని చెప్పగలను!

ఓ తల్లీ! నీవు మహాపతివ్రతవు. నీ నడవడి ఇతర స్త్రీలకు పూలబాట. కావున ఆ రామచంద్రుని పాదములందే నీవు మనస్సు నిల్పి నీవిందుండుము అని తెలుపుటకు నేనెవడనో తెలియునా! నీ భర్త నుండి నిన్ను విడదీసి అడవులకు దీసికొని వచ్చి నన్నీయడవిలో వంటిరిగా విడిచి నేనిక ఊరికి పోయి వచ్చెదను సెలవిమ్మని నీ సెలవు గోరుచున్న పాపాత్ముడను. లక్ష్మణుడను అని సీతమ్మకు లక్ష్మణుడు వినిపించగా విని మొదలు నరుకగా కూలిన అరటి చెట్టు వలె సీతాదేవి నేలబడి ఓ తల్లీ యని గట్టిగా అరచుచు నేడ్చుచుండెను.

సీతాదేవి భూమిపైబడి యేడ్చుచుండగా ఆమె కన్నుల నుండి నీరు ధారాపాతముగా గారుచుండెను. ఆమె కొంతసేపు యేడ్చును. ఆయేడ్పును చాలించి మౌనము వహించును. మౌనము చాలించి నవ్వును. నవ్వును విడిచి తలయూడించును. పరధ్యానముగా ముక్కు మీద వ్రేలు వేసికొనును. ఉలిక్కిపడి మరలా అయ్యో హా! హా! యని తల్లవని తలవంపులు గలిగెను. లక్ష్మణా చూచితివా యని లక్ష్మణునితో ఇట్లనెను.

సీతాదేవి: అన్నా లక్ష్మణా! నీవిటులెందుకేడ్చెదవు. ఇందులో నీ తప్పేమున్నది? రాజుగారగు రామాజ్ఞను నీవు దాటరాదు. కష్టాలను బడుమని ఆ బ్రహ్మదేవుడు నన్నిట్లు పుట్టించి యున్నాడు. విధి దాటరానిది. దానినెవ్వరు తప్పింపగలరు. ఆనాడడవులకు బోయినపుడు పడరాని పాట్లుబడినాను. రారాని బాధలు వచ్చినవి. ఇంతటితో తీరిపోయినవని నమ్మియుంటిని. మరలా ఈ కష్టములు వచ్చునని కలయందైనా నేనూహించి యుండలేదు. మనమయోధ్య నుండి బయలు దేరునపుడు మనకైన దుశ్శకునములు నాకు రాగల కష్టములను సూచించినవి. ఈ కష్టములనుభవించుటకే విధి నాకట్టి కోరిక బుట్టించినది. నేను ముందు జన్మలో ఏ భార్యాభర్తలను విడదీసి వారు కష్టములు బడుచుండగా చూచి సంతోషించి యుంటినో. ఆ పాపము నన్నిట్లు జేయక ఊరక విడుచునా అనాడు కష్టములుగా నాకు కనిపించుట లేదు. ఏలననగా నా ప్రత్యక్షదైవము రామచంద్రునితో కలిసి ఉంటిని. భర్తలేని దాననై ఈ కీరారణ్యములలో ఒంటరీగనెట్లు జీవించగలను?

సమస్త జనులు నన్ను పతివ్రతగా పిలుచుచున్నారని నేను చాలా సంతోషించుచుంటిని. కానీమధ్యలో ఈ కసాయి నిందలు వచ్చి శ్రీరామచంద్రుడు మరలా నన్నడవులకు త్రోసి వేయునని తెలియజాలక పోతిని. లక్ష్మణా ఈ విచిత్రము జరుగుచున్నది. అదియేదనగా పిడుగు కంటే భయంకరమైన మాట నీవనుచుండగా నేను వినుచుండియు నా గుండె పగలిపోలేదు. నా ప్రాణములెగిరి పోలేదు. ఇంకను బ్రతికి యుండుటే ఆ విచిత్రము. ఈ కఠిన హృదయముతో నేను జీవించి యుండి ఇంకా ఎన్ని కష్టములను అనుభ వింపవలయునో కదా, లక్ష్మణా! నీవు వినుట ఏమైనా పొరబాటుగా అయాజ్ఞను వినియున్నావా? ఏనాటికైనా ఆ రామచంద్రుని నేను నన్నా రామచంద్రుడును మరలా చూచుట జరుగవచ్చును. లేకున్న నా ప్రాణములీపాటికి పైకెగరి పోవకనిలచి యుండవు. కావున అక్కడ నీవీ విధముగా నామాటగా తెలియ జేయుము.

ప్రాణనాధునితో సీత చావక బ్రతికి యున్నదనితెలుపుము. ఆమె గంగానది మడుగు చెంతనే యున్నదనుము. నిన్నెప్పుడు మరచిపోదని తెల్పుము. అత్తగారిని ముగ్వురిని బంధుమిత్రులను ప్రజలను నేనడిగినట్లు తెలుపుము. నీవింక పోయి రమ్ము అని జానకి తెలుపగా లక్ష్మణుడు ఈమెను వంటరిగా అడవులలో విడచి వెళ్ళవలసి వచ్చె గదాయని దుఃఖించుచు వెళ్ళెను.

లక్ష్మణుడు వెళ్ళిన తర్వాత లక్ష్మణుని వైపే జూచుచు వారి రథము కనబడకుండా పోవునంత వరకు చూచుచునే యుండెను. లక్ష్మణుడు వెళ్ళిన వెనుక సీత అడవిలో దుఃఖించి దుఃఖించి అలసి పోయి యేడ్చుచునే యుండెను. ఆయడవిలో వాల్మీకి మునీంద్రునశ్రమమున్నది. యాశ్రమము నుండి కొందరు మునిపత్నులు పండ్లుగోసికొనుటకు ఆ ప్రాంతమునకు వచ్చియుండి సీత యొక్క దుఃఖమును విని వారు పోయి వాల్మీకి మునీంద్రునకు దెల్పిరి. వాల్మీకి తన దివ్యదృష్టితో జూచి జరిగినదంతయు తెలిసికొని ఈమె శ్రీరామచంద్రుని భార్య, జనకరాజు కుమార్తె సీత అని వారికి తెలియజే, ఆ మునీంద్రుడర్ఘ్య పాద్యములు దీసికొని మునీంద్రుల భార్యలను వెంటబెట్టుకొని సీతాదేవి యున్న చోటునకు వెళ్ళుచుండగా అడుగుల చప్పుడు విని సీతపైకి లేచి వాల్మీకి మునీంద్రుని పాదములపై బడెను.

ఇట్లు తమ కాళ్ళపై బడిన సీతను బుజ్జగించుచు, అమ్మా నీవు గొప్ప సద్గుణవంతురాలవని తెలిసి యుండియు ప్రజలు బలికెడు నిందా వాక్యములను భరింపజాలక నీ పతి బాధపడి ఆ నిందను తప్పించుకొనుటకై నిన్నిట్లు పంపవలసి వచ్చెను. నా దివ్య దృష్టితో నేనంతయు తెలిసికొంటిని.

నీ తండ్రి జనక మహారాజు వలె నన్ను భావింపుము. మాయాశ్రమమునకు రమ్ము. నాయాశ్రమము నీదిగా భావింపుము. ఈ మునికన్యలు నీకు సేవలు జేయుచుండెదరు. బుద్ధిమంతులు తమ తెలివిని మరువరుకదా! ఐనను దైవనిర్ణయమునకడ్డు పడుట కెవ్వరికినీ సాధ్యము కాదు.

అమ్మా! నీవెంతటి దానవో తెలిసికొనుటకు నీ తండ్రి జనకచక్రవర్తి బ్రహ్మవిద్యా పారంగతుడు. నీ మామ దశరధుడు మలినము లేని మహామనీషి. నీ భర్త శ్రీరామచంద్రుడు తప్పు జేసెడు వారి శిరచ్ఛేదము సేయువాడు. నీవన్ని ధర్మములు తెలిసిన దానవు. అజ్ఞానమైన దుఃఖమును వదలి పెట్టుము లెమ్ము. నా తపోవనమును నీ ఉద్యానవనమనుకొమ్ము. ఇదిగో ఈ మంచి నీళ్ళతో ముఖమును కడుగుకొనుము అని వాల్మీకి మునీంద్రుడు అనునయ వాక్యములతో సీతనూరడించి ఆమె దుఃఖమును మాన్పి తన ఆశ్రమమునకు దీసుకొనిపోయి మునికన్యలను బిలిచి సీతాదేవి వృత్తాంతమంతయు దెలిపి మీరీమెకు వంతుల ప్రకారము సేవ జేయుచుండవలెనని దెలిపి సీతాదేవిని మునికన్యలకప్పగించెను. వారు భక్తి యుక్తులతో కంటిని రెప్పవలె కాచుచు సీతకు సేవలు జేయుచు కాపాడుచుండిరి.

## లక్ష్మణుడు వాల్మీకాశ్రమంబున సీతను విడిచి మరల అయోధ్యకు వచ్చుట

లక్ష్మణస్వామి! సీతాదేవి నుండి సెలవుదీసికొని గంగానదిని దాటి సుమంతుని చేరుకొని రథము మీద అయోధ్యకు బయలుదేరి పోవుచు సుమంతా! నిష్కారణముగా పరమ పతివ్రతను ప్రజలేమో అన్నారనే సాకుతో అడవులలో విడిచి పోవలసివచ్చెను. లంకలో అగ్ని పరీక్షలో నెగ్గిన భూపుత్రిని ప్రజలు నిందించి రామచంద్రునకెడబాటుగావించిరి. ఈమెనీవిధముగా అడవులకు వెడలగొట్టిన పాపము ప్రజలకా? రామచంద్రునికా? అని లక్ష్మణుడు ఏడ్చుచుండెను.

సుమంతుడు లక్ష్మణునితో నాయనా లక్ష్మణా ఎందుకిటులేడ్చెదవు? ధర్మాత్ముడగు దశరథ మహారాజు తన పురోహితుడైన వసిష్ఠుని జూచుటకు పోవునపుడు నేను రథము తోలుటకై పోయి యుంటిని.

వసిష్ఠాశ్రమములో ఏకవార్షిక మహాయజ్ఞము జరుగుచుండెను. ఆయజ్ఞమును నిర్వర్తించుటకు దుర్వాస మునీంద్రుడు కూడా అక్కడికి వచ్చి యుండెను. మేము కూడా అక్కడికి చేరితిమి. దశరథమహారాజా! మాకు నీవిపుడు అతిథిగా వచ్చియున్నావు అని సన్మానించి కందమూల ఫలములను రాజుగారికిని నాకును యిచ్చి వారును భుజించి సంతోషముగానుండగా ఆసమయమున తండ్రిగారు వారి వద్దకు బోయి నమస్కరించి మహాత్మా! మా రామచంద్రుడెన్నాళ్ళు రాజ్యమేలగలడు. అతనికి కొడుకు లెందరు. అతని ఆయుః ప్రమాణ మెంతకాలము? అతని తమ్ములెట్లు జీవించెదరు? సూర్యవంశము భూమిపైయెంతకాలముండును అని దుర్వాస మహామునిని తండ్రిగారడిగిరి.

**దుర్వాసుడు** : ఓ రాజా! నీ కుమారుడగు రామచంద్రుడు మునీంద్రులు మెచ్చుకొను విధముగా యజ్ఞములను గావించును. పదకొండువేల సంవత్సరములు రాజ్యమేలగలడు. అతనికిద్దరు కుమారులు గలిగెదరు. వారి పెద్ద కుమారునకయోధ్య పట్టాభిషేము గావించి చివరకు బంధువులతోను మిత్రులతోను, పురజనులుతోను, పురోహితులతోను, మంత్రులతోను కలసి ఆనందముగా వైకుంఠమునకు వెళ్ళెదరు. తరువాత అతని కుమారులకు ఒక్కొక్కరికి ఇద్దరు కల్గెదరు. వారు ఇతర రాజ్యములను కూడా పాలించగలరు. సూర్యవంశము చాలా కాలము భూమిపై నిలిచి యుండును. మరియొకవిశేషమును కూడా తెలిపెదను వినుము.

రామచంద్రుడు సీతనెడబాసి చాలా కాలము భూమిపై ఆమె విరహమును పొందెడు కారణమొకటి కలదు. పూర్వమొకప్పుడు రాక్షసులను దేవతలు తరిమిరి. రాక్షసులు భృగమహర్షి భార్య వద్దకు బోయి ఆమెను శరణు వేడిరి. ఆమె వారి కభయమొసగి దేవతలను వారిపై బడనీయకడ్డుకొనెను. అపుడు విష్ణుదేవుడు తన చక్రమునుపయోగించి ఆమె తలను ద్రుంచి వైచెను. అందుకు భృగువు విష్ణువు పై కోపించి ఓవిష్ణుమూర్తీ నిన్ను దేవుడని అందరును పొగడుచుందురు. అట్టి దేవుడవు నీవింత క్రూరుడవై స్త్రీ హత్యనెట్లు గావించితివి. కావున ఈ కొల నీవనుభవింపక తప్పదు. అందువలన నీవు భూమి మీద మానవుడవై పుట్టి నా వలెనే నీవు కూడా భార్యలేని వాడవై నేనెట్లు భార్య లేక బాధపడుచున్నానో అదే విధముగా నీవు కూడా చాలా కాలము విరహ వేదనను భవింపగలవు అని భృగమహాఋషి విష్ణు దేవునకు శాపమొసగి యుండెను. అపుడు ఋషులందరు విష్ణుదేవునకు నీవు శాపమిచ్చుట న్యాయము కాదని తెలుపగా ఆ మహర్షి విష్ణువును ప్రార్థించి తానిచ్చిన శాపమునుపసంహరించెను. ఆ హరిని గూర్చి కథలేవియైనను మేలే గూర్చును. ఆ శాపముననుభవించుటకే ఆ హరినీకు పుత్రుడై జన్మించెను. రామచంద్రుడికమీద భార్యా వియోగమనెడు ఫలితముననుభవింపగలడు. ఆ శ్రీహరి ఈ విధముగా నీకు కుమారుడై జన్మించి యున్నాడనగా నీపుణ్యమేమనగలము. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల కైనను బ్రహ్మ జ్ఞానులగు బ్రాహ్మణులు బెట్టిన శాపము అనుభవింపక తప్పదు. ఈ విషయమును మేము పట్టణము చేరులోపల మీ తండ్రి గారు చెప్పియుండిరి. అదే యిపుడు నేను మీకు తెలుపుచుంటిని.

ఇది ఇంకెవ్వరికిని తెలియదు. నీవు కూడా ఇంకెవ్వరికిని తెలియ నీయవలదు. ఆ రామచంద్రుడు చాలా కాలము వరకు ఇక్కడ చేయవలసిన వన్నియు జేసి ముందు మిమ్ము బంపి తరువాత తాను కూడా ఆ బ్రహ్మ పదము నొందగలడు అని సుమంతుడు చెప్పగా విని లక్ష్మణుడు ధైర్యమును సంతోషమును చెందిన వాడయ్యెను.

ఆ దినము వారి రథము గోమతీ తీరమునకు చేరినది. ఆ రాత్రి అక్కడ విశ్రమించి, మరునాడరుణోదయమున బయలుదేరి మధ్యాహ్నమగునప్పటికి అయోధ్యచేరిరి.

ఈ విధముగా పట్టణ ద్వారమున పోనిచ్చుచు ఎవరి వైపును చూడక తల వంచుకొని రాజమార్గమున రథము వెళ్ళుచుండెను. లక్ష్మణుని దీనత్వము సీతరథములో లేకుండుట చూచి పురజనులు గుంపులు గుంపులుగా చేరి ఒకరితోనొకరిట్లనుకొనుచుండిరి.

అమ్మో! నిన్న మనమనుకొన్న వార్త నిజమని తెలియచున్నది. చూడండి అని ఒకరితోనొకరు గుసగుసలాడువారును, అమ్మో! పండంటి సంసారమును పడగొట్టి పాడుజేయుటకు మన ఊరివారే ప్రయత్నించి పుణ్యము గట్టుకొనిరనువారును, ఇక మన మేనోరు బెట్టుకొని మాటలాడగలమనువారును, ఇంతమాత్రమునకే రామచంద్రుడింత సాహసము సేయవచ్చునాయనువారును, సేయకుండిన ఈయపవాదునెట్లు బాపుకొనుననువారును, ప్రజల నిందా వాక్యములను వినినప్పుడే రామచంద్రుడు కోపముతో పాపపుణ్యములను ప్రజల పై దోసి వేసెనను, వారును మనమాయననేమనరాదు. తెలివిలేని వారై ప్రజలు మొరటుదనముతో నిందించిరను వారును, అట్లు నిందించి పుకారు లేపిన వారింక చల్లగా బ్రతుకనీయనువారును, బంగారు వంటి సీతను నిందించి కారడవులకు ద్రోయించి వీరింక బంగారు బ్రతుకు బ్రతుకనీలేయను వారును, పూచిన తంగేడువలెను. శృంగారించిన రథమువలెను. సీత నిండు గర్భముతో నుండగా నిందించి విడచి రాముడెట్లోర్చి యున్నాడనువారును, ఇంతమంది తనకుండియు దిక్కులేని దానివలె అడవులలోనెంత దుఃఖించుచున్నదో కదా! యనువారును, హా దైవమా! సీతాదేవికి వచ్చిన అగచాట్లు పగవారికి కూడా రాకూడదనువారును, సీతలేని ఖాళీ రథమును చూచినవారు పరిఫరివిధములుగా మాటలాడుచుండిరి.

ఏనుగుమొగసాల వద్ద రథము దిగి సుమంతుని బంపి వేసి లక్ష్మణుడు అనేక కక్ష్యాంతరములు గడిచి కావలసినవన్నీ యుండియు దేవుడులేని దేవాలయమువలె సీత లేక బోసి పోయిన అంతఃపురములో రామచంద్రుడు సీతను గూర్చి చెప్పుకొనుచు దుఃఖంచుచున్న రామచంద్రుని జూచి లక్ష్మణుడాయన పాదముల పైబడి దుఃఖింపసాగెను. రామచంద్రుడు లక్ష్మణుని తన చేతులతో లేవనెత్తెను. లక్ష్మణుడు కన్నుల యందు నీరు దుడుచుకొనుచు రామచంద్రునితో అన్నా తమ ఆజ్ఞానుసారము మా వదినగారిని గంగాతీరమున విడిచి వచ్చితిననగా అది విని దుఃఖించుచున్న రామచంద్రుని జూచి లక్ష్మణు దార్చుచునిట్లనెను.

అన్నా! యీ భూమి మీద పుట్టిన వారికి ఆపదలెన్నియో వచ్చుచుండును. అన్ని సమయములందును సుఖమేయుండదు. మనమెంత యేడ్చినను వచ్చిన యాపదలు తొలగిపోవు. పుట్టినవారు మరణించుట కలిసినవారు విడిపోవుట సహజమే కదా! చిన్మయ శరీరుడవగు నీకు తెలియనిదేమున్నది. నీ వంటి మహనీయులు పామరునివలె దుఃఖించుట సరికాదు. ఆత్మజ్ఞానముతో నాలోచించినచో నిన్ను వినా ఇతరమైనదేమున్నది. సచ్చిదానందమూర్తివగు ఆ పరమాత్మ నీవే కదా! నీ సంకల్ప బలము వలన ఈ సమస్త జగత్తు నడచుచున్నది. ఈ జగత్తునకుపదేశ మొసగు మొదటి గురువు నీవై యున్నావు. నీకు బోధించునంతటి వానినికాను. కానీ ఈ సమయములో నా విద్యుక్త ధర్మమును నేను నెరవేర్చుచున్నాను. పంచభూతములన బడునవన్నియు నీవే. ప్రపంచములో గల సమస్త చరాచర కోట్లన్నియు నీవేయైయున్నావు. కావున సీత కూడా నీవే కదా! అట్లయినచో సీత నిన్ను విడిచి ఎక్కడికి పోయినది. ఎక్కడికి పోగలదు మీరిట్లెందుకు దుఃఖంచెదరు. నిన్ను తెలిసికొన్న జ్ఞానులందరును శత్రువుల యందు గాని, మిత్రుల యందు గాని, భార్య యందు గాని, బంధువుల యందు గాని, ఎన్నియో విన్నను మోహమును విడిచి విరాగులై యున్నారు. ఆయాత్మారాముడగు రామచంద్రుడే భ్రమలో బడి భార్యను గూర్చి యేడ్చుచున్నాడు. ప్రజలను పాలించుట మరచి పోయి యున్నాడని మఱియొక విధముగా ప్రజలు నిందింతురు కదా! కావున మీరీ విధముగా దుఃఖించుట తగదు అని లక్ష్మణుడన్నకు బోధించగా విని రాముడు తన దుఃఖమునుప సంహరించుకొని లక్ష్మణుని ముఖమును ప్రసన్న దృష్టితో జూచిఅతని సందోర్భచితమైన బోధకు మెచ్చుకొనెను.

**రామచంద్రుడు:** అన్నా లక్ష్మణా నాలుగు దినముల నుండి నేను కొలువుకు వెళ్ళలేదు. ఇపుడు నీవు చేసినప్రబోధతో నాకు స్వస్థత చేకూరినది. కావున రేపటి నుండి ప్రజా పాలనకు సభకు వెళ్ళెదను. రాజైన వాడు సజ్జనులను కాపాడుచు దుర్జనులను శోధించి శిక్షించుచు ప్రజలు అక్కడక్కడ సేయు విన్నపములను తెలిసికొని పరిష్కరించుచు రాజ్యపాలన గావించిన రాజులను స్తుతింతురు. మరచిన రాజులను ఈ లోకములో నిందింతురు. అతడు మరణించిన వెనుక ఆ లోకమున నరకమునుభవించవలసి యుండును. రాజైనవాడు నేను పుణ్యాత్ముడను నాకేమి తక్కువ అని హజాజరమునకు వెళ్ళక ఇంటిలోనే యుండి ప్రజలు తెలిపెడు విషయమును తెలిసికొనక యుండెనేని అతనికి కీడు గలుగును. కావున దీనికుదాహరణగా నొక కథగలదు.

ఆ కథ: నృగుడనునొక మహారాజు గలడు. ఆ నృగుడు మంచి కీర్తి, సాధుజనుల పై భక్తి, శత్రుజయముగలవాడు. అహంకారము లేని సత్య వాదియను పేరునొందెను. అతడు బంగారు ఆభరణములను, దూడలుగల గోవులను బ్రాహ్మణులకు దానము సేయుచుండెను. అయన దానము సేయుచున్న గోవులలో ఒక ఆచారవంతుడగు బ్రాహ్మణుని ఆవు దూడ చేరి యుండెను. ఆయన అది తెలియక ఆ యావును దూడను కూడా ఒక బ్రాహ్మణునకు దానమిచ్చెను.

ఈ గోవును పోగొట్టుకొన్న బ్రాహ్మణుడు ఎక్కడెక్కడనో తిరిగి ఒకనాడు కనకల అను దేశమునందొక బ్రాహ్మణుని యింటిలోనున్న ఆవును, దూడను చూచి శబలీ అని అవును పిలువగా ఆయావు తన యజమానిని గుర్తించి దూడతో కలసి అతని వద్దకు వచ్చి బ్రాహ్మణుని చూచుచుండగా ఆ బ్రాహ్మణుడు సంతోషించి తన ఆవు తనకు చేరినది, ఇంకెవ్వరితో నాకేమి పనియని ఆయావును తీసికొని వెళ్ళుచుండెను. ఆయావును దానముగా పొందిన బ్రహ్మణుడు అతనిని చూచి ఆగ్రహోదగ్రుడై ఆ బ్రాహ్మణుని అడ్డగించెను.

ఏమయ్యా పొరుడా! నీకిది తగునా? నా అవును నీవు దుర్మార్గముగా తీసికొని పోవుచున్నావు. ఇది దొంగతనము వంటిది గాక ధీరత్వమెట్లగును? అనుచు అతని జుట్టు విడిపోగా వెంట్రుకలు విరియబోసుకుని అతని పించగోచి జారిపోవుచుండగా అతనితో కలహమునకుసిద్ధపడెను. అపుడాయావును దోలుకొని వెళ్ళుచున్న ఆ బ్రాహ్మణుడు నవ్వుచు ఇది నా గోవు కాక వేరొకరిదైనచో దీనిని తీసికొని పోవుటకు నేనంత వెఱ్ఱివాడనుకాను. ఈ గోవు నిజముగా నాది ఏమందలో కలసిపోయి ఇక్కడికి చేరినదో నాకు తెలియదు. ఈ యావు కొఱకు నేను దేశమంతయువెదకి అలసిపోయి ఇచ్చటికి వచ్చితిని. నీ యింట నా ఆవును చూచితిని అని చెప్పెను. ఆ మాటలు విని రెండవ బ్రాహ్మణుడిట్లనెను. అయ్యా బ్రాహ్మణోత్తమా! ఈ యావును రాజుగారు నాకు దానముగానిచ్చి యున్నారు. నీవిక్కడ చేరి అబద్ధమాడుచున్నావు. కావలసినచో నృగమహారాజు చేత సాక్ష్యమిప్పించెదును అనివారు రాజుగారి దర్శనార్థమై వెళ్ళిరి. ఆ యిరువురును రాజుగారి ద్వారము చెంత చాలాదినములుండినను రాజదర్శనము కానందున విసిగి కోపించిన వారై ఓరాజా! నీవు ప్రతి దినము సభకు వచ్చి ప్రజలకు దర్శనమిచ్చి వారి సుఖసౌఖ్యములకు తగిననట్లుగా నేర్పాట్లు

చేయవలసిన బాధ్యత గల వాడవైయుండగా దానిని విస్మరించి మదోన్మత్తుడవై రాజ హజారమునకు రానందున నీవు ఊసరవెల్లివై పుట్టెదవు గాక! అని శాపమిచ్చి వెళ్లిపోయిరి.

వారట్లు శాపమిచ్చినది ద్వారపాలకుల వలన నృగుమహారాజు విని చాలా చింతించి తన్నాశ్రయించిన వారికి మంత్రులకును స్నేహితులకును వజ్రాయుధము వంటి బ్రాహ్మణుల శాపమును వినిపించి తక్షణమే తన కుమారుని పిలిపించి అతనిని సమస్త రాజ్యమునకును రాజును గావించి అతనికి రాజనీతులు తెలిపి ధైర్యముగల వాడై చలి, మంచు, గాలి, ఎండ, చేరనీయని పలుకల గట్టు చేయించి, దానిని కనబడనీయక పుట్టలు, పొదలు, దట్టమై యుండునట్లు ఏర్పాటు చేసి తన నిజస్వరూపమును వదలి ఊసరవెల్లి రూపములో అతడక్కడ బాధపడుచుండెను. ఆ నృగు మహారాజిపుడున్నాడు. కావున మత్తుడైన ఆ నృగు మహారాజు ఆ విధముగా కీడు పొందెను.

పూర్వము కృతయుగము నందు సూర్యవంశములో పుట్టి నిమియను రాజొకడుండెను అతడు శత్రువులను జయించుట యందు చాలా నిపుణుడు, గౌతమ ముని ఆశ్రయముచెంత ఒక పట్టణమును నిర్మించి అపట్టణమునకు వైజయంత మను పేరుపెట్టి రాజ్యమేలు చుండెను. ఒకనాడు బృహస్పతితో సమానమైన తమ గురువుగారగు వసిష్టుల వారితో స్వామీ నేను యజ్ఞము సేయదలచితిని. మీరు దీని బాధ్యత వహించి నిర్విఘ్నముగా నెరవేర్చవలెనని వేడుకొనెను. అది విని వసిష్టుడు, రాజేంద్రా నన్ను దేవేంద్రుడు ముందే పిలిచియున్నాడు. అందువలన అది ముగిసిన తరువాత నీ యజ్ఞమునకు వచ్చెదను. చెప్పిన మాటతప్పుట న్యాయము కాదుకదా! అనెను. వసిష్టుడు ఇట్లనినందున నిమిక్రోధముగల వాడై గౌతమ మహర్షిని యజ్ఞమునకు కర్తగా నియమించెను. వెంటనే భృగువు, అత్రి, చ్యవనుడు, మున్నగు ఋషులను పిలిపించి వారిని ఋత్విక్కులుగా నుండునటుల ప్రార్థించి వారి యాజ్ఞానుసారము హిమాలయ పర్వతములకు పడమర దిశయందు యజ్ఞశాలలు నిర్మించి ప్రపంచమున జనులు మెచ్చునటుల సత్రయాగము జరిపించెను. ఇట్లు నిమి ఐదు వేల సంవత్సరములు అడిగిన వారికి లేదనకుండా శ్రేష్ఠమైన మణి భూషణములును, పట్టువస్త్రములను అన్నదానములను గావించి అడుగ వచ్చిన వారందరినీ తృప్తిగావించెను. కావున అతని కలిమి ఇంతటి దని చెప్పుటకు సాధ్యముకాదు. ఇట్లుండగా అంతకు ముందే దేవేంద్రుని యజ్ఞము ముగిసినందున వసిష్ఠుడు ఇంద్రుని వలన పూజింపబడి

భూలోకమునకు వచ్చి నిమి యజ్ఞము సేయుచున్నాడని తెలిసికొని కోపముతో వారి కుల గురువగు తమను విడచిదురుద్దేశముతో వేరొకరిని గురువుగా పెట్టుకొని నిమి యజ్ఞము సేయుచున్నాడు కదా! వీని కింతకండకావరమా! నేనది తొలగించెదను అని నిమి యజ్ఞము సేయుచున్న యజ్ఞశాల ద్వారము వద్దకు పోయినిలిచి యుండెను. యజ్ఞమును నిర్వర్తించిన నిమి పగటికాలమందు అలిసిపోయి అంతఃపురములోనికి దూరబోవు చుండెను. వసిష్టుడు వచ్చి తన ద్వారము వద్ద నిలిచియున్నాడని అతనికి తెలియదు. ప్రమత్తులైన వారికి ఎరుక అనునది ఉండదుకదా! ఈ విధముగా ముహూర్త కాలము వసిష్ఠమహర్షి ద్వారము వద్ద నిలచియుండి. అతడుతన వద్దకు రానందుకు కోపించి మన్మథుని శరీరమును కాల్చివేసిన రుద్రునివలె మండిపడి వీడునన్ను విడిచి, యజ్ఞము సేయుచుండియు. ఈ క్రూరుడివ్వుడైనను నావద్దకు రాలేదు. కావున వీడు శరీరము లేనివాడై తిరుగు చుండుగాక అనిశాపమిచ్చెను. వసిష్ఠుడిచ్చిన శాప మహిమయెట్టిదో గాని నిమి మహారాజు శరీరము జీవి నుండి విడిపోయి. అతని శరీరమును వదలకుండుటచే అతని శరీరమునుండి నిద్రకూడ వదలిపోయెను. నిమి మహారాజు నిద్రనుండి విడివడగానే తమకు వసిష్ఠుడిచ్చిన శాపమువిని ఈ వసిష్ఠుడునన్ను అకారణముగా శపించినాడని అతను కూడ నావలెనే శరీరములేనివాడగును అని నిమి తిరిగి వసిష్ఠునకు ప్రతి శాపమిచ్చెను. ఇట్లు నిమి వసిష్ఠుడు ఒకరికొకరు శాపము లిచ్చుకొనుటవలన ఇద్దరు శరీరములేని వారలైరి. శరీరము లేనందు వలన వసిష్ఠుడు దుఃఖితుడై బ్రహ్మదేవుని వద్దకు బోయి నేను వసిష్ఠుడను అని ఆయనకు దెలుపుకొని ఓ తండ్రీ! నిమి యిచ్చిన శాపము వలన నేమస్థూల దేహమును వదలి సూక్ష్మ దేహముతో నిక్కడికివచ్చితిని. ఇకనాకు స్థూల దేహము వచ్చు ఉపాయమును తెలిపి నేనెక్కడ జన్మించవలెనో నాకానతిమ్మని దీనుడై ప్రార్థించెను.

వసిష్ఠుని వాక్యములను విని దయామయుడై నాయనా! వసిష్ఠా నీవిపుడు మిత్రవరుణ తేజస్సులలో ప్రవేశించి వారి వలన అయోనిజుడవై పుట్టుమని చెప్పెను. వసిష్ఠుడు బ్రహ్మ యాజ్ఞానుసారము వరుణాలయము చేరి యుండెను. ఆ మిత్రావరుణులిద్దరును సముద్రపు ఒడ్డున తిరుగుచుండిరి. అచట ఉర్వశి యొక శృంగారమైన వనములో దిరుగు చుండెను. అందులో ఊర్వశి మిత్రునివైపు వలపు చూపుగ జూచెను. ఆమెకో అచూపుల కతడు సమ్మోహితుడై, మన్మధ ప్రేరితుడై యామెను కూడెను. ఆ సమయమున మిత్రుని నుండి వీర్యము జారగా ఆ వీర్యమును దీసి ఒకకడవలో భద్ర పరచి తరువాత ఊర్వశి వరుణనితో.

ఓ వరుణదేవా! నన్ను ముందుగా మిత్రుడు భార్యగా స్వీకరించెను. కావున నన్ను చూచుటకు నీకిష్టమగునేని నా శరీరమును జూచియనుభవింప వచ్చును. అనిచెప్పగా ఆమె ఒయ్యారములకు మెచ్చుకొని ఓపిక పట్టజాలక ఊర్వశితో సుఖించెను. అతనికి ఇంద్రియస్కలనమయ్యెను. ఆయింద్రియమును ఊర్వశి ఇదివరకు ముందు మిత్రునింద్రియమును భద్రపరచి యున్న కడవ యందు వరుణుని ఇంద్రియమును కూడ భద్రపరచెను. ఇట్లు వరుణునిగలసిన ఊర్వశిని జూచి మిత్రుడు ఓ యువతీ ముందు నాతో గలసి మరలా వరుణునితో గలియుట ధర్మమా? కావున నీవు భూలోకమున నివసించుచు పురూరవునకు భార్యవైనిందను బొందెదవుగాక యని శపించెను. ఆకడవలో నుండిన వీర్యమునందు ముందుగా అగస్త్యముని జన్మించెను. తరువాత వసిష్ఠుడు జన్మించెను. ఇట్లు పుట్టిన నీరువురిలో అగస్త్యుడు తపస్సునకు బోయెను. ఇక్ష్వాకు మహారాజు వసిష్టునితన కులగురువు గాదీసికొనెను. ఇది వసిష్ఠుని జన్మవృత్తాంతము.

ఇక నిమి వృత్తాంతమును చెప్పెదమ వినుము. వసిష్ఠుని శాపమువలన నిమి తన శరీరమును వదలెను. ఆశరీరమునకు మణిభూషణములలంకరించి సుగంధద్రవములను బూసి పూల మాలలు వేసి భద్రపరచి యజ్ఞాధిపతులు ఋషులు దయతో ఆయజ్ఞమును పూర్తి చేసిరి.

**నిమి:** దేవతలారా శరీరధరులగు వారందరి కన్నుల యందుండ వలెనని నాకోరిక. అనియడుగగా నీయిష్టము వచ్చినట్లేయగుగాకయని వారాశీర్వదించిరి. ఆ విధముగా నిమి అందరి నేత్రములయందు నివసించుట వలన ఆ శరీరము నుండి మహాగుణసంపన్నుడగు మహారాజు జన్మించెను. ప్రాణములేని శరీరము నుండి పుట్టుటవలన జనకునకువిదేహుడను పేరుగల్గెను. మీధించిన దేహము నుండి పుట్టిన వాడగుట వలన జనకునకు మిధి పేరు కూడ కలదు. అది నిమి నిమధించినదైనందునను. ఆయన గట్టించిన పట్టణమైనందు వలనను ఆనగరము మిధిలానగరము అనిరామచంద్రుడు చెప్పగావిని లక్ష్మణుడు ఆశ్చర్యము పొంది అన్నగారూ! ఆనిమి ఇంతటి గొప్పవాడైయుండియు శాంతి వహింపక కోపము గలవాడై గురువుగారికి ప్రతి శాపమునియ్యక, ఓర్పుగలిగియుండె నేని అభివృద్ధి చెందియుండెడువాడు కదా! అనియడగగా రామచంద్రుడిట్లనెను.

లక్ష్మణా విను. కోపమెవ్వరికైనను అంతశ్శత్రువగును. కావున దాని నుండి విముక్తుడై ఓర్పుగలిగియుండుటకు ఎవరికి నీ సాధ్యముకాదు. అది యయాతి అనురాజునకు మాత్రమే చెల్లినది. కావున కీర్తి పొందిన అతని వృత్తాంతము తెలిపెదను వినుము.

అవినీతిపరుడగు నహుషుని కుమారుడగు యయాతికి శర్మిష్ఠయను భార్య యందు పూరుడును, దేవయానియను భార్యయందు యదువును జన్మించిరి. తరువాత యయాతి వృషపర్వుని కూతురు శర్మిష్ఠయందు ప్రీతిగలవాడై శుక్రాచార్యుని కుమార్తె దేవయానిని నిర్లక్ష్యము సేయుచుండెను. అందువలన తండ్రి వద్దకు దేవయాని బోయి అతని పాదములపైబడి యేడ్చుచు తనకు భర్త వలనగలుగు పరాభవమును తన సవతికి శర్మిష్ఠకు గలుగుచున్న గౌరవమును దెల్పియేడ్చుచుండగా తన కుమార్తెను శుక్రచార్యుడు బుజ్జగించుచు అమ్మా నీవు దుఃఖింపవలదు యౌవన గర్వమువలననిన్ను తిరస్కరించిన రాజు ఇకమీదట ముదుసలివాడై పోవును గాక! అనిశుక్రాచార్యుడు యయాతికి శాపమిచ్చెను. తమ మామగారు తనకు శాపమిచ్చినను ఆయనపై కోపింపక ఎంత శాంత మూర్తియై యుండెనో నీవాలోచింపుము.

ఇట్లు తనకు ముదుసలి తనము సంభవించియు చంద్రవంశీయుడగు యయాతి స్త్రీ భోగలాలసుడై తనపెద్ద కుమారుని యౌవనమును తానుతీసుకొని తన ముదుసలి తనమును తన కుమారునకొసగి యౌవన పురుషుడై తన యిద్దరి భార్యలతో చాలాకాలము సుఖించెను. ధర్మ పద్ధతిలో ప్రజలను పాలించెను. ఆయన దానధర్మములు యజ్ఞములు జేసి తరువాత తన ముదుసలితనమును తాను దీసికొని కుమారుని యౌవనము నతకిచ్చివెచి అతనినే రాజ్యమునకు రాజునుగా జేసి తానుతపోవనమునకు బోయెను.

యదువు తండ్రిమాటలకెదురాడినందున అతడు రాజ్యమేలుట కర్హుడు కాలేదు. తండ్రిమాటలు వినని కుమారులకు కీడు రాకుండునా. తరువాత పూరుడు రాజ్యపాలనగావించి చంద్రవంశమునకు కర్తయై ప్రతిష్ఠాన పురమును పాలించుచు తన తండ్రివలెనే తానుకూడ కీర్తి గడించెను.

నిమి తమగురువైన వసిష్ఠునకు ప్రతిశాపమొసగి దానివలన తనకు గల్గు బాధనను భవించెను. యయాతి తమ మామగారగు శుక్రచార్యునకు ప్రతిశాపమిచ్చు శక్తి తనకుండియు. ఇవ్వక ఓర్చి నందు వలన క్షత్రియ ధర్మము నమష్టించి మరలా యౌవనము సంపాదించి రాజ్యమేలెను. కావున అట్టి యయాతిని కీర్తింపవలెను కదా! అని శ్రీరామచంద్రుడు లక్ష్మణునకీకథలను జెప్పుచు ఆరాత్రి అటులనే గడిపివేసెను.

## శ్రీరామునితో బిక్షుతాడితమైన శునకము తన వృత్తాంతము దెలుపుట

మరునాడుదయముననే లేచి కాలోచిత కృత్యములు దీర్చి శ్రీరాముడు సభకు వచ్చెను. పౌరులందరిని బలుకరించి మీకేమైనా కొరతలున్నచో తెలియజేయుడని లక్ష్మణుడడుగగా, మాకేమి కొఱతలు లేవని సభలోని వారు బదులు చెప్పిరి.

ఇట్లుండగా ఎక్కడ నుండియో ఒక కుక్క అక్కడికి వచ్చెను. దానితల మీదనుండి నెత్తురు ధరాపాతముగా కారుచుండెను. నడచుటకు శక్తిలేనిదై తూలితూలి పడుచుండెను. ఎట్లెట్లో వచ్చి శ్రీరాముని ద్వారమునందు నిలిచి అఱచుచుండెను. ఇట్లరచుచున్న కుక్కను లక్ష్మణుడుచూచి ఆ కుక్కదగ్గరకు బోయి నీతల యిట్లు పగులుటకు కారణమేమియని యడిగెను.

కుక్క లక్ష్మణునితో దిక్కులేని వారికి దిక్కైయున్న రామచంద్రునకు దప్పనేనితరులకు చెప్పనన్నది. లక్ష్మణుడు పోయి జాగిల విషయము రామ చంద్రునకు చెప్పెను. ఆకుక్కను లోనికి ప్రవేశట్టుమని చెప్పగా లక్ష్మణుడా కుక్కతో నిన్నురామచంద్రుడు లోనికి రమ్మనుచున్నాడని తెలిపెను.

ఆకుక్క అదరుచు స్వామీ! ఆ సభలో బ్రహ్మణులు ఋషులు మహాత్ములున్నారు సభలోనికి నన్ను రమ్మనుట ఆ దయామయునికి గలిగిన సమత్వబుద్ధిని సూచించున్నది. అది ఆ మహానీయునకే చెల్లినది. ఐనను నేను ఆ సభ లోనికి వచ్చుట కర్హుడనుకాను. అనగా లక్ష్మణుడు కుక్క యొక్క అభిప్రాయమును తెల్పెను. అదివిని రామచంద్రుడు సింహాసనముదిగి తానే కుక్క వద్దకు వచ్చెను. ఆ ద్వారము వద్ద తలపగిలి నెత్తురుగారుచున్న కుక్కను చూచినీవేల ఇక్కడికివచ్చితివి? నిన్ను ఎవడిట్లుకొట్టి నొప్పించెను చెప్పుమని రామచంద్రడడుగగా.

**కుక్క:** ఓ సూర్యవంశాధిపా రామచంద్ర ప్రభూ! కుక్క ఇక్కడికెందుకు వచ్చినది. వచ్చెను పో నేనక్కడికెందుకు వెళ్ళవలెను. అని తిరస్కరించకదయాశాలివై ఈ ఋషులందరు నిన్ను సేవించుచుండగా వారితోగలిసి క్షుద్ర జంతువైన నన్ను పరామర్శించుటకు నీవిక్కడికి వచ్చియున్నావనగా నీభూతదయ ఇంతటిదని చెప్పటకు మాటలు చాలవు ఊహకందదు. నీవు వారధి కట్టినప్పుడు బలశాలురైన హనుమదాదుల వానరులకంటె ఉడుతను గొప్పగలాలించి శుక్రుడు వామదేవుడు మొదలగు ఋషులకే కాక జటాయువు అనేపక్షికి కూడ మోక్ష మిచ్చితివి. భరతుని క్షేమము తెలియగోరితివి. శబరి అనుబోయస్త్రీ ఇచ్చిన ఆమె యెంగిలిపండ్లు భక్షించితివి. భరద్వాజుడిచ్చిన ఇష్టమ్యష్టాన్న భోజనము కన్న శబరి యిచ్చిన యెంగిలి

పండ్లకే ప్రాధాన్యత నిచ్చినావు. దొర్వైనెనీ యందు హెచ్చుతక్కువలనే భావములు పక్షపాతములనునవి లేక సమాన సమాజమును నిర్మించుటకును బాధలు పడువారి అవస్థలను విని వారిని కాపాడుటకును నేనున్న చోటునకే మీరు వచ్చి, నన్ను విచారించుటయే దీనికి ప్రత్యక్ష సాక్ష్యము. నీకటాక్షమును ఎవడు కోరి ఆశ్రయించినను నీవువారికడకేబోయి రక్షించుట నీ మహాగుణము.

ఓ రామచంద్రా! ఇంద్ర అగ్నియమ నైరుతి వాయువు కుబేరాదులు ఈశాన్యాది అష్టదిక్పతులును సూర్యచంద్రాదులును. నీయంశ యందు జన్మించిరి. నీవా శ్రీహరివి. పరాత్పరుడవు దయాశాలివి దుర్మార్గులను శిక్షించుటకీభూమి మీద జన్మించితివి. అట్టి మహాత్ముడవగు నిన్ను చూచుటవలన నా జన్మధన్యమయ్యెను.

రాజులకు సాధువులను రక్షించుట సహజధర్మము. కావున నావిన్నపమా లింపుడు. నేనెవరికేకీడును సేయక ఈ పట్టణములో తిరుగు చుండెదను. అదేమిచిత్రమోగాని ఈ దినమొక బిక్షకుడు నిష్కారణముగా నాతలపగులగొట్టినాడు. కావున ప్రభువులైన మీరు బిక్షుని బిలిపించి విచారింపుడని కుక్క చెప్పగా విని రామచంద్రుడు బిక్షువును పిలిపించెను.

**రామచంద్రడు:** బిక్షువుగారూ! ఈ కుక్కకును నీకును విరోధమేమైనా యుండెనా? –

**బిక్షువు:** లేదండీ మాకు పూర్వవిరోధాములేదు.

**రామచంద్రడు :** ఐతే దీనితల నెందుకు పగలగొట్టితివి. ఇది నిన్నే మన్నది మొరుగుచు కరుచుటకేమైనా వచ్చినదా?

**బ్రాహ్మణుడు:** లేదండీ! అట్లు రాలేదు. కానీ నేను భిక్షమెత్తుకొనుటకు ఊరిలో తిరుగుచుంటిని. నేను వీధులలో తిరుగునపుడు ప్రతి వీధిలోను నేను పోవుత్రోవలో అడ్డముగా నిలిచియుండును. అది తొలగదు. నేనే తొలగిపోవలెను. ఈ విధముగా నాకు విసుగుబుట్టించినది.

**రామచంద్రడు :** అయ్యో! నీవు బ్రాహ్మణుడవై పుట్టియున్నావు. శత్రువు వంటి పెద్దకోపమును జయించలేక పోతివా? ఇదెక్కడి సన్యాసి తనము. ఇదేమి వైరాగ్యము. అది నీకడ్డు దగిలి విసిగించినదనుచున్నావు. కుక్క లకది సహజగుణము నీకు ఓపిక నశించి పోవునంతవరకు నీకడ్డు తగిలిన దనుచున్నావు. అది నీకడ్డు రావలెనని రాలేదు. నిన్ను చూచి కొంచెము త్రోవ తొలుగ లేదన్నచో దానిని కొంచెము భయపెట్టవలెను. దానికి అపాయములేకుండా సామాన్యమైన రెండు దెబ్బలు వేసి

భయపెట్టియుండిన సరిపోయి యుండును. తప్పుకు మించిన దండన చేసితిని. తలపగుల గొట్టినావు. కోపమును జయించిననేగాని సన్యాసివి కాలేవు నీవు బ్రాహ్మణుడవు కాని దీనికి నీ సమాధానమేమి? అనెను.

**బిక్షువు:** ప్రభూ! మీరు చెప్పినదంతయునిజమే. ఆగ్రహముండవచ్చు కానీ దురాగ్రహముండ కూడదట. నాదురాగ్రహము వలననే దీని నింతగా కొట్టి యున్నాను. నాకు తగిన దండన మీరు విధింపవచ్చును. ఇతడు బ్రాహ్మణుడు కదా! అని మీరుదండించక విడిచిన నన్ను యమధర్మరాజు దండించును. కావున నన్ను మీరు దండించండి. అని బిక్షువు శ్రీరామునకు విన్నవించెను.

ఇతనికేదండన విధించవలెనని రామచంద్రుడు ఆలోచించు చుండెను. అంతలో ఆజాగిలము దేవా! కాలాంజనమను పర్వతముపై గల దేవాలయమునకు ఈ బిక్షువును పాలకుడుగా నియమింపుడు. అతనికదియే తగిన దండన అని చెప్పగా రామచంద్రుడు నవ్వుచు ఆభిక్షుకునప్పడే దేవాలయమునకధికారిగా నియమించి, దానికతనిని పరిపాలకుడుగా నియమించి అభిషేకము జేయించి అతని నొకపట్టపుటేనుగుపై నెక్కించి, కాలాంజన పర్వతమునకు బంపివేసెను.

**మంత్రులు:** ఓ రామప్రభూ! తప్పుచేసిన బ్రాహ్మణ డొక పర్వతమునకు మరియు దేవాలయమునకు ప్రభువాయెను. మనము కూడ ఇట్టి తప్పులను ( అనగా కుక్కలను గొట్టి) తప్పుచేసితిమేని ఒక్కొక్క దేవాలయమునకధికారికాగలమని తక్కిన బ్రాహ్మణులు ఇదే మార్గమునవలంభించవచ్చును. మరేతప్పులైనా చేయవచ్చును. అందువలన బ్రాహ్మణులందరును అధికారకాంక్షతో కుక్కలను కొట్టుటయో మరే తప్పులైన సేయుటయో సేయవచ్చును కదాయని రామచంద్రునకు విన్నవించిరి. అదివిని శ్రీరాముడు నవ్వుచూ నేను చేసిన పని మంచిదో కాదో మీకు కుక్కయే సమాధానము చెప్పగలదు.

**అనగా:** కుక్క ఓ రామచంద్రా! లెక్కబెట్టినచో ఇప్పుడు మీరతనికి వేసిన శిక్ష కంటె అవమానములేదు. కుక్కకు మూడు జన్మల స్మృతి కలిగియుండునను సామెత మీరు వినియుందురు. కుక్క పడుకొనునప్పుడు తనచుట్టు తానుప్రదక్షణగా మూడుచుట్లు తిరిగి పడుకొనుట కూడ మీరు చూచియుందురు. నేను పూర్వ జన్మలో బ్రాహ్మణుడను నేనొక దేవళమునకధికారినై యుంటిని. నేను హద్దులు మీరి ప్రవర్తించుచు నేనెంత తినవలెనో అంతేతినక దేవుని సొత్తులెక్కువగా తిన్నాను. ఇప్పుడీ కుక్కగా పుట్టవలసి వచ్చినది. ధర్మకర్తలు అధర్మమునకు పాల్పడకుండా

ఉంటే స్వర్గము, అధర్మానికి పాల్పడితే నరకము ఇటువంటి జన్మలెత్తుట జరుగుచుండును. కావున మీరు చెప్పబోవు శిక్షకంటే అతనికినేను చెప్పినదే గొప్పశిక్షయని భావించి దేవుని సొత్తును, బ్రాహ్మణుని సొత్తును అన్యాయముగా తినుట పాపము అది వంశమును అడవిని కాల్చివేయును.

నేను దేవాలయము పారుపత్తెమునకు పూనుకొని సాధుజనుల సేవ జేయుచు దీనులనుద్ధరించుట అనునది చేసియుంటిని. కావున కుక్క జన్మమెత్తియు నా పూర్వజన్మములో బ్రాహ్మణుడను సంగతి మరువక ఎవరినిగానీ ఏమియు అనక సాధు వృత్తిలోనుంటిని. మనుష్యుడు మరియు బ్రాహ్మణుడై యుండియు కుక్క కన్న హీనమగు కోపము కలిగి ఈ క్రూర బ్రాహ్మణుడు ఆలోచనతో జాగ్రత్తగా భయభక్తియుక్తులతో పనులుచేసి పాపములకు గురిగాక కడతేరలేదని తన పూర్వజన్మప్రకారమును తెలిపి రామచంద్రునకు ప్రదక్షిణము చేసి ఆయన వద్ద సెలవు దీసికొని కాశికిపోయి అచట నిరాహార దీక్షనుబూని కృశించిన శరీరమును వదిలి తరువాత మోక్షము బొందెను.

రామచంద్రుడీవిధముగా కుక్కను కొట్టిన బిక్షువునకు దేవాలయాధి కారమిచ్చి, కుక్కనాశీర్వదించి యెప్పటియట్లు సభనుండి ప్రజల సమస్యలను దెలిపికొనుచు వారికి కావలసిన సౌకర్యములను సమకూర్చుచు ధర్మయుక్తముగా తీర్పులు జెప్పుచు రాజ్యపాలనము సేయుచుండెను.

ఇట్లుండగా ఒకనాడు చ్యవన మరీచి పులస్త్య రుచీకాదిమునీంద్రులు వచ్చి రాజసభ ద్వారము నుండి నిలిచినవారిని సుమంత్రుడు జూచి రామచంద్రుని వద్దకు బోయినమస్కరించి స్వామీ! యమునా నదితీరమున నివసించు చ్యవనాది మునీంద్రులు వచ్చియున్నారని తెలుపగ రామచంద్రుడు తొందరగా సింహాసనము దిగి వారివద్దకు పోయి వినయము భక్తి పెనంగొన వారిపాదములకు నమస్కారములు చేసి వారిని తీసికొనివచ్చి తగిన పీఠములనిచ్చి పూజించెను. వారందులకు సంతోషించి వారుదెచ్చిన, పుణ్యతీర్థములను, ఫలములను శ్రీరామచంద్రునకొసగి ఆశీర్వదించిరి.

**శ్రీరామచంద్రుడు:** ఓ పరమమునీంద్రులారా! మనోవ్యాధులను తీర్పజాలిన మీ పాదజలము నాశిరసుపై బడినది. ఇంతేచాలును . నేనును సామంత రాజులును మీసేవకులము. మాకుండబడిన సమస్తమును మీ యధీనములోనిదే మీరువచ్చిన కార్యమును తెలిపినచో తప్పక సేయగలము.

**మునీంద్రులు:** నాయనా రామచంద్రా! ఏకొంచమైనను గర్వములేక వినయ వంతుడ వన్ననీవలె నుండురాజులెవరును నీకుసాటిరారు. మీవంశము వారందరును మహాధర్మాత్ములు. దుష్టులను శిక్షించుట సాధువులను రక్షించుట వారిలక్ష్యముగా జీవించుచుండిరి. నీవు కూడ అదే విధముగా కావించుటకు పుట్టియున్నావు. కృత యుగము నందు మధుండను రాక్షసుడొకడుండెను. అతడు చాలా ధర్మాత్ముడు బ్రాహ్మణులను దేవతలను అతనిని మంచివాడని పొగడుచుండెడువారు.

అమధురాక్షసుడు మహా శ్రద్ధతో ఈశ్వరుని గూర్చి తపముగావించెను. అతని తపస్సునకు మెచ్చి ఈశ్వరుడు వరములు కోరుమనెను. అతడు స్వామీ! ఈనీ శూలమును దయసేయుమని కోరెను. శివుడపుడు తనశూలము నుండి మఱి యొకశూలమును సృష్టించి మధురాక్షసునకొసగెను. ఓమధూ! ఈ శూలమును శత్రువుపై ప్రయోగించునపుడు వానిని సంహరించి మరలానిన్ను చేరుచుండును. నీ మనస్సునందు ధర్మము విడిచితివా? అది మరలావచ్చి నన్ను చేరును. అనగా ఆషరత్తునకు మధుడంగీకరించి, స్వామీ! నావంశమువారీ భూమి మీదనున్నంత వరకు ఈశూలము వారిచేతనుండునట్లు వరమీయుమనగా శివుడు నీకు వారసుడొకడు దీనిని ధరించి చాలాబలవంతుడైయుండి శూల మతనిచేత బట్టియున్నంత సేపు యుద్ధమున నతనినెవరు జయింపలేరు. కాని అతడు శూలమును మరచిపోయి, ఏ వీరునిపైన యుద్ధమును సేయుటకు పోవునో అతని చేత వాడుచావగలడు. తక్షణమే ఈ శూలము వచ్చి నాశూలములో కలిసిపోవును అని తెలిపి ఈశ్వరుడదృశ్యుడాయెను. ఆ మధురాక్షసుడు తరువాతలంకలో బ్రవేశించి రావణుని చెల్లెలు కుంభీనసయను దానిని బలవంతముగా నెత్తుకొనిపోయి వివాహముగావించుకొనెను. పాల సముద్రములో విషము పుట్టినట్లు ఆమె గర్భమునందు లవణాసురుడను వాడు పుట్టెను.

అమధుని కుమారుడగు లవణాసురుడు వానితండ్రివలెగాక దుర్మార్గు డయ్యెను. వానిదుండగీడ తనమును జూచి తండ్రి ఏవగించుకొని మధు పట్టణమును, శూలమును వానికొసగి తనకు ఈశ్వరుడిచ్చియుండిన వరముల వివరములను తెలిపి నీవెల్లప్పుడును ధర్మమును విడువకుండుట మంచిదని తెలిపి అతడు సముద్రములో ప్రవేశించెను.

ఓ రామచంద్రా! లవణాసురుడిట్లు వానికి శూలమునిచ్చి పోయినప్పటి నుండి వాడు మదోన్మత్తుడై మా వంటి మునీంద్రుల బాధించుచు, మనుష్యుల నెక్కడను తిరుగనీయక దేవతలను కూడ బాధించుచున్నాడు. వాని దుండ

గీడతనమును ఎంతని చెప్పగలము. వాడీశ్వరుడిచ్చిన శూలమును చేపట్టినప్పుడెంతటి వారైనను వానినెదరింపజాలరు. కావున ఆరాక్షసుని జంపి, వాని వలన మాకుకలుగు చున్నఉపద్రవములను తొలగించి మమ్ము రక్షించుము. మీరే భూమియందుండగనే వేరొకరింకేలయని మీతో విన్నవించుకొనుటకై వచ్చితిమి. కావున వానిని చంపి మమ్ములను రక్షింపుము. రావణుని జంపినమీకు లవణాసురుడు లెక్కగాదు. వీనిని చంపి మా ఉపద్రవమును తొలగింపుము అనిచ్యవన మహా మునీంద్రుడు చెప్పగా విని రామచంద్రుడు వినయముతో ఓ మహాత్ములారా! ఆ లవణాసురు డెక్కడనుండును? వాడెచ్చట అహారమును తినును? వాడెక్కడతిరుగు చుండును? వాని ఆహారమెట్లుండును అని తమ్మడిగిన రామచంద్రునితో ఋషులిట్లనిరి.

ఓ రామచంద్రా! వాని అహారమును వినుము. వానికి ఒకపూటకు నూరు మదపుటేనుగులు, రెండునూర్లు గుఱ్ఱములు, పదివేలు దుప్పులు, ఆరునూర్లు జింకలు, వేయి చమరీమృగములు లక్ష పందులు వానికొకపూటకాహారము కావలెను. వాడు మదుపానముతో తిరుగుచుండును. స్నానముసేయని దురాచారము కలవాడు.

మంచి మాటలు వానికిష్టపడవు అని లవణాసురుని కార్యమును మునీశ్వరులు చెప్పగావిని, అది ఒకగడ్డి పరకతోసమానముగా భావించి. ఓ మహాత్ములారా నేను లవణాసురుని సంహరించి మీ బాధలు తొలగించెదనని వారికభయమొసగెను. తర్వాత భరత శత్రుఘ్నులవైపు చూచి, మీయిరువురిలో లవణుని నెవరు జయింతురని అడుగగా రామచంద్రునితో భరతుడిట్లనెను నన్నుబంపుము. ఈ మునీంద్రులు, బ్రాహ్మణులు, దేవతలు మెచ్చుకొనునట్లుగా నేనాలవణాసురుని చంపివచ్చెదననెను. శత్రుఘ్నుడు శ్రీరామచంద్రునకు నమస్కరించి.

ఓ ప్రభూ! ఈ భరతుడు పదునాలుగు సంవత్సరములు కూరగాయలుదిని నారబట్టలుగట్టి చాలాశుష్కించియున్నాడు. కావున ఇప్పుడైన ఇతనిని మీపాదసేవ చేసికొన నిండు. నేనుపోయి లవణాసురుని సంహరించెదను. దయతో నన్ను పంపుమని ప్రార్థించెను.

రామచంద్రుడందులకు మెచ్చుకొని, నీవు కొఱతలేని ధైర్యశాలివి. అస్త్ర శస్త్రములుగలవాడవు. యుద్ధము సేయుటలో నీవు చాలా నేర్పరివని నిజముగానే నీసామర్థ్యము తెలిపి పంపిస్తున్నాను. విరోధియగు లవణాసురుని చంపి

మహావైభవముగా నుండు మధుపట్టణమును నీవు పరిపాలింపుము. రాజులకు ధర్మముగా భూమిని పరిపాలించుట కంటె మించిన ధర్మములేదు. యుద్ధములో శత్రువును జయించి ఆరాజ్యమును ధర్మముగా పరిపాలింపకుండిన పాపము వచ్చును. పెద్దవాడగు అన్నమాట చిన్నవాడగు తమ్ముడు వినుట న్యాయము. కావున నీవు నాతోనెదురాడక విరోధి పట్టణమునకు గల సంపదకు నీవేరాజువు. కావున పట్టాభిషేకము కావించుకొనుము అని రామచంద్రుడనెను.

**శత్రుఘ్నుడు:** అన్నా! నీవు పెద్దవాడవు ఉండగా నేనెట్లు రాజ్యమునకర్హుడను అనబోయి భయపడుచుండ నాకెదురాడవలదని చెప్పిన మాటను జ్ఞాపకము చేసికొని ఊరకుండగా లక్ష్మణ శత్రుఘ్నులతో రామచంద్రుడిట్లనెను.

లక్ష్మణా! పట్టాభిషేకమునకు కావలసిన వస్తుసామాగ్రిలను తెప్పించి ఊరంతయు చాటింపజేసి శుభముహూర్తమున సమస్తబంధుమిత్రులతో శత్రుఘ్నునకు శ్రీరాముడాశీర్వదించి బంగారు పట్టముగట్టెను. అప్పుడే లవణుడు చచ్చినట్లు భావించి రామచంద్రా! నీవుసేయు కార్యమునకెదురుండునా యని అందరు పొగడిరి. శత్రుఘ్నుడు అన్నవద్దకు వచ్చినిలబడెను. రామచంద్రుడు ఆర్ద్రహృదయుడై తమ్మునిముద్దాడి ఒడిలో కూర్చుండబెట్టుకొని తమ్మునితో నాయనా! బ్రహ్మదేవుడు ఒక మహనీయాస్త్రమును సృష్టించెను. ఆ యస్త్రముచేత మధుకైటభాదులు మరణించిరి. ఆ యస్త్రమిపుడు నాకు లభించినది. దానిని నేనిదవరకెవరి పైనను ప్రయోగించి యుండలేదు. దానిని ప్రయోగించినప్పుడు అదిలోకములకు ప్రళయము సృష్టించును. ఆ యస్త్రమును నేను నీకిచ్చుచున్నాను. ఆ యస్త్రము నీచేతిలో నుండుట వలన లవణాసురుని చంపుట కష్టముకాదు అని శత్రుఘ్నునకు ఆ యస్త్ర ప్రయోగోప సంహారాదులను తెలిపి బాణము నిచ్చిగంభీర స్వరములో నిట్లనెను.

తమ్ముడా! ఆ యీశ్వరునిచేనియ్య బడిన భయంకర శూలాయుధము ఆరాక్షసుడు ధరించెనేని వానిని జయించుటకు ఈశ్వరునకేశక్యము కాదు. అందు వలన వాడా శూలాయుధము నింటియందే బెట్టి వాడాకలి బాధతో అడవులలో దిరుగు సమయమున వాని నెదిరించితివేని నీకు తప్పక జయము కలుగును.

శత్రువగు నీవు యుద్ధమును చేయుటకు వచ్చితివని వానికి ముందు తెలియరాదు. తెలిసినచో వాడు శూలమును ఇంటియందుంచక చేతనిదుకొని రాగలడు. కావున నీవు జాగ్రత్తగా దూరముగా నుండి కనిపెట్టుకొని యుండుము.

లవణాసురుడాహారార్థమై ఊరు విడిచి వచ్చునప్పుడు వానిని ఊరిలోనికి పోనీయక నీవు వానినడ్డగించి యుద్ధము జేసి నీవు బాణ వరంపరలతో వానిని కప్పివేయవలెను. నిన్ను మోసగించి వాడుపట్టణములోనికి పోయి శూలము నెత్తుకొనివచ్చి నీతోకలియబడగలడు. నేను నీకిది పలుమారులు చెప్పుచున్నాను. మరువకుము. నీకు జయమగునుగాక! నీకు కావలసిన సైన్యము నిచ్చుచున్నాను.

## రఘు వీరుడు లవణాసురుని చంపుటకు శత్రుఘ్నుని బంపుట

వేగముగల నాలుగు వేల గుఱ్ఱములు, రెండువేల రథములు, కొండలతో సమానమైన ఏనుగులు వేయి, పది వేల మంది వీరసైనికులు, ఖర్చులకు లక్షవరహాలు తీసికొని మధు పట్టణమునకు పోయిరమ్ము.

నాయనా శత్రుఘ్నా! సేనాధిపతులను సైనికులను బంధువులను మంత్రులను స్నేహితులను తగిన రీతుల సన్మానించి సమయమును తెలిసికొని నీకు వారిచేత గావింపవలసిన పనులను చేయించుకొనుము. ఏమరుపాటు లేక సగౌరముగా వారి మెప్పులు సంపాదించు చుండుము. సైనికులను అలసిపోవు విధముగా నడిపించవద్దు ఎండలో ఎక్కువ దూరం నడచినప్పుడు వారు ఆకలితో అలసిపోగలరు అందు వలన వారిని దయతో పరిశీలించు చుండుము. సైనికులు సేవకులు ఏదైనను అడిగినప్పుడు ధనము ఖర్చైపోవుననెడి లోభముతో తిరస్కరించవద్దు.

ధనమును రాజ్యమును దుర్గములును ఆ సైనికులచేతనే కాపాడబడు చున్నవి. సైనికులతో రాజుకు భేదాభిప్రాయము వచ్చినప్పుడు వారు శత్రువులతో పోరాడరు ప్రజలు మెచ్చుకొనరు. అందువలన యుద్ధము నందు జయమురాదు. పరాక్రమవంతులగు సైనికులు, ఏనుగులు, గుఱ్ఱములు, ఎండకు తపించునప్పుడు గంగాతీరమున గల పొదరిండ్ల నీడలలో వారు సంతోషముతో మండగలరు. ఎడారిలో జింకలు నీరు దొరకక మరణించును. అదే విధముగా నీ సైనికులు దప్పిగొననీయక గంగాతీరమునకు దీసికొని పొమ్ము. నీ సైనికులనక్కడనే యుంచి కాళింది నదీ తీరమునకు నీవొక్కడవే పోయి అచ్చట పొంచియుండుము. లవణాసురుడక్కడికి రాగలవాడు. వానిని తిరిగి పోనీయక అడ్డుకొని యుద్ధము గావింపుము. నాయనా! శత్రుఘ్నా నీవు లవణాసురుని సంహరించిన వెంటనే మాకు సమాచారము నెరిగింపుము. ఆలసించితివేని నా ప్రాణము నిలువదు.

అని శ్రీరామచంద్రుడు తన తమ్మునకు సమస్త హెచ్చరికలు జేసి శుభముహూర్తము నిర్ణయించెను. ఆ సమయమునకు శత్రుఘ్నుడు తనకు కావలసిన యుద్ధసామగ్రులను సమకూర్చుకొని రామాజ్ఞ ప్రకారము ముందుగా వసిష్టుని యొద్దకును, తరువాత తల్లుల వద్దకును ఆ తరువాత రామచంద్రుని వద్దకును, పోయివారందరికిని నమస్కరించి వారి నుండి దీవనలందెను. వారు నాయనా శత్రుఘ్నానీవు నిర్విఘ్నముగా శత్రువును జయింతువుగాక అని అతనిపై పుష్పములు చల్లిరి. సైనికులతో హుటాహుటిన శత్రుఘ్నుడు బయలుదేరెను.

ముందు ఏనుగులు, ఆ తరువాత గుఱ్ఱములు, ఆ తరువాత రథములు వానివెంటకాల్బములు క్రమముగా బయలుదేరిరి. మూడు దినములకు గంగానది సమీపము చేరి అచట దండును మజలీగా విడిచెను. పిమ్మట తాను మాత్రము వాల్మీకాశ్రమమునకు బోయెను వాల్మీకుల వారికి నమస్కరించి ఆయనదీవెనలందెను. తరువాత స్వామీ! నేను మా అన్నగారగు రామచంద్రుని అజ్ఞానుసారము లవణాసురునిపై యుద్ధమునకు బోవుచున్నాను. మా సైన్యము ఈ రాత్రి ఇక్కడ విడిదిసేయవచ్చునా? రేపు సూర్యోదయముననే వెళ్ళెదము అని మునీంద్రుని శత్రుఘ్నుడు ప్రార్థించెను.

ఆ ప్రార్థనను విని వాల్మీకి మునీంద్రుడు నవ్వుచు నాయనా పరాయి వానివలె నన్ను నీవడుగు చున్నావు. ఇది నీయిల్లేకదా? అట్లేవసింపుమని తెల్పి శత్రుఘ్నునకు వాల్మీకి కందమూలఫలములను ఆతిథ్యమొసగెను. ఆరాత్రి అక్కడ అందరును వసించిరి.

శత్రుఘ్నుడు వాల్మీకి మునీంద్రుని జూచి స్వామీ! ఇచట యూప స్థంభములు, వరుసగాదట్టముగా కనబడుచున్నవి. ఇంతకు ముందెవ్వరైనా ఇచ్చట యజ్ఞములను చేసి యున్నారాయని యడిగెను.

వాల్మీకి మునీంద్రుడాకథను చెప్పటకునారంభించెను. పూర్వము సూర్యవంశమున సుదాసుడను రాజుండెను. అతనికి సంతానములేదు. దానధర్మములను ఎక్కువగా జేసి ఆపుణ్యావశమున నొకపుత్రుడు గలిగెను. అతనికి మిత్ర సఖుడని పేరు బెట్టిరి. సుదాసుడు మిత్రసఖునకు పట్టము గట్టి తాను తపస్సుచేసికొనుటకె అడవులకు వెళ్ళెను.

తండ్రివెళ్ళిన తరువాత మిత్రసఖుడొకనాడు వేటలాడచు తాను చెంచుల వెంటవెళ్ళెను. అడవిలో అతడు వేటలాడుచు సింహములను, ఏనుగులను,

దుప్పులను, పందులను, చంపుచుండెను. రాక్షసులిద్దరు పులుల రూపములను ధరించి ఆమృగముల గుంపులో వెళ్ళుచు అమృగములను ఏమరించి మ్రింగుచుండిరి. మిత్ర సఖుడది చూచికోపించి బాణముతో కొట్టగా నొకపులిమరణించెను. రెండవవాడు పులిరూపమును వదలి రాక్షస రూపమును ధరించి ఓరాజా! నిష్కారణముగ నీవు నా మిత్రుని జంపితివి ఇది నేను మరువలేనని తెల్పి వెడలి పోయెను. మిత్రసఖుడా సంగతిని తమగురువు గారగు వసిష్టమునీంద్రునకు విన్నవించెను. వసిష్టుడు అశ్వమేధయాగమును సేయుమనగా ఈ ప్రదేశమున మిత్రసఖుడశ్వమేధ యాగములను గావించెను.

ఇట్లు యాగము జరుగుచుండెను. అనాడు పులి రూపమున నుండిన రాక్షసుడు మిత్ర సఖునితో నేనీసంఘటనను మరువలేనని చెప్పియుండెను. ఆ రాక్షసుడొకనాడు వసిస్టుని రూపమును ధరించి నాకీ దినము మాంసాహారమును బెట్టుమని కోరెను. రాజందుకు సమ్మతించి వంట సేయు వానిని పిలిపింపగా ఆ రాక్షసుడే వంటలవాని రూపములో వచ్చెను. రాజు వానిని తననిజమైన వంటవాడేయని నమ్మి అతనితో ఈ దినము వసిష్టుల వారికి మాంసమును వండి పెట్టుమనగా వాడట్లేయని పోయి మనుష్యమాంసమును వండి వసిష్టునకు బెట్టెను. వసిష్టుడది గమనించి మిత్ర సఖునిపై కోపించి నీవు నాకు మనుష్యమాంసమును వండించి పెట్టితివి. కావున నీవు ఆ మాంసమునేతిని జీవించెదవుగాక అని శపించెను.

మదయంతి యను తన భార్యతో కలిసి వసిష్టుల వారివద్దకు బోయి స్వామీ! మీరేనన్ను మాంసమును వండిపెట్టుమనికోరితిరి. వంటల వానికది చెప్పి చేయించితిని. వాడదియెట్లువండెనో బాగుగా మీరు యెాచింపక నాకు శాపమిచ్చితిరి. ఇది సరియగునా యని రాజు వసిష్టుల వారిని ప్రశ్నించెను. వసిష్టుడు రాజుతో రాజా! నేనంతయు తరువాత గమనించితిని. ఇదంతయు రాక్షసుడు చేసిన కుట్ర యని తెలిసికొంటిని. కాని పండ్రెండు సంవత్సరములిట్లు రాక్షసుడుగా తిరుగుచుండుము. తరువాత నీరూపము నీకు రాగలదని వసిష్టుడు దెలుపగా మిత్రసఖుడు కోపించి గురువునకు ప్రతి శాపమిచ్చుటకు ప్రయత్నించెను. అది గమనించి రాజుగారి భార్య మదయంతి అడ్డుపడి మీరు గురువుగారిని శపించుట న్యాయము కాదు అని సమాధానము చెప్పెను. ఆమె చెప్పినందుకు మిత్ర సఖుడు సమాధానపడి శాప జలమును తమపాదములపై విడుచుకొనెను. ఏలననగా ఆజలమును మరెక్కడ విడచినను అవిపడినచోట ప్రమాదము సంభవించి ఇతరులకు కీడుగలిగించును. అందువల్ల తన కాళ్ళమీద విడచుకొనెను. ఆ జలము

పడినందున ఆయన కాళ్ళు కమిలిపోయి నలుపెక్కెను. అందువలన ఆదినము నుండి ఆయనకు కల్మష పాదుడను పేరుగల్గెను. ఆ సుదాసుని కొడుకు సౌదాసుడు ఇచ్చట యజ్ఞములను గావించెను అని వాల్మీకి మునీంద్రుడు శత్రుఘ్నునకు దెలుపగా నతడు విని సంతోషించెను.

## జానకి వాల్మీకాశ్రమమునందు కుశలవులను గనుట

ఇట్లు వాల్మీకుల వారు శత్రుఘ్నునకు సౌదాసుని చరిత్రదెలుపు చుండెను. ఇంతలో నొక పర్ణశాలలో నుండి ఇద్దరు మునికుమారులు వాల్మీకి వద్దకు వచ్చి సీత ఇద్దరు మగ పిల్లలను గన్నదని తెలిపివెడలిపోయిరి.

ఆ సమయమున సూర్యాదిగ్రహములు క్షేమకరమైన స్థానములలో నుండిరి. చల్లనిగాలులు వీచెను. ఆయాశ్రమమునగల ఋషులందరును సంతోషించిరి వారిని పరామర్శించుటకు వాల్మీకుల వారువెళ్ళిరి. బాలారిష్ట దోషములు కలుగకుండుటకుగాను, రాక్షస నాశనమగు మంత్రముతో దర్భలు నింపియున్న నీటికల శమును అభిమంత్రించి అక్కడున్నవారిచేత వాల్మీకి పంపించెను. ఆకుమారులకిద్దరకు ఒక కుమారుని దర్భలతో ప్రోక్షించి అతనికి కుశుడనియు, లవలతో ప్రోక్షించిన కుమారునకులవుడనియు పేర్లు బెట్టెను. వారు సూర్య చంద్రులవలె, ఇంద్రోపేంద్రులవలె, అశ్వనీ దేవతలవలె నుండిరి. సీతకు ఇద్దరు కుమారులు కల్గి బాగుగానున్నారని వాల్మీకి మునీంద్రుడు శత్రుఘ్నునకు తెలిపెను. చెవులున్నందుకీవార్త వినుటచే ధన్యాత్ముడనైతినని శత్రుఘ్నుడు సంతోషించెను.

ఇంతలో తూర్పున తెల్లవారెను. శత్రుఘ్నుడు ఉదయకాలకృత్యాది స్నాన సంధ్యాదులుగావించి వాల్మీకుల వారి వలన ఆశీర్వాదములు బొందిసెలవు దీసికొని సైనికులతో బయలుదేరి లవణాసురుని సంహరించుట కొఱకు ఏడు దినములు నడిచి కురంగనాభివనములలో ప్రవేశించి నర్మదానది తీరముజేరి. ఆనదిలో స్నానము జేసి అచ్చట గల చ్యవనాది మునీంద్రులను జూచి వారిచ్చిన ఆతిథ్యమును ఆహారరాదులతో తమ యాకలితీర్చుకొని అచటనే ఆరాత్రి విశ్రమించి చ్యవనమునీంద్రునితో.

### మాంధాతలవణాసురునిచే మృతుండైన కథను శత్రుఘ్నునకు చ్యవనుడు దెల్పుట

ఓ మహాత్మా! ఆ దినమున మీరు మా అన్నగారితో లవణుని వృత్తాంతము దెల్పుచు అతని దగ్గర శూలమున్నదని చెప్పి యుంటిరి. ఆ శూలముతో ఇదివరకెవరి –నైనను చంపియుండెనా వినదగి విశేషమేమైన నుండిన వినిపింపుమని కోరెను.

**చ్యవన మహర్షి:** ఆ లవణాసురుడా శూలముతో నెందరినో చంపియున్నాడు. వారిలో మహాపరాక్రమశాలియైన మాంధాత యొక్కడు. ఆ కథను తెలిపెదను వినుము.

యువనాశ్వుడను మహారాజునకు మాంధతయను కుమారుడు గల్గెను అతడు ఉదారగుణమునందును, ధైర్యము నందును, పరాక్రమమునందును అతని కతడేసాటి. అతడు భూలోకమున రాజులనందిరిని జయించి, ఇకదేవేంద్రుని కూడ జయించి ఇంద్ర పదవి బొందవలెనని నిశ్చయించి దండయాత్రకు బయలుదేరి మహామేరు పర్వతమును దాటి స్వర్గమును సమీపించునప్పటికి దేవేంద్రుడిది తెలిసికొని, మాంధాతకెదురుగా వచ్చి ఓరాజా! నీవు భూలోకము నందుండు వీరులనందరిని జయించి ఆ తరువాత దేవలోకమునకు రావలెనుగదా నీకు జయించుటకు సాధ్యము కానివాడు లవణాసురుడు భూలోకమందున్నాడు. అతని గెలువకనే దేవేంద్రుని గెలుచుటకు వచ్చితివా? అని కపటవేషధారియనగా మాంధాత సిగ్గుపడి వెంటనే భూలోకమున లవణాసురుని జయించివచ్చెదనని దెలిపి తిరిగిపోయెను.

భూలోకములో గల మధువనమునకు బోయి మాంధాత దండువిడిచెను. అక్కడనుండి లవణుని వద్దకు తన దూతను బంపెను. ఆ దూతను లవణుడు అక్కడనే చంపివేసెను. అది తెలిసికొని మాంధాత కోపించి తానే వానికొలువునకు బోయి ఓరే! రాక్షసాధమా! నాతో యుద్ధమునకు రమ్మని పిలిచెను.

సింహమును జూచి యెదరించిన మదపుటేనుగువలె మాంధాత లవణుని పిలువగా లవణుడు భయంకరముగా గర్జించుచు. వాని తండ్రి శివునిచే పొందియున్న శూలమును ధరించి అభిమంత్రించి వేయగా అది నలువైపుల ప్రచండాగ్నులను జిమ్ముచూ అతని మంత్రులను చుట్టపక్కములను. ఒకే మారు బూడిదగావించెను. వాడు శూలమును ధరించినప్పుడు వానిపైకి పోవలదని మీ అన్నగారు మీకు చెప్పియున్నారు.

రేపు వానిని నీవు తప్పక జయించగలవు. ఈ నాటికిక్కడ పరుండి విశ్రాంతి దీసికొనుమని చ్యవన మహాముని తెలిపిన మాటలు శత్రుఘ్నునకు చెవుల కమృతము శోకినట్లు పులకింపగా విని ఆరాత్రియచటనే నిద్రించెను.

మరునాడుదయమున లేచి కాలకృత్యములను దీర్చుకొని స్నాన పానాదులాచరించి మునివరులకు నమస్కరించి వారి దీవనలంది. ధనుర్బాణములను ధరించి లక్ష్మీకరమగు మధుపట్టణ సమీపమునకు బోయి లవణుని కొఱకు పొంచియుండెను.

## శత్రుఘ్నుడు లవణునితో పోరుట

ఆ దినమున లవణాసురుడు సూర్యుడుదయింపక మునుపే లేచి అడవికి బోయి సింహములను, ఏనుగులను, గుఱ్ఱములను, ఖడ్గమృగములను, అడవి దున్నలను తినగోరి ఇల్లు విడిచి అరణ్యములకు బయలుదేరి పోయి అచట అనేక జంతువులను గొట్టి పట్టుకొని తిని వానికి తృప్తిలేక మరలా మధ్యాహ్నమున వేటకు బయలుదేరెను. లవణుడిట్లు బయలుదేరి పోయి ఏనుగులు, పులులు, పందులను బట్టి చంకలలో నిరికించుకొని ఆ జంతువులను సారెసారెకు వంగివానిని కొఱికికొనుచు ఆ జంతువుల నుండి కారిన రక్తమును దిగువబడనీయక నాలుకచాచి నాకికొనుచు అమదోన్మత్తుడు తనకెదురుగానున్న మానులను చెట్లను కాళ్ళతో తన్ని కూలద్రోయుచు, దేవతలు దిగులుపడునట్లును దిక్కులు పగిలిపోవునట్లును, ఖిల్లిల్లీయని కిలారించుచు, తనకెదురు లేనివాడై తిరిగి తన పట్టణమునకు బోవుచున్న గొప్ప శరీరమును కోఱ పండ్లును అగ్ని గోళము వంటి కన్నులు కలిగిన లవణాసురుని శత్రుఘ్నుడు దూరము నుండియే చూచెను. వానిని చూడగానే శత్రుఘ్ననకు కోపము వచ్చి కోదండమెక్కుబెట్టి అల్లెత్రాడును సారించిటంకారము గావించెను. ఆనీచరాక్షసుడు శత్రుఘ్నుని జూచి వాని భయంకరమైన కోఱలు కనబడునట్లు వికటముగానవ్వి ఓహో ఒకవిల్లు దానికి కొన్ని బాణములు ధరించి నాత్రోవకడ్డముగా నిలబడియున్నావు. నాతో యుద్ధము జేసి శూరత్వమును చూపువానివలె యున్నావు.

నాతో యుద్ధము సేయుటకు నీవంటివాడు సరిపోగలడా? ఈ పనికి మాలిన బుద్ధి నీకే స్వయముగా పుట్టినదా? లేక ఏమూర్ఖుడైన బోధించి పంపియున్నాడా? ఓహో ఇంకనూర్గురు బ్రహ్మదేవుళ్ళు వచ్చి ఇతనికి మేమాయుస్సు పెంచియున్నామని చెప్పి తప్పించబోయినను, ఇప్పుడు నాచేతిలో బడిచావవలెనని అనాడు నీకు బ్రహ్మవ్రాసిన వ్రాతను తప్పింపలేరు. ఏలననగా ఈ లవణాసురుని చేతిలోబడి ప్రాణాలతో బ్రతికిపోయిన వారిదివరకు లేరు. నీకు మాత్రమిదియెట్లు తప్పును. నీ విలువిద్యలు నాయెదట చెల్లునా? ప్రతిదినమును జంతువుల మాంసమునేతిని నానాల్కారుచి కోల్పోయినది. అందువలన దాని అరుచిని పోగొట్టి మరల క్రొత్తరుచిని కల్పించుటకు ఓనరాధమా! ఈ దినము నీ మాంసము దొరికినదని లవణుడను చుండగా, శత్రుఘ్నుడు కోపమును పట్టజాలక నాలుక నడ్డమునా గొఱకి కొనుచు దవడ లదురుచుండగా పండ్లు పటపట గొరుకుచు. కన్నుల యందు చిటపట నిప్పులు రాలుచుండ. ఒడలు ముచ్చెమటలు బోయుచుండ లవణునితో.

**శత్రుఘ్నుడు :** ఓరే రాక్షసాధమా! నీవొకమొనగానివలె దుర్బుద్ధిగలవాడవై ఇది వరకు ముందు నిన్నెదరించిన రాజులను మాటలాడినట్లున్నను చుంటివి? రావణుని పుత్రమిత్రాదులను పీచమణచిన శ్రీరామచంద్రుని సహోదరుడను, శత్రుఘ్నుడను వాడను. నీ పాలిట యమధర్మరాజును నానుండి తప్పించుకొనినీ వికపోజాలవు. నేను నీపై యుద్ధము సేయుటకై వచ్చియున్నాను. ఈ నాటి నుండి దేవతలుగాని, ఋషులుగాని, బ్రాహ్మణులుగాని నీతో భయపడవలసిన పనిలేదు. ఈ దినము యుద్ధములో నిన్ను ఖండించి నీ శరీరమునిచట కుక్కలు, గ్రద్దలు కంకాళములు, కొర్నం పోతులు తినునట్లు విందు గావించెదను. దుర్మార్గపు చరిత్రగల ఓ కుంభీనసకొడుకా, పారిపోక నాయెదుట నిలబడుమనెను.

అది విని లవణుడు క్రోధావేశుడై బెట్టుగా అఱచుచు, భళి భళీ లంకాధీశ్వరుడు మామేనమామయగు రావణుని జంపిన రాముని తమ్మునివా? అయితే నాకోఱికనెరవేరినది. ఈ దినమేనిన్ను చంపి యమపట్టణమునకు బంపెదను. నిలునిలుమని పట్టణములోనికి వెళ్ళుటకు ప్రయత్నించెను. శత్రుఘ్నుడడ్డమై నిలబడి యెంతటిమొనగాడవు ఇంత వరకు నన్నేమేమో మాట్లాడి తప్పించుకొని పోవుటకు యత్నించుట చూడగానిన్ను చూచినవారు నవ్వరా! అని నిందించుచుండగా వాడదివిని సహింపలేక కోపముగల వాడై గర్వించి ఓరీ క్షత్రియాధమా? నీవు నీప్రాణములను నిలబెట్టుకొనలేక నామీదకోపగించు చున్నావు. దానికి తగిన ఫలితమనుభవించగలవని ఆ జంతుకళేబరముల నవతల బడవైచి తన చేతులతో భుజములను తట్టుకొనుచు, గలగల అఱచుచు వేగముగా చెలరేగి కేకలువేయుచు ఒక విశాలమైన మద్దిమానును బెరికి శత్రుఘ్నుని ఱొమ్ము పగులునటులవైచెను.

వానికి భయపడక శత్రుఘ్నుడు ఐదు బాణములను సంధించి కొట్టగా అమద్దిమాను తునకలై క్రిందపడెను. వాడపుడు అచ్చటనుండి మద్దిమ్రానులను బెరికి శత్రుఘ్నునిపై వర్షమువలె తెఱపిలేకుండావిసరెను. శత్రుఘ్నుడందులకు వెనుదీయక, భయపడకమూడేసిబాణములను సంధించి, వాడేయు మద్దిమానులను తునాతునకలుగా తెగగొట్టుచుండెను. లవణుడు మ్రానులను దెచ్చివేయుట శత్రుఘ్నుడు తెగ గొట్టుటా రాళ్ళను దెచ్చి వేయుట శత్రుఘ్నుడు దుమ్ముసేయుట ఈ విధముగా పోరుబలమై ఆ ప్రదేశమున మ్రానులు రాళ్ళు గుట్టలు గుట్టలుగా బడిపోయెను. లవణుడు నర్మదానది యొడ్డుననున్న మ్రానులను రాళ్ళను దెచ్చి శత్రుఘ్నునిపై వేయుచుండెను.

వీడిట్లు పోవుచు వచ్చుచు పట్టణములోనికి పోవునీవెూయని వీనిని నమ్మరాదని శ్రీరాముడిచ్చిన మహాస్త్రమునుపయోగించెదమని శత్రుఘ్నుడాలోచించుచు శత్రుఘ్నుడే మఱియుండగా లవణుడు మద్ది మాకుతో శత్రుఘ్నుని తలపై మోదెను. ఆదెబ్బకు శత్రుఘ్నుడు సొమ్మసిల్లిమూర్ఛబడెను. ఆ సమయమున దేవతలు ఋషులు బెదిరిపోయిరి. అప్సరస స్త్రీలు జాలిపడి ప్రపంచమేవణకిపోయెను. ఇట్ల పడిన శత్రుఘ్నుని జూచి దానిని చావుగా భావించి నాకిక శూలముతో పని లేదు. శత్రువు చచ్చినాడని భావించి అచ్చటనున్న జంతువులను తినుచుండెను.

ఇట్లుండ కొంతసేపటికి శత్రుఘ్నుడు తెప్పరిల్లి కన్నులు దెఱిచి మహాకోపముతో పైకిలేచెను. అది చూచి అందరును దుఃఖములు మానివేసిరి.

శత్రుఘ్నుడు చూచునప్పటికి అనేక జంతుకళేబరములను చేతబట్టుకొని భూమికంపించునటుల పాదములనుబెట్టుచు పరువిడిపోవుచున్న లవణుని వీరావేశుడై శరీరము పొంగుచుండ ప్రళయకాలము నాటి యమధర్మ రాజు వలె కనుబొమలు ముడివడ తన కోదండము యొక్క నారినిసారించి ఆలస్యముసేయక బంగారు పిడిగలదియు, మేఘ ఘర్జన వంటి ధ్వనిగలదియు, లోకము లన్నింటి నొకేసారి భస్మముసేయునదియు, మధుకైట భాది శత్రువులను రాక్షసులను త్రుంచినట్టిదియు అనేక చక్రశూలములను వెడలించుచు అనేక దేవతామూర్తులగు శక్తులు గలది యునగు రామచంద్రుడిచ్చిన బాణమును పొదినుండీ తీసికొని లవణాసురుని ప్రాణముతీయగల్గిన దానిని వింట సంధించగా ఆ బాణము నూరు కోట్ల సూర్యమండలములొకటిగా చేరినప్పుడు వెలిగెడు వెలుగుతో సమానముగా నుండి చూచువారి కన్నులు మిరుమిట్లు గొని చూడలేక భయపడి సిద్ధ విద్యాధరాదులు బ్రహ్మకడకు బోయి ఓ సర్వేశ్వరా ఆ శత్రుఘ్నుడు తన వింటియందు సందించియున్న బాణము ప్రపంచములను నాశనముచేయు రుద్రతేజమువలె నున్నది. ప్రపంచమును కాల్చివేయు విధముగానున్నది. ఇక మీద లోకము లేమగునోయని మాకు భయముగానున్నది. కావున కరుణించి కాపాడుమని కోరిరి.

**బ్రహ్మదేవుడు :** ఓ దేవతలారా! భయపడవలదు పూర్వము విష్ణుదేవుడు ఈ బాణము చేతనే అనేక మంది రాక్షసులను చంపియున్నాడు. ఆ బాణముచే శత్రుఘ్నుడిపుడు లవణాసురుని చంపగలడు. మీకీ నాటి నుండి వానితో కలుగు బాధలు తొలగిపోగలవు. మీరిక భయపడకవెళ్ళుమని చెప్పగా దేవతలు సంతోషించి వెడలిపోయిరి.

## శత్రుఘ్నుడు లవణాసురుని జంపితత్పురంబునేలుట

శత్రుఘ్నుడీవిధముగా బాణమును వింట సంధించి లవణాసురుని రొమ్మునకు గుఱిజూచి విడిచెను. ఆ బాణము లవణుని వక్షస్థలములో దూరి వానిని భూమిపై బడద్రోచి అది భూమిలోదూరి పాతాళలోకములో బ్రవేశించి తిరిగి వచ్చి శత్రుఘ్నుని పొదిలో బ్రవేశించెను. అది చూచి దేవతలు మెచ్చుకొనిరి.

ఆ బాణము తగిలినవెంటనే వానిశరీరము నుండి ప్రాణము లెగిరిపోయెను. వాని శరీరమొక పర్వతమువలె నేలపై కూలిపోయెను. అది చూచువారందరును ఇక్కడ లవణాసురుడు భూమిపై బడగనే వాని యింటిలో నుండిన శూలము వెళ్ళిపోయి ఈశ్వరుని అసలు శూలములో చేరెను. అపుడు శత్రుఘ్నుని మీద ఆకసము నుండి ఘుమఘుమయని పరిమళించు పూలవానలు గురిసెను. దేవదుందుభులు మ్రోగెను. అప్సరసలాడిరి. గంధర్వులు పాడిరి.

దేవతలు దిక్పాలురు తన్నుగొలుచుచుండగా దేవేంద్రుడు ఠీవితోనచటికి వచ్చెను. అందరును దీవించి లంకలో అనాడు రామచంద్రుని బొగడినట్లు ఈనాడిక్కడ శత్రుఘ్నుని పొగిడిరి. దేవేంద్రుడు శత్రుఘ్నునితో లవణాసురుని నీవు సంహరించుటవలన, ఈ దినము నుండియు ఈ ఋషులు దిగులు విడిచి తిరుగు చుందురు. దేవతలమగు మాకందరికిని స్థిరసౌఖ్యములుగల్గెను. రావణుడు బోయి లవణుడటులనే జీవించియున్నందున సగము భయము మాత్రమే తొలగి సగము భయమటులనే నిలచియుండెను. ఈ నాటికి రక్కసుల భయమునిక్కువముగా తొలగెను. లోకమందందరమును బ్రతికి పోయితిమి. కావున నీకిష్టమైన వరమును గోరుకొనుము అని దేవేంద్రుడనగా.

శత్రుఘ్నుడు వారందరికిని పాదాభివందన మాచరించి మహాత్ములారా! మిమ్మందరిని దర్శించి, మీకునేను సేవగావించితిని. ఇంతకు మించినాకేమి కావలెను. కానీ మధుర పట్టణము ఇంతకు ముందున్నదాని కంటె ఇకపై ఎక్కువగా సంపద గలిగి యుండునట్లు సేయవలెనని నాకోరిక. అనగా దేవతలు భూలోకమందున్న స్వర్గలోకమువలె నుండుగాక! యని వరములొసగివారందరును వెడలిపోయిరి. తరువాత శత్రుఘ్నుడుతాను లవణాసురుని సంహరించిన వార్తను రామచంద్రునకు తెలుపుటకు ఆదినమే తగిన వారిని అయోధ్యకు బంపెను.

శత్రుఘ్నుడు లవణాసురుని చంపినాడను వార్త క్షణాల మీద దేశమంతట తెలిసిపోయెను. అప్పుడచ్చటికి మంత్రులును, సైనికులు వచ్చిరి. వారిని పరామర్శించి

వారితో గలిసి విజయ సూచకముగా రణ భేరీలు తప్పెటలు బోరున మ్రోగించుచు మధు పట్టణములోనికి ప్రవేశించిరి.

అందరును పట్టణములోనికి బోయి మనుష్య సంచారమేలేని మధు రాక్షసునింటిలోనికి బోయి వాని యింటిలో గల ధనమును, బంగారమును, మణులను ఇంకాతక్కిన సమస్త సంపదను తన స్వాధీనము జేసికొని అచ్చట గల ప్రజలను ఇంపును పెంపును నీతియు నియమములను గలిగి ప్రవర్తించువారినిగా జేసి ఆ పట్టణమును అపర అయోధ్యవలె పాలించుచుండెను.

ఇట్లు శత్రుఘ్నుడా పట్టణమును భూలోకము నందు గల స్వర్గలోకమాయను నట్లు సౌఖ్యములు కలుగజేసి పాలించుచు పండ్రెండు సంవత్సరములు రాజ్యపాలనగావించెను.

## శత్రుఘ్నుడు శ్రీరామపాదసేవార్థియై అయోధ్యకరుదెంచి మరలచనుట

**శత్రుఘ్నుడు :** మధురాక్షసుని జయించి శత్రుఘ్నుడేలు చుండెను. పండ్రెండు సంవత్సరములు గడచిన తరువాత, తన అన్నగారగు రామచంద్రుని చూడదలచి గుణవంతులగు మంత్రులకు రాజ్యభారమప్పజెప్పి, మణులతో బంగారముతో తయారుచేయబడిన రథము నెక్కి తగిన వారిని వెంటదీసికొని కొన్ని దినములకు వాల్మీకాశ్రమమునకు చేరెను.

వాల్మీకి శత్రుఘ్నుని జూచినాయనా ! సమస్తజనులకు ఉక్కుముల్లు వంటి లవణుని సంహరించితివి. నేనా నాడుదేవసభలో నుంటిని వింటిని . దేవతలందరును రావణుని సంహరించుటకు ఏమేమో ప్రయత్నములు సేయవలసివచ్చెను. రావణుని మించిన ఈ లవణాసురుని సంహారము ఏ ప్రయత్నమూలేకనే ఒక్కబాణముతో శత్రుఘ్నుడు సంహరించెను అను నీభుజబలవీర్యములను దేవతలు ఒకరికొకరు చెప్పుకొనుచు మెచ్చుకొను చుండిరి. కావున నీవు సామాన్యుడవు కావని వాల్మీకి శత్రుఘ్నుని శ్లాఘించుచు కౌగలించుకొని, ఆయనకు కందమూలఫలములనిచ్చి అతిథి సత్కారముగావించెను.

ఆ తర్వాత వాల్మీకి రచించిన రామాయణమును ఇద్దరు పిల్లలు సంగీతముగా పాడుచుండిరి. శత్రుఘ్నుడా బాలురు సీత పుత్రులుగా భావించుచు వినుచు ఆనందించు చుండెను. అతని కారాత్రిక్షణ కాలముగా గడచిపోయెను. ఆమరు నాడుదయముననే లేచి కాలకృత్యములను దీర్చుకొని వాల్మీకికి నమస్కరించి ఆయన

వద్ద సెలవు దీసికొని ఆ దినమంతయు వేగముగా తన రథమును నడిపించి మధ్యాహ్నమునకు అయోధ్యజేరెను.

శత్రుఘ్నుడు వచ్చిన వార్తవిని ఏనుగు మొగసాల వద్దకు ఎదురుసేవకు మంత్రులు, నాట్యగత్తెలు, వందిమాగధులతో వచ్చి స్వాగతము బలికిలోనికి సగౌరవముగా తీసికొనివెళ్ళిరి.

శత్రుఘ్నుడులోన బ్రవేసించగనే తన తలపై రెండుచేతులు జోడించుకొని పోయి అన్నకు సాష్టాంగ దండప్రణామములాచరించి తాను దెచ్చిన మణి భూషణములను కానుకగా సమర్పించి నిలబడి రామచంద్రునితో స్వామీ! మీయాజ్ఞాను సారము పోయి శత్రువగు లవణాసురుని చంపి ఆ రాజ్యమును స్వాధీనము చేసికొని, నీతిగా పండ్రెండు సంవత్సరములు పాలించితిని. ఆవును విడిచిన లేగ దూడవలె నిన్ను విడిచి మరచి ఒంటరిగానుండ జాలక నిన్ను చూచుటకై వచ్చియున్నాను అని నిశ్చయముగా పలుకగా విని, రామచంద్రుడు నవ్వుచు, తమ్ముని దనవద్దకు తీసుకొని సోదరా! నీకు వ్యసనమెందుకు. నీవు కోరినపుడంతయు వచ్చి మమ్మందరిని చూచి కొంతకాలమిచటనుండి, పోయి వచ్చుచుండుము రాజులకు శత్రువులను జయించుట, రాజ్యమును చక్కగా పరిపాలించుట పరిపాటి.

క్షత్రియులూరకుండుట ఉచితముగాదు. అక్షత్రియ ధర్మమునసుసరించి నిన్ను మావద్ద నుంచుకొనుటుచితముకాదు. కానీ మేము కూడా మిమ్ము విడచి యుండలేము. నీవేడు రాత్రులిచట ఉండి తరువాత మరలా మధుపట్టణమునకు పోయి రమ్ము. ఇంతకాలము రాజుగారు రాజ్యములో లేకపోయినచో రాజ్య మరాచకమైపోవును అని రామచంద్రుడు చెప్పగావిని, రామాజ్ఞను శిరసావహించి, భరతుని లక్ష్మణుని జూచి వారికి భక్తితో నమస్కారములు జేసి వారి ఆదరణ పొంది తల్లులకు నమస్కారములు చేసి వారి వలన దీవనలంది, బంధువులను సహాయకులను స్నేహితులను మంత్రులను బ్రాహ్మణులను చూచి వారిని తగిన విధముగా గౌరవించి, సత్కరించి అన్న ఆజ్ఞానుసారము అచటనే యేడు దినములు మాత్రమే యుండి తరువాత అందరి వద్ద సెలవు దీసుకొని భరతుడును లక్ష్మణుడును తన వెంటవచ్చు చుండగా బయలుదేరి తమసేవకులతో కలసిమరలా మధుపట్టణమునకు పయనమైపోయెను.

శత్రుఘ్నుని కథ, ఏబుద్ధి మంతులుగాని చదివినను, విన్నను సూక్ష్మ బుద్ధిగలవారై వ్రాసినను వారికి శత్రు నివాశము, రాజ్యప్రాప్తికల్గును. ఇట్లు ఆ

లవణాసురుని చంపిన శత్రుఘ్నుడు మధు పట్టణమునకు బోయి ప్రజలు సంతోషించునట్లు మంచి మనస్సుతో భూభారమును వహించి రాజ్యమేలుచు విశాలమైన కీర్తి సంపాదించి ప్రజల మనసులోగల కోర్కెలను తీర్చుచు దుష్టులను శిక్షించుచు శిష్టులను రక్షించుచు ధర్మమూర్తియై రాజ్యపరిపాలనసాగించెను.

## వృద్ధవిప్రమిధునంబు మృతుడగు కుమారుని రామునివాకిట వైచి దుఃఖించుట

అయోధ్యలో రామచంద్రుడు ధర్మమూర్తియై మేరు పర్వతము వంటి ధైర్యముగలవాడై బ్రహ్మణ, క్షత్రియ, వైశ్య సమస్త శుద్రాదిజనములను, సాదరముగానాదరించుచు ప్రసన్నతతో వారి కోర్కెలను దీర్చుచు వేదరహస్యములను తెలిసికొని బ్రహ్మభావముతో ధర్మపరులై శత్రువులనన్ని దిక్కుల వారిని జయించి పరలోక సాధకములైన అష్టాంగ యోగములనభ్యసించి, అందుకు కావలసిన శాస్త్రములను తెలిసికొని, శీతోష్ణ సుఖదుఃఖములనెడి ద్వంద్యముల కోర్చుకొని ఆర్యులకు సేవలు చేయుచు బ్రాహ్మణ, క్షత్రియాది వర్గము యోగిజనులవలె హెచ్చుచుండ నెలకు మూడేసి, పది దినముల కొక వర్షము కురియుచుండగా, శ్రీరామచంద్రుడు రాజ్యపరిపాలనము సేయుచుండెను.

రామచంద్రుడీవిధముగా ధర్మపరిపాలనము సేయుచుండగా, ఒకదినమున ఇద్దరు వృద్ధ బ్రాహ్మణ దంపతులు, చనిపోయిన తమ కుమారుని దెచ్చి రామచంద్రుని ద్వారము ముందుబెట్టి దీనులై కన్నీరు మున్నీరుగా ఏడ్చుచు హా కుమారా! నీవంటి తెలివి తేటలు గల కుమారుడు మావంటి దౌర్భాగ్యులకు దక్కునా? నీ కొఱకు మేమెన్నియో మంచి కార్యములు గావించి నిన్ను కన్నాము ఐదు సంవత్సరముల బాలుడెక్కడ? వానిచావెక్కడ? ప్రపంచములో నెచ్చటనైనను ఇట్టి విచిత్రవములు జరుగలేదే! తల్లిదండ్రులకు సద్గతులు వచ్చుటకు కుమారులుండి కర్మక్రియలు సేయవలెనుగాని, ఈవిధముగా పుత్రశోకముతో తండ్రి కుమారునకు పరలోక క్రియలుగావించుట కుమారునకు దహనాది క్రియలు గావించుట తటస్థించినదా! ధర్మ రక్షణ యందు రామచంద్రుడు విష్ణునితో సమానుడని చెప్పగా వినియుంటిమి. ఆ దృష్టాంత మిపుడు నీ మరణమువలన అబద్ధముగాతోచుచున్నది.

రాజు తన రాజ్యమందు వర్ణాశ్రమ ధర్మములను చక్కగానడుపని యెడల ఆ ధర్మము దిగజారిపోయి అది దోషమునకు గుఱియగును. ఆ దోషము రాజుగారికంటును. రాజునకు దోషమంటినందు వలన అది బ్రాహ్మణులకు సంక్రమించును. ఆ అధర్మమెక్కడా జరుగనీయక రాజు కడుజాగ్రత్తగా పరిశీలించు చుండవలెను. ఆ పరిశీలనా లోపమే నీ మృత్యువునకు కారణము.

రామచంద్రా! సూర్యవంశీయుడగు రామచంద్రుడు రాజ్యమేలెడు కాలములో బ్రాహ్మణ బాలకుడు మరణించెనను శాశ్వత కీర్తినీకేదక్కుగాక! ఇది వరకు మునుపటి సూర్య వంశీయుల కాలములో నెన్నడును నీ హయాములో వలె శిశు మరణాలు జరుగలేదు. ఈయమోఘ దుర్ఘటన నీకాలములో జరిగినది. అయ్యా! సత్యము ధర్మము దయ యనునవి రాజు నిర్వర్తించు చుండెనేని ఈవిధముగా బాలురకు చావురాదు.

వేయి మాటలెందుకు. ఈ బాలున కగ్ని సంస్కాము చేసి అందులో మేముకూడ ప్రవేశించి ప్రాణములను వదలెదము. అందువలన బాలునితోపాటు మా యిరువురి మరణముతో నీకు మొత్తము మూడు బ్రాహ్మణ హత్యలు కలుగును. ఆ హత్యలున్నను నీవు సుఖముగా రాజ్యాపాలన చేసుకొనుము అని ఆ బ్రాహ్మణ వృద్ధులు రామచంద్రుని ఎత్తిపొడుపు మాటలాడుచు దుఃఖించుచుండిరి.

అదే సమయమున రామచంద్రుని చూచుటకు మార్కండేయాది మహామునీంద్రులరుదెంచిరి. రామచంద్రుడు వారికి సాదుమర్యాదలు జేసి వారిని సుఖాసనాశీనులను గావించి తరువాత బ్రాహ్మణ బాలకుడు చనిపోవుటను గూర్చి చర్చించిరి. ఇందుకు కారణమేదైయుండవచ్చునని వారికి నివేదించెను.

వారది ఆలోచించి శూద్రుడు తపస్సుజేయుచుండవచ్చును అదిగమనించి దీనిని చక్కదిద్దుము అని మునీంద్రులు దెలిపిరి.

## రచయితనైన నా అభిప్రాయము వినండి

ఎవడో శూద్రుడు తపస్సును వాని శ్రేయస్సు కొఱకు చేసికొన్నాడు. కానీ వాడు బ్రాహ్మణులకు కీడుతలపెట్టి చేయలేదు. ఆ ఉద్దేశముతో చేసివుండేవానిది తప్పుగా భావించాలి. తన జన్మనుతరింపజేసికొనుటకు చేశాడు. అట్లువాడు తపస్సు జేసినందుకు బ్రాహ్మణ బాలకుడు చావడం ఒకదాని కొకటిపొసగని విషయం. ఏలనగా ఈ బ్రాహ్మణుని కుమారుడే ఎందుకు చావాలి. ఇంకా బ్రాహ్మణు లెందరో ఉన్నారు వారి కుమారులెందుకు చావకూడదు. అట్లు జరుగలేదే అట్లుంటే

బ్రాహ్మణబాలకులందరు చావాలి. అప్పుడు శూద్రుని తపస్సు ఫలితంగా ఈయనర్థము జరిగిందని చెబితే కొంత వరకు సమంజసముగా నుండునేమో! విజ్ఞులు గమనించాలి.

ఇది యెవరో శూద్రద్వేషి బ్రాహ్మణులు దీనినీవిధముగా కల్పించి యుండ వచ్చును. ఈ కల్పితము శ్రీరామునకు అపకీర్తిని అంటగట్టినట్లైనది. దీనిని నేను రచయితగా త్రోసి వేయలేను. ముందే ఇందులో వ్రాయబడియున్నది కాబట్టి రచయితగా సమర్థించనూలేను. ఏలనగా ఎవడో తపస్సుచేసితే ఈ బ్రాహ్మణ బాలకుడు చావడానికి సంబంధముండవచ్చునని ఒప్పుకోలేం. ఈ వివాదమును బుద్ధిమంతులకే వదిలేస్తాం. బ్రాహ్మణుడు రామచంద్రుని నిందించిన పద్ధతికూడ సహించే పద్ధతిలో లేదు. అయ్యా! వర్ణాశ్రమ ధర్మాలను సక్రమంగా నడుపకపోతే ఇలాంటివి జరుగుతూ ఉండవచ్చు. ప్రభువులైన మీరు పరిశీలించి కనిపెట్టి అలాంటి దానిని అరికట్టమని తన బాధను రాజుగారికి నివేదించవలెనేగాని మాబిడ్డతో పాటు మేము అగ్ని ప్రవేశము చేసిచస్తాము. అప్పుడు నీ కుమారుడు బ్రాహ్మణ హత్యా దోషములంటగలవు అని రామచంద్రుని బెదరించుచు నిందించుట సమంజసమా? ఇక నా విద్యుక్త ధర్మమైన రచనను సాగిస్తాను.

ఓ రాఘవేంద్రా! పాపాలునీకంటవు. యుద్ధమునందు మరణించిన వానరులను బ్రతికించినా బ్రాహ్మణకుమారుని బ్రతికించుట నీకొకలెక్కగాదు. ఇది రాజ ధర్మములను గూర్చి తెలియుట అనినారద మహర్షి శ్రీరామునకు దెలిపెను.

రామచంద్రుడు బ్రాహ్మణుని బిలిచి బాలకుని శవమును చెడకుండా నూనెలో బెట్టింపుము అనియాజ్ఞాపించి తన మనస్సులో పుష్పక విమానమును దలచెను. వెంటనే విమానము హాజరయ్యెను. పట్టణ పరిరక్షణకు లక్ష్మణ భరతులను నియమించి సుమంతాది మంత్రులను విమానములో నెక్కించుకొని భూమి నంతయు తిరుగుచు నొకచోట నొకకొలను నడుమ ఆహారము లేనందున దేహము కృశించి వెంట్రుకలు పెరిగిజడలు గట్టి ఉగ్రాచారముతో తలక్రిందికి బెట్టి కాళ్ళుపైకి బెట్టి తెల్లని శరీరము గల్గి దేవత్వముతో ఓంకారంతో చలింపని మనస్సుతో ఉగ్రతపస్సు జేయుచున్న ఓ పురుషుని శ్రీరామచంద్రుడు జూచెను.

ఇట్లు కఠోరతపస్సుజేయుచుండిన శూద్రతపస్వికి అక్షర తత్త్వంబైన రామచంద్రుడు ప్రత్యక్షమయ్యెను. వాడు సేయుచున్నతపంబున కాశ్చర్యపడెను. విమానము నుండి దిగి రామచంద్రుడు కొలనిగట్టున నిలిచి శూద్రతపస్విని జూచి

ఇతడు సామాన్యుడు కాదని తెలిసికొని ఓ నియమ నిష్ఠలలో గొప్పవాడా! నీవేమి కోరి తపస్సుజేయుచున్నావు? ఏకులము వాడవు? బొంకకనాతో నిజము దెల్పుము. నేనెవరినో చెప్పుచున్నాను వినుము దశథుని కుమారుడను రామ చంద్రుడను. నీ తపమును జూచుటకిటవచ్చియున్నానని తెలుపగా.

**తపస్వి:** ఓ రామచంద్రా! మంచి నీతిశాలివగు నీతో నేను బొంకవచ్చునా. నిజమునే చెప్పుచున్నాను. నేను శూద్రుడను. నాపేరు శంబుకుడు. నేను బొందితో స్వర్గమునకు పోవలెనను కోరికతోతపస్సు జేయుచున్నాను అని తెలుపగా రామచంద్రుడు తన మనస్సులో నీవిధముగా భావించెను. ఇంత వినయముగల తపోధమనినేనెట్లు సంహరించవలెను. రాజైపుట్టుట చాలా నిందింపదగినది అని తనమనస్సులో బాధపడి మరలా బ్రాహ్మణబాలకుని మరణమును తనమనస్సులో జ్ఞప్తికి దెచ్చుకొని తనఒరలో నుండిన కత్తిని దీసి తనచుట్టుగల వారందరును జూచుచుండ శూద్రత పస్వికంఠమును కఱుక్కున తెగనఱికెను. అతని శరీరము నుండి పారినరక్తముతో ఆకొలని లోనినీరంతయు ఎరుపెక్కెను. దేవతలు రామచంద్రుని పొగిడిరి.

**దేవతలు :** ఓ రామచంద్రా! నీచేత ఖండింపబడిన శూద్రతపస్వి బొందితో స్వర్గమునకు బోవుచున్నాడు చూడుము పాపాత్ములను చంపి పవిత్రులను చేయు నిన్ను మెచ్చుకొని నీకువరము లియ్యదలచితిమి కోరుమనిరి.

**రామచంద్రుడు :** మీరు నాకు వరములియ్య దలచితిరేని బ్రాహ్మణ బాలకుని బ్రతికింపు మని కోరెను.

**దేవతలు :** నీ మాటకు మారుగలదా! నీవు శూద్రతాపసిని ఖండించినపుడే బ్రాహ్మణ బాలకుడు బ్రతికి యున్నాడు. నీ మనస్సు నందుగల కలత విడిచి నెమ్మదిగా నుండుము అని రామచంద్రునకు దెలిపిరి.

ఓ రామచంద్రా! అగస్త్యమునీంద్రులవారు పండ్రెండు సంవత్సరములు యాగదీక్షను పూనియుండెను. ఆదీక్ష ఈ దినముతో సమాప్తమైనది. ఈ దినమే పూర్ణాహుతిగావింపబడినది. నీవు యాగభర్తవు యాగభోక్తవు. యాగఫలప్రదాతవు. ఇవియన్నియు నీ స్వభావగుణములు. కావున మనమందరమచటికి పోవలెను అని యాగహవిస్సులను తీసికోవలసిన దేవతలుదెలుపగా రామచంద్రుడు సరేయనెను. అందరును ఆపుష్పక విమానములో ఆసీనులైరి.

విమానము పోవుచున్నది. అనేకములైన జాతులుగల ఫలవృక్షములతోను పనస, మద్ది, టేకు, చందనము, ఎఱ్ఱ చందనము, జాలారి, మామిడి వగైరా వృక్షములు, తీగలు, గురువెందలాంటి పొదలు, సింహములు, పులులు, ఏనుగులు, దుప్పలు, ఖడ్గమృగములు వంటి జంతువులతోను గండభేరండ మొదలగు పక్షులుతోను మరియు చెంచులు నివసించుచున్న ఒక మహారణ్యమును రామచంద్రుడు చూచెను.

## గ్రద్దకు, గూబకు తగవు దీర్చిన శ్రీరామచంద్రుడు

ఆ యరణ్యములో నుండి ముందుగా నొక గ్రద్ద విమానమునకెదురుగా వచ్చి రామచంద్రునకు నమస్కరించి ఒక ప్రక్కగా నిలబడెను. ఇంతలో నొక గ్రుడ్లగూబ వచ్చి రామచంద్రునకు నమస్కరించి మరొకవైపున నిలిచెను.

**గ్రద్ధ :** ఓ రామచంద్ర! నీవు దుర్మార్గులను శిక్షించుచున్నావు. దేవతలను ఋషులను సాధువులను రక్షించు చున్నావు. నీవు సాక్షాద్విష్ణుమూర్తివి. కావున నిన్నింతటి వాడని పొగడుట మా బోంట్లకు సాధ్యముగాదు. నీవు విద్య యందు బ్రహ్మదేవునికంటె, రౌద్రమునందు రుద్రునికంటె, గంభీరమునందు సముద్రుని కంటె, ఓర్పునందు భూమికంటె, ధైర్యము నందు మేరువుకంటె, సంపదయందు కుబేరుని కంటె, దండనయందు యమధర్మరాజుకంటె, తేజమునందు సూర్యునికంటె, కీర్తియందీశ్వరునకంటే గొప్పవాడవు. ఈ ప్రపంచమును సృష్టించి పోషించి లయింపజేసే కర్తవు. కాన నావిన్నపమొకటి వినుము.

ఈ గూబ నేను కట్టుకొన్నయింటిలో (గూటిలో) ప్రవేశించి నన్నులోపల పోనీయక వాకిటి యందడ్డుపడి నాతో పోరాటముగావించు చున్నది. నాకు దిక్కులేదు. బలంలేదు. దుర్బలస్య బలం రాజాయని ఆర్యోక్తి నాయిల్లును నాకిప్పింపగోరు చున్నానని గ్రద్దచెప్పుచుండగనే

**గూబ (దివాంధము):** ఓరామచంద్ర ప్రభూ! నీవు దేవేంద్రునంశతో సమస్తభోగములననుభవించెదవు. అగ్ని దేవునంశతో పవిత్రతకలిగియుందువు. యముని యంశతో ధర్మమును రక్షింతువు. నైరుతియంశతో అవినీతిని నిర్మూలింతువు. వరుణునియంశతో వర్షమును కురియింతువు. వాయు దేవునంశతో బలవంతుడవై, కుబేరునంశతో మహాధనవంతుడవై, ఈశ్వరునంశమున సంపద గలవాడవై, చంద్రుని యంశతో శాంతమూర్తివై, సూర్యనంశమున ప్రతాపము

గలవాడవై సమస్త శుభలక్షణముల సమూహమైన నిన్ను పొగడుటకు బ్రహ్మదేవునకైనను సాధ్యముకాదు. నాలాంటి పక్షికి సాధ్యమగునా!

లక్ష్మీదేవిని చూచినట్లు నీకడకంటి చూపులతో శిష్టులను చూచి రక్షింతువు. దుష్టులను చూచినప్పుడు రోషముతో నీకన్నులెఱ్ఱపెక్కును. శిష్టులను జూచినపుడు నీమనస్సు శాంతించును. నీపలుకులు దుష్టులు విన్నప్పుడు కోపముగా మాట్లాడినట్లుండును. నీముఖము దుష్టులకు కోపముగాను శిష్టులకు శాంతముగాను కనబడును. నీవు సమస్త జీవులందును సమానముగా నుండియు ధర్మమును స్థిరముగానిలబెట్టుట కొఱకు నీవిన్ని గుణములు గల్గియున్నావు.

ఓ ప్రభూ రామచంద్రా! బ్రహ్మయేనాడు పుట్టెనో ఈ భూమి యేనాడు నిర్మాణమయ్యెనో ఆనాడే నిలుచుటకు నీడగా నుండవలెనని నేనీయిల్లు కట్టితిని అని గ్రద్ధ దెలుపగావిని.

**గూబ:** ఓ రామచంద్రా! నేను నీయెదుట అబద్ధమాడను. ఈ భూమిని, భూమి యందు వృక్షములను, బ్రహ్మయే దినమున సృష్టించెనో ఆ దినమున నేనీవృక్షముపై నిల్లుగట్టితిని అని గూబదెలిపెను.

ఇట్లు గ్రద్ధయును గూబయును తెలిపిన విధమును విని రామచంద్రుడు మంత్రులవైపున జూచి ధర్మము దెలిసిన మహనీయులారా! భూమి మీద వృక్షములు పుట్టినప్పుడు వృక్షముల పై ఇల్లు కట్టితినని గూబదెల్పుచున్నది.

ఈ భూమి పుట్టినప్పుడే వృక్షము మీద యిల్లుకట్టితినని గ్రద్ధ దెలుపుచున్నది. ఈ రెండిటిలో నిజము ఏదైయుండవచ్చును. తగవులు దీర్చునప్పుడు వీడు మావాడు వాడు పరాయివాడని స్వపర భేదములు లేక రెండు పక్షములను సమానముగా భావించి తగవును తీర్చువారీలోకమునందు కీర్తిమంతులైపరలోకమున సౌఖ్యమును పొందెదరు. తీర్పుజెప్పెడువాడు వాది ప్రతివాదుల వ్యవహారమును చక్కగావిని న్యాయమెవరిదో, అన్యాయమెవరిదో బాగుగా పరిశీలించి ధర్మమును తప్పక తాను చెప్పి తీర్పును వినినవారు ఔరా! అని ఆశ్చర్యపడునట్లు తీర్పుచెప్పెడు సజ్జనులగు వారు ప్రపంచములో చాలా కీర్తిపొందెదరు.

అట్లుగాక న్యాయాన్యాయములు తెలిసి యుండియు, తప్పెవరిదో తెలిసియుండియు, నిజముగాన్యాయవంతుల పక్షమున తీర్పుజెప్పక మొగమోటము గలిగిగానీ వీరుతన వారనిగానీ అధర్మ పక్షమున తీర్పు జెప్పెడువారు

ఈలోకమునందు అపకీర్తి సంపాదించుకొని మరణానంతరము నరకమునకు బోయెదరు. నిజమిట్లుండగా ఏమెమో కొన్ని చెడు యుక్తులు కల్పనలుజేసి న్యాయము యదార్థమొకటిగానుండగా మఱియొక విధముగా సరిపోలని కల్పనలు చేసి తనవారిని రక్షించుకొనుటకై చమత్కారముగా మాటలాడి రచ్చల యందు ధర్మముగా తీర్పుజేయక అధర్మముగా తీర్పుజేసెడువారు వరుణదేవుని త్రాళ్ళతోకట్టబడి నరకముననుభవించు చుండెదరు. కావున మీరున్న దున్నట్లుగా గ్రద్దకును, గూబకును కలిగిన వ్యవహారము తీర్చుమని శ్రీరామచంద్రుడు మంత్రుల కాజ్ఞాపించెను.

రామచంద్రుడిట్లు తన యెనిమిది మంది మంత్రులనాజ్ఞాపింపగా వారు కొంతసేపాలోచించి ప్రభూ! గూబయే గెలిచినది. ఇల్లు కొఱకు గ్రద్దయే అసత్యమాడినది. దీనిని మీరు దండింపవచ్చును అని మంత్రులు తెలిపిన మాటకు రామచంద్రుడును సంతోషించి మీరు చెప్పినదేనిజము. నామనస్సులో నున్నట్లే మీరును తీర్మానించితిరి.

అదియెట్లనగా, గూబ వృక్షము పుట్టిన తరువాత ఇల్లుకట్టితినని నిజము చెప్పినది. కానీ ఈ గ్రద్ద భూమిపుట్టగానే చెట్టుపుట్టకనే ఇల్లు కట్టినదట. కావున అబద్దమాడిన ఈ గ్రద్దను చంపక విడువకూడదు.

జల ప్రళయము జరిగినప్పుడు విష్ణుదేవుడు నీటిలో పరుండియుండగా ఆ దేవుని గర్భమునందు బ్రహ్మదేవుడు కొన్నికోట్ల సంవత్సరములుండి బయటబడు త్రోవదెలియక వెదకు సమయమున విష్ణు దేవుని బొడ్డునందు బంగారు తామరపువ్వుబుట్టెను. ఆ పువుకాడలో గల రంధ్రమునుండి బ్రహ్మదేవుడు వెలికి వచ్చుచుండగా మధుకైటభులను వారు బ్రహ్మను అదలించుచుండిరి.

వారి అరుపులకు విష్ణుదేవుడు నిద్రమేల్కొని కోపముగలవాడై చక్రా -యుధముతో వారిని ఖండించెను. అప్పుడా రాక్షసుల తలలో గలమెదడంతయు మేథిని అను పేరుతో భూమిగా తయారయ్యెను. ఈ భూమియందు కొండలు వృక్షములు గడ్డిని బ్రహ్మదేవుడు తయారుచేసెను. అటు తరువాత సమస్త జంతుజాలము, జీవరాసులు తయారయ్యెను అని రామచంద్రుడు వారికి సృష్టిక్రమమును తెలిపి ఈ గ్రద్దను నాఖడ్గముచే తెగవేసెదనని శ్రీరామచంద్రుడు కత్తిచేత బట్టి ఖండించుటకు ప్రయత్నించుచుండగా ఆకాశవాణి యిట్లనెను.

ఓ రామచంద్రా! నీ వీగ్రద్దను చంపవద్దు. ఈ గ్రద్ద ముందొక రాజు అతడు రాజశరీరమును విడిచి ఇప్పుడీగ్రద్ద శరీరములో నున్నాడు. ఇతని పూర్వ చరిత్రవినుము.

ఇతడు బ్రహ్మదత్తుడు అను పేరుగల మహారాజు. శత్రువులను జయించి సత్యవంతుడై రాజ్యమునేలుచుండెను. ఇతడు మంచి కీర్తిగలవాడు ఒకనాడు గౌతమమునీంద్రుడీయన వద్దకు వచ్చి నాకు అన్నముపెట్టుమని కోరెను. ఆయనకీరాజు నూట యిరువది సంవత్సరములు అన్నము బెట్టి పోషించెను.

ఇట్లుండగా ఒకనాడు మునీంద్రునకు పెట్టిన అన్నములో ఎటులనో ఒక మాంసపుముక్క కనబడెను. దానినతడు చూచికోపించి నీవునాకు అన్నములో మాంసపు ముక్కను పెట్టితివి. కావున నీవు గ్రద్దవై పుట్టి మాంసమును తిని జీవించుమని దయలేని వాడై శపించెను. ఆ శాపమునకు రాజు భయపడి స్వామీ! తెలియక అపరాధము జరిగినది. అదినేను తెలిసి చేసిన తప్పుకాదు. నన్ను క్షమించి శాపమునుపసంహరింపుమని వేడుకొనెను. మునీంద్రుడు దయగలవాడై శాపవిమోచనమును తెలిపెను.

ఓరాజా! ఆ దయామయుడైన మహా విష్ణువు దశరథ కుమారుడై పుట్టి రాక్షస సంహారముచేసి కార్యార్థముగా నీవున్నదారిన పోవునప్పుడు గూబతో తగవుపడి ఆరామచంద్రునితో తగవులు తీర్చుమని పోయిన ఆ రామచంద్రుడు తీర్పు చేయునప్పుడు నీమీద అపరాధము నిరూపింపబడి, ఆయన చేయినీమీద తగులగానే గ్రద్ద రూపముబోయి నీరాజ రూపము నీకురాగలదు అని శాప విమోచనము తెల్పియున్నాడు. అందువలన గ్రద్దను ఖండింపక నీచేయితో స్పర్శింపుడు. గ్రద్దకు శాపముతీరి రాజుకాగలడు. గూబకు విరోధిలేకుండా పోవును. అందువలన నీవీవిధముగా తగవు దీర్చి న్యాయముచేసిన వాడవగుదువని ఆకాశవాణి తెలుపగా విని రామచంద్రుడు దయగలవాడై ఈ భూమండలంతటిని యేలుచున్న తన కుడిచేతితో నీకు శాపవిమోచన మగుగాక! అని గ్రద్దశిరస్సుపై రామచంద్రుడు తన చేయి నిమిరెను.

ఈ విధముగా బంగారుటుంగరములు గల తన చేయిని గ్రద్ద తలమీద తాకించగానే సూర్యుని వలెవెలుగులు విరజిమ్ముచు గ్రద్దరూపును విడిచి రాజురూపమును ధరించెను. ఆ పుణ్యపురుషుడు పురుషోత్తముడైన రామచంద్రుని పాదములకు నమస్కరించి స్వామీ! నాకష్టములు గట్టెక్కినవి. నాకు శుభము

చేకూరినది. నేను రాజురూపముతో పట్టణమునకు పోయెదను. నాకు సెలవొసంగుమని ప్రార్థించగా రామచంద్రుడాశీర్వదించి పంపెను.

## శ్రీరాముడగస్త్యాశ్రమమునకు బోవుట

బ్రహ్మదత్తుడిట్లు వెళ్ళిన తరువాత దేవతలు రామచంద్రుడును పుష్పకవిమాన మెక్కి అగస్త్యాశ్రామమునకు పోయిరి. అప్పటికగస్త్యుని యజ్ఞము పూర్తియై పూర్ణాహుతి ముగిసియుండెను. అందువలన హవిస్సులను ఎవరెవరికి కావలసిన భాగములను వారు పంచుకొని దేవేంద్రాదులు దేవలోకము చేరిరి. తరువాత రామచంద్రుడగస్త్యునకు నమస్కరింపగా ఆయన నాశీర్వదించి ఆ రాత్రి రామ చంద్రుడతిథిగా ఆయనకగస్త్యుడు కందమూలాది ఫలములు సమర్పించి తృప్తునిజేసి తరువాత ఓ రామచంద్రా! నా మీద దయవలన కదా పిలువకనే మీరిచ్చటికి వచ్చితిరి. ఇప్పుడు మీకు నేనేమి సత్కారమును సేయగలను. ఐనను విచిత్రమైనదియు రత్నములతో తయారుసేయబడిన హారము ఒకటున్నది. ఇచ్చెదను స్వీకరింపుమనగా.

**రామచంద్రుడు:** మహాత్మా! రాజులు మునీంద్రులకు (బ్రాహ్మణులకు) దానమివ్వవలెను కానీ రాజులు బ్రాహ్మణుల వద్ద దానము తీసికొనవచ్చునా? అనగా రామచంద్రా! రాజులో కుబేరాంశయున్నది. కావున రాజు దానమిచ్చుటకును తీసికొనుటకును అర్హుడేయని తెలిపెను అదియెట్లనగా.

## అగస్త్యుడు శ్వేతకేతుడును రాజర్షి వృత్తాంతము రామునకెరిగించుట

పూర్వము భూపరిపాలనకు రాజు లేనందున బ్రాహ్మణులు బ్రహ్మయొద్దకు పోయి స్వామీ! దేవలోకము నేలుటకు దేవేంద్రునివలె భూలోకమునేలుటకు రాజును దయసేయుమని ప్రార్థించిరి. అప్పుడు బ్రహ్మదేవుడు, దేవేంద్రుని యమ ధర్మరాజును వరుణుని కుబేరుని పిలిపించి మీయంశలలో ఒక్కొక్కరు నాలుగింట ఒక్కొక్క భాగమునియ్యవలెను. మీ యంశలను కలిపి నేనొక రాజును స్పష్టించెదను అనియనగా వారటులనే కావించిరి. వారి యంశలను తీసికొన్న బ్రహ్మ బుక్షువుడనే రాజును సృష్టించెను. అతడు బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారము భూలోకమునకదిపతియై ఇంద్రుని యంశతో ఐశ్వర్యము తృప్తి దాతృత్వము, వరుణుని యంశతో శత్రునాశనము, యముని యంశతో ధర్మపరిపాలన, కుబేరునంశతో దానధర్మాదుల నిచ్చుట, తీసికొనుట కలిగియున్నవి. కావున రాజులు ఎవ్వరిచ్చినను తీసికొన

వచ్చును. నీవు అందరివలె రాజు మాత్రుడవేకావు. సాక్షాద్విష్ణు మూర్తివి. కావున ఈ పవిత్రమై నహారమును దయతో స్వీకరింపుము. అని అగస్త్యుడు కోరగా రామచంద్రు డాహారమును తీసికొని ధరించి మహాత్మా! ఈ హారమెక్కడిది? దీని వృత్తాంతమునాకు దయతో తెలుపుమని యడుగగా ఓరామాచంద్రా ! కృతయుగము చివరి యందు నేను తపస్సుచేసి కొనుటకు తగిన చోటును వెతికికొనుచు పోయి నూరు యోజనముల విస్తారముగల అరణ్యమును చూచితిని. ఆయరణ్యములో మనుష్యులుగాని, పక్షులుగాని, మృగములుగాని లేకుండుట చూచి ఆశ్చర్యపడుచు పోయి ఒకకొలనును జూచి ఆ కొలనులో దిగి స్నానదికాములాచరించివచ్చితిని ఆ కొలనొక యోజన విస్తారముగానుండెను. నేనచ్చోటునుండి వెదకుచు కొంతదూరము పోగా అచట పూజకు యోగ్యమైన తపోవనముకనబడెను. అందెవ్వరును లేరు. ఇటువంటి తపోవనము నందు ఋషీశ్వరులు లేకుండుటకు కారణమేమైయుండ వచ్చునని తలంచుచు అందలి ఫలములను తిని ఆకలి తీర్చుకొని ఆరాత్రి అచటనే యుండి మరునాడుదయమున స్నానము జేయుటకై ఆ కొలనికి పోవుచుంటిని. మంచి ప్రాయములో నుండి చనిపోయియున్న నొకశవము త్రోవలో నాకగపడెను. చూచితిని నాకశ్చర్యము గలిగెను. ఆహా! ఈ శరీరములో నుండి శరీరి ఎప్పుడు పోయినది. ఈ శవమింకను చెడకుండుటకు కారణమేమై యుండును అని నేనాలోచించు చుంటిని. అంతలో నాకొక విమానము కనబడెను అందులో నొక దివ్య పురుషు డుండెను. అతనికి దేవతాస్త్రీలు వింజామరలు విసరుచుండిరి. ఇట్లతడు దేవేంద్రవైభవముతో వచ్చి ఆశవమును కోసుకొనితిని మరలాస్వర్గమునకు బోవుటకు ప్రయత్నించు చుండెను. నేనా దివ్యపురుషుని జూచి అయ్యానీవెవరు? నీకింతవైభవము కలిగియుండియు అసహ్యమగు మనుష్యమాంసము తినవలసిన గతి నీకేలపట్టినది? అని నేనడుగగా అతడు సిగ్గుతో తలవంచుకొని నమస్కరించుచు ఇట్లనెను.

ఓ మునీంద్రా! వినుము పూర్వము విదర్భ దేశాధిపతి సుదేవుడను. రాజుండెను అతనికిద్దరు భార్యలుండిరి. ఆ భార్యల యందు శ్వేతకేతుడనియు, సురదుడనియు ఇద్దరు కుమారులను కనెను వారిలోనేను శ్వేతకేతుడను వాడను. మాతండ్రి ధర్మపాలనము సాగించుచుండెను. ఆయన అనంతరము నాకు రాజ్యాభిషేకముగావించిరి. కొంతకాలము నేనుకూడ మాతండ్రివలెనే పాలించితిని. తరువాత ఆరాజ్యమునేను నాతమ్మునకప్పగించి అరణ్యమునకు వచ్చి మూడు వేలసంవత్సరములు తపముగావించి శరీరమును విడిచిదైవత్వమును బొందితిని.

నేనింత వైభవముతో నుండియు నన్నాకలియెక్కువగా భాదించుచుండెను. దేవతలకాకలి దప్పలుండవు కదా? నాకెందుకు ఇంత ఆకలియగు చున్నదని ఆలోచించి బ్రహ్మదేవుని వద్దకు పోయి ఆయనతో స్వామీ నేను దైవత్వమును పొందియుండియు, ఆకలి దప్పలు కలుగుచున్నవి. కారణమేమని యడిగితిని. బ్రహ్మదేవుడు రాజా! అతిధులకన్నము ఎల్లప్పుడును ఎడతెగకపెట్టెడు సంపద కల్గియుండియు నీవొకరికిగాని అతిథి సత్కారము సేయలేదు. దప్పిగొన్న వారికి నీరైనను ఇచ్చి యుండలేదు. సాధువుల నెవ్వరినిగాని నీవు ఆదరించలేదు. కావున నీవిపుడీ ఆకలిదప్పలతో బాధపడుచున్నావు. నీకు దేవుడు అనగా నెవ్వరో తెలిపెదను వినుము.

ఆకలగొన్నవాని కన్నమును, దప్పికగొన్న వారికి నీరును ఇచ్చి రక్షించిన వాడే దేవుడు. కానీ నీవు దైవత్వము పొందవలెనని చేసిన తపము అన్నదానము చేసిన ఫలితముకంటె తక్కువేయగును. అతిథియగు వాడలసిపోయి తనయింటికి వచ్చినప్పుడు తనకు దేవుడిచ్చిన మాత్రములో ఆయతిథికన్నముగాబెట్టి దప్పిక తీర్చి అతని దేహము చెమటలారునటుల చల్లపరుపక ఆ యతిథిని జూచి నీవెవ్వరు ఇక్కడికెందుకు వచ్చితివి అనికేకలు వేయుచు, ఇంటిలోనికి రానీయక క్రూరుడై దుష్టుడుగా నుండిన గానీ (లేక) చచ్చిగానీ లోకమునకేమి ప్రయోజనము నీవెవరికిని అన్నదానము సేయనందున నిన్నాకలి బాధబాధించుచున్నది. నీవు తపస్సు గావించిన వనముందేనీశరీరమున్నది. నీవక్కడికి బోయి, దానిని కోసుకొనితిని, ఆకొలనిలోని నీరుద్రాగి ఆకలి దప్పలు తీర్చుకొనుము. ఈ విధముగా నీవు ప్రతినిత్యమును ఆశరీరమును కోసి తినుచుండుము. అట్లు సేయుచున్నను, నిన్నటి దినమున నీవు కోసి తినిన మాంసమును మరసటి దినము నీవు పోయి చూచునప్పటికి మరలా వృద్ధిచెంది కోయని శరీరమువలె ముక్కలేక పూర్ణముగానుండును. ఇట్లు కొన్ని సంవత్సరములు తినుచుండుము. ఒకానొక సమయమున అక్కడికగస్త్య మునీంద్రుడు రాగలడు. ఆయన నీతో మాటలాడినప్పుడు నీకుగల ఆకలి దప్పలు శాశ్వతముగా తీరిపోవును. నీవాశవమును ఆనాటినుండి కోసి తినవలసిన పనిలేదు. ఎవరెవరు జేసికొన్న పాపపుణ్యములు వారననుభవింపక తప్పదు. కావున నీవిక బాధపడవలదు. పొమ్మని బ్రహ్మదేవుడు తెలుపగా ఆనాటి నుండి యీ హీనమ్మైన ఆహారమును తినుచున్నాను. కావున ఓ మహాత్మా! నీవెవరో తెలుపుము. ఆ బ్రహ్మదేవుడు తెల్పిన అగస్త్య మునీంద్రులవారు మీరై యుండవచ్చును కదా! లేకున్న ఇంత నిర్మలమైన మనశ్శాంతియు గంభీరమును ఇతర మునీంద్రుల యందు

కనిపించునా అని నమస్కరించెను. మహాత్మా! దానమిచ్చుటకు తగిన వారికి దానమియ్యక పోవుటవలననే కదా నాశరీరమును నేనే కోసితిన వలసి వచ్చినది. కావున ఈ విచిత్రమైన భూషణమును తీసికొని నన్ను కాపాడుమని అతడు హారమును నాచేతిలో బెట్టులోపలనే ఆ పీనుగు అదృశ్యమయ్యెను. అది చూచి శ్వేతకేతుడు సంతోషించి స్వామీ! మీదర్శన భాగ్యము వలన నా కాకలి దప్పులు తీరెను. ఇప్పుడు నేను దైవత్వము పొందిన సౌఖ్యము కల్గినది. ఇదంతయు మీ ప్రభావమే యనినమస్కరించగా నేను ఆశీర్వదించి పంపించితిని. అతను సంతోషముతో దేవలోకమునకు వెళ్ళిపోయెను.

ఓ రామచంద్రా! దీనిని మీరిప్పుడు ధరించుట వలన కలుగు పుణ్యమును, నాకు దాన మిచ్చిన ఫలితమును, ఆదాత బొందిన సౌఖ్యమును పొందునని అగస్త్యమునీంద్రుడు తెలుపగావిని.

**రామచంద్రుడు:** ఓ మహాత్మా! ఈ యరణ్యము నూరు యోజనముల విస్తీర్ణములో పశుపక్షి మృగాదులుగానీ, ఇతరమనుష్యులుగానీ లేకపోవుటకేమి కారణము? ఏమునీంద్రుడైనా ఈపశుపక్షి మృగాదుల బాధలకు భరింపలేక శాపమిచ్చియున్నాడా? దీనిని గూర్చి విశేషములుండిన తెలుపుమనియడుగగా.

**అగస్త్యమునీంద్రుడు:** ఓ సూర్యవంశీయుడా! పూర్వము సూర్యుని కుమారుడై మనువు జన్మించెను. ఆ మనువుకు ఇక్ష్వాకు అను రాజుపుట్టెను. ఆ యిక్ష్వాకు సమస్త విద్యలందారితేరి శ్రుతి, స్మృతి, పురాణ, ఇతిహాసములను చదివి విలువిద్యలు నేర్చిన ఇక్ష్వాకుతో మనువు ఇట్లనెను.

## అగస్త్యుడు రామునకు దండకారణ్య వృత్తాంతమును దెల్పుట

నాయనా! నీవు ముందు సమస్త విద్యలును చదివియున్నావు. అందులో మొట్టమొదటిది ధర్మము. ఆ తర్వాతది అర్థము. కడపటిది కామముగా భావింపుము. ఏలననగా ధర్మములేకుండా ధనము రాదు. ఆధనము లేకుండా నీకేమి కావలెనని కోరిన ఆవస్తువు రాజాలదు. అది రానందున నీకున్న కోరికనెరవేరదు. కావున నీకు నేను ధర్మమే గొప్పదిగా జెప్పితిని.

కుమారా! ధర్మము వలన ప్రజలకు మేలు కల్గును. దేవతలు మెచ్చుకొందురు. ఆర్యులు ప్రేమింతురు. ధనము కూడబెట్టగా దుష్కార్యములు సేయువారు భయపడుదురు. శత్రువులు సమసిపోయెదరు. తాము కోరిన కోరికలు నెరవేరును. భూలోకమున కీర్తి నిలుచును. శరీరమును వదలిన వారు స్వర్గమునకు

బోయెదరు. మునీశ్వరులు మొదటపరోపకారము సేయుమని చెప్పుదురు. అది పవిత్రమైన తపస్సని చెప్పెదరు. పరులకు కీడు జేయుట పాపమని చెప్పెదరు. కాని పరులకు బాధకదాయని దండించక విడువరాదు. వారి తప్పులకు తగిన దండనసేయవలెను. రాజులు వారిని దండన సేయకూడదని దుర్మార్గులను దండించక విడచుటచేతను, దండనసేయవచ్చునని సన్మార్గుల దండించుట చేతను ఆ రాజునకు నరకము వచ్చును. ఓ కుమారా! రాజులు దండనీతిని దప్పక ఆచరించి భూలోకమున కీర్తియు వారి మరణానంతరము స్వర్గలోకప్రాప్తియు గల్గును. మునుపటి రాజవంశ పద్ధతులివియే కదా. కావున నీవు కూడ అదేవిధముగా వారి పద్ధతిననుసరించి రాజ్యమేలుము. నీవు శౌర్యముగలవాడవని కుమారునకు నీతులు దెలిపి, నీతి విశారదుడవగు మనిమనువు తపస్సునకై వెడలిపోయెను.

ఇట్లు మనువు ఇక్ష్వాకుకు దెలుపగా, ఇక్ష్వాకు తండ్రి చెప్పిన ప్రకారము ప్రజలను పాలించెను. తనకు కుమారులు లేనందువలన పుత్రులు కావలెనను కోరికతో దాన ధర్మములు జేసిక్రతువులు జేసి ఆ పుణ్యమువలన నూరు మంది కొడుకులను గనెను. ఆ నూరు మందిలో చివరివాడు దండుడు. అన్నగారివలె సజ్జనుడుగాకవేదములను చదువక సాధువుల చెంత జేరక మిత్రుల మాట వినక, దండుడు తనకు దోచినట్లు విచ్చలవిడిగా తిరుగుచుండెను. ఆదండుడనెడువాడు ఉద్దండుడై వీధులలో దిరుగు ముదుసలివారి ఊతకఱ్ఱల నూడ బెరికి వారిని పడద్రోచి వారు బాధ పడుచుండగా చూచి వారిని వెక్కిరించును. తమతో ఆడు కొనుచున్న పిల్లలను అకస్మాత్తుగ కొట్టుచుండును. చదువుమని దండించిన తల్లిదండ్రుల నవమానముగా తిట్టుచుండును. సజ్జనుడుగాక ఇండ్లలో చొరబడి మంచి వస్తువులను పారవేయును. వాని ప్రవర్తన తల్లిదండ్రులకు బాధగల్గించు చుండెను. వాని దుష్టచేష్టలకు తండ్రి భరింపజాలక వింధ్యపర్వతము యొక్క దక్షిణ దేశమునకు పొమ్మని పంపివైచెను. దండుడు పోయి వింధ్య పర్వతము మీద మధుమంతంబను పట్టణమును నిర్మించుకొని రాక్షసగురువగు శుక్రచార్యుని పౌరోహితునిగా దీసికొని గొప్ప సంపదగలవాడై రాక్షసులను సహాయులుగా దీసికొని నూరు సంవత్సరములు రాజ్యమేలెను.

దండుడిట్లు రాజ్యమేలుచుండి ఒకనాడు తనగురువు గారగు శుక్రాచార్యుని ఆశ్రమమునకు బోయి అచట సరదాగా తిరుగుచుండెను. అచటనొక యౌవనవతి

కనిపించెను. అతడామె వద్దకు బోయి ఓ జవ్వనీ నీవెవ్వతెవు! నిన్ను జూచినప్పటి నుండి నీమీదనాకు మనస్సుబడినది. నీవు నన్ను భర్తనుగా జేసికొనుమని దండుడడుగగా ఆమె భయపడి నేను శుక్రచార్యుని పెద్దకుమార్తెను. నా పేరు అరజ. మా తండ్రిగారి యాజ్ఞచొప్పున నేనీవనములో తపస్సు జేసికొనుచున్నాను. నీవుతప్పక నన్ను వివాహమాడవలెనన్న మా తండ్రిగారినడుగుము అని అరజ చెప్పగా ఆమె చెప్పిన మాటలు వినక అక్రమముగా నామెను చెరచెను.

అరజ తన తండ్రి వద్దకు బోయి జరిగినదంతయు వినిపించి ఆయన పాదములపైబడి బోరుమని యేడ్చెను. అదివిని శుక్రాచార్యుడు మూడు లోకములను మ్రింగివేయువానివలె మండిపడి ఎదుటనున్న శిష్యులతో శిష్యులారా! వింటిరికదా వానికి తగిన శాస్తిగావించెదను. ఆదుర్మార్గుడు వానిసైన్యముతో కలసి మట్టిలో నలిగిపోవునటుల ఈ దినము నుండి ఏడు దినములు మట్టివాన కురియును గాక! వానిరాజ్యము నూరామడల విస్తీర్ణమంతయు మట్టిలో మునిగి పోవుగాక! అనిశపించగా, ఇంద్రుడు ఏడు దినములు ఎడతెగక ఏకధాటిగ మట్టివాన కురిపించెను. వానిరాజ్యమును సైన్యమును నూరామడ విస్తీర్ణము మట్టితో పూడిపోయినశించెను.

అగస్త్యుడు రామావిను. ఆపట్టణమంతయు మట్టిలో పూడిపోయి అదంతయు అరణ్యముగా మారిపోయెను. అది మొదలు ఆ ప్రదేశమున గల యడవికి దండకారణ్యమను పేరుగల్గెను. ఆనాటి నుండి ఆయడవియందు మనుష్య, పశు, పక్షి, సంచారములేనిదైయుండెను. తరువాత అరజ ఆయరణ్యమధ్య ప్రదేశములో తపస్సు జేయుచుండెను. మట్టి వర్షమునకు భరింపజాలక అరజ తపస్సుజేయుచున్న ఆశ్రమము చెంతకు మధుమంత పట్టణములో గల పౌరులందరును పోయి చేరిరి. అందు వలన ఆనాటి నుండి ఆ ప్రదేశమునకు జనస్థానమను పేరుగల్గెను. అరణ్యా సమీపమున నివసించు చుండిన ప్రజలకు ఒకయోజన విస్తీర్ణము నందు మట్టివాన కురవకుండుగాక యని శుక్రాచార్యుడు శాపమును తప్పించెను. కావున కొందరు ప్రజలాయాశ్రమమున నుండి తమ ప్రాణములను కాపాడుకొనిరి. ఆ వర్షము నిలువగానే అక్కడనుండివెడలిపోయిరి.

అరజ తపము జేసిన ఆశ్రమము చుట్టును మట్టి వానలేనందున ఆచోట పల్లముగా నుండి అదియొక సరస్సుగా మారిపోయెను అని రామచంద్రునకగస్త్య మునీంద్రుడు చెప్పగా విని సంతోషముతో ఆ రాత్రి అక్కడగడిపి మరునాడు

దయమున లేచి కాలోచిత కృత్యములు దీర్చుకొని మహాత్మాకోటి తీర్థములతో సమానమైన మీపాదములను తాకి పవిత్రుడనైతిని అనగా!

**అగస్త్యుడు:** రామచంద్రా! నీవు సామాన్యమానవునివలె నన్నెందుకిట్లు పొగడెదవు. మా వంటి వారు నిన్నింతటి వాడని తెలియజాలరు కదా. గంగాదేవి యెవని పాదములో పుట్టెనో, నదులన్నిటికంటె పవిత్రమైనదని పేరుగాంచెనో, మునీంద్రులెవని నిజస్వరూమిట్టిదని తెలియలేక తపస్సు జేయుచున్నారో, ఈ సమస్త ప్రపంచమెవని యాజ్ఞజవదాటలేక తలదాల్చి ప్రవర్తించుచున్నదో, యెవని మహిమ వలన అజ్ఞానులు జ్ఞానులుగా మారుచున్నారో అశ్రీవారివగు నీకునేనర్ఘ్య మిచ్చి నాకన్నులు కఱవు దీరునటుల నిన్నుచూచి చెవులారా నీమాటలు విని నీదయను సంపాదించి ధన్యుడనైతినని తలంచుచున్నాను.

ఓ జానకీరమణా! రామచంద్రా! యెవరు నియమముతో నీనామమును ఓరామాయని జపించు చుందురో అట్టి భాగ్యశాలికి వేదములు పఠించవలసిన పనిలేదు. నిన్నొక్కసారి కన్నులతో జూచిన సుజ్ఞానికి బ్రహ్మజ్ఞాననిష్ఠతో పనిలేదు. భక్తితో నీభజనజేయు బుద్ధిగల వారికి వేరేతపస్సు సేయవలసిన పనిలేదు. నీకటాక్ష మొక్కనిమిషము పొందగల్గినవాడు పుణ్యనదులలో మునుగవలసిన పనిలేదు. నిజముగా నిన్ను కీర్తించుచు నిన్ను గురించి పొగడువానికి అణి మాది అష్టసిద్ధులతో పనిలేదు. నీ పాదతీర్థమును నిత్యమును త్రాగువారికి దేవత్వము పొందవలెనను కోరికలెందుకు? అవియేవియు శ్రీరామభక్తిగల వారికవసరములేదు. ఏలననగా సమస్తమైన పువ్వులయందు గల మధువును విడివిడిగా తేనెటీగలు దెచ్చి ఓకే చోట మధువనే తేనెనుగాచేర్చిన తేనె సులభముగా లభించుచుండ దానిని విడిచి విడివిడి పువుల నుండి తేనెను దీసి త్రాగెదనను వెఱ్ఱివాడుండునా? రామా అను రెండక్షరములలో చతుర్వేదాది సమస్తమంత్రములు కలిసి యుండగా విడివిడిగ తీర్థయాత్రలు వేదాధ్యయనము చేసిన వారికి లభించెడు భాగ్యము రామా అను వాక్యములోలభించు చున్నదని అగస్త్య మునీంద్రుని తీర్పు. రామానిన్ను చూచుచు మరణించిన రాక్షసులను కూడ సాధువులు జేరెడు చోటునవైకుంఠమును చేర్చెడు దయాశాలి వగునీవు నాయింటికి వచ్చి నేను జేసిన సేవలకు మెచ్చుకొని నీవు సంతుష్టి జెందుటవలన లోకములన్నియు సంతుష్టి చెందినవేయగును. కావున పోయిరమ్ము అని గంభీరమైన వాక్యములతో అగస్త్య మహామునీంద్రుడు సెలవీయుగా అచ్చటనుండిన మునీంద్రులందరికి నమస్కరించి వారి వలన రామచంద్రు డాశీర్వాదములను పొంది, తన మంత్రులతో గలిసి పుష్పక విమానము నెక్కి

మధ్యాహ్నపు వేళకు అయోధ్యకు చేరుకొనెను. ఇట్లు శ్రీరామచంద్రుడయోధ్యకు చేరగానే అందరును సంతోషించిరి. ఆనాడు బ్రాహ్మణ కుమారుడు బ్రతికెనని, ఆ బ్రాహ్మణుడాశీర్వదించి వెళ్ళెనని అక్కడనుండిన వారలు జరిగిన దంతయు విన్నవించిరి. ఆ దినము గడచిపోయెను.

అమరునాడు శ్రీరామచంద్రుడు యథాప్రకారము సభాస్థలిక వచ్చి రాజ్య వ్యవహారములు చర్చించి తమ్ములను చూచి తమ్ములారా! మీ వంటి తమ్ములు నాకుండుట వలన నేనిన్ని కార్యములను సేయుచున్నాను. ఇకమీద నేను మీ సహాయమున రాజసూయ యాగమును సేయవలెనని యున్నాను. మీ అభిప్రాయములు దెల్పుమని అడుగగా అన్నను జూచి భరతుడిట్లనెను.

**భరతుడు:** ఓ మహారాజా! సమస్త ప్రాణులకు భూమి అధారము. అభూమికి నీవే ఆధారము. దేవతలను బ్రహ్మదేవుడు కాపాడినట్లు నీవు ప్రజలను కాపాడు చున్నావు. కావున ప్రజలందరును సుఖమును పొందుదురుగాక.

పూర్వము దేవేంద్రుడు ఈ రాజ సూయయాగమును చేసినప్పుడు దేవతలకును రాక్షసులకును యుద్ధము జరిగెను. హరిశ్చంద్రుడీయాగము జేసినప్పుడు చాలామంది రాజులు మరణించిరి. చంద్రుడీ యాగము జేసినప్పుడు నక్షత్రములకు యుద్ధము జరిగెను. కావున రాజసూయయాగము యుద్ధమునకు దారితీయును. ఈ యాగమును దగ్గర దగ్గరచేయరు. ఇదంతయు నీకు తెలియనిది కాదు. ఏదో మమ్ములను గౌరవించుట కొఱకై యడిగితిరి. నీకు తెలియని ధర్మములు లేవు. నీయిష్టము వచ్చిన విధముగా పనిసేయుటయే మాపని అనగా రామచంద్రుడు తమ్ములను మెచ్చుకొనెను.

రామచంద్రుడిట్లు భరతుని అభిప్రాయమువిని రాజసూయమును చాలించుట జూచి లక్ష్మణుడు రామచంద్రునితో నిట్లు నెను.

ప్రభూ! మీరు యజ్ఞమును చేయుదలచితిరేని అశ్వమేధ యాగమును చేయవచ్చును కదాయనెను. ఇంద్రుడు అశ్వమేథయాగమును చేసి బ్రహ్మహత్య బాపుకొనెను. ఆ కథనుదెల్పెదను వినండి.

పూర్వము వృత్రుడు అనుదేవ కుమారుడు సూర్యుని వంటి తేజస్సు బ్రహ్మవర్చస్సు గల పవిత్రుడు. అతడొకయోజనము ఎత్తును, అందుకు తగిన లావును కలిగి బయట శత్రువులను, లోపలగల కామక్రోధాదులనెడి అంత శ్శత్రువులను గెలిచి ప్రపంచమునంతటిని పాలించెను. వృత్రుడు రాజ్యపాలనము

సేయు కాలమున మాటి మాటికిని భూమిని దున్ననవసరము లేకుండగనే ధాన్యములు పండు చుండెను. కోరిన వస్తువులాకసము నుండి కురియు చుండెను. ఆ వృత్రుని ధర్మమును వర్ణించుటకు సాధ్యముకాదు. అతడన్ని లోకములందున్న వీరులందరిని జయించి లోకములకేకైక వీరుడనిపించుకొని ఇంద్రునకు భయముగల్గునట్లుగావృత్రుడు తన కుమారుడగు శంబరునకు పట్టము గట్టిరాజ్య భారమప్పగించివైష్ణవ భక్తిగలవాడై సముద్రతీరమున తపముగావించెను వృత్రుడిట్లు విజృంభించి తపము చేయుచుండగా దేవేంద్రాది ముఖ్యులగు వారు విష్ణుదేవుని వద్దకుబోయి ననుస్కరించి ఓస్వామీ వృత్రుని కోరికను దీర్చక లోకములను రక్షింపుము అతడు దేవతలను తనకు దాసులుగా జేసికొనవలెనని మూడు లోకముల కధిపతియై యుండవలెనని తపస్సు జేయుచున్నాడు. అతని తపస్సు ఫలించినచో అది జరుగుటకాశ్చర్యమేమున్నది. కావున అతని తపస్సును భంగపరచి అతనిని చంపి మమ్ములను రక్షింపు మని ప్రార్థించిరి.

**విష్ణుదేవుడు:** దేవతలారా! వృత్రునకు ముందునేనే వరమిచ్చియున్నాను. అతనిని నేనిప్పుడు చంపుట న్యాయముకాదు. నా యొక్క విష్ణుత్వమును మూడు భాగములుగా జేసి ఒకటి దేవేంద్రుని యందు మరొకటి అతడు పట్టే వజ్రాయుధము నందు మూడవది భూమియందును ప్రవేశింప జేసియున్నాను. మీరేపోయి అతనితో యుద్ధము జేసి జయింపుమని విష్ణు దేవుడు దేవతలను బంపివైచెను.

ఇట్లు విష్ణు దేవుని యానతిలో దేవతలు వృత్రునిపై యుద్ధమునకు వచ్చు చుండిరి. విష్ణు తేజమును గ్రహించిన దేవేంద్రుడు వృత్రునితో యుద్ధము జేసి అతనిని సంహరించెను. అందువలన దేవేంద్రునకు బ్రహ్మాహత్యాదోషము సంభవించెను. ఆదోషమును పోగొట్టు కొనుటకు దేవేంద్రుడు అశ్వమేధ యాగమును గావించెను.

ఎట్లనగా దేవేంద్రుడు వృత్రుని చంపిన తర్వాత అతనికి బ్రహ్మాహత్యా దోషము సంభవించెను. ఆదోషము వలన ఇంద్రుని శరీరము వణకు చుండెను. ఆయన మనస్సునిలకడ లేకపోయెను. దేవతలతనిని దేవత్వమునుండి వెలివేసినట్లతనికి దోచుచుండెను. బ్రాహ్మణులకు బాధగల్గెను. వర్షములు లేక భూమి పంటలు లేకుండెను. దేవేంద్రుడింద్రపదవి గోల్పోయెను. అతని కీర్తినశించెను. అప్పుడగ్ని దేవుడు దిక్పతులు విష్ణువు వద్దకుబోయి విష్ణువుతో చెప్పుకొనిరి. ఇంద్రునకు బ్రహ్మాహత్యాదోషము వలన ఇల్లును కూడవిడిచిపోయెను.

లోకమున పాపకృత్యము అతలా కుతలము జేయుచున్నది. ఇకమీదట మీరు మాకేమి యాజ్ఞసేయుదురని దేవతలు విష్ణుదేవునితో మొఱబెట్టుకొనిరి. విష్ణువు, ఓ దేవతలారా! బ్రహ్మార్పణమని అశ్వమేథయాగమును దేవేంద్రుని చేత చేయింపుడు. ఆ బ్రహ్మాహత్యా దోషముతొలగి పోవునని తెలుపగా దేవతలు అశ్వమేధ యాగమును నిర్విఘ్నముగా దేవేంద్రుని చేత జరిపించిరి. ఆ బ్రహ్మాహత్య దోషము ఇంద్రునిలో నుండి వెలుపలకు వచ్చి ఇంత వరకు నేను దేవేంద్రునిలో నుంటిని ఇప్పుడక్కడుండలేను. నేనుండుటకు చోటు మీరేచూపుడని యడుగగా దేవతలిట్లనిరి.

ఓ బ్రహ్మాహత్యా దోషమా! నిన్ను ఒకరే భరింపజాలరు. అందువలన నీవు నాల్గు భాగములుగా మారి ఒకటి నీటిలోనురగవలెను, మరొకటి మద్దిమ్రాకుల యందు బంకవలెను, మూడవది స్త్రీల యందు రజస్వలవలెను, నాల్గవది భూమి యందును కలసియుండుమనిరి. అందువలన అశ్వమేధయాగము అన్నియాగములకంటే గొప్పమైనది, శ్రేష్ఠమైనది. దేవరవార్ధానిని చేసిన యెడల సమస్త హత్యాదోషములు తొలగునని లక్ష్మణుడు రామచంద్రునకు దెలిపెను. రామచంద్రుడు విని లక్ష్మణుని బుద్ధి కుశలతకు మెచ్చుకొనెను.

## శ్రీరాముడు తమ్ములకు ఇలోపాఖ్యానము జెప్పుట

రామచంద్రుడు లక్ష్మణుడు జెప్పినదంతయు విని లక్ష్మణా! నీవు చెప్పిన దంతయు మంచిది. చాలా శ్రేష్ఠమైనది. అది జరిపించిన వారికి సమస్త పాపంబులు నశింపజేసి సమస్త పుణ్యములు ప్రసాదించును. ఈ యాగమును పూర్వము ఇలుడుమహారాజు జేసి శాపవశాత్తున తనకు సంక్రమించియుండిన ఆడ రూపమును పోగొట్టుకొని మరలా శాశ్వతముగ మగవాడయ్యెనని శ్రీరామచంద్రుడు చెప్పెను.

**తమ్ములు:** అన్నగారూ! ఇలునకు స్త్రీ రూపమెందుకు గల్గెను తెల్పుమనిగోరిరి.

**రామచంద్రుడు:** తమ్ములారా! వినండి. సూర్యవంశమున కర్ధముడను తపస్సంపన్నునకు ఇలుడను కుమారుడుగల్గెను. అతడు చాలా తేజోవంతుడు. పరాక్రమశాలి సమస్తాయుధములు కలవాడు. సమస్త ధర్మములు తెలిసి సార్వభౌముడై రాజ్యమేలుచుండెను. ఒకదినము చెంచులు అడవులలో లభించెడు వస్తువులను పునుగు, జవ్వాది, కస్తూరి, తేనెలు, పండ్లు దెచ్చి రాజునకు సమర్పించి రాజునకు దండములు బెట్టి రాజుగారితో రాజేంద్రా! మేమున్న అడివిలో లేళ్ళు,

దుప్పులు, ఏదుపందులు, పులులు, ఖడ్గమృగములు, సింహములు, రేచు కుక్కలు ఇట్టి జంతువులు గుంపులు గుంపులుగా నున్నవి. కావున దేవరవారు ఒకదినము దయసేయండి. ఈయెరుకోళ్ళపరాక్రమము వినండి.

ఒక పిల్లెరుకోడు చెప్పుచున్నాడు. స్వామీ! ఈసిన్న యెరుకోడు యానిగ తొండాన్ని బట్టి ఉయ్యాలూగతాడు. ఈదుందుడుకోడు పులి నోటికి తీగెలు కల్లెంగాగట్టి దానిమిందికెక్కి దౌడుదీస్తాడు. వోసామీ! యీపిల్లెరుకోడు మరుగున సూస్కోనుంటాడు. సింపముయానిగ తలను పగలగొట్టి గోర్లతో శీల్చిదాని మెదుర్నుదినేచ్చుంది. అది పుయ్యేది సూస్కోనుండి ఆ సింపాన్ని మ్యాకపిల్లను బట్నిట్టు పట్టేచ్చాడు. దాని గోరుల్లో యానిగను తలశీల్చినప్పుడు దానితలలోని ముత్తాలుంటాయి. ఆముత్తాలను సింపంగోరుల్లోంచి తీసుకొస్తాడు. అట్లాటోడు సామి యీాడు.

ఇంకొకడు సామీ! యీ బుడతోడు గండబేరండ గువ్వల్ని వాటి తలకాయల్ని బట్టితెచ్చేస్తాడు. మా పెతాపమునువ్వు సూచ్చే తెలుచ్చుంది. మేము పచ్చుల్ని మురగాల్ని యాటాడేటప్పుడు చూచ్చె కుశాల పడతావ్ అని తెల్పగావిని వారికి కానుక లిప్పించి పంపివేసెను.

తరువాత ఇలుడు పేటకు బోవుటకు తనవారిని సిద్దముజేసి తానుకూడ తగిన వేషముతో సిద్దమయ్యెను. అడవికి వేటకుక్కలను, వలలను, జగురులను, పురులను బరిసెలను ఈటెలను మొదలగు వేటాడు సాధనములను వేట పోటరులను వెంటదీసుకొనిపోయి అనేక మృగములను, పక్షులను వేటాడెను.

## ఇలుడు సపరివారముగా వేటకు బోవుట

ఇలుడీవిధముగా వేటాడి అలసిపోయి విశ్రాంతి దీసికొనదలచి కైలాస పర్వతము చెంతకు బోయి. అచటనొక ఉద్యానవనమును జూచి ఆవనములోనికి ప్రవేశించెను. ఇలుడున్నట్లుండి ఒకప్రాయపు అందగత్తెయగు స్త్రీగా మారిపోయెను. తానుమారుటయేగాక తన పరివారమంతయు మారియుండిరి. అదిచూచి తన మనస్సులో నొకప్రక్క బాధయు, మరొక ప్రక్క ఆశ్చర్యమును కల్గియుండెను. అక్కడికి కొందరు కన్యకలువచ్చిరి. పురుషుడుగా నుండినప్పుడు ఇలుడుగాను, స్త్రీగా నుండి -నప్పుడు ఇలగాను నుండిన ఇలా కన్యతోవారు అమ్మా! ఇది శివుడు పార్వతీ దేవితో ఏకాంతముగా విహరించు ఉద్యానవనము. ఈ వనములో ప్రవేశించిన పురుషులు స్త్రీలు గామారిపోవుదురని శివుడొకప్పుడు శాపమిచ్చియున్నాడు. కావున ఈ వనము

నందుగల పశుపక్షి, మృగాదులు, సర్పములు ఏవియున్నను అవన్నియు ఆడవిగానే యుండుననని చెప్పిరి. అందువలన ఈశ్వరాజ్ఞను దాటుట కెవరికిని సాధ్యము కాదు కదాయని నీవుపోయి ఆ ఈశ్వరుని శరణువేడుమని రుద్రకన్యలు చెప్పిరి.

అదివిని ఇలాకన్య పార్వతీసమేతుడై యుండిన పరమశివుని వద్దకుపోయి వినయముతో నమస్కరించి స్వామీ! నేనిలుడను రాజును. నాసైనికులతో అడవికి వేటకొఱకు వచ్చి వేటాడి అలసటదీర్చుకొనుటకు ఉద్యానవనములో ప్రవేశించితిమి. ప్రవేశించగానే ఆడవారుగా మారిపోతిమి. రుద్రకన్యల వలన విషయము తెలిసికొని మీ వద్దకు వచ్చితిమి. ఈ స్త్రీ రూపములను తొలగించి మా పురుష రూపములు మాకు ప్రసాదింపుమని ఇలా కన్యపరమేశ్వరుని వేడుకొనెను.

శివుడు అదితప్ప వేరేదైన కోరుకొనుము ఇచ్చెదనని పలికెను. ఇలుడు పార్వతీ దేవివద్దకు బోయినమస్కరించి ఆమెననేక విధముల ప్రార్థించెను. ఆ ప్రార్థనలకు దేవి మనస్సు కరిగి ఇలునితో బిడ్డానీకు ఒకనెల దినములాడ రూపమును, ఆతర్వాత నెలదినములు మగరూపమును ఉండును. ఏలననగా నాలో సగముగ మాత్రమే స్త్రీయై రెండవ సగము శంకరుడనై నందున సగమేపురుషుడనై నందున ఆ సగము మాత్రమే త్రిప్పగల్గితిని అని మరలాయిట్లనెను.

## ఇలను బుధుడు వరించుట

ఇల స్త్రీని జూచి ఓ ఇలుడా! నీవెన్నిదినములాడ రూపముతో నుండెదవో అన్ని దినములు మరలా పురుషరూపములో నుండి పౌరుషముతో రాజ్యమునేలుము. నీవాడ రూపముతో నుండినప్పుడు మగరూప విషయములను, మగరూపముతో నుండినప్పుడాడు రూప విషయములను మరచిపోవుచుండెదవు. ఇట్లుండుట వలన నీకు రెండు విధములైన రూపములయందును సౌఖ్యమే యగును అని దేవి చెప్పగా ఇలనమస్కరించి తల్లీనేనొకనెల స్త్రీ రూపములోను, ఒకనెల పురుష రూపముతోను నుండునట్లు వరమును ప్రసాదింపుమని వేడగా దేవి తదాస్తు! అని ఆశీర్వదించి పోయి రమ్మనెను.

ఇలాకన్య పార్వతి వలన సెలవు దీసికొని తన ఇతర కన్యలతో గలిసి అరణ్యములో దిరుగు చుండిరి. ఇట్లు తిరుగుచు నొకచోట నొక సరోవరమును జూచి ఆకొలని గట్టున తపస్సుజేసికొను చుండిన చంద్రుని కుమారుడు బుధుని జూచి అతని అందచందములకు మెచ్చుకొని ఆకొలనిలోనికందరును దిగి జలక్రీడలాడుచు కేరింతలు బెట్టుచు ఒకరిపై ఒకరు నీళ్ళు చల్లుకొనుచు

అలజడిగావించు చుండిరి. వారి ఆలజడులకు బుధుడు కన్నులు దెరచి చూడగా తనయెదుట నొకయువతి తన చెలులతో జల క్రీడలాడుచుండెను. బుధుడామె సోయగమును జూచి కామించి ఆ కొలనిగట్టునగల పర్ణశాలవద్దకు బోయి అందుగల వారితో ఆ కొలనిలో జలక్రీడలాడుచున్న స్త్రీలెవరనియడిగి వారి వృత్తాంతము దెలిసికొని తన దివ్య దృష్టితో జూచి పార్వతీదేవి వనములో ప్రవేశించి స్త్రీలుగా మారిన ఇలుడును ఆయన పరివారముగా నెఱింగి వారితో మీరు పార్వతీదేవి ఉద్యానవనము ప్రవేశించి స్త్రీలుగా మారినవారు మీకు నేను కింపురుషులను సృష్టించి యిచ్చెదను. వారితో సుఖింపుడు అని చెప్పివారందరికిని అందరు కింపురుషులను సృష్టించి యివ్వగ వారితో గలిసి ఈమె పరివార స్త్రీలు వెళ్ళిరి.

వారట్లు వెళ్ళినవెనుక ఇలాకన్య యొకటి మాత్రమే మిగిలి యుండెను. ఈమె బిత్తరచూపులను చూచు చుండెను. బుధుడామె వద్దకు బోయి మెల్లగా పలుకరించి ఆమెపైగల తన మక్కువను తెలియజేసి ఆమెను యొప్పించుకొని యిద్దరును కలిసి ఉద్యానవనమంతయు తిరుగుచు పూదోటలు మున్నగు అనువగు చోటులలో సుఖించిరి. ఇట్లుండగా ఆ కన్యకు నెలదప్పెను. ఇంతలో నెల దినములు నిండుట వలన ఆమె అతడుగామారి పోయెను. ఇలుడపుడు తన ఆడ రూపును మరచి తాను అడవివేటకు వచ్చిన సంఘటన జ్ఞాపకమునకు రాగా తనవారిని వెదుకుచు బోయి ఒకకొలని గట్టున తపము జేసికొనుచుండిన బుధుని జూచి నేను బాహ్లీయను పట్టణము నేలు రాజును. వేటాడుటకై నేనీయడవికి వచ్చితిని. నాసైన్యము లెక్కడనెళ్ళె నోకని పించుటలేదు. అవి యేమాయెనో తెలుపగలారాయని బుధుని యడుగగా అయన దయగలవాడై ఈ యడవిలో శిలా వర్షము పడినది. ఆసైన్యము నీకిప్పుడు కనబడదు. నీవిక్కడనే యుండుమని బుధుడు దెలుపగా ఆయనతో మహాత్మా! సైన్యము లేకుండ నేను పట్టణమునకు పోజాలను నేనిక్కడనే యుండె దననగా బుధుడు సంతోషించి యుండుమనెను. నీవొక సంవత్సరమిచట యుండినచో నీకుమేలు జరుగునని తెలిపెను. అతడచటనేయుండి బుధునకు సేవలు జేయుచుండెను. ఆ తరువాత ఇలుడు స్త్రీగా మారెను అప్పుడు బుధునకు భార్యగా నుండి సేవలు జేయుచుండెను. ఇట్లుతొమ్మిది నెలలు నిండునప్పటికి ఇలకు చంద్రునితో సమానమైన నొక కుమారుడు గల్గెను. ఆ కుమారుని పెంచుమని బుధుడు తన తండ్రియగు చంద్రునకప్పగించెను. చంద్రుడు తమ మనుమనికి సోమరసము బోసిపోషించెను. మఱియు కళలను కూడా నేర్పించెను.

ఇట్లిలా కన్యకుమారుని బ్రసవించి పురుషుడుగా మారగా బుధుడు ఇలుని యందు దయగలవాడై భృగువు మొదలగు మునీంద్రులను బిలిపించి ఓమహనీయులారా! శాపవశాత్తుగా వచ్చిన ఈయిలుని ఆడతనమును పోగొట్టు ఉపాయము లేమైనా కలవాయని వేడెను. ఇంతలో పులహుడు మొదలగు వారితో చేరి కర్దముడటకు వచ్చెను. అచటనున్న మునీంద్రులను బుధుడు జేయుచున్న పూజలను మెచ్చుకొని అచటనేతల వంచుకొని కూర్చొని యున్న తన కుమారుడు ఇలుని జూచి నాయనా! నీవిపుడు అశ్వమేధ యాగమును గావించినచో ఇప్పుడు నీకు కల్గియున్న ఆడ రూపము తొలగిపోగలదని దెలిపి అతని చేత అశ్వమేధ యాగనము సేయించెను. శివుడందులకు మెచ్చుకొని ఇలునకు ప్రత్యక్షమై ఈదినము నుండియు శాశ్వతముగా ఆడ రూపము తొలగిపోయి పురుషుడుగా నుండగలవని చెప్పి అంతర్ధానుడయ్యెను. ఋషులందరును వారివారి ఆశ్రమములకు బోయిరి. కర్ధముడు తనకుమారుని తనపట్టణమైన బాహ్లియను పట్టణమునకు దీసుకొని పోయి మరలా రాజ్య పాలనముగావించునటుల ఏర్పాటులు గావించివెళ్ళెను.

ఈయిలో పాఖ్యాగాధనము నెవరు చదివినను విన్నను, వ్రాసినను వారి పాపములు పారిపోయి కష్టములు తొలగిపోయి సుఖసౌఖ్యములనుభవించెదరు. మఱియు అట్టివారికశ్వమేదయాగముగావించినంత పుణ్యము లభించును. శ్రీరామ చంద్రుడీ విధముగా తనతమ్ములకు ఇలోపాఖ్యానమును దెలుపగా విని సంతోషించిరి. **(ఏడవ ఆశ్వాసము సంపూర్ణము)**

## ఎనిమిదవ ఆశ్వాసము ప్రారంభము

## శ్రీరాముడశ్వమేధ యాకమును జేయుట

తరువాత రామచంద్రుడీవిధముగా తమ్ములకు దెలుపగా వారందరు ఆశ్వమేథ యాగమును జేయుటకు తీర్మానించిరి. లక్ష్మణునితో సోదరా నీవు వెళ్ళి కశ్యప వసిష్ట కకుత్సకణ్వాది సమస్త మునీంద్రులను పిలుచుకొనిరమ్మని చెప్పగా లక్ష్మణుడు వెళ్ళి వేద, శాస్త్ర, యజ్ఞ, యాగా దిక్రతువులు సేయుటలో ఆరితేరిన మునీంద్రుల నందరినీ సగౌరముగా ఆహ్వానించి వారినందరినీ రామచంద్రుని సన్నిధికి చేర్చెను.

అయోధ్యలో రామచంద్రుడు భరతునితో కొలువు కూటములో నుండెను. ఇంతలో మునీంద్రులు వచ్చి యున్నారను వార్త తెలుపగావిని రామచంద్రుడు బంగారు సింహాసనము నుండిదిగి హుటాహుటిన వారి కెదురుబోయి పాదాభి

వందనములు గావించి వారిని సభలోనికి దీసికొనిపోయి. తగిన ఆసనములనిచ్చి వినయముగా వారితోనిట్లనెను.

తాప సోత్తములారా పిలువగనే దయచేసిన మీయందరికిని నా విన్నపములు. నేను మీ ఆనతిని శిరసావహించి అశ్వమేధయాగమును చేయవలెనని తలచితిని. మీరందరు ఇందులో పాల్గొని నిర్విఘ్నముగా నీయాగము నెరవేర్పవలెనని విన్నవించెను.

అప్పుడామునీంద్రులందరును ఏకవాక్యముగా సమ్మతించి ఓరామచంద్రా! నీవు చేయవలెనన్న క్రతువు మూడులోకముల వారికిని సమ్మతమైనదే. కావున చేయుమనితెలుపగా రామచంద్రుడు లక్ష్మణునితో లక్ష్మణా! మనము సేయ దలచిన అశ్వమేధ యాగమును చూచుటకు సుగ్రీవాది హనుమ అంగద, జాంబవంత, గజ, గవాక్ష, సుషేణాది వానర వీరులనందరినీ పిలిపింపుము. మఱియు మన ప్రియబంధువులను కేకయ జనకాదులను, స్నేహితులను పిలిపింపుము మఱియు నానా దేశములయందు నివసించి యుండు రాజులకు లేఖలు వ్రాసి పిలిపింపుము. నానా దేశముల యందు బ్రాహ్మణులను నదీతీరములలో, తపోవనములందుండు మునీంద్రులను నక్షత్ర మండల మందుండు సప్త ఋషులను అనేక దిక్కులలో లోకములలో నుండు బ్రహ్మర్షులను బ్రహ్మ లోకములో నుండు వారందరినీ పిలిపింపుము మఱియు అనలుడు మున్నగు వారందరితో కలసి విభీషణుని పిలిపింపుము.

కవులను, గాయకులను, ఆడవాండ్లను అనేక విధముల పొగడు వంది మాగదులను దివ్యవాద్యములను మ్రోగించు వారిని, నృత్యము సేయువారిని మన యజ్ఞమునకు పిలిపింపుము. పుణ్యస్థలమగు నైమి శారణ్యమున గోమతీ తీరమున భూమి యందు వాస్తు శాస్త్ర మెరిగిన శిల్పాచార్యుల చేత పొడవును, వెడల్పును కొలతలు వేసి తగినట్లు ఆయుములను పెట్టించి యజ్ఞ మంటపమును నిర్మింపజేయుము. ఆయజ్ఞశాలచుట్టును బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రాదులకు యోగ్యముగానుండు రచ్చకొట్టంబులు కట్టింపుము. ధనము పెట్టుటకు, ధనాగారపు టిండ్లను, వస్తుసామాగ్రులను నిల్వు ఉగ్రాణములను, వంటశాలలను, భోజన శాలలను, సాధువులుండుటకు మఠములను, సైనికశాలలను, ఏనుగులకు గుఱ్ఱములకు తగిన శాలలను ఏర్పాటు సేయింపుము. ఎండలు లేకుండుటకు చలువ పందిళ్ళు, దప్పికతీర్చుకొనుటకు చలివేంద్రములను బెట్టింపుము. కోరిన

వెంటనే లేదనకుండ ఇచ్చుటకు వైశ్యులను అంగళ్ళలో వివిధ రకముల పదార్థముల పెట్టింపుము. పప్పుధాన్యములను కొండలవలె రాసులు బోసి బియ్యము నెక్కువగా తెప్పింపుము. నెయ్యి, నూనె, బెల్లం, చక్కెర, అరటి పండ్లు, కందమూలములు, గడ్డ దినుసులు, రకరకముల కూరగాయలు, ఆకు కూరలు ఇంకను కావలసిన వన్నియు ఇప్పటినుండి తెప్పించి భద్రపరచుము.

లక్ష్మణా! యజ్ఞమునకు గావలసిన వస్తువులన్నియు సమకూర్చుము. కొన్ని కోట్ల గోవులను, ధనరాసులను, రత్న రాసులను యజ్ఞశాలకు తోలింపుము. నేను చెప్పినవన్నియును మరచినదేమైనా ఉండిన బాగా విచారించి పరిశీలించి ఏదియేని తక్కువ లేకుండా సమకూర్చి తోలింపుము అని రామచంద్రుడు లక్ష్మణునకు తెలిపెను.

**భరతునకు:** నాయనా! భరతా! నీవు మన పట్టణమున గల పౌరులను, బంధువులను, హితులను, అంతఃపుర స్త్రీలను, మన తల్లులను, దారకులను, సేవకులను, ఆశ్రితులను బంగారు సీతను యజ్ఞశాలకు చేర్పించి అచ్చట చేర్చియున్న వస్తుసామాగ్రులను నీవు భద్రముగా కాపాడుము. మనశత్రుఘ్నుని, యాగమునకు పిలిపింపుము. అతడురాగానే మునులకును, యతీశ్వరులకును విసుగులేకుండ వారిని విచారించి పూజింపుమనుము అని ఆజ్ఞాపించెను. ఆ పనులన్నియు సిద్ధము సేయించి రామచంద్రునకు తెలియజేసిరి. అయన వారిని మెచ్చుకొనెను.

తరువాత అవయవములు ఎక్కడగానీ మొక్కలు మచ్చలులేని, సంపూర్ణ శుభ లక్షణములు కలిగి, నల్లరంగు గలిగి, ఆరోగ్యవంతమైన గుఱ్ఱమును తెచ్చి దాని వెంటపోవుటకు చాలాసైన్యమునిచ్చి ఆ గుఱ్ఱము వెంట లక్ష్మణుని పంపెను.

ఇట్లు రామచంద్రుడంపగా లక్ష్మణుడు ఋత్విక్కులను ఈ భూమి నంతయు నలుదిక్కులను గుఱ్ఱమును త్రిప్పగా సమస్తరాజులును భీతిల్లిభుజబల శాలియగు లక్ష్మణునకు వస్తువాహన సామగ్రులతో తామును కలిసి గౌరవించి తామును లక్ష్మణుని వెంటవచ్చు చుండిరి. రాజులందరికిని అభిమానియగు రామచంద్రుని తమ్ముడగు లక్ష్మణుడు ఈ గుఱ్ఱమును కాపాడుచున్నాడు. ఈ భూలోకములో వీరులెవరుండినను ఈ గుఱ్ఱమును పట్టవచ్చును! అనివ్రాయబడిన పటమును గుఱ్ఱమునకు నుదుటగట్టబడియుండెను. వానిని చూచిన యే రాజుగానీ పట్టణ సమీపమున కాగుఱ్ఱము పోయినపుడే ఆ పట్టణ రాజులు దానిని పట్టుటకు భయపడి

దానిజోలికి పోక యూరకుండిరి. లక్ష్మణుని రక్షణలో తిరుగుచున్న ఆ గుఱ్ఱము తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ దేశములయందు ఎవరిచేతగానీ పట్టుబడక సమస్త భూమండల మంతయు తిరిగి వచ్చెను. భరత శత్రుఘ్నులు రామచంద్రుని యాజ్ఞతో గోమతీ తీరమున యజ్ఞశాలకుగావలసిన సమస్త వస్తువులు చేర్చియుండిరి. రామచంద్రుడు ఋషులతోను, పౌరులతోను, బంధువులతోను, యజ్ఞశాలకు ప్రవేశించి, అక్కడ జాగ్రత్తగా కార్యములను జరిపించుచున్న తమ్ముళ్ళను చూచి సంతోషించెను. మఱియు నానాదేశపు రాజులను సుగ్రీవాది వీరులను, విభీషణాది రాక్షసులను వారి వెంబడి వచ్చిన వారిని విచారించి వారికి విడుదులనిప్పించి సౌకర్యములు కలిగించుటకు శత్రుఘ్నుని నియమించెను.

భరతుని జూచి తమ్ముడా బ్రాహ్మణులను క్షత్రియులను గౌరవించుటకు సిద్ధముగా నుండుము. యాగమునకు కావలసిన వస్తుసామాగ్రులు తెచ్చి యిచ్చుచుండుము అని నియమించెను.

సుగ్రీవుని బిలిచి సుగ్రీవా! అడిగిన వారికి లేదనక వారు కోరినధన ధాన్యాదులనిచ్చు చుండుము. విభీషణుని జూచి ఓవిభీషణా ఎవ్వరైనను ఈ యజ్ఞమునకు ఆటంకములు కలుగజేయుచున్నట్లు అనుమానము కలిగెనేని అయత్నములో నున్నవారినెదిరించి, దండించి యాగమును మెలకువతో రక్షింపుమనెను.

హనుమా! యాగమునకేది కొదువగానుండిన దానిని క్షణాలమీద సమకూర్చి యిచ్చుచుండుము అని ఈ విధముగా ఎవరెవరు సేయుపనులు వారికప్పగించెను.

ఈ విధముగా యజ్ఞము జరుగు చుండగా భరతునిచే చేయింపబడుచున్న షడ్రసోపేత తరుచులు కలిగియున్న భోజనాదులను బ్రాహ్మణులు, క్షత్రియులు, భోజనములొనర్చి తృపులగుచుండిరి. విభీషణుడు సేయు సపర్యల వలన బ్రహ్మ ఋషులు సంతృప్తులై ప్రసన్నతజెందిరి. సుగ్రీవుడు సేయు చున్న దానములను తీసికొని బిక్షకులు వారి కోరికలను తీర్చుకొని సుఖించిరి. ఈ విధముగా అన్న దానము, వస్తుదానము, ధనదానము ఎవరికేదికావలసిన దానిని వారికందించుచు. ఒక సంవత్సర కాలము యజ్ఞము నిర్విఘ్నముగా జరుపుచుండిరి.

ఇట్లు యజ్ఞము జరుగుట ప్రారంభించినదినమే అయోధ్యనుండి లక్ష్మణుడు యజ్ఞాశ్వమును విడిచి దాని వెంట కొంతసైనికులతో బయలుదేరి అన్ని దిక్కుల యందును తిరిగి నిరాటంకముగా యజ్ఞశాలకిది వరకు మునుపేచేర్చియుండెను.

కానీ యజ్ఞము జరుగుచునేయుండెను. బ్రాహ్మణులు నిత్యమును భోజనము సుష్టుగా భోంచేసి దక్షిణలను తీసికొనుచూ శ్రీరామునాశీర్వదించుచు సంతృప్తులగు చుండిరి.

ఈవిధముగా రామచంద్రుడు సేయు యజ్ఞమునకు వచ్చియెవరు ఏమికోరినను వారికి కాదనక, లేదనక సమస్త దానములనిచ్చుట వలన దానములు తీసికొనువారు లేకపోయిరి. అందువలన సుగ్రీవుడు మొదలగువారు బల వంతముగా పిలుచుకొని వచ్చిదానములిచ్చుచుండిరి. పలుమారులు దానములు తీసికొన్నవారేతీసికొన్నందున తప్పిపోయిన వారులేక బంగారమునుగానీ, రత్నములనుగానీ తీసికొన్న వారికే మరలా మరలా యిచ్చుట వలన వస్త్రములు ఏదియు అడుగువారే లేకపోయిరి. రామచంద్రుడు గావించిన యజ్ఞమును ఎవరు వర్ణించగలరు!

ఈ భూలోకమునందు లేదు అనువాక్యము మనుష్యులయందే నిలబడి పోయెను. యాగశాల యందు తిరుగువారలయందు మాసిన బట్టలు కట్టిన వాడొకడైనను కనబడలేదు. పేదవారుగాని, ఆకలిలో అలమటించు వారుగాని లేరు. అక్కడ తిరుగువారందరును రత్నభూషణములు ధరించి బంగారు పట్టు వస్త్రములు గట్టియున్న వారందరిని ఋషులు జూచి ఆశ్చర్యపోయిరి.

ఔరా! మనమింత వరకు ఎందరినో జూచి యుంటిమి. వారెవరెవనగా బ్రహ్మదేవుడు, దేవేంద్రుడు, చంద్రుడు దధీచి మున్నగు వారు చేసిన యజ్ఞములలో ఈ యజ్ఞమునకొకటైనను ధీటుగావు.

శ్రీరాముడు యజ్ఞకాలములో చేసిన దానములను లెక్కవేయలేము. కొన్ని కైలాసములు వేసినా రామచంద్రుడిచ్చినంత వెండికి దీటుగావు. కొన్ని మేరు పర్వతములు చేర్చినా రామచంద్రుడిచ్చిన బంగారానికి సాటిరావు. కొన్ని రోహిణీ పర్వతములను కూర్చినా రామచంద్రుడిచ్చిన రత్నరాసులకు సమానముకావు. కొన్ని కల్పవృక్షములు కలిపినా రామచంద్రుడిచ్చిన వస్త్ర దానములకు సరికావు. కొన్ని కామదేనువులు కూడినా రామచంద్రుని భోజన పదార్థములకు సరిపోవు. కావున ఇంత ధారాళముగా ఖర్చుబెట్టి యజ్ఞముజేసినవారు ఇంత వరకు లేనేలేరు.

ఎటులననగా రామచంద్రుని భార్య సీతాదేవి, ఆమె తల్లి భూదేవి. ఆ భూదేవి రామచంద్రునకు అత్తగారు కావలెను. అందు వలన రామచంద్రుడు సేయు యజ్ఞకాలములో అల్లుని మీద అభిమానముగలదియై ధాన్యరాసులు తరుగ

నీయక పెరిగించినది, ధనమును కూడ అడుగనీయలేదు. మఱియు ఏయే సమయమున ఏమేమి కార్యములు జరుగవలెనో ఆయా కార్యమును జరిపించుటకు కొఱత లేని సామర్థ్యము కలవారు, ఒకరికి మించినట్లొకరున్నారు. వారందరు కార్య దక్షులే కోకొల్లలుగానున్నారు. రాముని కనుసన్నలతో పనులు జరిగిపోయినవి. ఇతరులింత ఘనముగా చేయుటకు సాధ్యపడదు.

ఈ యజ్ఞమునకెన్ని బలములుతోడైనవనగా ధనబలము, జనబలము, ఆంజనేయ, సుగ్రీవ, అంగదజాంబవంతాది వానర బలము, విభీషణ, అతని మంత్రులు మున్నగు రాక్షస బలము, లక్ష్మణ, భరత, శత్రుఘ్న సోదరబలము, వసిష్టవామ దేవ, భృగు గౌతమ విశ్వామిత్రాది ఋషిబలము, బ్రహ్మాదేవ అష్టదిక్పతుల దేవేంద్రాది దేవతల బలము, చప్పన్నారు దేశాదీశుల బలము, ప్రపంచ మందంతటనున్న ప్రజల బలము, యజ్ఞమునెవరైన చెఱచుటకు ప్రయత్నించినచో వారి ప్రాణాలు దీయుటకు సిద్ధముగా నుండిన అన్నివిధాల బలగాల బలము, దేవుడై నరరూపముతో నున్న దైవబలము, రావణుని వలన తమసామర్థ్యము కోల్పోయి యుండిన నవగ్రహముల బలము ఇవన్నియు శ్రీరాముని యజ్ఞమునకు తమతమ సత్తా మేరకు సహకరించినందుననే సమగ్రముగా ఈ యజ్ఞమిటుల జరిగినదని పరిశీలకులు భావించు చుండిరి.

ఇతరు లెందరో చేసియుండిరనగా వారందరికిని ఈ విధమైన సహాయకులే లేరు. విఘ్నములు కలిగించెడు వారుకలరు. అందువలన తక్కిన వారిట్లు జరుపలేకపోయిరి.

ఇట్లు రామచంద్రుడు సంవత్సరకాలము నిర్విఘ్నముగా యజ్ఞము జరుపుట వలన వాల్మీకి మునీంద్రులవారా యజ్ఞమును చూచుటకై యజ్ఞశాలకరుదెంచిరి. ఆ వాల్మీకి తన శిష్యులతోను, ఆయన శిష్యులకు గల శిష్యులతోను సమూహముగా వచ్చియుండెను.

ఇట్లు వచ్చియున్న వాల్మీకి మునీంద్రునకు రామచంద్రుడర్ఘ్య పాద్యాదులనిచ్చి నమస్కరించి ఓముని శ్రేష్ఠా మీరిక్కడికి దయతో వచ్చినందున నా యజ్ఞము సఫలీకృతమైనది. మీ పాదరేణువులీ యజ్ఞశాలలో రాలుట వలన నా యజ్ఞశాల పవిత్రమైనది. కావున నా యజ్ఞము పరిసమాప్తి చెందువరకు మీరిక్కడనే యుండ వలసినదిగాకోరి వారికి తగిన విడిదిచూపించెను.

## కుశలవులు వాల్మీకి యాజ్ఞచే రాముని కడకేతెంచి రామాయణమును గానము సేయుట

రామచంద్రుడు వాల్మీకుల వారికి చూపిన విడుదుల యందు నివసించుచు, వారు సంగీత కోవిదులైన వీణాగాన ధురీణులును, తమకు శిష్యులునగు కుశలవులను జూచి బాబులారా! మీరు జత విడివడక రామచంద్రుని కొలువునందు శ్రీరామకథా ప్రపంచమును మునీంద్రులున్నచోటుల యందును, వ్యాపారములు జరుగుచోటుల యందును, ఎక్కువ మంది రాజులు గలచోటుల యందును, వనముల యందును, కవి పండితులున్న స్థలముల యందును జనులందరును వినునట్లుగా పాడవలెను. మీకు నారదమహర్షి నేర్పిన సంగీతము ఫలించునట్లుగా వీణలు సవరించి చేతబట్టి దినమునకు ఇరువది స్వరాల చొప్పున సర్వులు వినిమెచ్చుకొనునట్లు సభలోనికి వెళ్ళి మీరు రామ కథను గానము సేయవలెను.

మీకెవరైనను ధనమివ్వ బోయినచో ఆశపడక వారితో అయ్యా మేము కందమూలములను తిని జీవించెడువారము అని తెలిపి తీసికొనకూడదు. రేపటి నుండి మీరు రామాయణకావ్యమును పాడుటకు ప్రారంభించవలెను. రామ చంద్రుడు మీరెవ్వరని యడగినచో మేము వాల్మీకి శిష్యులమని చెప్పవలెను. ఆరామచంద్రుని మీరు తండ్రిగా భావింపవలెను. ఏలననగా ప్రజలందరికి తండ్రి వంటివాడు రాజు కావున మీరుకూడ తండ్రిగా భావింపవలెను.

ఆ విధముగా తెలిపిన వాల్మీకియాజ్ఞాను సారము భూదేవి ముద్దువనవళ్ళు లవకుశులు ఆ మరుదినము నుండి చేతులలో వీణలు ధరించి మనుష్యులుండెడు అన్ని చోటుల యందున రామాయణమును గానము జేయుచుండిరి. ఒక దినమున తినిన సమయమును జూచి రామచంద్రుని యజ్ఞశాలకు బోయిరి. ఆకుమారు లిద్దరును, తాన మానములను, రాగములను ఆలాపన గావించుచు పాడుటకు మొదలు పెట్టిరి. వినగా వినగా ఆగాన మాధుర్యము తనివిదీర చెవులతో తాగుచు ఆనంద సముద్రములో మునిగిపోయిరి. ఈ విధముగా వారు శ్రీరామ చరిత్రను గానము జేసిరి.

వారు గానము జేయుచుండగా ఆ రాగాలాపనకు రాజులకిరీటములలోని రాళ్ళు (రత్నములు) కరిగి నీరై కారినవి. ఇకరాజుల మనస్సులు కరిగెనని వేరే చెప్పవలెనా! రామచంద్రుడు యజ్ఞకార్యములను నిర్వర్తించి యొక చోటకొలువు దీరి ఆ కుమారులను బిలిపించి వారిని తన దగ్గరాగా నుండనియమించెను.

వారు రామచంద్రుని సమీపము నందుండగా చూచినవారికి రామచంద్రుడు రెండద్దముల యందు కనబడు ప్రతిబింబములవలె ఆ కుమారులు కనబడుచుండిరి. మేమీకథను దినమునకు కొంతకొంత వినిపించెదము. మీరు దానిని విని సఫలతనొందించవలెనని వారు రామచంద్రుని కోరిరి. రామ చంద్రుడందులకు అంగీకరించెను. ఆ మరుదినము నుండి వారు సమయమునకు వచ్చి గానము చేయుచుండిరి. తన కార్యములను దీర్చుకొని రామచంద్రుడు కూడా వచ్చుచుండెను. విను వారును వచ్చుచుండిరి. వారు ప్రతి దినమును వీరు గానము సేయుట అందరును చేరివినుట పోవుటలు జరుగుచుండెను.

ఇట్లుండగా గానము జేసెడు కుమారులను వారి శరీర లక్షణములను రామచంద్రుడు పరిశీలించి వారిలో సీత లక్షణములచ్చు గ్రుద్దినట్లు కనబడు చుండెను. అది చూచి రామచంద్రుడను మానించి వీరిలో సీత లక్షణములగు పడుచున్నవి. ఆమె కవల పిల్లలను కనియున్నదనగా వినియుంటిని. వీరు వారేయై యుండవచ్చును కాకున్న ఇతరులకీయందమెక్కడిది. అయ్యో! సీత అడవిలో నుండి తానును తన కొడుకులును జింక చర్మములను గట్టుకొని నారచీరలు ధరించి కాయగసరులు, కందమూలములు తిని జీవించు చున్నారు. ఆమె యెంత బాధపడుచున్నదో కదా! ఆమెను చూడకనేనెట్లోర్చి యుండగలను. కావున ఆమెనిప్పుడు పిలిపించి ప్రజలునమ్మునటుల ప్రమాణము జేయించి ఆమె పవిత్రురాలని తెలుప కుండినచో ఈ పిల్లలు నాకొడుకులనిన ప్రజలు నమ్మెదురా! అని తన మనస్సులో భావించి తనకెదుటనున్న శత్రుఘ్నుని బిలిపించి కుమారా హనుమంతుని విభీషణుని సుషేణుని వెంటదీసికొని పుణ్యాత్ముడైన వాల్మీకిని చూచుటకు పొమ్మని రామచంద్రుడు దెల్పెను.

## రఘు పుంగవుడు వాల్మీకాశ్రమమునున్న సీతను బిలిపించుట

శత్రుఘ్నుడు, హనుమదాదులతో వాల్మీకాశ్రమమునకు పోవుటకు ప్రయాణ మయ్యెను.

**శ్రీరామచంద్రుడు :** నాయనా శత్రుఘ్నా! మీరు వాల్మీకి మునీంద్రుల చెంతకు బోయి స్వామీ మహాత్మా! సీత పవిత్రచారిణి అని తెలిసియుండియు జనుల నిందలు వినలేక తాళజాలక ఆనాడామెను విడువవలసి వచ్చెను. కానీ ఈ ప్రజలకు నమ్మకముకలుగునటుల, సభలో ప్రతిజ్ఞ సేయునటుల ఆమెను ఇచటికి తీసుకొని

వచ్చుట మంచిదని తెలుపుడు. ఆ మాటకు మునీంద్రుడేమి సమాధానమిచ్చునో తెలిసికొని రండు అని రామచంద్రుడు దెలుపగా వారుపోయి వాల్మీకి మునీంద్రునితో రామచంద్రుని అభిప్రాయమును దెలిపిరి.

**వాల్మీకి :** శ్రీరామచంద్రుడెట్లు దెలిపెనో అటులనే సీతాదేవి సేయగలదని సమాదానమును దెల్పెను. రేపే సభకు వచ్చి ప్రతిజ్ఞ సేయగలదని చెప్పెను. హనుమదాదులు వచ్చి రామచంద్రునితో వాల్మీకి తెలిపిన దంతయు శ్రీరాముని కెరిగించిరి.

ఆ సభాస్థలములో నుండినవారందరికిని రామచంద్రుడు రేపు సీత పవిత్రురాలనని పతివ్రతనని ప్రతిజ్ఞసేయగలదని తెలియజేసి ఆదినానికి సభ చాలించి తన విడిదికి బోయెను. తక్కినవారందరును వారి వారి విడుదులకు పోయిరి.

ఆ రాత్రి గడచిన తరువాత మరునాడుదయముననే లేచి రామచంద్రుడు కాలకృత్యములు దీర్చుకొని స్నానము జేసి దైవపూజలుగావించి సభకువెళ్ళికొల్పై యుండెను.

అంతకుమునుపే సుగ్రీవాదివానరులు విభీషణాది రాక్షసులు, వసిష్టాది ఋషీశ్వరులు , భరతాది తమ్ములు, జనకాది రాజులు, సుమంతాది మంత్రులు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య, శూద్రాది పౌరులు, తక్కిన దేశాధీశులు రామచంద్రుని సభకు వచ్చి సందు లేక సభక్రిక్కిరిసియుండెను.

రామచంద్రుడు సభకు వచ్చి ఎవరెవరికి తగిన విధముగా వారిని గౌరవించి నమస్కారములు జేసి ఆసీనుడై యుండెను.

ఇక్కడ వాల్మీకి సీతాదేవితో అమ్మా! రామచంద్రుల వారు నిన్నటి దినమున శత్రుఘ్న, హనుమ, విభీషణాదులను నావద్దకు బంపియున్నాడు. యజ్ఞశాలకు నిన్ను బిలుచుకొనిరమ్మని చెప్పియున్నాడు. పతి యాజ్ఞను పాలించుట ఉత్తమ పతివ్రతలగు సతుల ధర్మము అనగా సీతసమ్మతించెను. మునీంద్రుడు సీతను వెంట బెట్టుకొని పోయి యజ్ఞశాలకు చేరెను.

## భూపుత్రి నిష్కల్మషయని వాల్మీకి సభాసదులు వినునట్లు శ్రీరామునకు దెల్పుట

ఆ సభలో భూలోక వాసులగు నరులును ఆకసమునుండి దేవతలును సీతాదేవి జేయు ప్రతిజ్ఞను చూచుటకై వచ్చియుండిరి. ఇట్లుండగా వాల్మీకి

మహాముని శ్రీరామచంద్రుని ముందు భాగమున నిలిచి ఆసభలో గల వారందరినీ జూచి చేయిచాపి నిలువరించుచు, దేవతలు మానవులు వినుచుండ ఓరామచంద్రా! సీతాదేవి పవిత్రత, పతివ్రతాతనమును, శీలమును, సత్యమును నీవు తెలిసికొని యుండియు ప్రజలు నిందించినందున వారినిందలను వినజాలక నిండు గర్భవతి యగు సీతాదేవిని అడవులకు బంపగా ఆమె దిక్కులేనిదై యక్కడ ఏడ్చుచుండగా నేనది తెలిసికొని ఆమెనోదార్చి ధైర్యమును దెలిపి నాయాశ్రమ మునకు తీసుకొనిపోయి ఆమె యోగక్షేమములు నేనే చూచు చుంటిని. ఆమె ఈ కవలపిల్లలగు కుశలవులను కనెను. ఈ కుమారులిద్దరు నీ బిడ్డలు. ఈ సీతాదేవి మంచి ఆచారవతి. వివేక వంతురాలు. ఈ కుశలవులు మంచి స్వభావము కలవారు. కావున వీరిని నీవనుమానింపరాదు. ఈ ముగ్గురను నీవు స్వీకరింపుము. ఇటువంటి మహాసభలో మేము అబద్ధమాడము. అట్లు మేము అబద్ధమాడినట్లైనచో మా తపస్సులు ఫలించవు. నేను బుధులచే పొగడబడిన ప్రచేతముని పుత్రుడనై యుండి వేదములన్నియు నేర్చుకొని యుండి మిక్కిలి తపస్సంపన్నుడనై యుండి అసత్య మాడెదనా! సీతమనస్సు చేతను, వాక్కుచేతను ఈ శరీరముతో పనులు జేయుటచేతను నిన్ను దప్ప ఇతరులెరుగనిది. మంచి గుణములలో లక్ష్మికి, పార్వతికి, సరస్వతికి సమానమైనది. ఓరామచంద్రా! సీత పతివ్రతలలో మహాపతివ్రత. ఆకాశము, గాలి, నీరు, నిప్పు, భూమి, సూర్యుడు, చంద్రుడు మొదలగు సమస్త దేవతల సాక్షిగా నేను సీత హృదయమును పరిశీలించి యున్నాను. ఆమె యందే మాత్రము దోషములేదు. సీతను కాపాడుటకొఱకు మీముందీ ప్రమాణములు సేయుటలేదు. బొంకుట లేదు. అట్లు బొంకియే యుండినచో నేను చాలా కాలము నుండి, చేసియుండిన తపస్సంతయు ఫలితమునియ్యక వృథాయైపోవునుగాక! సీత పవిత్రురాలని ప్రజలు నమ్మవలెనని మీరుకోరిన యెడల ఈసభవారందరు చూచి వినునటుల ఆమెకూడ మీరుకోరెడు విధముగా ప్రతిజ్ఞసేయగలదని స్థిరబుద్ధితో వాల్మీకి మహామునీంద్రుడు ప్రతిజ్ఞ గావించెను.

ఇట్లు పలికిన వాల్మీకి మహామునీంద్రునకు శ్రీరామచంద్రుడు చేతులు జోడించి నమస్కరించుచు ఓపాపములేని పవిత్రతాత్మగల పరమ మహర్షీ! ముందు లంకలో అగ్ని ప్రవేశముజేసి సీత మహాపవిత్రురాలని నిరూపించుకొన్నది. నాకది తెలిసియుండియు లోకనిందలు బడలేక ఆనిందను బాపుకొనుటకై ఈ సీతను నేనరణ్యమునకు బంపవలసి వచ్చినది. కావున కోపింపకనన్ను క్షమింపుము. ఈ పుత్రులు నా కుమారులనియు. ఈమె పతివ్రతయని మరొకసారి ఈ సభవారందరును

చూచుచుండగా ప్రజలు మెచ్చుకొనునటుల సీత ప్రతిజ్ఞ సేయునేని చాలామేలగును. ఓ పుణ్యాత్మ! మీరు జేసిన ప్రతిజ్ఞకంటెను సీత ప్రతిజ్ఞ జేయుటెంతయో సమంజసము. ఆమె ప్రతిజ్ఞజేయకుండిన ఇచ్చటగల వారికి నమ్మకము కలుగదు అని రామచంద్రుడను చుండగా.

## భూదేవి సీతాదేవింగైకొని రసాతలంబునకు పోవుట

ఆ మాటలు సభలో గలవారు విని ఆశ్చర్యపడుచుండిరి. ఆ రామచంద్రుని మాటలకు బ్రహ్మదేవుడు మున్నగు దేవతలందరును సెభాషని మెచ్చుకొనిరి. పూల వానలు గురిపించిరి. ఆప్రాంగణమంతయు చల్లని పిల్లగాలులు వీచెను.

ఆ సమయమున సీతాదేవి రామచంద్రుని పాదములనే మనసునందుంచు కొని ధైర్యముతో తలపైకెత్తి మరలా క్రిందికి దించి భూమి మీద తన చూపును నిలిపి చేతులు జోడించుకొని తన మామూలు కంఠముతో సభయందుండు వారువిని ఆశ్చర్యపడునటుల.

**సీతాదేవి:** ఓ తల్లీ భూదేవీ! నేను శ్రీరామచంద్రునే పూజించుచుట నిజమగునేని, నేనెల్లప్పుడు రామాజ్ఞననుసరించి ప్రవర్తించునది నిజమగునేని, మెలకువయందుగాని స్వప్నమునందుగాని, గాఢనిద్రయందుగాని, రామచంద్రునే పతి దైవముగా భావించి జీవించియుండినది నిజమగునేని. నా తల్లివగు భూదేవీ తల్లీ నాకు త్రోవచూపించి నన్నునీలోనికి దీసికొనిపొమ్ము. అనగా బ్రహ్మదేవుడు ఇంద్రుడు మొదలగు దేవతలకానందమును, సనకసనందాది కర్మదేవతల కద్భుతంబును, నరులకు వానరులకు, రాక్షసులకు, దుఃఖంబును దీనత్వమును ఉబికి పోవునటుల సీతాదేవి పలికెను.

ఆ తక్షణమే శతకోటి శతకోట్ల ధ్వనులు గలప్రళయకాలమందలి మేఘ గర్జనవలె ఢమ ఢమ ఢమయని ధ్వనులు వచ్చుచు ఆనాడు ప్రహ్లాదుని గాపాడుటకు నృసింహ స్వామి ఉక్కు స్థంభము పగిలినట్టి శబ్దములతో, పటపటమను ధ్వనులతో భూమి రెండు వ్రయ్యలుగాచీలి మహా భయంకరముగా పెద్ద నెఱియ గుహవలె నేర్పడెను. అగుహలో నుండి కనులు మిరుమిట్లు గొలుపు చుండగా చూచువారలకు ఆశ్చర్యమగు చుండ అందులో నుండి మెరుగులు గుంపులుగా బయలుదేరెను. ఆనెఱియ ద్వారమున భోగవతీ పురము నుండీ వచ్చిన వాసుకి తక్షకులు కనబడి ఆ సీతాదేవిని పూజించు సమయమున ఘుమ్మను సువాసనలు సభయందుండు వారినందరిని గ్రమ్ముకొనెను. వస్త్రములు పూలదండలుమై పూతలు

తీసికొని వాసుకి రాచకుమారులతో నొకరత్నసింహాసనమును భూదేవి ఎత్తించుకొని తళతళత్తళలుగా వెలుగులు విఅజిమ్ముచుండగా అచట భూదేవి ప్రత్యక్షమై అందరును చూచు చుండగా సీత వద్దకు వచ్చి కౌగలించుకొని కన్నీరు గార్చుచు తల్లీ ఎందుకు చింతించెదవు దైవయోగమును తప్పించుటకెవరికి నిసాధ్యముగాదు అని యూరడించుచు సీతముఖము కడిగి కస్తూరిబొట్టుబెట్టి కొప్పునందు పూవులను తురిమి దేవతలును గంధర్వులు ఊడిగములు జేయుచుండగా రత్న పీఠమునందు గూర్చుండబెట్టుకొని సీతను భూదేవి రసాతలమునకు తీసుకొని వెళ్ళెను. (గోవిందలు, చప్పట్లు) అదిచూచి బ్రహ్మాది దేవతలు సీతయొక్క పాతివ్రత్యమును వేనోళ్ళ పొగడిరి. ఆ సభలో గలవారందరును వలవలయేడ్చుట ఆయ్యో రామచంద్రుని అర్థాంగి లక్ష్మి యీదినముతో ఆయనను విడచివెళ్ళెను. ఆయన లక్ష్మిమరుగాయెను. మనలక్ష్మలు నిలుచునాయని పొరలి పొరలి యేడ్చు వారును, మాటలాడుటకెలుగు రాక శోకించు వారును, శోకమధికమై కొయ్యలవలె నిశ్చేష్టులైన వారును, తెలివిదప్పి మూర్ఛలుబడువారును, ఈ లోకాపవాదమింతజేసెగదా యనువారును, కుశలవులను బట్టుకొని నాయనలారా! మీ తల్లి తరలిపోయెనేయను వారును, భరత శత్రుఘ్న అంగద హనుమంత సుగ్రీవ, విభీషణాదులందరును మహాదుఃఖితులై యుండగా తలక్రిందికి వంచుకొని యున్న రామచంద్రుని జూచి యేడ్చువారునై ఆ యాస్థానమున గలవారందరును మొత్తము శోకదేవతలై యుండిరి.

## సీతరసాతలమున కరిగినందుకు రాముడు దుఃఖించుట

సీతాదేవిని ప్రతిజ్ఞసేయుమని ప్రజల సందేహములను దీర్చుమని రామచంద్రుడు కోరినప్పుడు ఈ ప్రజలకు మాటిమాటికిని సందేహములు వచ్చుచునే యుండును. అడిగినపుడంతయు నేను తీర్చుచునే యుండవలెను. ఆ పనికంటె నేనొకేపర్యాయము శాశ్వతముగా తీర్చుచున్నాను. మీరందరు చూడండీయనునట్లు ఆమె భూమిలోనికి వెళ్ళిపోయెను.

ఇదంతయు చూచిన శ్రీరామచంద్రునకు సీతలేక మరుగైనందున ఈ ప్రపంచమే లేనిదిగా దోచుచుండెను. సీతనుదలంచుచు హాజానకీ! యని మూర్ఛిల్లెను. కొంతసేపటికి తెలివిదెచ్చుకొని లేచి నేనీలోక నిందభరింపలేక కఠిన స్వభావుడనై నిన్నడవుల యందు త్రోయించినతప్పుచాలక కించిత్ స్వభావుడవుడై నన్ను రచ్చకెక్కించెదవా యనికోపముతో మరుగైపోనేల మఱియొకసారి నీముఖమును చూపింపుము. ఓ కోమలీ! నిన్ను పతివ్రతేయని నమ్మియున్నాను. నన్ను నీవు

వంటరిగా విడచి పోవుట ధర్మముగాదు. కావున నన్ను కూడ నీవెంట దీసుకపొమ్ము నాతప్పులు క్షమింపుము. ఇల్లు విడిచి నిన్నడవులకు బంపి చాలా బాధపెట్టి యున్నందున ఇకనైన యిల్లుచేరి సుఖపడుటకిది మంచి యుపాయమని భావించి నేనిట్లు ప్రతిజ్ఞసేయు మంటినేగాని నీహృదయము తెలియకగాదు. ఆనాడు లంకలో కఠిన పరీక్షపెట్టిన నాకఠినత్వము అడవులకు బంపిన కఠినత్వము ఈనాడు సభలో ప్రతిజ్ఞజేయుమన్న కఠినత్వములను జూచి ఇతనికి నామీదమక్కువలేదని భావించి ఉన్నట్లుండి భూమిలోనికి బ్రవేశించి మాయమైపోయితివి. నీవు అడవులలో నుండినప్పుడు మరలా కలుసుకొనే అవకాశము రావచ్చునను యాశతో నేనిన్నాళ్ళు జీవించి యుంటిని. ఇప్పుడు కానరానిచోటునకు చేరిపోయితివి.

ఓసీతా! నేను నీకొఱకెన్నిపాట్లుబడి యున్నానో ఒకసారియాలోచింపుము. మహావీరులందరును ప్రయత్నించి వదలివేసిన శివ ధనస్సును విఱచి యున్నాను. నిన్ను రావణుడు తీసుకొనిపోగా నేను సుగ్రీవుని స్నేహము జేసి మహాబలవంతుడైన వాలిని చంపితిని సముద్రుని అల్లకల్లోలముగావించితిని. బ్రహ్మవంశస్థుడగు రావణాసురుని సంహరించితిని. ఇవన్నియు నీకొఱకు నేనుచేసినత్యాగములే కదా!

నీవు లేకపోయినందున ఆకసము కూలిపోయినట్లును. బంగారు వన్నెగల నీశరీరము మరుగైనందున నాకు దరిద్రముచుట్టుకొన్నట్లును కనబడుచున్నది. నేనేదో ఒకటి రెండు తప్పులు చేసినందున నేను చేసిన త్యాగములన్నియు చేయనట్లేనా!

## రాముడు భూమిపై బాణము ప్రయోగింప చూచుట

అనివారి పూర్వపుటను భవములను వెలిబుచ్చి సభయందున్న వారిని జూచి ఓమహనీయులారా! ఓ సభాసదులారా! సీత తమ తల్లియగు భూదేవిని ప్రార్థించి తనకష్టాలను చెప్పుకొనెను. ఇది లోకసహజము. ఆడువారికి కష్టములు వచ్చి వైరాగ్యము కలిగినప్పుడు వారి తల్లిదండ్రులతో చెప్పుకొనుట ఆ తల్లిదండ్రులు తమ బిడ్డకు ఓదార్పు జెప్పి మరల భార్యా భర్తలను విడిపోనీయక అల్లుడుగారికి కూడ కొన్ని చెప్పవలసినవి చెప్పి తమబిడ్డను పంపించుట లోక సహజము. ఈ భూదేవి అటుల చేయలేదు. ఆమెనన్నొక అసమర్థుడుగా భావించి తనకుమార్తె ప్రార్థించుటతోనే వచ్చి ఆమెను అలంకరించుకొని తటాలున తనలోనికి తీసుకొని వెళ్ళినది. ప్రేమానురాగాలు పెనవేసుకొనియుండిన మాయిరువురకు నెడబాటు కలిగించినది.

సీత నన్నెడబాయనిదై నేనే ఆమెప్రాణముగా భావించి ఇంతకాలము ఆమెజీవించి యుండినది. ఇప్పుడు మమ్మెడబాటు గావించిన భూదేవిని నేను అత్తగారుగా భావించక, క్షమించక నా బాణముతో గొట్టిచీల్చి సీత ఎక్కడున్నను వెదికిగాలించి తెచ్చెదను. నాకు కోపము రాకమునుపే ఈ భూదేవి నాసీతను దెచ్చి నాకప్పగించకున్నచో, నాబాణముతో గొట్టి ఈ భూమిని దుమ్ము దుమ్ము జేసెదను. ఆ దుమ్మును సముద్రములో కలిపివేసెదను. చూడుడని రామచంద్రుడు లక్ష్మణుని వద్దనున్న కోదండమును దీసి ఎక్కుబెట్టి నారిసారించి ఆలీఢ పాదుడై (ఒకకాలును మోకరింపజేసి రెండవ పాదమును వెనుకకు బట్టుకొని రెండవకాలు పాదమును ముందుకు తొడ వరకు బోనిచ్చి మోకాలును వంచి పాదమునేల ఊనుట). బాణమును సంధించి భూమిని గొట్టుటకు యత్నించు చున్న రామచంద్రుని జూచి బ్రహ్మదేవుడును బ్రహ్మఋషులును గడ గడ వణకుచు వచ్చి రామచంద్రుని చేయిబట్టుకొని స్తోత్రముగావించిరి.

## బ్రహ్మాది దేవతలు రాముని స్తుతించుట

ఓ సాధు సంరక్షకా! రామచంద్రా! రాక్షసాంతకా! సత్యాపోషకా వినినింపగు భాషణా! నీకు జయమగు గాక! తన విల్లును విరిచిన యట్లే భూమిని కూడ ఖండించు చుండెను కదా యని శంకరుడును నన్నుమొలనూలు వలెధరించి యుండిన యీ భూమి యీదినముతో శిథిలమైపోవు చున్నది కదాయని సముద్రుడును, ఇట్లే భూమిని ధరించినశేషుడు, ఆదివరాహము, అష్టదిగ్గజములు, ఆది కూర్మము అందరును నిన్ను జూచి భీతిల్లుచున్నారు. భూమి, నీరు, వాయువు గాలి, అకసము, మహత్తు అంతయు నీవే సృష్టించి యున్నావు.

ఈ జగత్తంటికిని నీవే అంతరాత్మయై యున్నావు. అవ్యక్షత వహించి నీనాభియందు తామర సృష్టించి ఆ తామర యందు నన్ను సృష్టించిన ప్రభుడవు నీవేకదా! రాజులందరి వలె నీవు సామాన్యుడవుకాదు. ఈ లోకములన్నియు నీవలననే కలిగియున్నవి. వానిని నీవే తెగజూచినచో వలదని నీకెవ్వరడ్డు పడగలరు. ఈ భూమి నీదిగాక మరెవరిది. నీవీ భూమిపై కోపగించు టెందుకు ఓర్పు వహింపుము. సహించుము. మమ్మందరినీ సృష్టించి ఈ జగత్తంతటికిని పరిపాలకులుగా నియమించి యీనాడీభూమిని ధ్వంసము జేయుట సరియగునా. కావున శాంతింపుము.

ఈ వాల్మీకి మునీంద్రుడు నీ కథను రచించియున్నాడు. ఇంత వరకు నీవు కొంతయేవిని యున్నావు. ఇంకా వినవలసినది యున్నది. ఇక జరుగబోవు కథ కూడా రాగలదు. వానిని నీవు వినుట వలన నీ మనస్సులో గల బాధలు తొలగి పోగలవు. ఇదంతయు నేనీమునీశ్వరుని వలన వినియున్నాను. ఈ యాదికావ్యమగు శ్రీమద్రామాయణమును వినుట వలన దీనిని వినిన వారలకు సత్వగుణము గల్గును. వానివలన తెలివిగల్గును పాపమనే బురదనణచివేయును. సరస్వతీ దేవి పాదములకు గట్టిన గజ్జెల శబ్దములను విన్నట్లు ఉత్సాహమును ఉల్లాసమును కలిగించును. ఈ సమయమున నీవు తొందరపడక ఉత్తర కాండను వినినప్పుడు నీ కలవరపడిన మనస్సు శాంతించును, నిలకడకల్గును అని బ్రహ్మదేవుడు చెప్పగా రామచంద్రుడు విని శాంతించి ధనుర్బాణములను లక్ష్మణుని చేతికిచ్చి వైచెను. రామచంద్రుని వద్ద బ్రహ్మదేవుడు సెలవుదీసికొని తనను దేవతలు సేవించుచుండగా తన లోకమునకు వెళ్ళెను.

ఇది యిట్లుండగా కంచుఘంట మ్రోగినట్లు వీణలో నితంత్రులోకేసారి మ్రోగినట్లు, భూదేవి నుండి ఒక వాక్యము వినబడెను. ఓ రామచంద్రా! నీకింత చింతయెందుకు. ఆ లక్ష్మీదేవియే సీత. ఆమె యీలోకమునందు జన్మించినది. విష్ణువగు నీవా రామచంద్రుడవుగా పుట్టియున్నందున నిన్ను పెండ్లియాడినది. నీతో నుండినది. నీవామెను విడిచినను ఆమెనిన్ను విడువలేదు. మునులును, దేవతలును మెచ్చుకొనునటుల తన పతివ్రతాత్వమును నిరూపించుకొని నీరాకకు ఎదురు చూచుచు స్వస్థానము (వైకుంఠము) చేరినది. క్షమ, తెలివి, స్థిరత్వము, కీర్తి, శక్తి, సిగ్గు, శాంతి, దయ, తుష్టి, పుష్టి, యనునదంతయును సీతయే యగును నీవామెకు మనోనాయకుడవైనందున శ్రీహరివి. మీరిద్దరును లోకములకు తల్లిదండ్రులు. మీరు ప్రజలనెల్లకాలముల యందును కాపాడుచుండెదరు.

ఏ సీతాదేవి పాదములకు దేవేంద్రాది దిక్పాలుర భార్యలు నమస్కారములు సేయుచుండెదరో, ఏ దేవి చూపులు పారినంతనే దరిద్రము పారిపోయి ప్రబలమైన సంపదలు కలుగుచున్నవో ఆ లక్ష్మీదేవి సీతాదేవియై కొంతకాలమిచట నీకు భార్యయై సేవలు జేసినది. నీ కిద్దరు కుమారులనిచ్చినది. ఇక మీదట నీవు సీతను దలచుచు బాధపడవలదు. నీకు సీతపై నుండెడు మరులును నీ కుమారులపై మరలింపుము. నామ నుమలగు కుశలవులు నేర్చియున్న దంతయు వినుము ఉత్తర కాండను ప్రీతితో వినుము. నీకంతయు మేలగుగాక అని భూదేవి నుండి పలుకులు వినవచ్చి సమాప్తమయ్యెను.

ఈ విధముగా భూదేవి నుండి వచ్చిన పల్కులను వినికొంత వరకు శాంతించి ధైర్యముదెచ్చుకొని వాల్మీకి మహామునీంద్రుని జూచి మీరు రచించిన ఉత్తర కాండమును ఈ ఋషులు రాజులును వినగోరుచున్నారు. కావున తక్కిన కథను రేపటి నుండి వీరిచేత చదివింపజేయుడని ఆదినమున రామచంద్రుడు సభలోని వారిని పంపివైచి తమ కుమారుల దోడ్కొని యజ్ఞశాలకు చేరెను.

ఆ రాత్రంతయు సీతను దలంచుచు నిద్రబట్టక మరునాడు దయమున లేచి కాలకృత్యములను స్నాన సంధ్యలను దీర్చి దేవతార్చన జేసి తన కుమారులతో తమ్ములతో యథాప్రకారము సభామండపము ప్రవేశించెను. ఆ సభామండపములో ఎప్పటి యట్లు చేరవలసిన వారందరును చేరి యుండిరి. కుశలవులను ఉత్తర కాండను వినిపింపుడని వారివలన వినుచు చాలాదినములకది పరిసమాప్తి గావించిరి. రామచంద్రునకు యజ్ఞము పూర్తియయ్యెను.

రామచంద్రుడు ఋత్విక్కులకు దక్షిణలు సమర్పించి, దానధర్మములు జేసెను. రాజులకు, రాక్షసులకు, వానరులకు సమస్త భూషణాదులనిచ్చి వారిని తృప్తి పరచి ఎవరికి దగినట్లు వారికి మర్యాదలు జేసి వారినందరిని వారివారి నివాసములకు బంపివేసెను.

ఈ విధముగా రామచంద్రుడు యజ్ఞమును పరిసమాప్తి నొందించుకొని సీత లేనందున తమ్ములతోను, తనయులతోను, వానరులతోను, రాక్షసులతోను కలిసిపోయి అయోధ్యలో ప్రవేశించెను. రామచంద్రుడిట్లు దేవకార్యములను ప్రజాకార్యములను గావించుచు బ్రాహ్మణుల కగ్రహారములిచ్చి దానధర్మములను జేసి దుర్మార్గులను దునుమాడుచు ఎవరేమి కోరెదరో అది వారికొసగుచు దయగలవాడై నిర్మల నిశ్చల చిత్తముతో అనేక యాగములను తమ జీవితకాల మంతయు గావించెను.

రామచంద్రుడిట్లు యాగములు గావించుచు ధర్మముగా రాజ్యమేలెడి సమయమున, భూమి బంగారుకాసులు గలదిగా నిండిపోయెను. సముద్రము తనలో నుండెడు మంచి ముత్తెపు చిప్పలను తనలో నుండి పైకి దేల్చి అలలతో దెచ్చి గట్టులపైకి విసరివేయు చుండెను. ప్రజల కోరికలకనుకూలముగా వర్షములు గురియుచుండెను. ముదుసలి వారైనను ప్రాణములు తీయనందున యముడు ధర్మరాజయ్యెను. కర్షకులు కోరినప్పుడు వర్షములు కురియుచున్నందు వలన పాడిపంటలు సమృద్ధిగా నుండెను. ప్రజలు సౌఖ్యవంతులై దేవేంద్ర భోగములతో

తేలియాడుచుండిరి. ఆ కాలములో పోకకు పుట్టెడు ధాన్యమమ్ముచుండెను. ఆకాలములో రామచంద్రునకు రెండే రెండు భారములుండెను. సీత తన సమక్షములో లేని భారమొకటి. ఏమరుపాటు లేక ధర్మమును జాగ్రత్తగా కాపాడుచు పాలించు భారమొకటి.

ఆ కాలములో రామచంద్రునకు రెండే రెండు మరపులుండెను. అవి యేవనగా తన్నెవ్వరైనా నిందించిన దానిని, తన్నాశ్రయించినవారు జేసిన తప్పును ఈరెండింటిని మరచి పోవుట సహజమైయుండెను. రామచంద్రునకు విద్య, వినయము, రూపము, శౌర్యము, ధైర్యము కావలసినంత కల్గియున్న కుమారు లిద్దరును సేవలు జేయుచుండిరి.

తన మనస్సును దెలిసికొని తన కనుకూలముగా ఎదురు మాటలాడక, భరతలక్ష్మణులగు తమ్ములు సమస్త కార్యములును నెరవేర్చుచుండిరి. స్నేహితులు, మంత్రులు, పురోహితులు, సామంత రాజులు, బంధువులు తనకను కూలముగా నుండిరి. తమ కుటుంబములో ఏలాంటి విరోధములు లేక వినయముతో ఒకరి కొకరు ఐకమత్య భావములు గలవారై, అసూయలు ద్వేషములు లేక మెలగు చుండిరి. (అసూయ, ద్వేషము, మత్సరము కల్గియుండిన మంధరయను దాసి జేసిన కుట్రవలన రామచంద్రుడానాడు పట్టాభిషేకమును వదలి భార్యతోను, తమ్మునితోను అరణ్యమునకు బోవలసి వచ్చెను. దాని పరిణామముగా భార్యను గోల్పోవుట రాక్షసులతో యుద్ధము జేయుటలు సంభవించెను. వానినన్నింటిని ఓర్పుతో, నేర్పుతో, శౌర్యముతో, ధైర్యముతో బుద్ధి బలముతో ఎదుర్కొని సాధించుటకు రామచంద్రునకు సామర్థ్యముండుట వలన సాధించి మరలా తిరిగి వచ్చి మర్యాదగా కుటుంబమును కుదుట బెట్టినది రామచంద్రునకే చెల్లినది. ఇది రచయితనైన నా అభిప్రాయము).

ప్రజలందరును స్వామీ! ఈ భూమిని చాలాకాలము మీరే ఏలుమని శ్రీరాముని ప్రార్థించు చుండగా ఏ కొఱతలు లేక పాలించుచుండెను. కానీ సీతలేని కొఱత కొఱతగానే యుండెను.

రామచంద్రుడిట్లు రాజ్యపాలన సేయుచుండగా వారి తల్లులు ముందుగా కౌసల్య తరువాత సుమిత్ర, ఆ తరువాతకైకఈ విధముగా దగ్గర దగ్గరగా స్వర్గస్థులైరి వారికి రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు కర్మక్రియలు గావించి అంటును బాపుకొనిరి. తల్లులు స్వర్గములోనున్న దశరథ మహారాజుతో చేరిపోయిరి.

## శ్రీరాముని కడకుగార్గ్యమహాముని వచ్చుట

రామచంద్రుడీవిధముగా రాజ్యపాలనము జేయుచుండెను. ఆయన వద్దకు కేకయ మహారాజు నొకదూతను బంపెను. శ్రీరామచంద్రుడా దూతను గౌరవించి వచ్చిన పని తెలుపుమని యడిగెను.

ఆ దూత పేరుగార్గ్యమహాముని. ఆయన కేకయరాజు తన చేత బంపిన కానుకలను సమర్పించి రామచంద్రా! మూడు కోట్లమంది గల గంధర్వులు విజృంభించి ప్రజలను బాధించుచున్నారు. వారిని సంహరించి వారివలన కల్గు బాధలను తప్పింప గోరుచున్నాడని తెలియజేయుగా రామచంద్రుడు మునీంద్రునితో రేపే వచ్చి గంధర్వులను సంహరింపగలమని చెప్పి సంపదగల గంధర్వ రాజ్యమునకు భరతుని కుమారులకు పట్టాభిషేకము గావించి సైన్య సమేతముగా గార్గ్యమునీంద్రుని వెంట భరతుని అతని కుమారులను బంపించెను.

అన్న దగ్గర ఆశీర్వాదము దీసికొని భరతుడు సైన్యసమేతుడై బయలు దేరెను. పదహైదు దినములకు కేకయరాజు పట్టణము చేరిరి. మేనమామయగు కేకయరాజుకు భరతుడు నమస్కరించెను.

ఆ మరునాడందరును కలిసి గంధర్వనగరముపై దండెత్తి పోవుచుండిరి. భరతుడు తమపైకి వచ్చు చున్నాడని వేగులవారి వలన తెలిసికొన్న గంధర్వులు తమ సైన్యములతో భరతునకెదురై యుద్ధమును గావించిరి. ఈ విధముగా వారు రాత్రిం బగళ్ళను విడువక పోరాడిరి. యుద్ధ భూమి పీనుగపెంటయ్యెను. గంధర్వులు మాయా యుద్ధము జేయుచు భరతుని సైన్యములను నొప్పించిరి భరతుడు కోపించి సంవర్తకాస్త్రమును ప్రయోగించెను. ఆయస్త్రము ప్రళయాగ్నియై మండుచుబోయి మూడు కోట్ల మంది గంధర్వుల మొత్తమును సంహరించెను.

భరతుడు గంధర్వరాజ్యమును స్వాధీనముజేసికొని తక్షశిలయను నొక పట్టణమును నిర్మించి తక్షకునకును పుష్కరవతియను నొక పట్టణమును నిర్మించి పుష్కరునకును పట్టాభిషేకము గావించి వారిని రాజులుగా నియమించి ఐదు సంవత్సరములు భరతుడు తమ కుమారుల వద్దనుండి వారికి కావలసిన రాజ్యపాలనానుభవములను దెల్పి ధర్మముగా రాజ్యపాలనమును గావింపుమని నియమించి భరతుడయోధ్య చేరెను. శ్రీరామచంద్రుని కొలువునకు బోయి నమస్కరించి ఆ నాడు కేకయరాజు దూతవెంటబోయినప్పటి నుండి ఈ దినము ఇక్కడ చేరువరకు జరిగిన దంతయు అన్నకు భరతుడు వినిపించెను. రామచంద్రుడు సంతోషించెను.

తరువాత రామచంద్రుడు భరతలక్ష్మణులను జూచి తమ్ములారా! ఊర్మిళ పుత్రులకు రాజధానులెవ్వియనగా భరతుడిట్లనెను.

అంగరాజ్యమంగదునకు ఉత్తరకోసల దేశమును చంద్రకేతునకు ఇచ్చి రాజులను చేయుమనెను. అందుకు రామచంద్రుడు సంతోషించి తన సైన్యమును రెండు సమభాగములుగా జేసి సగమంగదునకును సగము చంద్రకేతువునకు నొసగి అంగదుని నిలుపుటకు పడమటి దేశమునకు లక్ష్మణునీ చంద్రకేతువును నిలుపుటకు భరతుని రామచంద్రుడు మల్లదేశమునకు బంపించెను. వారు పోయి రామాజ్ఞాను సారము ఆయాదేశములకు పట్టాభిషేకము గావించి రాజులనుగా బ్రకటించి వారిచెంత ఒక సంవత్సర కాలముండి రాజనీతులను, ధర్మపాలనను అన్నియు వారికి తెలియజేసి అన్న వద్దకు తిరిగి వచ్చిరి.

ఇట్లు వచ్చిన భరత శత్రుఘ్నులను జూచి రామచంద్రుడు సంతోషించి గార్హపత్యమను అగ్నితో దక్షిణ యను అగ్నియు వానితో ఆహవనీయమను అగ్ని కలిసి వెలిగినట్లు తమ్ములతో గలిసి రామచంద్రుడు వెలుగుచుండెను.

రామచంద్రుడీవిధముగా తనతమ్ములతో కూడి భూమి నాలుగు చెరగులను త్రేతాయుగమునందు కృతయుగ ధర్మములతో పదునొకండువేల సంవత్సరములు రాజ్యపాలనముగావించెను.

ఆగొప్ప బుద్ధిమంతులగు భరత లక్ష్మణులతో రామచంద్రుడు సేవలు గొనుచుండెను. తమకాలము సమీపించినదని తెలిసియు ఉపేక్షించి ( అప్రయత్నము సేయక) ఊరకుండెను. ఈ విధముగా రామచంద్రుడు రాజ్యపాలనము సేయుచుండగా

## సంయముడు మునివేషధారియై శ్రీరాముని కడకు వచ్చి రహస్యంబున బ్రహ్మ వాక్యములను దెల్పుట

రామచంద్రుడిట్లు రాజ్యపాలన చేయుచుండగా ఒకనాడొక మునీశ్వరుడెఱ్ఱని జడలతోను, యోగదండముతోను, నుదుట విభూతి రేఖలు చంకలో కృష్ణాజినము కమండలముతోను ప్రకాశించుచు వచ్చి రామచంద్రుని ద్వారము వద్ద నిలిచి అక్కడ నేయుండిన లక్ష్మణునితో, అయ్యా! ఒక మునీశ్వరుడు రామచంద్రునితో మాటలాడి రావలసినదిగా కోరినందు వలన నేను వచ్చియున్నాను. నీవు వెళ్ళి రాజుగారికి నారాకనెఱిగింపుము. అనగావిని లక్ష్మణుడు అన్న వద్దకు వెళ్ళి మునీంద్రుని రాక నెఱిగించెను.

అదివిని రామచంద్రుడు ఆ మునీంద్రుని వెంటనే ప్రవేశపెట్టుమని యాజ్ఞాపించెను. లక్ష్మణుడు ద్వారము వద్దకు చేరులోపులనే హుటాహుటిన రామచంద్రుడు ద్వారము వద్దకు వచ్చి, అర్ఘ్యపాద్యాదులనొసగి లోనికి దీసుకొనిపోయి బంగారు పీఠముపై కూర్చుండనియమించి మహాత్మా! మిమ్మెవరు బంపించిరి. ఎచ్చట నుండి వచ్చితిరి మీ ముఖము చూడగా సూర్యుని జూచిన తామరపూవు విధముగా నామనస్సు వికసించు చున్నది. మీపేరేమి యని రామచంద్రుడామునీంద్రునడిగెను.

**మునీంద్రుడు:** ఓ రామచంద్రా! నీవు దప్ప తక్కినవారెవరును నిచట నుండకూడదు. మరెవ్వరును నా మాటలు వినుట కర్హులుగారు. వీరినందరిని దూరముగా పంపివేయుము. మనము రహస్యముగా మాటలాడునప్పుడు మూడవవాడు వినకూడదు. ఆ సమయమున నెవ్వడైనను వచ్చెనేని అతడెంతటి వాడైనను నిర్దాక్షిణ్యముగా అతనితల దీసెదనని నీవు ప్రతిజ్ఞ జేసినచో నేనారహస్యమును మీతో తెలుపగలనని మునీంద్రుడు రామచంద్రుని కోరెను. మునీంద్రుని వాక్యములను వినికొంత తడవు రామచంద్రు డాలోచించి సరేయని అక్కడున్న వారి నందరిని బంపించి లక్ష్మణునితో లక్ష్మణా! నీవు ద్వారము వద్దనుండుము. ఎవ్వరైనను వచ్చి నా వద్దకు రావలెనని కోరినచో ఇప్పుడిది సమయము కాదని తెల్పుమని లక్ష్మణునితో ద్వారము వరకు తాను కూడాపోయి పంపించి, తిరిగి రామచంద్రుడు మునీంద్రుని వద్దకు బోయెను. రామచంద్రుడచటికి పోయి స్వామీ ఇక మీరహస్యమేమియో తెలుపుమని కోరెను. ఆ కపటమునీంద్రుడు.

ఓ రామచంద్రా! బ్రహ్మదేవుడు నన్ను మీ వద్దకు పంపియున్నాడు. నేను యమధర్మరాజును. అందరివలె నీవు రాజమాత్రుడవు కావు. ఈ చరాచర ప్రాణి కోట్లన్నింటికిని దేవుడవగు విష్ణు దేవుడవు. దేవేంద్రాది దేవతలచేత సాష్టాంగ నమస్కారము సేయించుకొనువాడవు. నీకు మొదలు నడుమ కొనయనునవి లేవు. కావున బ్రహ్మదేవుడు దెలుపు మన్నదంతయు తెలుపుచున్నాను వినుము.

పూర్వము నీవు పాలసముద్రములో శేషునిపాన్పుగా జేసికొని నిద్రబోయితివి. నీ నిద్రకొన్ని కల్పముల కాలము గడచిపోయెను. ఆ తర్వాత నీవు నిద్రనుండి మేలుకొని నీ నాభియందు బుట్టిన తామర పూవునందునన్ను పుట్టించితివి. అటు వెనుక నీచెవుల యందు బుట్టిన మధుకైటబాదులను నీవు సంహరించితివి. వారి యెముకల చేత కొండలను మెదడు చేత భూమిని కల్పించి లోకములను సృష్టించి

లోకాధిపతిగా నన్ను నియమించితివి. లోకములను రాక్షసులు బాధించినచో వారిని చంపెదనని ప్రతిజ్ఞ జేసితివి. రావణుడు లోకములలో గలవారిని బాధించుచుండగా దేవతలా బాధలు పడలేక వారు నీవద్దకు వచ్చి తమకు కలిగిన బాధలను చెప్పుకొనగా నీవు భూలోకములో దశరధుని కుమారుడై పుట్టి యుద్ధములో రావణుని చంపి అతని వలన లోకములకు కలిగిన బాధలను తొలగించితివి. ఆ నాడు నీవు చెప్పినట్లు పదునొకండు వేలేండ్లు ఈ భూమిని పాలించితివి. ఇకనీవాలస్యము సేయుటెందులకు? నీ నివాసమైన వైకుంఠమునకు దయసేయుము. అట్లుగాక భూలోకములో ఇంకను రాజ్యమేలవలెనని అభిలాషయుండెనేని రాజ్యము నేలుము అని బ్రహ్మదేవుడు నాతో చెప్పి నీకు చెప్పుమని నన్ను బంపియున్నాడు. అని యమధర్మరాజు తెలుపగా రామచంద్రుడు చిఱునవ్వుతో నిట్లనెను.

ఓ ప్రభావ సంపన్నుడా! బ్రహ్మదేవుడు చెప్పినదేమంచిదిగా నుండవచ్చును. నేను వచ్చిన కార్యములన్నియుసమాప్తియైనవి. ఇక్కడ నేను సేయవలసిన పనులు లేవని రామచంద్రుడు చెప్పుచుండగానే.

## దుర్వాసుడు క్షుత్పీడితుడై రాముని కడకు వచ్చుట

అనసూయా దేవి గర్భమునందు పుట్టిన వాడును, అత్రియను మహా మునీంద్రునకు తపో ఫలము వంటివాడును, శాపమొసగి రాజ్య సౌఖ్యములను సముద్రమునందు కలిపివేసిన వాడును, రుద్రుని రౌద్రమే మునీశ్వరుడుగా పుట్టినవాడునునగు దుర్వాస మునీంద్రుడు శ్రీరామచంద్రుని సభా ద్వారము వద్దకు వచ్చి అక్కడ ద్వారము వద్దనున్న లక్ష్మణుని జూచి నేను రామచంద్రుని సభలోనికి వెళ్ళవలెను. నీవు పోయి నారాకదెలుపుమని దుర్వాసుడనెను.

**లక్ష్మణుడు :** మహాత్మా మునీంద్రా! రామచంద్రుడీ సమయమున మఱియొక్క మహాత్మునితో ఏదో రహస్యము మాటలాడుచున్నాడు. మీరిప్పుడచటికి పోకూడదు. నేను కూడ పోకూడదు. ఇది రామాజ్ఞ. కావున మీరు మమ్ములను క్షమించి కొంత తడవు ఓపిక బట్టవలయును అని లక్ష్మణుడు చెప్పగా దుర్వాసుడు విని మండిపడి కనులెఱ్ఱజేసి నన్నడ్డగించుటకు బ్రహ్మకుగానీ, విష్ణువునకు గానీ, ఈశ్వరునకుగానీ సాధ్యముకాదు. నీవిపుడుపోయి నారాక రామచంద్రునకు తెలుపకుండుట నిజమే యగునేని, మీ యొక్క పుత్రమిత్ర కళత్ర బంధు ధన ధాన్యసమేతముగా కాలి బూడిదయై పోవునటుల శాపమొసగెదను. అని దుర్వాస మునీంద్రుడు గ్రుడ్డై

మాటలాడెను. అతడంతటి వాడేయైనందున లక్ష్మణుడు గడగడ వణుకుచు పదుగురు జచ్చుట కంటె నేనొక్కడు చచ్చుట మేలుకదా! యని భావించి రామచంద్రుని వద్దకు బోయి నమస్కరించి స్వామీ! మీదర్శనానికి దుర్వాస మునీంద్రులవారు వచ్చి యున్నారని తెలుపగా విని యమధర్మరాజును బంపివైచి దుర్వాసమునీంద్రునకెదురుగా బోయి నమస్కరించి స్వామీ! మీరిప్పుడేమి పనిగా వచ్చితిరి? మా వలన మీకేమి పనికావలయును అని రామచంద్రుడు వినయముతో అడుగగా వేయి సంవత్సరములు తపస్సు జేసి ఆకలియగుచున్నది. శరీరము కృశించి పోయినది. నాకు తృప్తిగా భోజనమును బెట్టవలెనని కోరగా రామచంద్రుడు మునీంద్రునకు భోజనమును బెట్టించెను. వడియములు సహాపాయసమషడ్ర సోపేతమైన పిండివంటలు ఆయన కోరిన వన్నియు బెట్టించెను. మునీంద్రుడు తృప్తిగా భోజనము జేసి ఆశీర్వదించి వెడలిపోయెను. అటు తర్వాత యమధర్మ రాజునకు తాను జేసిన ప్రతిజ్ఞను దలంచుకొని తలవంచుకొని ధైర్యమును వదలి దీనముగా ఖిన్నుడై రామచంద్రుడు కూర్చొని యుండెను.

## లక్ష్మణుడు రామ పరిత్యక్తుడై సరయూ నదిలో గ్రుంకి స్వధామమున కరుగుట

**శ్రీరామచంద్రుడు :** అయ్యో! దైవమా యమధర్మరాజు ఇచటికేల రావలెను. వచ్చెనుపో, ప్రతిజ్ఞ జేయువరకు అరహస్యము చెప్పనని యేలకోరవలెను. కోరెనుపో, నేనింతటి కఠిన ప్రతిజ్ఞ యేలసేయవలెను. చేసితిపో, ఆ సమయములోనే ఆ దుర్వాస మహర్షి యేలరావలెను. వచ్చెనుపో, నన్ను చేరుటకు దారి అతడేల కోరవలెను. కోరెనుపో, అతనిని బంపక లక్ష్మణుడేయెందుకు రావలెను. అట్లు వచ్చినందువలన నేనిపుడు జేసిన ప్రతిజ్ఞ చెల్లించవలెను కదా! అట్లు చెల్లించవలెనన్న నేనిపుడు లక్ష్మణుని తలతీయవలెను కదా! అయ్యో! దైవమా ఇదినా కొకపరీక్షా సమయమా!

లక్ష్మణుడు నాకు తమ్ముడు, స్నేహితుడు. సజ్జనుడు అయిన తమ్ముని ఎడబాసి నేనెట్లు ప్రాణములు నిలుపు కొనగలను. తమ్ముడా నా ప్రతిజ్ఞనెరవేర్చవలెనని అతనితో నేనెట్లు చెప్పగలను. ఈ విధముగా నావలెనే చేయరాని కార్యములె వ్వరైనను చేసి యున్నారా? అనాడు నేను వనవాసమునకు బోయినప్పుడు క్రొత్తగా వివాహమై యౌవనవతియగు భార్యను విడిచి నామీదగల భక్తితో స్నేహముతో ఆమె సౌఖ్యములను

విడనాడి నావెంట వచ్చియున్నాడు. అంతేగాదు అహర్నిశలు నన్ను కంటికి రెప్ప విధముగా కాపాడుచు నాకు సేవజేసియున్నాడు. సీతను రావణుడు తీసుకొనిపోయినప్పుడు ఆవ్యసనములో నేను దుఃఖించు చుండగా నాకు ధైర్యపు మాటలు జెప్పి ఆ దుఃఖమునుండి నన్ను తప్పించినాడు. యుద్ధములో నాకొఱకై అతికాయుని, ఇంద్రజిత్తును చంపియున్నాడు. నా మనస్సెటువంటిదో తెలిసికొని ఇన్నాళ్ళు మెలగినాడు. ఇటువంటి నామేలు కోరువారిలో నాకు నమ్మకము గలవాడును, నాకు కష్టములు వచ్చినప్పుడు నాతో వచ్చి నాకష్టములను పంచుకొన్న వాడును, అయిన నాముద్దుల తమ్ముని నా ప్రతిజ్ఞను నెరవేర్చుటకై ఎట్లు నాచేతులారా చంపగలను.

నేను ఒకే బాణము! ఒకే భార్య, ఒకే మాటగా, ఆచరణలో పెట్టి ఇంతకాలము జీవించితిని. కానీ చిట్టచివరి దశలో దైవము నాకీ పరీక్ష పెట్టవలెనా ఇంతకాలము నేను చెప్పిన మాట తప్పి జీవించలేదు కాని ఇప్పుడు నా మాట నిల్పుకోవలెనన్న నా రెండవ ప్రాణమగు లక్ష్మణుని తలదీయవలెను. ఇట్టి తమ్ముని తలనేనెట్లు తీసెదను. కానీ నేను నా తమ్ముని కొఱకై నా ప్రతిజ్ఞనెరవేర్చలేక చాలించిన నేనిన్నాళ్ళ నుండి కాపాడుకొనిన నామాట నీళ్ళమూటయై పోవునని యీవిధముగా శ్రీరామచంద్రుడు దుఃఖించి దగ్గరగా నిలిచియున్న లక్ష్మణుని జూచి తమ్ముడా లక్ష్మణా! ఆ దుర్వాసుడు ఆకలి బాధతో కోపించి మనలనందరిని కాలిపోవునటుల శపించియుండినను, అందరము నెమ్మదిగా సంతోషముగా మరణించి యుండెడువారము. కానీ ఈ సమయములో నేను పోయినచో నాకు మరణము వచ్చును కదా! అనియైనను నీవాలోచింపక నా వద్దకెందుకు వచ్చితివి. నీవంటి నిర్మలుడగు తమ్ముడైన నిన్ను విడిచి నేను ప్రాణములెట్లు పెట్టుకొని యుండగలను. తమ్ముడా లక్ష్మణా! ప్రతిజ్ఞయను సాకు బెట్టి నా చేతులారా నీ శిరస్సు ఖండించుటయా! నన్నింత కాలమును నమ్మియుండిన తమ్ముని పై సేవలు చేసి యుంటివి కదా! నా ప్రాణానికి ప్రాణమా! నిన్నెట్లు సంహరింతును. అని కన్నీరు మున్నీరుగా రామచంద్రుడు లక్ష్మణుని బట్టుకొనియేడ్చెను.

**లక్ష్మణుడు:** అన్నా రామచంద్రా! నన్ను గూర్చి నీవు చింతింపవలదు. నీతి తెలిసిన నీ బోటివారలు ఆ పదలు వచ్చినప్పుడు భయపడెదరా. విధిని తప్పింపనెవరి వశము. విధి దాటరానిది కదా! నీవు చేసిన ప్రతిజ్ఞ నాకొఱకై నెరవేర్పక విడిచి వేసితివేని యీభూమి పాతాళమున కుక్రుంగి పోగలదు. ఇతర రాజులందరును నిన్ను చూచి

రామచంద్రుడే బంధు ప్రీతి కొఱకు ఆడిన మాట తప్పిన వాడని వారును చెడు త్రోవలను తొక్కుచుండెదరు. ఇట్టివారికి నీవీదారి చూపిన వాడవు కాగలవు. అందు వలన వారు చేయు పాపకృత్యములకు నీవే పరోక్షముగా బాధ్యత వహింపవలసి యున్నది.

కావున రాజులెవ్వరుగానీ స్వధర్మమగు క్షత్రియ ధర్మమును అమలు పరచక విడువరుగదా! ఒక వేళ నామీద నీకుగల ప్రేమచేత నీవు విడిచినను, నీవు ప్రతిజ్ఞ జేసిన సంగతి నేను వినియుండియు లోనికెవ్వరినీ రానీయవలదని నీవు కూడా రావలదని నన్నేనీవు ద్వారము వద్ద కావలియుంచి యుండగా, అట్టి నేను నీ మాటనుల్లంఘించి తప్పుచేసి యున్నాను. ఆతప్పుకు తగిన దండన నాకు విధించక విడిచితివేని ఆ పాపమునన్నంటగలదు. నన్నుదండింపక విడిచినందు వలన అసత్య దోషమురాగలదు.

మనకిద్దరికిని ఏ విధముగా ఆలోచించినను ఆ ప్రతిజ్ఞ నెరవేర్పక విడుచుట అనేపద్ధతి అనర్థదాయకముగా నేయున్నది. అనర్థమును రానీయక నీవునన్ను విడువక దండించి సత్యమును కీర్తిని నిలబెట్టుము అని లక్ష్మణుడన్నకు హితవచనములు బోధించగా రామచంద్రుడు బాధపడుచు తక్షణమే తన కులగురువగు వసిష్ఠుని, ఆర్యులను, పురోహితులను, మంత్రులను పిలిపించి ప్రతిజ్ఞయను పేరుతో ఇటువంటి నీతి వంతుడైన తమ్ముని విడువవచ్చునా యని నామనస్సు కలవరపడు చున్నది. కావున మీరందరును నాకు మేలైన హితోపదేశమును గావించి నాకడ్డమై నిలిచిన ధర్మసందేహము దీర్చుడు అని రామచంద్రుడనగా సభలోని వారందరును ఒకరి ముఖములొకరు చూచుకొనుచుండిరి. వారిలో వసిష్ఠ మునీంద్రుడిట్లనెను.

ఓ రామచంద్రా! నేను ప్రతిజ్ఞ జేసితిని కదా! ఆ ప్రతిజ్ఞ నెవేర్చవలెనన్న తమ్ముని జంపి నెరవేర్చవలెనా అని నీవు విచారింపవలదు. ఏలననగా నీవు ప్రతిజ్ఞ నెరవేర్చక విడిచినచో, నీవు మాటతప్పిన వాడవయ్యెదవు. అందువలన అది అసత్యమనిపించు కొనును. అది అసత్యమైనందున ధర్మమునశించును. ధర్మము నశించుట వలన సత్యముగా జీవించిన నాటి పుణ్యమునశించును. ఆ పుణ్యము నశించుట వలన ప్రపంచమునశించును. ఈ విధముగా ఒకదానిపై నొకటి సంబంధపడి లోకములన్నియు నశించును. ఈ లోకములన్నియు నశించుట కంటె తమ్ముడంత ఎక్కువైనవాడా? ఈ కనబడు ప్రపంచమేదియు శాశ్వతముగాదు. ఎల్లప్పుడు నశింపనిది, నిలుచునది సత్యమొక్కటే మన పూర్వపు రాజులందరును సత్యమనే

సంపదతో జీవించి యుండిరి. సత్యమును లోకమునకు వెల్లడి చేసిన వారేకదా! ఏదో యెందుకు నీతండ్రి నిన్నడవులకు బంపవలసివచ్చెను. అసత్యమాడలేకనే కదా! కావున కుటిల స్వభావము లేక సత్యమును విడువక కీర్తి సంపాదింపుము.

అని వసిష్ట మహాముని చెప్పగా సభలోని వారందరు విని చాలాచెడ్డగ నిందించు చుండిరి. ఇట్లు గురువు గారు చెప్పుచుండగా రామచంద్రుడు చాలా తెగువగలవాడై దైర్యమును దెచ్చుకొని లక్ష్మణుని జూచి లక్ష్మణా! నీవెంత తప్పు చేసినను నీవంటి తమ్ముని చంపుటకు నాకు చేతులాడవు. ఎక్కువ ప్రతిభా వంతులకు చంపుటయనిన అతనిని తనతో నుండనీయక విడుచుట అనునది చేయగా చంపినదానితో సమానము. కావున నిన్ను నేనీ దినమునుండి వదిలివేసితిని. నీవింక నీకిష్టమైన చోటునకు బోయి జీవింపవచ్చును అని రామచంద్రుడనగా లక్ష్మణుడేడ్చుచు తన అన్నగారగు రామచంద్రుని పాదముల మీద సాగిలిపడి నమస్కారములు జేసి అక్కడగల ఆర్యులును, తన అన్నగారగు రామచంద్రుడును లక్ష్మణుని జూచి దుఃఖించుచు అతని వైపు జూచుచుండగా లక్ష్మణుడు సభలో నుండి బయలుదేరి దృఢనిశ్చయుడై సరయూనదికి బయలుదేరిపోయి యోగమవలంబించి ఆ నదిలో మునిగి తాను లక్ష్మణుడుగా పుట్టక మునుపే రూపమున నుండెనో ఆరూపమును తన మనస్సులో దలచుకొనెను. అప్పుడు దేవేంద్రుడు లక్ష్మణునిపై పుష్పవర్షమును కురిపించెను. శంఖములు మొదలగు మంగళవాద్యములు మ్రోగెను. రంభ మొదలగు అప్సరసలు నాట్యములతో సరయూనదికి వచ్చి ఆచట మహాతేజస్సుతో వెలుగు చున్న లక్ష్మణుని జూచిరి. లక్ష్మణుడు మానవ రూపమును విడిచి తన మునుపటి రూపమైన ఆదిశేషుని రూపమును ధరించెను. దేవతలు విమానములో ఆదిశేషుని దేవలోకమునకు దీసికొనిపోయిరి. అచ్చటగల బుధ జనులందరును ఆశ్చర్యముజెంది ఔరా! శ్రీమన్నారాయణుని నాల్గవ భాగముగు శేషుడు భూలోకమును విడిచి దేవలోకమునకు చేరెను అని పొగడుచుండిరి. ఇట్లు లక్ష్మణస్వామి దేవలోకము చేరి అచట కోటి సూర్యప్రకాశముగల వాడైవెలుగుచు దేవతల వలన పూజలు గొనుచు శాశ్వతమైన తన స్వస్థానమైన వైకుంఠమును చేరెను.

ఇట్లు లక్ష్మణస్వామి వెళ్ళినవెనుక రామచంద్రుడయోధ్యలో వసిష్టాదులను జూచి ఓ మహనీయులారా! లక్ష్మణుని విడిచినేనొక క్షణమైనను జీవింపజాలను, లక్ష్మణుడు లేని ఈ ప్రపంచమంతయు నాకొక వింతగా కనబడుచున్నది. కావున నేనిక అయోధ్యను భరతునకు పట్టాభిషేకము గావించి లక్ష్మణుని జూచుటకు

పరలోకమునకు పోయెదనని రామచంద్రుడు చెప్పగా భరతుడు భయకంపితుడై రామచంద్రునకు నమస్కరించి అన్నా! నాకీరాజ్యమే కాదు దేవేంద్రపదవియిచ్చినను అక్కరలేదు. ఏలననగా నీ పాదసేవచేయునదియే నాకు దేవేంద్ర పదవి. కావున నీవీరాజ్యమును కోసల దేశమును కుశునకును, ఉత్తరకోసల దేశమును లవునకును, ఇచ్చి ఈ రెండు దేశములకును కుశలవులను రాజులుగా జేయుము అని భరతుడు చెప్పుచుండగా ఈ యన్నదమ్ముల మాటలను వసిష్టుడువిని ఓ రామచంద్రా! మీరనుకొను చున్న మాటలను ప్రజలు విని వారుమిమ్మొడ బాయజాలమని దుఃఖించు చున్నారు. కావున వారికేమి జెప్పెదవో చెప్పివారి కూరట గావింపుమనగా రామచంద్రుడు ప్రసన్న హృదయుడై ప్రజలను జూచి ప్రజలారా! మీకు గల కోరిక లేమేమో తెలుపుడు. అదియెంతటి కోరికయైనను తీర్చెదనని శపథము గావించెను.

ఆసమయమున పౌరులు, బంధువులు, మంత్రులును, భటులును ఇంకను తక్కినవారందరు తమ చేతులు జోడించి నమస్కరించుచు ఓకరుణామయా! నీవిక్కడున్నంత కాలమును మమ్మెంతో దయతో కాపాడితివి. ఇప్పుడు మమ్మందరిని వదిలి మీరు వెళ్ళుట న్యాయమా! మా బిడ్డలను మనుమలను వారి వారి భార్యలను, మా స్నేహితులను, అన్నదమ్ములను, అక్కచెల్లెండ్రను, అందరినీ నీవెంట తీసికొని పోవలెను అని ప్రజలు కోరగా రామచంద్రుడు నవ్వి యమధర్మ రాజు తనతో చెప్పినమాటలను తలంచుకొని ప్రజలతో మీరు కోరిన విధముగనే రండని సమాధానము చెప్పెను.

సమర్థులైన వారికి అసాధ్యములెచ్చటను ఉండవు కదా! అదివిని శత్రుఘ్నుడు పురోహితులను పురప్రజలను చూచి వారితో మా అన్నగారు లక్ష్మణస్వామి స్వర్గమునకు పోగా పెద్దన్నగారాయనతో వెళ్ళుచు ప్రజలను కూడ తీసుకొనిపోవుటకు నిశ్చయించినాడట. రామచంద్రుడులేని పట్టణము అమరావతియైనను నేను నిలువజాలను. అందు వలన రాకుమారులలో పెద్దవాడగు సుబాహునకు మధు పట్టణమును, చిన్నవాడగు శత్రుఘాతికి విదిశాపురమును. ఇచ్చి రాజ్యాభిషిక్తులను జేసి నేనును మా పెద్దన్న గారితో కలిసికోవలెను. కావున మీరందరును నాకు శెలవియ్యవలెను. అని ప్రజల యనుమతిచే కుమారులకు సైన్యమును ధన కనక వస్తువాహనములను సమానముగా పంచియిచ్చి భార్యాపుత్రులనుండి సెలవు దీసికొని తనవద్దకు వచ్చిన దూతలతో కలిసి అయోధ్యచేరెను.

అప్పటికి రామచంద్రుడు దర్భాసనముపై కూర్చుండి అతని అనుమతితో ఆనందించుచు మునీంద్రులు తమచుట్టు నిలిచి యుండగా జ్వలించు అగ్ని

కణమువలె ప్రకాశించుచు శాంతి నిలయుడైయున్న అన్నగారగు రామచంద్రుని జూచి నమస్కరించి, శత్రుఘ్నుడు అన్నా! నీ యాజ్ఞ ప్రకారము కుమారులకు పట్టాభిషేకము గావించి వచ్చితిని. నేను నిన్ను నమ్మియున్నాను. నీతో కూడా వచ్చెదను. రావలదని యాజ్ఞాపింపకుము. మీరు లేని చోట క్షణమైనను నిలువజాలనని శత్రుఘ్నుడు ప్రార్థింపగా అందుకు రామచంద్రు డంగీకరించెను. ఆ సమయమున తమ గూఢచారుల వలనవిని కిష్కింధలో సుగ్రీవాదులును, లంకలో విభీషణాదులును రామచంద్రుడు వైకుంఠమునకు బోవు చున్నాడట అనివిని వారును బయలుదేరి అయోధ్యకు వానరులు రాక్షసులు కూడా చేరిరి.

**సుగ్రీవుడు:** ఓ రామచంద్రా! నేను అంగదునకు వానర రాజ్యమును పట్టాభిషేకము జేసివచ్చితిని. నేనుకూడ మీ వెంటవచ్చుటకంగీకరింప వలెనని కోరగా శ్రీరాముడంగీకరించెను.

తరువాత విభీషణుడు చేతులు జోడించుకొని రామచంద్రుని ముందునకు వచ్చెను. అది చూచి రామచంద్రుడు విభీషణా నీకీ కోరిక యెందుకు? ఈ చరాచర ప్రాణికోట్లు ఈ భూమిపైనున్నంత వరకు నీవు మహానీతి మంతుడవై లంకను పాలించు చుండుము. అదేమి స్వామీయని నాతో నెదురు ప్రశ్నవేయకుము. మహా ప్రభావము గలవాడవై ఎల్లప్పుడును ధర్మమును వదలక ప్రవర్తింపుము. మనస్నేహమును మరువ వలదుసుమా యని రామచంద్రుడనగా విభీషణుడు రామాజ్ఞకు మారుబలుక లేక యూరకుండెను.

తరువాత రామచంద్రుడు హనుమంతుని జూచి హనుమా! నీవు సమస్త జనుల చేత పొగడ బడుచున్న ప్రభావముగలవాడవు. నీవు వానర మాత్రుడవుగావు, సూర్యునిదయ వలన శ్రౌత, స్మార్థ, సమానాది రహస్యములను బాగుగ తెలిసిన వాడవు అధ్యాత్మ విద్య బాగుగా నెఱిగిన వాడవు. ఇప్పుడున్న బ్రహ్మదేవుని తరువాత భవిష్యత్ బ్రహ్మదేడవు. శుద్ధబ్రహ్మచారివి. నా కీర్తి ఈ లోకమున నెంత కాలముండునో అంతకాలము వానర రూపమున ఈలోకమున చిరంజీవివై నిలచియుండెదవుగాక! నామాట నిజమగును. నీకోరిక నాకు తెలియును. ఇకనీవు నాతో బదులుపలుక వలదని రామచంద్రుడు ఆంజనేయునకు తెలిపెను. మహాప్రీతి గలవాడైన బ్రహ్మ కుమారుడగు ఋక్షవిరజుని చూచి నీవుచిరంజీవివి. నీవిక చింతించవలదు. ఎప్పటివలె భూలోకమున నుండుమని మైంధుని ద్వివిధులను చూచి మీరు అమృతము త్రాగినవారు మీకు మరణములేదు. మీరు కూడ ఇక్కడనేయుండుడు

